ఓం శ్రీ గణేశాయ నమః

# మాండూక్యోపనిషత్

## ప్రార్థన

**ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవా భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః |**
**స్థిరైరఙ్గైస్తుష్టువాగ్ంసస్తనూభిర్వ్యశేమ దేవహితం యదాయుః ||**

**స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః | స్వస్తి నః పూషా విశ్వవేదాః |**
**స్వస్తి నస్తార్ క్ష్యో అరిష్టనేమిః | స్వస్తి నో బృహస్పతిర్దధాతు||**

**ఓం శాన్తిః శాన్తిః శాన్తిః||**

**మంత్రార్థం**

ఓం. ఓ దేవతలారా మంగళకరమైన విషయాలనే చెవులద్వారా విందుముగాక! యజ్ఞ కార్యాలలో నిమగ్నమై కన్నులతో మంగళకరమైన వాటినే చూచెదముగాక! సుస్థిరమైన అంగాలతో దేవతలను స్తుతిస్తూ దేవతల మేలుకొరకై జీవితాన్ని గడిపెదముగాక!

ప్రాచీనుడైన ఇంద్రుడు మాకు మంగళకరుడగుగాక! సర్వాన్ని ఎరిగిన పూష (సూర్యుడు) మాకు మంగళకరుడగుగాక! అరిష్టాలను తొలగించే గరుడుడు మాకు మంగళకరుడగుగాక! బృహస్పతి మాకు మంగళమును చేకూర్చుగాక!

ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధి దైవిక తాపములు (మా యందు) ఉపశమించుగాక!

ఓం శ్రీ గణేశాయ నమః

# మాండూక్యోపనిషత్

## ప్రథమ అధ్యాయం

## ఆగమ ప్రకరణం

**ప్రజ్ఞానాంశుప్రతానైః స్థిరచరనికరవ్యాపిభిర్వ్యాప్య లోకాన్భుక్త్వా భోగాన్స్థవిష్ఠాన్పునరపిధిషణోద్భాసితాన్కామజన్యాస్ | పీత్వా సర్వాన్విశేషాన్స్వపితి మధురభుఙ్మాయయా భోజయన్నో మాయాసంఖ్యాతురీయం పరమమృతమజం బ్రహ్మ యత్తన్నతోఽస్మి || 1 ||**

**యో విశ్వాత్మా విధిజవిషయాన్ప్రాశ్య భోగాన్స్థవిష్ఠాన్పశ్చాచ్చాన్యాన్స్వమతివిభవాంజ్యోతిషా స్వేన సూక్ష్మాన్| సర్వానేతాన్పునరపి శనైః స్వాత్మని స్థాపయిత్వా హిత్వా సర్వాన్విశేషాన్విగతగుణగణః పాత్వసౌ నస్తురీయః || 2 ||**

<u>భాష్యకారుల స్తుతి</u>

1. (జాగ్రదవస్థలో) కదలని-కదిలే సమస్తాన్ని మరియు వాటి విషయాలైన స్థూల ప్రపంచాలన్నింటిని కూడా చైతన్యకిరణాల ప్రకాశంతో ఏది వ్యాపించి వాటియందలి భోగాలను భోగిస్తోందో, మరింకా (స్వప్నావస్థలో) ఏది బుద్ధిచే వికసనం పొందిన కోరికలనుండి పుట్టిన సమస్త విశేషాలను త్రాగేస్తోందో, ఏది (సుషుప్తి అవస్థలో) ఆనందాన్ని అనుభవిస్తూ మాయచేత మమ్ములను అనుభవింపచేస్తూ నిద్రిస్తోందో, మరియు (ఈ మూడు అవస్థలకు అతీతంగా) ఏది మాయ యొక్క దృష్టితో చూస్తే లెక్కకు నాల్గవదో, ఆ పరమమైన-మృతత్వం లేని-పుట్టుక లేని బ్రహ్మకు ప్రణమిల్లుతున్నాను.

2. (సమిష్టి జాగ్రదవస్థలో) సమిష్ఠి విశ్వంతో సామ్యత్వాన్ని గలిగి దాని యందు వ్యాప్తమై ఏది కర్మజనితమైన స్థూల విషయాలను ఏది భోగిస్తోందో, మరింకా (సమిష్టి స్వప్నావస్థలో) తన స్వయం ప్రకాశంతో తనయందే కలిగిన సూక్ష్మ విశేషాలను ఏది అనుభవిస్తోందో, మరింకా కూడా (సమిష్టి సుషుప్తి అవస్థలో) వాటన్నింటిని మెల్లగా తనయందే ఏది స్థాపించుకొంటుందో, అదియే ఈ సమస్త విశేషాలతో కూడిన గుణ సమూహాలకు అతీతమైన స్వతంత్రతగల తురీయ అవస్థ (నాల్గవదైన అవస్థ). అది మమ్ము రక్షించుగాక.

## శంకరుల ఉపోద్ఘాత భాష్యము

ఓమిత్యేతదక్షరమిదం సర్వం తస్యోపవ్యాఖ్యానం| వేదాంతార్థసారసంగ్రహభూతమిదం ప్రకరణచతుష్టయం ఓమిత్యేతదక్షరమిత్యాది ఆరభ్యతే| అత ఏవ న పృథక్ సంబంధాభిధేయప్రయోజనాని వక్తవ్యాని| యాన్యేవ తు వేదాంతే సంబంధాభిధేయప్రయోజనాని, తాన్యేవేహాపి భవితుమర్హంతి ; తథాపి ప్రకరణవ్యాచిఖ్యాసునా సంక్షేపతో వక్తవ్యానీతి మన్యంతే వ్యాఖ్యాతారః| తత్ర ప్రయోజనవత్సాధనాభివ్యంజకత్వేనాభిధేయసంబద్ధం శాస్త్రం పారంపర్యేణ విశిష్టసంబంధాభిధేయప్రయోజనవద్భవతి| కిం పునస్తత్ప్రయోజనమితి, ఉచ్యతే — రోగార్తస్యేవ రోగనివృత్తౌ స్వస్థతా, తథా దుఃఖాత్మకస్యాత్మనో ద్వైతప్రపంచోపశమే స్వస్థతా ; అద్వైతభావః ప్రయోజనం| ద్వైతప్రపంచస్య చావిద్యాకృతత్వాద్విద్యయా తదుపశమః స్యాదితి బ్రహ్మవిద్యాప్రకాశనాయ అస్యారంభః క్రియతే| 'యత్ర హి ద్వైతమివ భవతి' (బృ. ఉ. 2| 4| 14), (బృ. ఉ. 4| 5| 15) 'యత్ర వాన్యదివ స్యాత్తత్రాన్యోఽన్యత్పశ్యేదన్యోఽన్యద్విజానీయాత్' (బృ. ఉ. 4| 3| 31) 'యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్తత్కేన కం విజానీయాత్' (బృ. ఉ. 4| 5| 15) ఇత్యాదిశ్రుతిభ్యోఽస్యార్థస్య సిద్ధిః| తత్ర తావదోంకారనిర్ణయాయ ప్రథమం ప్రకరణమాగమప్రధానమాత్మతత్త్వప్రతిపత్త్యుపాయభూతం| యస్య ద్వైతప్రపంచస్యోపశమే అద్వైతప్రతిపత్తిః రజ్జ్వామివ సర్పాదివికల్పోపశమే రజ్జుతత్త్వప్రతిపత్తిః, తస్య ద్వైతస్య హేతుతో వైతథ్యప్రతిపాదనాయ ద్వితీయం ప్రకరణం| తథా అద్వైతస్యాపి వైతథ్యప్రసంగప్రాప్తౌ, యుక్తితస్తథాత్వప్రతిపాదనాయ తృతీయం ప్రకరణం| అద్వైతస్య తథాత్వప్రతిపత్తివిపక్షభూతాని యాని వాదాంతరాణ్యవైదికాని సంతి, తేషామన్యోన్యవిరోధిత్వాదతథార్థత్వేన తదుపపత్తిభిరేవ నిరాకరణాయ చతుర్థం ప్రకరణం||

కథం పునరోంకారనిర్ణయ ఆత్మతత్త్వప్రతిపత్త్యుపాయత్వం ప్రతిపద్యత ఇతి, ఉచ్యతే — 'ఓమిత్యేతత్' (క. ఉ. 1| 2| 15) 'ఏతదాలంబనం' (క. ఉ. 1| 2| 17) 'ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః| తస్మాద్విద్వానేతేనైవాయతనేనైకతరమన్వేతి' (ప్ర. ఉ. 5| 2) 'ఓమిత్యాత్మానం యుంజీత' (నా. 79) 'ఓమితి బ్రహ్మ' (తై. ఉ. 1| 8| 1) 'ఓంకార ఏవేదం సర్వం' (ఛా. ఉ. 2| 23| 3) ఇత్యాదిశ్రుతిభ్యః| రజ్జ్వాదిరివ సర్పాదివికల్పస్యాస్పదమద్వయ ఆత్మా పరమార్థతః సన్ప్రాణాదివికల్పస్యాస్పదం యథా, తథా సర్వోఽపి వాక్ప్రపంచః ప్రాణాద్యాత్మవికల్పవిషయ ఓంకార ఏవ| స చాత్మస్వరూపమేవ, తదభిధాయకత్వాత్| ఓంకారవికారశబ్దాభిధేయశ్చ సర్వః ప్రాణాదిరాత్మవికల్పః అభిధానవ్యతిరేకేణ నాస్తి ; 'వాచారంభణం వికారో నామధేయం' (ఛా. ఉ. 6| 1| 4) 'తదస్యేదం వాచా తంత్యా నామభిర్దామభిః సర్వం సితం , సర్వం హీదం నామని' (ఐ. ఆ. 2| 1| 6) ఇత్యాదిశ్రుతిభ్యః| అత ఆహ —

## శంకరుల ఉపోద్ఘాత భాష్యానికి తెలుగు అనువాదము

**'ఓమిత్యేతదక్షరమిదం సర్వం తస్యోపవ్యాఖ్యానం'.** 'ఓమిత్యేతదక్షరమ్' తో ప్రారంభమయ్యే నాలుగు అధ్యాయాలుగల మాండూక్యోపనిషత్తుకు సంబంధించిన గౌడపాదుల వారి ఈ కారిక సమస్త వేదాంతం యొక్క సారానికి సంగ్రహమైన రూపం. వేదాంతానికి ఏ సంబంధ-అభిదేయ-ప్రయోజనాలు ఉన్నవో అవియే ఇక్కడ కూడా వర్తిస్తాయి కాబట్టి, అందుచేత దీనికి ప్రత్యేకించి సంబంధం-అభిదేయం-ప్రయోజనాలను చెప్పనవసరం లేదు. {ప్రస్తుత గ్రంథమైన ఉపనిషత్తు పాఠం మరియు దానిపై గౌడపాదుల వారు ప్రకటించిన కారిక కూడా వేదాంతమనే దానిలో ఒక భాగమే కనుక, నాలుగు అనుబంధాలైన, అధికారి (ఈ గ్రంథాన్ని అధ్యయనం చేసేవానికి ఉండవలసిన యోగ్యతల గురించి), సంబంధ (ఈ గ్రంథానికి మరియు అది చెప్పబోయే విషయానికి మధ్యగల సంబంధం గురించి), విషయ (ఆత్మకు మరియు బ్రహ్మకు మధ్యగల సామ్యత్వాన్ని చెప్పడమనే విషయం గురించి) మరియు ప్రయోజన (ముక్తి అనే ప్రయోజనం గురించి) అనేవి ఉపనిషత్తుకు మరియు కారికకు రెండింటికి కూడా ఒకటే. – స్వామి గంభీరానంద}. అయినా, గ్రంథాన్ని వ్యాఖ్యానించేవారు దానిని సంక్షేపంగానైనా చెప్పవలసిందేనని భాష్యకారులు

భావిస్తారు.  శాస్త్రం అనేది (వేదాంతమైనా కాని లేదా దానిపై చేసే వ్యాఖ్యానమైనా కాని) ఏదైనా సరే లక్ష్యాన్ని పొందేందుకు తగిన సాధనలను తెలియచెప్తుంది కాబట్టి ఆ లక్ష్య-విషయంతో ఆయా సాధనలకు ఒక సంబంధాన్ని ఏర్పాటు చేస్తుంది.  ఆ కారణంగా, నేరుగా కాకపోయినా ఆ విషయానికీ మరియు ప్రయోజనానికీ మధ్య ఒక అనుబంధంగా శాస్త్రం ఉంటుంది. {ఇక్కడ మనం ప్రధానంగా విద్య మరియు ఫలితం గురించే ఆలోచించుకోవాలి కాని గ్రంథాల గురించి కాదు.  ఆత్మకు మరియు బ్రహ్మకు తేడా లేదని అనుభవాత్మకంగా తెలుసుకోవడం వల్ల మాత్రమే, ముక్తి అనే ఫలితం కలుగుతుంది కాని, కేవలం శాస్త్రాల నుండి పొందబడదు.  అయినప్పటికీ, శాస్త్రాలు ఆ అభేదాన్ని తెలిసుకొనేందుకు దోహదం చేస్తాయి.  అందుచేత, శాస్త్ర విచారణ సహాయం లేకుండా జ్ఞానం సంభవం కాదు.  ఆ విధంగా, జ్ఞానానికి పరోక్ష సాధనాలుగా శాస్త్రాలు లక్ష్య-విషయంతో సంబంధాన్ని కలిగి ఉంటాయి. – స్వామి గంభీరానంద}.  మరైతే ఆ లక్ష్యం లేదా ప్రయోజనం ఏమిటో చెప్తున్నారు.  రోగం కలిగినవానికి ఆ రోగ నివృత్తి కలిగి స్వస్థత చేకూరినట్లుగా, దుఃఖపూరితమైన ఆత్మయందు ద్వైతప్రపంచం నివారింపబడి అద్వైతభావం కలగడమే స్వస్థత చేకూరడం. అదియే ముక్తి అనబడే ప్రయోజనం.  అవిద్యచే నిర్మితమైన ద్వైతప్రపంచం విద్యచేతనే ఉపశమించబడుతుంది కాబట్టి, బ్రహ్మవిద్యను ప్రకటించడానికి ఈ గ్రంథాన్ని ప్రారంభించడమైనది.  'ఎక్కడైతే ద్వైతం అన్నట్లుగా ఉన్నదో' ['యత్ర హి ద్వైతమివ భవతి' (బృ.ఉ. 2-4-14), (బృ.ఉ. 4-5-15)]; 'ఎక్కడైతే అన్యమైనట్లుగా ఉంటుందో, అక్కడ ఒకటి వేరొకదాన్ని చూస్తుంది ..... ఒకటి మరోదాన్ని తెలుసుకొంటుంది' ['యత్ర వాన్యదివ స్యాత్తత్రాన్యోఽన్యత్పశ్యేద్.... అన్యోఽన్యద్విజానీయాత్' (బృ.ఉ. 4-3-31)]; 'ఎక్కడైతే సర్వమూ ఆత్మయే అయినప్పుడు, ఏది దేనిని చూస్తుంది, ఏది దేనిని తెలుసుకొంటుంది' ['యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్తత్కేన కం విజానీయాత్' (బృ.ఉ. 4-5-15)] అనేటటువంటి శ్రుతి వాక్యాలకు కూడా ఇదే అర్థం సిద్ధిస్తోంది.

అది అలా ఉండగా, ప్రధానంగా ఆత్మయొక్క యదార్థతత్వాన్ని ప్రతిపాదించడంలో ఉపాయమైన ఓంకారానికి అర్థాన్ని మొదటి ప్రకరణంలో నిర్ణయిస్తున్నారు.  త్రాడునందు కల్పించుకొన్న సర్పభ్రాంతి తొలగిపోగా తాడు యొక్క యదార్థత్వం నిరూపణ అయినట్లుగా, ఏ ద్వైతప్రపంచ భావన తొలగిపోగా అద్వైతమే నిరూపితమౌతుందో, ఆ ద్వైతం యొక్క అసత్యత్వాన్ని (వైతథ్యతను) రెండవ ప్రకరణంలో హేతుబద్ధంగా నిరూపిస్తున్నారు.  అదేవిధంగా అద్వైతం కూడా అసత్యమేననే ప్రసంగం ఏర్పడగా, అద్వైతమే సత్యమని హేతుబద్ధంగా తృతీయ ప్రకరణంలో ప్రతిపాదిస్తున్నారు.  అద్వైతమే యదార్థమనే ప్రతిపాదనకు వ్యతిరేకమైన ఇతర అవైదిక వాదనలు ఏవైతే ఉన్నాయో, ఆ వాదనలన్నీ వాటిలో అవి పరస్పరం విరోధాన్ని కలిగినవేనని, వారు చెప్పే సిద్ధాంతాలతోనే వాటి యదార్థతను నిరాకరిస్తూ, నాల్గవ ప్రకరణాన్ని చెప్తున్నారు.

మొదట ఆత్మతత్త్వ ప్రతిపాదనకు ఉపాయంగా ఓంకారాన్ని ఎలా ప్రతిపాదిస్తున్నారో, చెబుతున్నారు.   'ఈ స్థితియే ఓంకారము' ['ఓమిత్యేతత్' (క.ఉ. 1-2-15)]; 'ఇదియే ఆధారం' ['ఏతదాలంబనం' (క.ఉ. 1-2-17)]; 'సత్యకామా! ఓంకారం ఏది కలదో అదియే పరబ్రహ్మ మరియు అపరబ్రహ్మ కూడా.  అందువలన విద్వాంసుడు వీటిలో ఏదో ఒకదానిని ఆశ్రయంగా పొందుతాడు' ['ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః| తస్మాద్విద్వానేతేనైవాయతనేనైకతరమన్వేతి' (ప్ర.ఉ. 5-2)]; 'ఆత్మనే ఓంకారంగా అనుసంధానించు' ['ఓమిత్యాత్మానం యుంజీత' (నా. 79)]; 'ఓంకారమే బ్రహ్మ' ['ఓమితి బ్రహ్మ' (తై.ఉ. 1-8-1)]; 'ఈ సకలమూ ఓంకారమే' ['ఓంకార ఏవేదం సర్వం' (ఛాం.ఉ. 2-23-3)] అంటూ ఎన్నో శ్రుతి వాక్యాలు ఓంకారాన్ని ఆత్మతత్త్వానికి ఉపాయంగా చెప్తున్నాయి. పాము వంటి వికల్పాలకు త్రాడు ఎలా ఆశ్రయమై ఉన్నదో, అలాగే అద్వయమైన ఆత్మ

పరమార్థంగా ఉండి ప్రాణం వంటి వికల్పాలకు ఆశ్రయమౌతోంది. అదేవిధంగా, ఆత్మవికల్పాలైన ప్రాణం వంటి విషయాలతో కూడిన సకల వాక్కు-ప్రపంచానికి కూడా ఓంకారమే అశ్రయం. ఓంకారం ఆత్మనే సూచించడం చేత, అది ఆత్మ యొక్క స్వరూపమే. ఓంకార శబ్దంలోని మార్పుల చేతనే సకలమైన ప్రాణం వంటి ఆత్మవికల్పాలు సూచించబడుతున్నందు చేత, అలా సూచించబడకపోతే అవి లేనట్లే అని 'అన్ని పరిణామాలకు వాక్కే అధారం. పేరుతోనే సూచించబడుతుంది' ['వాచారంభణం వికారో నామధేయం' (ఛా.ఉ. 6-1-4)]; 'ఈ వాక్కు అనబడే దారాలతో, పేర్లు అనే తాళ్ళతో సకలమూ కట్టబడినాయి. ఇవన్నీ ఈ నామంతోనే ముడిపడి ఉన్నాయి' ['తదస్యేదం వాచా తంత్యా నామభిర్దామభిః సర్వం సితం, సర్వం హీదం నామని' (ఐ.ఆ. 2-1- 6)] శ్రుతి వాక్యాలు ప్రకటిస్తున్నాయి. అందుచేత ఇలా అంటున్నారు.

**ఓమిత్యేతదక్షరమిదగ్ం సర్వం తస్యోపవ్యాఖ్యానం భూతం భవద్భవిష్యదితి సర్వమోఙ్కార ఏవ| యచ్చాన్యత్త్రికాలా తీతం తదప్యోఙ్కార ఏవ || || మాం.ఉ. 1-1 ||**

**ఓం అనే అక్షరమే ఇదంతా. ఈ సమస్తమూ దాని వివరణమే. భూత-వర్తమాన-భవిష్యత్తు అంతా ఓంకారమే. మూడు కాలాలకు అతీతమై ఏది ఉన్నదో అది కూడా ఓంకారమే.**

## శంకరుల భాష్యము

ఓమిత్యేతదక్షరమిదం సర్వమితి| యదిదం అర్థజాతమభిధేయభూతం , తస్య అభిధానావ్యతిరేకాత్ , అభిధానభేదస్య చ ఓంకారావ్యతిరేకాత్ ఓంకార ఏవేదం సర్వం| పరం చ బ్రహ్మ అభిధానాభిధేయోపాయపూర్వకమవగమ్యత ఇత్యోంకార ఏవ| తస్య ఏతస్య పరాపరబ్రహ్మరూపస్యాక్షరస్య ఓమిత్యేతస్య ఉపవ్యాఖ్యానం , బ్రహ్మప్రతిపత్త్యుపాయత్వాద్బ్రహ్మసమీపతయా విస్పష్టం ప్రకథనముపవ్యాఖ్యానం ; ప్రస్తుతం వేదితవ్యమితి వాక్యశేషః| భూతం భవత్ భవిష్యత్ ఇతి కాలత్రయపరిచ్ఛేద్యం యత్ , తదపి ఓంకార ఏవ, ఉక్తన్యాయతః| యచ్చ అన్యత్ త్రికాలాతీతం కార్యాధిగమ్యం కాలాపరిచ్ఛేద్యమవ్యాకృతాది, తదపి ఓంకార ఏవ||

అభిధానాభిధేయయోరేకత్వేఽపి అభిధానప్రాధాన్యేన నిర్దేశః కృతః 'ఓమిత్యేతదక్షరమిదం సర్వం' ఇత్యాది| అభిధానప్రాధాన్యేన నిర్దిష్టస్య పునరభిధేయప్రాధాన్యేన నిర్దేశః అభిధానాభిధేయయోరేకత్వప్రతిపత్త్యర్థః| ఇతరథా హి అభిధానతంత్రాభిధేయప్రతిపత్తిరితి అభిధేయస్యాభిధానత్వం గౌణమిత్యాశంకా స్యాత్| ఏకత్వప్రతిపత్తేశ్చ ప్రయోజనమభిధానాభిధేయయోః — ఏకేనైవ ప్రయత్నేన యుగపత్ప్రవిలాపయంస్తద్విలక్షణం బ్రహ్మ ప్రతిపద్యేతేతి| తథా చ వక్ష్యతి — 'పాదా మాత్రా మాత్రాశ్చ పాదాః' (మా. ఉ. 8) ఇతి| తదాహ — సర్వం హ్యేతద్బ్రహ్మేతి|

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**ఓమ్ ఇతి ఏతత్ అక్షరమ్ ఇదమ్ సర్వమ్** నామములచేత నిర్దేశించబడే ఈ పదార్థాలన్నీ, వాటి నామాలకు వేరైనవి కానందుచేత మరియు వివిధమైన నామాలన్నీ ఓంకారానికి భిన్నమైనవి కానందుచేత ఈ సమస్తమైన పదార్థాలన్నీ ఓంకారమే. అభిధాన-అభిధేయమనే ఉపాయంతో అవగతమయ్యే పరబ్రహ్మ కూడా ఓంకారమే. {అభిధానం అంటే సూచిక లేదా ప్రతీక. అభిధేయం అంటే లక్ష్యం చేసుకొన్న విషయం. అంటే అభిధానమైన ఓంకారంతో, అభిధేయమైన బ్రహ్మజ్ఞానాన్ని పట్టుకొనడమే ఉపాయం లేదా యుక్తి}. **తస్య** దీనికి

అంటే పర మరియు అపర బ్రహ్మరూపమైన అక్షరానికి అంటే ఓంకారం అనేది **ఉపవ్యాఖ్యానమ్** బ్రహ్మమును పొందటానికి ఉపాయం కావడం చేత బ్రహ్మకు అత్యంత సమీపంగా ఉన్నదనే విషయాన్ని స్పష్టంగా వివరించడం జరుగుతోంది. ఈ విషయమే ఈ విచారణ ద్వారా ప్రస్తుతం తెలుసుకొనవలసినది అని వాక్యాన్ని పూరించుకోవాలి. {ఓంకారం బ్రహ్మతత్త్వానికి అత్యంత సమీపమైనందుచేత, ఆ ఓంకారాన్ని కూలంకషంగా విచారణ చేసి తెలుసుకొన్నట్లైతే, బ్రహ్మమును తెలుసుకొనడం సులభతరమౌతుంది. అందుకొరకే, ఈ చెప్పబోయే విషయం అంతా కూడా శ్రద్ధతో అర్థం చేసుకోవాలి అని అభిప్రాయం}. **భూతమ్ భవత్ భవిష్యత్ ఇతి** భూత-వర్తమాన-భవిష్యత్తు అనే కాలవిభాగాలు **సర్వమ్ ఓంకారమ్ ఏవ** అన్నీ కూడా, ముందు చెప్పిన న్యాయం ప్రకారంగానే, ఓంకారమే. **చ యత్ త్రికాలాతీతమ్** మరియు ఏదైతే ఈ మూడు కాలాలకు అతీతంగా **అన్యత్** వేరుగా, ఈ కాలపరిధిలో లేకుండా, కార్యముల ద్వారా మాత్రమే దేని ఉనికినైతే తెలుసుకోగలమో, అంటే అవ్యక్తం వంటివి, **తత్ అపి ఓంకార ఏవ** అది కూడా ఓంకారమే.

నామము మరియు ఆ నామం సూచించే వస్తువు ఒకటే అయినప్పటికీ అభిధానమైన నామానికే ప్రాధాన్యతనిస్తూ 'ఓమిత్యేతదక్షరమిదం సర్వం' అని ప్రకటిస్తున్నారు. అభిధాన-అభిధేయాలకు సామ్యత్వాన్ని చూపడం కోసమే, అభిధాన ప్రాధాన్యంగా నిర్దేశించబడేదాన్నే తిరిగి అభిధేయ ప్రాధాన్యంగా చెప్తున్నారు. లేకపోతే (అంటే అలా చెప్పకపోతే), అభిధేయం అభిధానం మీద ఆధారపడినట్లుగా భావించి, అభిధేయం అభిధానం కావడం గౌణమౌతుందనే (ప్రధానం కాకుండా పోతుందనే) సంశయం ఏర్పడుతుంది. (అంటే, అభిధేయం అనేది అభిధానం మీద ఆధారపడితే, అపుడు అభిదేయం అభిధానం అయ్యే అవకాశం ఉండదేమో అనే సందేహం కలుగుతుంది). అభిధాన-అభిధేయముల ఏకత్వం ప్రతిపాదించబడితే కలిగే ప్రయోజనం ఏమిటంటే - ఒకటే ప్రయత్నంతో అభిధాన-అభిదేయములు రెండింటినీ నిర్మూలించి వాటికి విలక్షణమైన బ్రహ్మను పొందటమనేదే ఆ ప్రయోజనం. (అంటే అభిధాన-అభిధేయాలు రెండింటినీ ఒకేసారి నిర్మూలించుకొంటే వాటికి భిన్నతత్త్వమైన బ్రహ్మమును సాధించవచ్చు అని అభిప్రాయం). 'పాదములే ఓంకారంలోని మాత్రలు. ఆ మాత్రలే పాదాలు' ['పాదా మాత్రా మాత్రాశ్చపాదాః' (మాం.ఉ. 8)] అని అంటూ ఈ ఉపనిషత్తులో చెప్పబోయేది కూడా ఇదే. అందుకని, 'సర్వం హ్యేతద్బ్రహ్మ' అని తర్వాత మంత్రాన్ని ప్రారంభిస్తున్నారు.

**సర్వగ్ం హ్యేతద్బ్రహ్మాయమాత్మా బ్రహ్మ సోఽయమాత్మా చతుష్పాత్ || || మాం.ఉ. 1-2 ||**

ఇదంతా నిశ్చయంగా బ్రహ్మమే. ఈ ఆత్మ బ్రహ్మము. (బ్రహ్మమే అయిన) ఈ ఆత్మ నాలుగు పాదాలుకలది.

**శంకరుల భాష్యము**

సర్వం యదుక్తమోంకారమాత్రమితి, తదేతత్ బ్రహ్మ| తచ్చ బ్రహ్మ పరోక్షాభిహితం ప్రత్యక్షతో విశేషేణ నిర్దిశతి — అయమాత్మా బ్రహ్మేతి| అయం ఇతి చతుష్పాత్త్వేన ప్రవిభజ్యమానం ప్రత్యగాత్మతయాభినయేన నిర్దిశతి అయమాత్మేతి| సోఽయమాత్మా ఓంకారాభిధేయః పరాపరత్వేన వ్యవస్థితః చతుష్పాత్ కార్షాపణవత్ , న గౌరివ| త్రయాణాం విశ్వాదీనాం పూర్వపూర్వప్రవిలాపనేన తురీయస్య ప్రతిపత్తిరితి కరణసాధనః పాదశబ్దః ; తురీయస్య తు పద్యత ఇతి కర్మసాధనః పాదశబ్దః||

**కథం చతుష్పాత్త్వమిత్యాహ — జాగరితస్థాన ఇతి|**

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

**సర్వమ్** ఏదైతే ఓంకారం మాత్రమేనని (గత మంత్రంలో) చెప్పబడిందో అది **హి ఏతత్ బ్రహ్మ** నిశ్చయంగా ఆ బ్రహ్మమే. మరియు పరోక్షంగా చెప్పబడిన ఆ బ్రహ్మమునే ప్రత్యక్షంగానూ ప్రత్యేకంగానూ 'అయమ్ ఆత్మా బ్రహ్మ' ఈ ఆత్మయే బ్రహ్మ అని నిర్దేశిస్తున్నారు. **అయమ్ ఆత్మా బ్రహ్మ** అనే పాఠంలో, నాలుగు పాదాలుగా విభాగించదగిన అంతరతమైన ఆత్మను (అంటే ప్రత్యగాత్మను) **అయమ్** 'ఇది' అని నిర్దేశించి (హృదయం వైపు చేతిని ఉంచి) చూపిస్తున్నారు. **సః అయమ్ ఆత్మా** ఓంకారం అభిధేయంగా గలది, పరబ్రహ్మ-అపరబ్రహ్మ స్థితిని కలిగినట్టిది అయిన ఆత్మకు **చతుష్పాత్** కార్షాపణంలాగా నాలుగు పాదాలున్నాయి. అంటే ఆవుకు లాగా నాలుగుపాదాలున్నవని అర్థం కాదు. {'పాద' అన్న పదానికి పాదము లేదా నాల్గవవంతు అనే అర్థాలున్నాయి. ఇక్కడ నాల్గవవంతు అన్న అర్థాన్నే తీసుకోవాలి. ఒక కార్షపణానికి 16 సమాన భాగాలుంటాయి. (కార్షపణం అంటే పూర్వకాలంలో దాదాపు నేటి రూపాయికి సమాన విలువ కలిగిన ఒక నాణెం. దీనిలో 16వ వంతు భాగాన్నే అణా అనేవారు. 4 అణాలు కలిపితే ఒక పాదం). వీటిలో 4 భాగాలను కలిపితే ఒక 'పాదం' అవుతుంది. భాగాలు వాటి ప్రత్యేకతను కోల్పోయి వాటికన్నా పెద్ద వాటిలో కలిసిపోయినట్లుగా, విశ్వుడు తైజసునిలోను, తైజసుడు ప్రాజ్ఞునిలోను, ప్రాజ్ఞుడు తురీయంలోనూ కలిసిపోతాయి. పాదం అన్నదాన్ని ఒక భౌతిక వ్యవహారంగా చూడకూడదు – స్వామి గంభీరానంద}. విశ్వ-తైజస-ప్రాజ్ఞ అనేవి మూడు వరుసగా ఒకదానిలో మరొకటి ఒక క్రమంలో కలుస్తున్నప్పుడు పాదశబ్దాన్ని 'సాధించుట' అనే భావనలో కరణసాధనంగా గ్రహించాలి. అయితే తురీయ అవస్థలో మాత్రం పాదశబ్దానికి పొందుట అనే భావనలో కర్మసాధనాపరమైన అర్థాన్ని గ్రహించాలి.

ఆత్మకు నాలుగు పాదాలు ఎలా కలిగాయో తెలియచేయడానికి 'జాగరిత స్థానః...' అంటూ తర్వాత మంత్రాన్ని ఉపనిషత్తు ఇలా చెప్తోంది

**జాగరితస్థానో బహిఃప్రజ్ఞః సప్తాఙ్గః ఏకోనవింశతిముఖః స్థూలభుగ్వైశ్వానరః ప్రథమః పాదః||**

**|| మాం.ఉ. 1-3 ||**

బాహ్య చైతన్యంతో కూడి, ఏడు అవయవాలు, పందొమ్మిది ముఖాలు కలిగి, స్థూల విషయాలను భోగించే వైశ్వానరుని స్థానమే జాగ్రదవస్థ. అదియే ప్రథమ పాదము.

**<u>శంకరుల భాష్యము</u>**

జాగరితం స్థానమస్యేతి జాగరితస్థానః, బహిఃప్రజ్ఞః స్వాత్మవ్యతిరిక్తే విషయే ప్రజ్ఞా యస్య, సః బహిఃప్రజ్ఞః ; బహిర్విషయేవ ప్రజ్ఞా యస్యావిద్యాకృతావభాసత ఇత్యర్థః| తథా సప్త అంగాన్యస్య ; 'తస్య హ వా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాశ్చక్షుర్విశ్వరూపః ప్రాణః పృథగ్వర్త్మాత్మా సందేహో బహులో వస్తిరేవ రయిః పృథివ్యేవ పాదౌ' (ఛా. ఉ. 5| 18| 2) ఇత్యగ్నిహోత్రాహుతికల్పనాశేషత్వేనాగ్నిర్ముఖత్వేనాహవనీయ ఉక్త ఇత్యేవం సప్తాంగాని యస్య, సః సప్తాంగః| తథా ఏకోనవింశతిర్ముఖాన్యస్య ; బుద్ధీంద్రియాణి కర్మేంద్రియాణి చ దశ, వాయవశ్చ ప్రాణాదయః పంచ, మనో

బుద్ధిరహంకారశ్చిత్తమితి, ముఖానీవ ముఖాని తాని ; ఉపలబ్ధిద్వారాణీత్యర్థః| స ఏవంవిశిష్టో వైశ్వానరః యథోక్తైర్ద్వారైః శబ్దాదీన్స్థూలాన్విషయాన్భుంక్త ఇతి స్థూలభుక్| విశ్వేషాం నరాణామనేకధా సుఖాదినయనాద్విశ్వానరః, యద్వా విశ్వశ్చాసౌ నరశ్చేతి విశ్వానరః, విశ్వానర ఏవ వైశ్వానరః, సర్వపిండాత్మానన్యత్వాత్ ; స ప్రథమః పాదః| ఏతత్పూర్వకత్వాదుత్తరపాదాధిగమస్య ప్రాథమ్యమస్య| కథం 'అయమాత్మా బ్రహ్మ' ఇతి ప్రత్యగాత్మనోఽస్య చతుష్పాత్త్వే ప్రకృతే ద్యులోకాదీనాం మూర్ధాద్యంగత్వమితి ? నైష దోషః, సర్వస్య ప్రపంచస్య సాధిదైవికస్య అనేనాత్మనా చతుష్పాత్త్వస్య వివక్షితత్వాత్| ఏవం చ సతి సర్వప్రపంచోపశమే అద్వైతసిద్ధిః| సర్వభూతస్థశ్చ ఆత్మా ఏకో దృష్టః స్యాత్ ; సర్వభూతాని చాత్మని| 'యస్తు సర్వాణి భూతాని' (ఈ. ఉ. 6) ఇత్యాదిశ్రుత్యర్థశ్చైవముపసంహృతః స్యాత్ ; అన్యథా హి స్వదేహపరిచ్ఛిన్న ఏవ ప్రత్యగాత్మా సాంఖ్యాదిభిరివ దృష్టః స్యాత్ ; తథా చ సతి అద్వైతమితి శ్రుతికృతో విశేషో న స్యాత్ , సాంఖ్యాదిదర్శనేనావిశేషాత్| ఇష్యతే చ సర్వోపనిషదాం సర్వాత్మైక్యప్రతిపాదకత్వం ; తతో యుక్తమేవాస్య ఆధ్యాత్మికస్య పిండాత్మనో ద్యులోకాద్యంగత్వేన విరాడాత్మనాధిదైవికేనైకత్వమిత్యభిప్రేత్య సప్తాంగత్వవచనం| 'మూర్ధా తే వ్యపతిష్యత్' (ఛా. ఉ. 5| 12| 2) ఇత్యాదిలింగదర్శనాచ్చ| విరాజైకత్వముపలక్షణార్థం హిరణ్యగర్భావ్యాకృతాత్మనోః| ఉక్తం చైతన్మధుబ్రాహ్మణే — 'యశ్చాయమస్యాం పృథివ్యాం తేజోమయోఽమృతమయః పురుషో యశ్చాయమధ్యాత్మం' (బృ. ఉ. 2| 5| 1) ఇత్యాది| సుషుప్తావ్యాకృతయోస్త్వేకత్వం సిద్ధమేవ, నిర్విశేషత్వాత్| ఏవం చ సత్యేతత్సిద్ధం భవిష్యతి — సర్వద్వైతోపశమే చాద్వైతమితి||

## <u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>

**జాగరితస్థానః** జాగ్రదవస్థయే తన కార్యకలాపాల పరిధిగా కలిగి **బహిఃప్రజ్ఞః** తనకు భిన్నమైన విషయాలపట్ల ఎఱుక ఎవరికి కలదో అతడే బహిఃప్రజ్ఞః. అంటే ఎవనికి అవిద్య వల్ల బాహ్యవిషయాల యందు మాత్రమే ఎఱుక ఉన్నట్లుగా అనిపిస్తోందో అతడు బహిఃప్రజ్ఞుడు అని అభిప్రాయం. అలాగే **సప్త అఙ్గః** అతనికి ఏడు అవయవాలు. 'ఈ చెప్పబడిన వైశ్వానరునికి స్వర్గమే శిరస్సు, సూర్యుడే చక్షువు, ప్రాణమే వాయువు, ఆకాశమే మధ్యభాగం, నీరే మూత్రాశయం, భూమియే పాదద్వయం' ['తస్య హ వా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాశ్చక్షుర్విశ్వరూపః ప్రాణః పృథగ్వర్త్మాత్మా సందేహో బహులో వస్తిరేవ రయిః పృథివ్యేవ పాదౌ' (ఛా.ఉ. 5-18-2)] అని దానియందు అగ్నిహోత్ర క్రతువు యొక్క కల్పనను పూర్తిచేయడానికై దాని ముఖాన్ని ఆహవనీయాగ్నిగా వర్ణించారు. ఈవిధంగా ఏడు అవయవాలు కలిగిన వాడు సప్తాంగుడు. అదేవిధంగా, **ఏకోనవింశతిముఖః** జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు పది, వాయు-ప్రాణాదులు అయిదు, మనసు-బుద్ధి-అహంకారం-చిత్తం అనే నాలుగు, కలిపి మొత్తం 19 ముఖముల వంటి వాటిని కలిగినవాడు. ముఖములంటే అనుభవ ద్వారాలని అర్థం. ఆ విధమైన ప్రత్యేకతలు కలిగిన వైశ్వానరుడు ఈ చెప్పబడిన ద్వారాల గుండా **స్థూలభుక్** శబ్దం వంటి స్థూల విషయాలను భోగిస్తున్నాడు. **వైశ్వానరః** వైశ్వానరుడంటే విశ్వానరుడే. విశ్వంలోని ప్రాణులకు సుఖాదులను అనేక విధాలుగా తెచ్చేవాడైనందున విశ్వానరుడంటారు లేదా విశ్వమంతటా మరియు సకల ప్రాణులలోఉన్నవాడు మరియు సమష్టి స్థూలరూపత్వం తప్ప మరేమీ కాని వాడైనందుచేత విశ్వానరుడు అంటారు. అతడే **ప్రథమః పాదః** మొదటి పాదము. ఇది అన్నింటికన్నా ముందుది అయినందున మరియు దీనికి తర్వాత వచ్చే పాదములు దీనిపై ఆధారపడి ఉన్నందున, ఈ వైశ్వానరునికి ప్రథమత్వం చెప్పబడింది.

**<u>సందేహం</u> :** 'అయమాత్మా బ్రహ్మ' అని ప్రత్యగాత్మను సూచిస్తూ దానికి నాలుగు పాదాలున్నాయని చెప్పిన తర్వాత స్వర్గలోకాదులు దానికి శీర్షాదులంటూ అవయవాలను ఎలా చెప్తున్నారు?

**<u>సమాధానం</u>:** ఇందులో దోషం ఏమీలేదు. సకల ప్రపంచమూ మరియు దేవలోకం కూడా ఈ సమష్టి ఆత్మరూపంగానే ఉండి ఈ నాలుగు పాదములనేవి కూడా దానికి చెందినవే కాబట్టి (అటువంటి సమష్టి ఆత్మ స్వరూపానికి స్వర్గలోకాదులు అవయాలని చెప్పడంలో దోషం ఏమీ లేదు). అలా విశదీకరిస్తేనే, సకల ప్రపంచమూ లయమైపోగా అద్వైతసిద్ధి కలుగుతుందని చెప్పగలం. అప్పుడే, సర్వభూతములయందున్న ఆత్మ ఒక్కటే అని మరియు సర్వభూతాలు ఆత్మయందే ఉన్నాయనే దర్శనం కలుగుతుంది. అలా అయితేనే 'యస్తు సర్వాణి భూతాని' (ఈ.ఉ. 6) వంటి శ్రుతి వాక్యాల అభిప్రాయాన్ని కూడా ధృవీకరించినట్లు అవుతుంది. అలా కానట్లైతే, సాంఖ్యులు మొదలైనవారు భావించినట్లుగా, తన దేహంతో పరిచ్ఛిన్నమైన ప్రత్యగాత్మ వేరుగా మాత్రమే భావించబడతాడు. ఇది సాంఖ్యదర్శనాలకు భిన్నంకానందుచేత, 'అద్వైతమితి' అని శ్రుతి ప్రత్యేకంగా ప్రకటించిన స్థితి సిద్ధించదు. నిజానికి సకల ఉపనిషత్తుల అభిప్రాయం సకల జీవుల ఆత్మ ఒకటే అనే ప్రతిపాదనను సమర్ధించడమే. ఇదే అభిలషణీయం. అందువలన, ఈ ఆధ్యాత్మికమైన పిండరూపము (వ్యష్టి పరమైనది) మరియు స్వర్గలోకం ఒక భాగంగా కలిగిన ఆధిదైవికమైన విరాట్ రూపము (సమష్టికి చెందినది) ఒక్కటే అనే అభిప్రాయంతో చెప్పినపుడు సప్తాంగం అనే వాక్యం సమంజసమైనదే. 'మూర్ధా తే వ్యపతిష్యత్' (ఛా.ఉ. 5-12-2) వంటి శ్రుతివాక్యాలలో కూడా ఆ విధంగానే సూచించబడింది కాబట్టి కూడా (సప్తాంగ విభాగం సరియైనదే). {ఈ శ్రుతి వాక్యం ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడిన ఒక కథా భాగంలో అశ్వపతి అనే ఆచార్యుడు తన వద్దకు చేరిన ఆరుగురు శిష్యులతో చెప్పిన మాట. ఆరుగురు శిష్యులు వైశ్వానరుని యొక్క వివిధ అవయవాలను వైశ్వానరునిగా భావన చేసి ఉపాసిస్తూ ఉండేవారు. వారి ఈ దోషాన్ని ఎత్తి చూపిన అశ్వపతి మీరు మీ దోషాన్ని సరిచేసుకొనడానికి నా వద్దకు రాకుండా ఉండిఉంటే మీరు ఉపాసించే అవయవాలు నశించి ఉండేవి అని అన్నాడు. వ్యక్తి రూపము మరియు విరాట్ రూపము ఒకటి కాకపోతే, స్వర్గలోకాన్ని మాత్రమే విరాట్ పురుషునిగా ఉపాసించిన వాని శిరస్సు పడిపోతుంది అనడం అనౌచిత్యమే అవుతుంది కదా. అందుచేత, ఆచార్యుని ప్రకటనం సరియైనది కాబట్టి, వ్యక్తి శిరస్సు మరియు విరాట్పురుషుని శిరస్సైన స్వర్గము ఒకటే అయితీరాలి}. అలా (విశ్వునితో) విరాట్ యొక్క ఏకత్వం సాధించినట్లుగానే (తైజసునితో) హిరణ్యగర్భుని ఏకత్వాన్ని మరియు (ప్రాజ్ఞునితో) అవ్యాకృతానికి ఏకత్వాన్ని కూడా చెప్పవచ్చు. దీనినే బృహదారణ్యకంలోని మధు బ్రాహ్మణంలో 'ఈ పృథివియందు తేజోమయుడు అమృతమయుడైన పురుషుడే వ్యక్తియందు ప్రకాశిస్తున్నాడు' ['యశ్చాయమస్యాం పృథివ్యాం తేజోమయోఽమృతమయః పురుషో యశ్చాయమధ్యాత్మం' (బృ.ఉ. 2-5-1)] అని చెప్పారు. ఇక సుషుప్తిలో విశేషతలు ఏవీ లేనందువల్ల (వ్యష్టిగా) ప్రాజ్ఞునికి (సమష్టిగా) అవ్యక్తానికి ఏకత్వం సిద్ధమయ్యే ఉన్నది. ఈ విధంగా ఇదంతా ఉన్నందున, సకల ద్వైత ప్రపంచం ఉపశమించగా అద్వైతం సంభవిస్తుందని నిర్ధారణ కాబోతోంది.

**స్వప్నస్థానోఽన్తఃప్రజ్ఞః సప్తాఙ్గః ఏకోనవింశతిముఖః ప్రవివిక్తభుక్తైజసో ద్వితీయః పాదః ||**

**|| మాం.ఉ. 1-4 ||**

స్వప్నమే తన కార్యస్థానమై, అంతరంగంలోని చైతన్యంగా, ఏడు అంగాలు, పందొమ్మిది ముఖాలుగా విడివడి సూక్ష్మ విషయాలను భోగించే తైజసుడే రెండవ పాదము.

## శంకరుల భాష్యము

స్వప్నః స్థానమస్య తైజసస్యేతి స్వప్నస్థానః| జాగ్రత్ప్రజ్ఞా అనేకసాధనా బహిర్విషయేవావభాసమానా మనఃస్పందనమాత్రా సతీ తథాభూతం సంస్కారం మనస్యాధత్తే ; తన్మనః తథా సంస్కృతం చిత్రిత ఇవ పటో బాహ్యసాధనానపేక్షమవిద్యాకామకర్మభిః ప్రేర్యమాణం జాగ్రద్వదవభాసతే| తథా చోక్తం — 'అస్య లోకస్య సర్వావతో మాత్రామపాదాయ' (బృ. ఉ. 4| 3| 9) ఇత్యాది| తథా 'పరే దేవే మనస్యేకీభవతి' (ప్ర. ఉ. 4| 2) ఇతి ప్రస్తుత్య 'అత్రైష దేవః స్వప్నే మహిమానమనుభవతి' (ప్ర. ఉ. 4| 5) ఇత్యాథర్వణే| ఇంద్రియాపేక్షయా అంతఃస్థత్వాన్మనసః తద్వాసనారూపా చ స్వప్నే ప్రజ్ఞా యస్యేతి అంతఃప్రజ్ఞః, విషయశూన్యాయాం ప్రజ్ఞాయాం కేవలప్రకాశస్వరూపాయాం విషయిత్వేన భవతీతి తైజసః| విశ్వస్య సవిషయత్వేన ప్రజ్ఞాయాః స్థూలాయా భోజ్యత్వం ; ఇహ పునః కేవలా వాసనామాత్రా ప్రజ్ఞా భోజ్యేతి ప్రవివిక్తో భోగ ఇతి| సమానమన్యత్| ద్వితీయః పాదః తైజసః||

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**స్వప్నస్థానః** తైజసుని కార్యస్థానము స్వప్నం. జాగ్రదవస్థలోని చైతన్యం కేవలం మానసిక స్పందన మాత్రమే అయినా అనేక సాధనాలతో కలిసి బాహ్యవిషయాలలో నిమగ్నమైనదిగా కనబడుతూ, అలా ఆ విషయాలకు సంబంధించిన సంస్కారాలను మనసునందు నిక్షిప్తం చేస్తుంది. చిత్రాలను చిత్రించిన చిత్రపటం లాగా, అటువంటి సంస్కారాలతో నిండిన ఆ మనసు, అవిద్య-కామ్యం-కర్మల చేత ప్రభావితమై, (స్వప్నావస్థలో) బాహ్యసాధనాల ప్రమేయం లేకుండానే జాగ్రత్తు లాగా ప్రకాశిస్తుంది. ఈ విషయాన్నే 'ఈ సర్వవ్యాపితమైన జాగ్రత్తు నుండి కొన్నింటిని మాత్రమే (స్వప్నావస్థకు) తీసుకుపోతాడు' ['అస్య లోకస్య సర్వావతో మాత్రామపాదాయ' (బృ.ఉ. 4-3-9)] వంటి శ్రుతి వాక్యాలలో ప్రస్తావించారు. అదేవిధంగా అథర్వణవేదంలో చెప్పబడిన ప్రశ్నోపనిషత్తులో '(సకల ఇంద్రియాలు) వాటికన్నా ఉన్నత దేవతైన మనసులో ఏకమౌతాయి' ['పరే దేవే మనస్యేకీభవతి' (ప్ర.ఉ. 4-2)] అని విషయాన్ని ప్రారంభంచేసి, 'అక్కడ స్వప్నంలో ఈ (మనసు) దేవతయే మహిమలను అనుభవిస్తుంది' ['అత్రైష దేవః స్వప్నే మహిమానమనుభవతి' (ప్ర.ఉ. 4-5)] అని చెప్పారు. ఇంద్రియాలతో పోలిస్తే మరింత లోపలిది కాబట్టి **అన్తః** మనసు, **ప్రజ్ఞః** ఆ మనసు నందలి వాసనల రూపాలను పొందే స్వప్న స్థితిలోని ఎఱుక. అది **అన్తఃప్రజ్ఞః** అంతరతమమైన విషయాలను గురించిన ఎఱుక. విషయాలు లేకుండా, కేవలం ప్రకాశమే స్వరూపమైన ప్రజ్ఞగా విషయాలను గుర్తిస్తున్నందున ఆ అన్తఃప్రజ్ఞయే **తైజసః** తైజసుడు. విశ్వుడు విషయాలమీద ఆధారపడి, స్థూల విషయాలను గుర్తించి భోగిస్తుండగా, మరి అక్కడ తైజసుడు కేవలం సూక్ష్మమైన విషయ వాసనలను మాత్రమే ఎఱుకచేత గుర్తించి అనుభవిస్తున్నాడు. **సప్తాఙ్గః ఏకోనవింశతిముఖః** అన్న మిగిలినవాటికి గత మంత్రానికి వ్యాఖ్యానించినట్లుగానే గ్రహించాలి. **ద్వితీయః పాదః** ఈ తైజసుడు రెండవ పాదము.

**యత్ర సుప్తో న కఞ్చన కామం కామయతే న కఞ్చన స్వప్నం పశ్యతి తత్సుషుప్తమ్| సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానన్దమయో హ్యానన్దభుక్చేతోముఖః ప్రాజ్ఞః తృతీయః పాదః ||** **|| మాం.ఉ. 1-5 ||**

ఏ నిద్రలోనైతే జీవుడు ఏ భోగ్యవస్తువునూ కోరడో, ఏ స్వప్నాన్ని చూడడో అది సుషుప్తి. ఆ సుషుప్తిని స్థానంగా కలవాడు మరియు సమస్తమూ ఏకీకృతమైన చైతన్యఘనమే ప్రాజ్ఞుడు. ఆనందమయుడైన ఆ ప్రాజ్ఞుడే ఆనందాన్ని అనుభవించే వాడూ మరియు (తిరిగి జాగ్రత్తు మరియు స్వప్నావస్థలకు) మార్గమైనట్టివాడు. అదియే మూడవ పాదము.

**శంకరుల భాష్యము**

దర్శనాదర్శనవృత్త్యోః స్వాపస్య తుల్యత్వాత్సుషుప్తగ్రహణార్థం యత్ర సుప్త ఇత్యాదివిశేషణం . అథవా, త్రిష్వపి స్థానేషు తత్త్వాప్రతిబోధలక్షణః స్వాపోఽవిశిష్ట ఇతి పూర్వాభ్యాం సుషుప్తం విభజతే — యత్ర యస్మిన్స్థానే కాలే వా సుప్తో న కంచన కామం కామయతే న కంచన స్వప్నం పశ్యతి . న హి సుషుప్తే పూర్వయోరివాన్యథాగ్రహణలక్షణం స్వప్నదర్శనం కామో వా కశ్చన విద్యతే . తదేతత్సుషుప్తం స్థానమస్యేతి సుషుప్తస్థానః . స్థానద్వయప్రవిభక్తం మనఃస్పందితం ద్వైతజాతం తథా రూపాపరిత్యాగేనావివేకాపన్నం నైశతమోగ్రస్తమివాహః సప్రపంచమేకీభూతమిత్యుచ్యతే . అత ఏవ స్వప్నజాగ్రన్మనఃస్పందనాని ప్రజ్ఞానాని ఘనీభూతానీవ ; సేయమవస్థా అవివేకరూపత్వాత్ప్రజ్ఞానఘన ఉచ్యతే . యథా రాత్రౌ నైశేన తమసా అవిభజ్యమానం సర్వం ఘనమివ, తద్వత్ప్రజ్ఞానఘన ఏవ . ఏవశబ్దాన్న జాత్యంతరం ప్రజ్ఞానవ్యతిరేకేణాస్తీత్యర్థః . మనసో విషయవిషయ్యాకారస్పందనాయాసదుఃఖాభావాత్ ఆనందమయః ఆనందప్రాయః ; నానంద ఏవ, అనాత్యంతికత్వాత్ . యథా లోకే నిరాయాసః స్థితః సుఖ్యానందభుగుచ్యతే . అత్యంతానాయాసరూపా హీయం స్థితిరనేనాత్మనానుభూయత ఇత్యానందభుక్ , 'ఏషోఽస్య పరమ ఆనందః' (బృ. ఉ. 4 . 3 . 32) ఇతి శ్రుతేః . స్వప్నాదిప్రతిబోధం చేతః ప్రతి ద్వారీభూతత్వాత్ చేతోముఖః ; బోధలక్షణం వా చేతో ద్వారం ముఖమస్య స్వప్నాద్యాగమనం ప్రతీతి చేతోముఖః . భూతభవిష్యజ్జ్ఞాతృత్వం సర్వవిషయజ్ఞాతృత్వమస్యైవేతి ప్రాజ్ఞః . సుషుప్తోఽపి హి భూతపూర్వగత్యా ప్రాజ్ఞ ఉచ్యతే . అథవా, ప్రజ్ఞప్తిమాత్రమస్యైవ అసాధారణం రూపమితి ప్రాజ్ఞః ; ఇతరయోర్విశిష్టమపి విజ్ఞానమస్తీతి . సోఽయం ప్రాజ్ఞస్తృతీయః పాదః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

దర్శించడం, దర్శించకపోవడం అనే వృత్తులు సమంగా ఉండే నిద్రాదశను సుషుప్తిగా గ్రహించాలనే ఉద్దేశ్యంతో ఇక్కడ 'యత్ర సుప్త' అని ప్రత్యేకించి చెప్తున్నారు. లేదంటే, మూడు స్థానాలలో (జాగ్రత్తు-స్వప్న-సుషుప్తి అవస్థలలో) యదార్థతత్త్వాన్ని తెలియకపోవడం అనే లక్షణం సమానమే కాబట్టి, వాటినుండి సుషుప్తిని వేరు చేసి చెప్తున్నారు (అని కూడా అర్థం చేసుకోవచ్చు).

వ్యక్తి **యత్ర** ఏ స్థానంలో లేదా ఏ సమయంలో **సుప్తః** సుషుప్తి దశను చేరుకొంటాడో అప్పుడు ఆ ధశలో **న కఞ్చన కామమ్ కామయతే** ఏ భోగ్య విషయాన్నీ భోగించడు **న కఞ్చన స్వప్నమ్ పశ్యతి** ఏ స్వప్నాన్ని దర్శించడు. ముందు చెప్పిన జాగ్రత్తు మరియు స్వప్న దశలలో లాగా స్వప్న దర్శనాన్ని పొందటం లేదా కోరినదాన్ని పొందటం లాంటివి సుషుప్తిలో ఉండవు. **తత్ ఏతత్ సుషుప్తమ్** అదియే ఈ సుషుప్తి దశ. **సుషుప్త స్థానః** ఆ స్థానమే సుషుప్తి స్థానం. దానిలోనే సమస్తమూ **ఏకీభూతమ్** ఒక్కటిగా అవుతాయి. ఎందుకంటే ద్వైత భావననుండి కలిగిన జాగ్రత్తు మరియు స్వప్నములనే రెండు స్థితులూ మనసు యొక్క పరిణామాలే కాబట్టి, ఆ స్థితులలో రూపాలు వాటి లక్షణాలను కోల్పోకుండా, రాత్రి చీకటిచే ఆక్రమించినప్పుడు పగటి ప్రపంచం కనబడకుండాపోయినట్లుగా, ఏకీకృతం అవుతాయంటున్నారు. ఆవిధంగానే, స్వప్న-జాగ్రత్తులలోని మనసు యొక్క స్పందనలనే చైతన్యానుభవాలన్నీ (ఈ సుషుప్తి అవస్థలో) ఘనీభవించినట్లౌతాయి కాబట్టి, అవివేక

రూపమైన ఈ స్థితిని **ప్రజ్ఞానఘనమ్ ఏవ** ఘనీభవించిన చైతన్యమే అని అంటున్నారు. ఏ విధంగా రాత్రికాలంలో చిక్కని చీకటిలో సర్వస్వమూ చీకటి ముద్దలాగా అన్పిస్తూ దాని లోపలి అంశాల వివరాలను చూడటం వీలుకాదో అదేవిధంగా ఈ గడ్డకట్టిన చైతన్యం కూడా **ఏవ** అలాగే ఉంటుంది. ఇక్కడ 'ఏవ' శబ్దానికి చైతన్యం తప్ప దానికి భిన్నంగా ఇతరమైనదేదీ లేదనే అర్థం. **ఆనన్దమయః** ఆ స్థితిలో మనసుకు, విషయాలుగాను మరియు వాటిని అనుభవించేదానిగానూ స్పందించడమనే, శ్రమచేత కలిగే దుఃఖం అనేది లేనందుచేత ఆనందంతో నిండియున్నది. అయితే ఈ ఆనందం తాత్కాలికమే కాబట్టి అసలైన ఆనందం కాదు. లోకంలో ఎటువంటి శ్రమ లేకుండా ఉన్న (విశ్రాంతిగా ఉండే) వాడిని సుఖి అని అనుకొన్నట్లుగా, ఈ ఆనందాన్ని అనుభవించే వానిని **ఆనందభుక్** అంటున్నారు. **ఆనందభుక్** అంటే ఏపాటి శ్రమ కూడా లేనట్టి ఈ స్థితిని అనుభవిస్తున్నవాడు అని అర్థం. ఈ స్థితినే 'ఇదియే అతని యొక్క పరమానందము' ['ఏషోఽస్య పరమ ఆనందః' (బృ.ఉ. 4-3-32)] అని శ్రుతి చెప్పింది. **చేతోముఖః** ఇతడే (ఈ ప్రాజ్ఞుడే) స్వప్న-జాగ్రత్తులో అనుభవాలను పొందే చేతనకు దారి చూపుతాడు కాబట్టి 'చేతోముఖః' అని అనబడుతున్నాడని లేదా అనుభవాలను పొందటమనే లక్షణం గల చైతన్యమే స్వప్న-జాగ్రత్తులలోకి ప్రవేశించే మార్గం కనుక ఆ చైతన్యమే ముఖంగా లేదా ద్వారంగా కలవాడు కాబట్టి 'చేతోముఖః' అని అయినా అనుకోవచ్చు. **ప్రాజ్ఞః** జరిగినది-జరగబోయేది తెలియడం, సకల విషయాలు తెలియడం అనే లక్షణాలున్నందున అతడు ప్రాజ్ఞుడు. లేదా, సుషుప్తిలో ఉండి కూడా పూర్వ స్థితులను కలిగినవాడు కనుక ప్రాజ్ఞుడు అనబడుతున్నాడు. లేదా, కేవలం శుద్ధ జ్ఞానమనే అసాధారణ రూపం కలవాడైనందున ప్రాజ్ఞుడు అని కూడా అంటారు. ఇతర స్థితులలో (స్వప్న-జాగ్రత్తులలో) ఉండే జ్ఞాన వైవిధ్యాలతో కూడిన విజ్ఞానం కల ఈ ప్రాజ్ఞుడే మూడవ పాదంగా వర్ణించబడినాడు.

**ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽన్తర్యామ్యేష యోనిః సర్వస్య ప్రభవాప్యయౌ హి భూతానామ్ || || మాం.ఉ. 1-6 ||**

ఇతడే సర్వేశ్వరుడు. ఇతడే సర్వజ్ఞుడు. ఇతడే అంతర్యామి. ఇతడే సకల ప్రాణుల పుట్టుకకు లయానికి కూడా మూలకారణం.

## శంకరుల భాష్యము

ఏషః హి స్వరూపావస్థః సర్వేశ్వరః సాధిదైవికస్య భేదజాతస్య సర్వస్య ఈశ్వరః ఈశితా ; నైతస్మాజ్జాత్యంతరభూతోఽన్యేషామివ, 'ప్రాణబంధనం హి సోమ్య మనః' (ఛా. ఉ. 6| 8| 2) ఇతి శ్రుతేః| అయమేవ హి సర్వస్య సర్వభేదావస్థో జ్ఞాతేతి ఏషః సర్వజ్ఞః| అత ఏవ ఏషః అంతర్యామీ, అంతరనుప్రవిశ్య సర్వేషాం భూతానాం యమయితా నియంతాప్యేష ఏవ| అత ఏవ యథోక్తం సభేదం జగత్ప్రసూయత ఇతి ఏషః యోనిః సర్వస్య| యత ఏవం , ప్రభవశ్చాప్యయశ్చ ప్రభవాప్యయౌ హి భూతానామేష ఏవ||

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**ఏషః** ఈ ప్రాజ్ఞుడే తన స్వరూపస్థితిలో **సర్వేశ్వరః** సర్వమునకు ప్రభువు, అంటే దేవలోకంతో సహా వైవిధ్యంతో కూడిన సర్వస్వానికి ఈశ్వరుడు, సమస్తానికి శాసకుడు. అంతేకాని, ఈశ్వరుడు ప్రాజ్ఞునికి అంతర్గతంగా

భిన్నమైన వాడు కాడని శ్రుతి ఇలా అంటోంది. 'ఓ సౌమ్యా, మనసు (అంటే ఉపాధి చేత పరిమితుడైన జీవుడు) బంధనం ద్వారా తనకు ముడిపడియున్న ప్రాణాన్ని ఆశ్రయిస్తాడు' ['ప్రాణబంధనం హి సోమ్య మనః' (ఛా.ఉ. 6-8-2)]. మరింకా, **ఏషః సర్వజ్ఞః** ఇతడే సకలాన్ని వివిధ అవస్థాభేధాలలో తెలుసుకొనేవాడు. కాబట్టే, **ఏషః అన్తర్యామి** ఇతడే అంతరంగంలోనున్న శాసకుడు, సకల భూత శరీరాల లోపల ప్రవేశించి నియంత్రణ కూడా చేస్తున్నాడు కనుక అంతర్యామి అన్నారు. ఈ చెప్పబడిన కారణంగానే (ప్రాజ్ఞుడు సర్వానికి ప్రభువు, సర్వం తెలిసినవాడు, అంతర్యామి అయినందున బ్రహ్మతో సామ్యం కలిగిన కారణంగానే) వైవిధ్యం కల జగత్తును ప్రభవింపచేస్తున్నందున **సర్వస్య** సకలానికి **ఏషః యోనిః** ఇది మూల కారణం. అందుచేతనే, ఇది **భూతానామ్** సకల భూతముల **ప్రభవ-అప్యయౌ** పుట్టుకకు మూలము మరియు లయమయ్యే అంతిమ స్థానము కూడా.

## గౌడపాదుల కారిక

**అత్రైతే శ్లోకా భవంతి —**

ఈ విషయాన్ని గురించి (గౌడపాదుల వారి కారికలో) ఈ శ్లోకాలు ఉన్నాయి.

### శంకరుల భాష్యము

**అత్ర ఏతస్మిన్యథోక్తేఽర్థే ఏతే శ్లోకా భవంతి — బహిఃప్రజ్ఞ ఇతి|**

### శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

ఇలా చెప్పబడిన ఈ విషయాన్ని గురించి 'బహిఃప్రజ్ఞ...' అంటూ మొదలయ్యే ఈ క్రింది శ్లోకాలు (మాండూక్య కారికలో ఉన్నాయి).

**బహిష్ప్రజ్ఞో విభుర్విశ్వో హ్యన్తఃప్రజ్ఞస్తు తైజసః|**
**ఘనప్రజ్ఞస్తథా ప్రాజ్ఞ ఏక ఏవ త్రిధా స్మృతః ||** **|| మాం.గౌ.కా.1-1 ||**

విశ్వుడు సర్వత్రా వ్యాపించి బాహ్యవిషయాలను అనుభవిస్తాడు. తైజసుడు అంతరంగంలోని సూక్ష్మ విషయాలను అనుభవిస్తాడు. అలాగే, ప్రాజ్ఞుడు ఘనీభవించిన చైతన్యం. ఒక్కటే మూడు విధాలుగా (మహర్షులచే) భావించబడింది.

### శంకరుల భాష్యము

**పర్యాయేణ త్రిస్థానత్వాత్ సోఽహమితి స్మృత్యా ప్రతిసంధానాచ్చ స్థానత్రయవ్యతిరిక్తత్వమేకత్వం శుద్ధత్వమసంగత్వం చ సిద్ధమిత్యభిప్రాయః, మహామత్స్యాదిదృష్టాంతశ్రుతేః||**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఒకదాని తర్వాత మరొకటిగా మూడు అవస్థలను (జాగ్రత్తు-స్వప్న-సుషుప్తి అవస్థలను) పొందుతూ, 'అది నేను' అనే (ఆ పొందేది నేనే అనే) స్మృతితో అనుసంధానమై ఉండటం చేత, ఆ మూడు స్థానాలకు భిన్నమైన ఉనికి కలిగిన ఆత్మ ఏకత్వం, శుద్ధత్వం, అసంగత్వం అనే లక్షణాలు కలిగినదని నిరూపణ అవుతోంది.

వేద వాక్యాలలో చెప్పిన మహామత్స్యం, గరుడపక్షుల ఉదాహరణలు ఈ విషయాన్నే విపులీకరిస్తున్నాయి. {బృహదారణ్యకోపనిషత్తులోని 4.3.18వ మంత్రంలో మహామత్స్యం గురించిన ఉదాహరణ ఇలా చెప్పారు. నదిలోని చాలా పెద్ద చేప ఈ తీరం నుండి ఆ తీరానికి, అంటే తూర్పు నుండి పడమరకు, వరుసగా పలుమార్లు తిరిగినట్లుగా, ఈ అనంతతత్వం జాగ్రదవస్థకు నిద్రావస్థకు మధ్య తిరుగాడుతోంది. అదే ఉపనిషత్తులోని 4.3.19వ మంత్రంలో ఆకాశంలో తిరిగే గరుడపక్షి అలసిపోయి రెక్కలు చాచి తన గూడువైపుకు చేరినట్లుగా, ఈ అనంతతత్వం కూడా కోరికల పట్ల ఆసక్తి లేని మరియు స్వప్నాలను దర్శింపని సుషుప్తి అవస్థకు దారితీస్తుంది. – స్వామి గంభీరానంద}.

**దక్షిణాక్షిముఖే విశ్వో మనస్యన్తస్తు తైజసః|**
**ఆకాశే చ హృది ప్రాజ్ఞస్త్రిధా దేహే వ్యవస్థితః|| || మాం.గౌ.కా 1-2 ||**

విశ్వునిగా కుడి కన్ను అనుభవస్థానం. తైజసునిగా లోపల మనసునందు (అనుభవ స్థానం). మరియు హృదయాకాశం ప్రాజ్ఞుని స్థానం. అలా మూడు విధాలుగా దేహంలో (జీవాత్మ) వ్యవస్థితుడై యున్నాడు.

**శంకరుల భాష్యము**

**జాగరితావస్థాయామేవ విశ్వాదీనాం త్రయాణామనుభవప్రదర్శనార్థోఽయం శ్లోకః — దక్షిణాక్షీతి| దక్షిణమక్ష్యేవ ముఖం , తస్మిన్ప్రాధాన్యేన ద్రష్టా స్థూలానాం విశ్వః అనుభూయతే, 'ఇంధో హ వై నామైష యోఽయం దక్షిణేఽక్షన్పురుషః' (బృ. ఉ. 4| 2| 2) ఇతి శ్రుతేః| ఇంధో దీప్తిగుణో వైశ్వానర ఆదిత్యాంతర్గతో వైరాజ ఆత్మా చక్షుషి చ ద్రష్టైకః| నన్వన్యో హిరణ్యగర్భః, క్షేత్రజ్ఞో దక్షిణేఽక్షిణ్యక్ష్ణోర్నియంతా ద్రష్టా చాన్యో దేహస్వామీ ; న, స్వతో భేదానభ్యుపగమాత్ ; 'ఏకో దేవః సర్వభూతేషు గూఢః' (శ్వే. ఉ. 6| 11) ఇతి శ్రుతేః, 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత' (భ. గీ. 13| 2) 'అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితం' (భ. గీ. 13| 16) ఇతి స్మృతేశ్చ ; సర్వేషు కరణేష్వవిశేషేష్వపి దక్షిణాక్షిణ్యుపలబ్ధిపాటవదర్శనాత్తత్ర విశేషేణ నిర్దేశోఽస్య విశ్వస్య| దక్షిణాక్షిగతో దృష్ట్వా రూపం నిమీలితాక్షస్తదేవ స్మరన్మనస్యంతః స్వప్న ఇవ తదేవ వాసనారూపాభివ్యక్తం పశ్యతి| యథా తత్ర తథా స్వప్నే ; అతః మనసి అంతస్తు తైజసోఽపి విశ్వ ఏవ| ఆకాశే చ హృది స్మరణాఖ్యవ్యాపారోపరమే ప్రాజ్ఞ ఏకీభూతో ఘనప్రజ్ఞ ఏవ భవతి, మనోవ్యాపారాభావాత్| దర్శనస్మరణే ఏవ హి మనఃస్పందితం ; తదభావే హృద్యేవావిశేషేణ ప్రాణాత్మనావస్థానం , 'ప్రాణో హ్యేవైతాన్సర్వాన్సంవృంక్తే' (ఛా. ఉ. 4| 3| 3) ఇతి శ్రుతేః| తైజసః హిరణ్యగర్భః, మనఃస్థత్వాత్ ; 'లింగం మనః' (బృ. ఉ. 4| 4| 6) 'మనోమయోఽయం పురుషః' (బృ. ఉ. 5| 6| 1) ఇత్యాదిశ్రుతిభ్యః| నను, వ్యాకృతః ప్రాణః సుషుప్తే ; తదాత్మకాని కరణాని భవంతి ; కథమవ్యాకృతతా ? నైష దోషః, అవ్యాకృతస్య దేశకాలవిశేషాభావాత్| యద్యపి ప్రాణాభిమానే సతి వ్యాకృతతైవ ప్రాణస్య ; తథాపి పిండపరిచ్ఛిన్నవిశేషాభిమాననిరోధః ప్రాణే భవతీత్యవ్యాకృత ఏవ ప్రాణః సుషుప్తే పరిచ్ఛిన్నాభిమానవతాం| యథా ప్రాణలయే పరిచ్ఛిన్నాభిమానినాం ప్రాణోఽవ్యాకృతః, తథా ప్రాణాభిమానినోఽప్యవిశేషాపత్తావవ్యాకృతతా సమానా,**

**ప్రసవబీజాత్మకత్వం చ| తదధ్యక్షశ్చైకోఽవ్యాకృతావస్థః| పరిచ్ఛిన్నాభిమానినామధ్యక్షాణాం చ తేనైకత్వమితి పూర్వోక్తం విశేషణమేకీభూతః ప్రజ్ఞానఘన ఇత్యాద్యుపపన్నం| తస్మిన్నేతస్మిన్నుక్తహేతుసత్త్వాచ్చ| కథం ప్రాణశబ్దత్వమవ్యాకృతస్య ? 'ప్రాణబంధనం హి సోమ్య మనః' (ఛా. ఉ. 6| 8| 2) ఇతి శ్రుతేః| నను, తత్ర 'సదేవ సోమ్య' (ఛా. ఉ. 6| 2| 1) ఇతి ప్రకృతం సద్బ్రహ్మ ప్రాణశబ్దవాచ్యం ; నైష దోషః, బీజాత్మకత్వాభ్యుపగమాత్సతః| యద్యపి సద్బ్రహ్మ ప్రాణశబ్దవాచ్యం తత్ర, తథాపి జీవప్రసవబీజాత్మకత్వమపరిత్యజ్యైవ ప్రాణశబ్దత్వం సతః సచ్ఛబ్దవాచ్యతా చ| యది హి నిర్బీజరూపం వివక్షితం బ్రహ్మాభవిష్యత్ , 'నేతి నేతి' (బృ. ఉ. 4| 5| 3) 'యతో వాచో నివర్తంతే' (తై. ఉ. 2| 9| 1) 'అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి' (కే. ఉ. 1| 4) ఇత్యవక్ష్యత్ ; 'న సత్తన్నాసదుచ్యతే' (భ. గీ. 13| 12) ఇతి స్మృతేః| నిర్బీజతయైవ చేత్ , సతి ప్రలీనానాం సంపన్నానాం సుషుప్తిప్రలయయోః పునరుత్థానానుపపత్తిః స్యాత్ ; ముక్తానాం చ పునరుత్పత్తిప్రసంగః, బీజాభావావిశేషాత్ , జ్ఞానదాహ్యాబీజాభావే చ జ్ఞానానర్థక్యప్రసంగః ; తస్మాత్సబీజత్వాభ్యుపగమేనైవ సతః ప్రాణత్వవ్యపదేశః, సర్వశ్రుతిషు చ కారణత్వవ్యపదేశః| అత ఏవ 'అక్షరాత్పరతః పరః' (ము. ఉ. 2| 1| 2) 'సబాహ్యాభ్యంతరో హ్యజః' (ము. ఉ. 2| 1| 2) 'యతో వాచో నివర్తంతే' (తై. ఉ. 2| 9| 1) 'నేతి నేతి' (బృ. ఉ. 2| 3| 6) ఇత్యాదినా బీజత్వాపనయనేన వ్యపదేశః| తామబీజావస్థాం తస్యైవ ప్రాజ్ఞశబ్దవాచ్యస్య తురీయత్వేన దేహాదిసంబంధజాగ్రదాదిరహితాం పారమార్థికీం పృథగ్వక్ష్యతి| బీజావస్థాపి 'న కించిదవేదిషం' ఇత్యుత్థితస్య ప్రత్యయదర్శనాద్దేహేఽనుభూయత ఏవేతి త్రిధా దేహే వ్యవస్థిత ఇత్యుచ్యతే||**

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

జాగ్రదవస్థలోనే విశ్వ, తైజస, ప్రాజ్ఞులు ముచ్చురూ ఏవిధంగా అనుభవానికి వస్తారో చెప్పడానికి 'దక్షిణాక్షి.....' అనే శ్లోకం చెప్తున్నారు. **దక్షిణ అక్షి** అంటే కుడి కంటిని **ముఖం** నోరుగా (అంటే అనుభవస్థానంగా), ఆ కుడికంటి ద్వారా ముఖ్యంగా స్థూలవిషయాలను ద్రష్టగా **విశ్వః** విశ్వుడు అనుభవిస్తాడు. 'ఈ కుడి కంటిలోని పురుషుడే, ఇన్ధుడు అనే పేరు కలిగినవాడు' ['ఇంధో హ వై నామైష యోఽయం దక్షిణేఽక్షన్పురుషః' (బృ.ఉ. 4-2-2)]. ప్రకాశించడమనే గుణంగల ఇన్ధుడే వైశ్వానరుడు. సమష్టి స్థూల దేహాభిమానియైన సూర్యాంతర్గతమైన విరాట్ పురుషుని ఆత్మ మరియు కంటిలో ఉండి చూచేవాడు అనగా వైశ్వానరుడు రెండూ ఒక్కటే.

**<u>సందేహం</u> :** అయితే, హిరణ్యగర్భుడు పేరు, దేహేంద్రియాలను తెలుసుకొనే క్షేత్రజ్ఞుడు పేరు, కుడికంటిలో ఉండి కంటిని నియంత్రించే ద్రష్ట పేరు మరియు దేహానికి అధిపతియైన జీవుడు ఇవన్నీ వేర్వేరా?

**<u>సమాధానం</u> :** కాదు. ఎందుకంటే స్వతహాగా భేదమన్నది అంగీకారము కాదు కాబట్టి. 'సకలప్రాణులలో గూఢంగా ఒకే దివ్యత్వం (ప్రకాశిస్తోంది)' [ 'ఏకో దేవః సర్వభూతేషు గూఢః' (శ్వే.ఉ. 6-11)]; 'అర్జునా, సకల దేహాలలో క్షేత్రజ్ఞునిగా ఉన్న నన్ను తెలుసుకో' ['క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత' (భ.గీ. 13-2)]; 'భిన్నమే కానిది ప్రాణులలో వేర్వేరుగా ఉంటోంది' ['అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితం' (భ.గీ. 13-16)] అని శ్రుతి, స్మృతులు ఏకత్వాన్నే ప్రకటిస్తున్నాయి.

విశ్వుడు సకల అవయవాలలో సమానంగా ఉన్నప్పటికీ, చూచే సామర్థ్యం ప్రత్యేకించి కుడి కంటిలోనే అధికం కాబట్టి అక్కడ ఉన్నట్లుగా నిర్దేశిస్తున్నారు. కుడికంటిలో ఉండి రూపాన్ని చూసి, కనులు మూసుకొని, ఆ రూపాన్నే **మనసి అన్తః** మనసు లోపల గుర్తుచేసుకోగా, అదియే స్వప్నం లాగా, వాసనా రూపంగా అభివ్యక్తమై కనబడుతుంది. {అంటే, జాగ్రదవస్థలోనే తైజసుడు అనుభవానికి వస్తున్నాడు. విశ్వుడు మరియు తైజసుడు ఒకరే (తేడా ఏమీ లేదు). విశ్వునిగా చూడబడిన (స్థూల) రూపాన్ని తైజసునిగా (సూక్ష్మంగా మనసులో) స్మరించడం జరుగుతోంది – స్వామి గంభీరానంద}. ఇక్కడ (జాగ్రత్తులో) ఎలా ఉన్నదో, అలాగే స్వప్నంలో కూడా.

కాబట్టి, తైజసుడు మనసు లోపల ఉన్నా కూడా, విశ్వుడే. (స్వప్నావస్థకు చెందిన తైజసుడు జాగ్రత్తులో కూడా అనుభవానికి వస్తున్నాడు కనుక, జాగ్రదవస్థకు చెందిన విశ్వునికి మరియు తైజసునికి బేధం లేదని చెప్తున్నారు). (ఆ జాగ్రదవస్థలోనే) స్మృతి (గుర్తుచేసుకోవడం) అనే వృత్తి ఆగిపోగా **ప్రాజ్ఞః** ప్రాజ్ఞుడు **ఆకాశే చ హృది** హృదయాకాశంలో, మనోవ్యాపారాలేవీ లేనందున, కేవలం ఘనీభవించిన చైతన్యంలాగా ఉండిపోతాడు. చూడటం, గుర్తుచేసుకోవడం అనేవి మనసు యొక్క స్పందనలే. అవి లేనందుచేత, హృదయంలో ఎటువంటి విశేషాలు లేకుండా కేవలం ఉనికి మాత్రంగా ఉంటాడు. 'ప్రాణమే ఈ సర్వాన్నీ చుట్టుముట్టి ఉంటుంది' ['ప్రాణో హ్యేవైతాన్సర్వాన్సంవృంక్తే' (ఛా.ఉ. 4-3-3)] అన్న శ్రుతి వాక్యం ప్రకారం, జీవచైతన్యానికి ప్రాణంతో సామ్యత్వం ఉంటుంది. {ఇలా ప్రాజ్ఞుడు కూడా జాగ్రదవస్థలో తెలియబడుతున్నాడు. మనోవృత్తులు ఆగిపోగానే, జీవ చైతన్యం ప్రాజ్ఞుని లక్షణాలను పొంది ఉంటుంది. – స్వామి గంభీరానంద}. మనసులో ఉన్నందు చేత తైజసునికి హిరణ్యగర్భునితో సామ్యత్వం ఉన్నదని ఈ శ్రుతివాక్యాలు చెప్తున్నాయి. '(ఆసక్తితో చేసిన కర్మల ఫలితంగా) సూక్ష్మ శరీరం లేదా మనసుతో బంధం ఏర్పడుతుంది' ['లింగం మనః' (బృ.ఉ. 4-4-6)] అనీ, 'ఈ మనోమయుడైన పురుషుడు (హృదయంలో తెలియబడతాడు)' ['మనోమయోఽయం పురుషః' (బృ.ఉ. 5-6-1)] అనీ వేదవాక్యాలు చెప్తున్నాయి. {1. క్రియాశక్తి కలిగిన హిరణ్యగర్భుడు సూక్ష్మ(లింగ) శరీరాభిమాని అని మరియు లింగం అన్నదానికి మనసుతో సామ్యత్వం కలదని ఈ శ్రుతి వాక్యం చెప్తోంది. అందుచేత, తైజసుడు మరియు హిరణ్యగర్భుడు ఒక్కటే అని మొదటి శ్రుతి వాక్యం బృ.ఉ. 4-4-6 ద్వారా నిరూపితమౌతోంది. 2. హిరణ్యగర్భుడు మనసుతో సామ్యత్వం కల పురుషుని యొక్క పరిణామమే. అంతేకాక, తైజసుని ముఖ్యస్థానం మనసే. కాబట్టి కూడా, హిరణ్యగర్భుడు మరియు తైజసుల ఏకత్వం సాధ్యపడుతోంది అని రెండవ శ్రుతివాక్యం బృ.. 5-6-1 ద్వారా ప్రాప్తిస్తోంది. – స్వామి గంభీరానంద}.

<u>**సందేహం :**</u> సుషుప్తిలో ప్రాణశక్తి వ్యక్తమౌతూనే ఉంటుంది మరియు ఇతర ఇంద్రియాలన్నీ ఆ ప్రాణశక్తిలో లయమౌతున్నాయి కదా! {గాఢంగా నిద్రిస్తున్న వానిని చూసే ఇతరులకు అతనిలోని ప్రాణ వ్యవహారం స్పష్టంగా తెలుస్తూనే ఉంటుంది. అంటే నిద్రయందు ఇతర అవయవాలు ప్రాణంలో లయమై కేవలం ప్రాణమే వ్యక్తమౌతోందని తెలుస్తోంది. కాని, అవ్యక్తం అంటే దేశ-కాల-వస్తు పరిమితులు లేనిది కదా!}. అలాంటప్పుడు ప్రాణం అవ్యాకృతం ఎలా అవుతుంది?

<u>**సమాధానం :**</u> ఇది దోషం కాదు. ఎందుకంటే అవ్యాకృతానికి దేశం-కాలం అనే ప్రత్యేకతలు లేవు కాబట్టి. (జాగ్రత్తు-స్వప్న అవస్థలలో 'ఇది నా ప్రాణం' అనే) ప్రాణాభిమానం ఉన్నప్పుడు ప్రాణం వ్యక్తమయ్యే ఉంటుంది. అయినా కూడా (సుషుప్తిలో) దేహాది పరిమితుల వల్ల (అంటే దేశం-కాలం వంటి పరిమితుల వల్ల ఈ దేహానికి పరిమితమైన ప్రాణం లేదా ఈ కాలానికే పరిమితమైన ప్రాణం అనే) ప్రత్యేకమైన అభిమానం ప్రాణం పట్ల ఉండదు. అందుచేత, పరిచ్ఛిన్నత్వం పట్ల అభిమానం కలవారికైనా (దేహాభిమానులకైనా) సుషుప్తిలో ప్రాణం అవ్యాకృతమే (విశేషాలేవీ లేనిదే) అవుతుంది. ఎలాగైతే, దేహాభిమానులకు మరణానంతరం ప్రాణం అవ్యాకృతమైపోతుందో (వ్యక్తం కాకుండా ఉంటుందో), అలాగే ప్రాణాభిమానులలో కూడా విశిష్టతలనేవి లేని (సుషుప్త) స్థితిలో ఆ ప్రాణం అవ్యాకృతత్వంతో (వ్యక్తం కాకుండా ఉండడం) సమానమే కనుక వాటిమధ్య తేడా ఏమీ లేదు మరియు కార్యాలను పుట్టించగల సామర్థ్యం అవ్యాకృతంలో బీజరూపంగా ఉంటుంది కూడా. ఆ సుషుప్తి అవస్థకు (అంటే ప్రాజ్ఞుని స్థితికి) మరియు అవ్యాకృతానికి రెండింటికీ కూడా ఒకడే సాక్షి. మరింకా, దేహాభిమానులకు లేదా ఆయా స్థితులకు

సాక్షులైన వారికి అవ్యాకృతంతో ఏకత్వం కనిపిస్తుండగా ముందు చెప్పిన 'ఏకీభూతః', 'ప్రజ్ఞానఘనః' అనే విశేషణాలు (ప్రాణంతో సామ్యత్వం కలిగిన ప్రాజ్ఞునికి) చెప్పడం సమంజసమే అని ప్రాప్తిస్తోంది. {విశేషణాలనేవి ఏవీ లేనందుచేత, నిద్రించే జీవుడు మరియు అవ్యాకృతం రెండూ ఒక్క సుషుప్తి దశలో మాత్రమే కాదు, ఉపాధులతో పరిమితమై ఉన్నప్పుడు కూడా ఒకటే. – స్వామి గంభీరానంద}. ఇంతే కాదు, ఇంతకు ముందు చెప్పిన కారణాల వల్ల కూడా (జీవుడు మరియు అవ్యాకృతం ఒకటే అని నిరూపితమౌతోంది).

**సందేహం :** ప్రాణ శబ్దానికి అవ్యాకృతం అనే అర్థం ఎలా వచ్చింది?

**సమాధానం :** 'ఓ సౌమ్యా, మనసు (అంటే ఉపాధి చేత పరిమితుడైన జీవుడు బంధనం ద్వారా తనకు ముడిపడియున్న) ప్రాణాన్ని ఆశ్రయిస్తాడు' ['ప్రాణబంధనం హి సోమ్య మనః' (ఛా.ఉ. 6-8-2)] అని శ్రుతి చెప్పింది కాబట్టి.

**సందేహం :** అక్కడ ప్రాణ శబ్దానికి సత్-బ్రహ్మ అనే అర్థంలో 'ఓ సోమ్య, (ఆ బ్రహ్మము) సత్ మాత్రమే' ['సదేవ సోమ్య' (ఛా.ఉ. 6-2-1)] అని ఆ చర్చను ప్రారంభించేటప్పుడే శ్రుతి చెప్పింది కదా! (అంటే ప్రాణ శబ్దానికి సత్ లేదా ఉనికి అనే అర్థాన్నే చెప్పారు గానీ, అవ్యాకృతం అనే అర్థాన్ని చెప్పలేదు కదా, అలాంటప్పుడు మీరు ప్రాణానికి అవ్యాకృతం అనే అర్థాన్ని ఎలా చెబుతున్నారు?)

**సమాధానం :** దోషం ఏమీ లేదు. ఎందుకంటే, అక్కడ చర్చలో 'సత్'ను (సృష్టికి) బీజరూపంగా భావన చేస్తున్నారు కాబట్టి. ఒకవేళ అక్కడ ప్రాణ శబ్దంతో సత్-బ్రహ్మ సూచించబడినా, ప్రాణుల ఉత్పత్తికి బీజరూపంగా ఉన్నదనే భావనను త్రోసిపుచ్చకుండానే అప్పుడు కూడా ఆ 'సత్'నే ప్రాణంగానూ మరియు 'సత్'గానూ చెప్పారు. అక్కడ నిర్బీజరూపమైన బ్రహ్మయే అనే భావించినట్లైతే, 'ఇది కాదు, ఇది కాదు' ['నేతి నేతి' (బృ.ఉ. 4-5-3)]; 'దేనిని చేరలేక వాక్కు వెనుతిరుగుతుందో' ['యతో వాచో నివర్తంతే' (తై.ఉ. 2-9-1)]; 'అది తెలిసినదానికి భిన్నమైనది, తెలియనిదాని కన్నా ఉన్నతమైనది' ['అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి' (కే.ఉ. 1-4)] అని శ్రుతులు చెప్పి ఉండేవి. ఎందుకంటే 'సత్ అనిగానీ, అసత్ అనికాని చెప్పలేము' ['న సత్తన్నాసదుచ్యతే' (భ.గీ. 13-12)] అని స్మృతి స్పష్టంగా చెప్పింది కాబట్టి. ప్రస్తావన నిర్బీజమైన బ్రహ్మము గురించే కనుక అయితే, మూలకారణం లేనందుచేత సుషుప్తిలో పూర్తిగా లీనమైన ప్రాణులు తిరిగి ఉత్పన్నం కావడమూ సంభవం కాదు మరియు ముక్తిపొందినవి తిరిగి పుట్టడమూ సంభవించదు. అంతేకాదు, జ్ఞానంచే దహించబడే అజ్ఞాన బీజమే లేనప్పుడు, ఇక జ్ఞానం యొక్క ఆవశ్యకతే లేదని ప్రాప్తిస్తోంది. కాబట్టే, బీజరూపంతో కూడిన 'సత్'యే ప్రాణ శబ్దం చేత (పైన చెప్పిన ఛాందోగ్యోపనిషత్ 6-2-1 వాక్యంలో) సూచించబడింది మరియు అన్ని ఉపనిషత్తులూ ప్రాణ శబ్దాన్ని జగత్తుకు కారణమైన 'సత్'గానే భావించాయి. ఈ కారణం చేతనే, 'నశించేదానిని మించినదాని కన్నా ఉన్నతమైనది' ['అక్షరాత్పరతః పరః' (ము.ఉ. 2-1-2)]; 'పుట్టుక లేని ఆ పరమాత్మ కార్య-కారణాలున్నా వాటికి భిన్నమైన వాడు' ['సబాహ్యాభ్యంతరో హ్యజః' (ము.ఉ. 2-1-2)]; 'దేనినుండి వాక్కులు వెనుదిరుగుతాయో' ['యతో వాచో నివర్తంతే' (తై.ఉ. 2-9-1)]; 'ఇది కాదు, ఇది కాదు' ['నేతి నేతి' (బృ.ఉ. 2-3-6)] అని పరబ్రహ్మను కారణ రహితమైనదిగా శ్రుతివాక్యాలు ప్రకటించాయి. కారణ బీజం లేని ఆ స్థితి, ఆ ప్రాజ్ఞ శబ్దంతో చెప్పబడిన సుషుప్తి అవస్థకు తర్వాతది కాబట్టి తురీయం నాల్గవ అవస్థ. అది దేహాదులతో సంబంధం కలిగిన జాగ్రత్తు-స్వప్న-సుషుప్తి స్థితులకన్నా పరమోన్నతమైనది కాబట్టి వేరుగా చెప్పబడబోతోంది. కారణసహిత స్థితి అయినప్పటికీ, 'నాకు ఏమీ తెలియలేదు' అనే అనుభవం మేల్కొన్నవానికే కలుగుతోంది కనుక, **త్రిధా దేహే వ్యవస్థిత** దేహంలో

మూడువిధాలుగా ఉంది అని అంటున్నారు. (అంటే, జాగ్రత్తులోనే ఈ మూడు జాగ్రత్తు-స్వప్న-సుషుప్తి అవస్థల అనుభవం కలుగుతోంది అని సారాంశం).

**విశ్వో హి స్థూలభుజ్ నిత్యం తైజసః ప్రవివిక్తభుక్|**
**ఆనన్దభుక్తథా ప్రాజ్ఞస్త్రిధా భోగం నిబోధత || || మాం.గౌ.కా. 1-3 ||**

విశ్వుడు స్థూలవిషయాలను నిత్యమూ భోగిస్తుంటాడు. తైజసుడు సూక్ష్మవిషయాలను (భోగిస్తాడు). అలాగే ప్రాజ్ఞుడు ఆనందాన్ని అనుభవిస్తాడు. భోగం అన్నది మూడు విధాలని తెలుసుకో.

**స్థూలం తర్పయతే విశ్వం ప్రవివిక్తం తు తైజసం|**
**ఆనన్దశ్చ తథా ప్రాజ్ఞం త్రిధా తృప్తిం నిబోధత || || మాం.గౌ.కా. 1-4 ||**

స్థూల విషయాలు విశ్వునికి తృప్తినిస్తాయి. సూక్ష్మవిషయాలు తైజసుని తృప్తిపరుస్తాయి. అలాగే ఆనందం ప్రాజ్ఞునికి (తృప్తినిస్తుంది). తృప్తి అన్నది మూడు విధాలని తెలుసుకో.

**<u>శంకరుల భాష్యము</u>**

**ఉక్తార్థౌ హి శ్లోకౌ||**

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

ఈ రెండు శ్లోకాలకు అర్థం స్పష్టంగా తెలుస్తూనే ఉన్నది. (కనుక, శంకరులు ఈ రెండు శ్లోకాలకు తమ వ్యాఖ్యానాన్ని ప్రత్యేకించి చెప్పడం లేదు).

**త్రిషు ధామసు యద్భోజ్యం భోక్తా యశ్చ ప్రకీర్తితః|**
**వేదైతదుభయం యస్తు స భుఞ్జానో న లిప్యతే|| || మాం.గౌ.కా. 1-5 ||**

మూడు అవస్థలలో ఏది భోగింపబడుతోందో మరియు ఎవరు భోగిస్తున్నారో అనే ఈ రెండింటిని తెలుసుకొన్నవాడు భోగిస్తూ ఉండి కూడా వాటిచే ప్రభావితం కాడు.

**<u>శంకరుల భాష్యము</u>**

**త్రిషు ధామసు జాగ్రదాదిషు స్థూలప్రవివిక్తానందాఖ్యం యద్భోజ్యమేకం త్రిధాభూతం ; యశ్చ విశ్వతైజసప్రాజ్ఞాఖ్యో భోక్తైకః 'సోఽహం' ఇత్యేకత్వేన ప్రతిసంధానాత్ ద్రష్టృత్వావిశేషాచ్చ ప్రకీర్తితః ; యో వేద ఏతదుభయం భోజ్యభోక్తృతయా అనేకధా భిన్నం ,**

**సః భుంజానః న లిప్యతే, భోజ్యస్య సర్వస్యైకభోక్తృభోజ్యత్వాత్| న హి యస్య యో విషయః, స తేన హీయతే వర్ధతే వా| న హ్యగ్నిః స్వవిషయం దగ్ధ్వా కాష్ఠాది, తద్వత్||**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**త్రిషు ధామసు** జాగ్రత్తు-స్వప్న-సుషుప్తి అవస్థలలో స్థూల-సూక్ష్మ-ఆనందాలనే పేర్లుగల **యత్ భోజ్యమ్** ఏ విషయమైతే భోగింపబడుతోందో అది ఒక్కటే అయినా మూడు రకాలుగా కన్పిస్తోంది. **చ యః** మరియు ఏవడైతే విశ్వుడు-తైజసుడు-ప్రాజ్ఞులనే పేర్లతో భోగిస్తున్నాడో, ఆ మూడూ 'సోఽహం' (అది నేను) అనే ఏకత్వ భావనతో అనుసంధానమై, వాటిని వేర్వేరుగా గుర్తించడానికి ప్రత్యేకతలేవీ లేనందుచేత, అవి ఒకే తత్వం అని **ప్రకీర్తితః** ప్రకటించబడుతున్నాయి. **ఏతత్ ఉభయమ్** అనేకంగా వేర్వేరుగా కన్పిస్తోన్న ఇవన్నీ, భోగ్యవిషయాలు మరియు భోక్త అనే రెండుగా ఏవడైతే **వేద** తెలుసుకొంటాడో **సః భుఞ్జానః** భోగాన్ని అనుభవిస్తూ కూడా **న లిప్యతే** ప్రభావితం కాడు. ఎందుకంటే భోగించబడే సకల భోగములు మరియు వాటి భోక్త కూడా ఒక్కడే కాబట్టి. అగ్ని దాని స్వవిషయమైన కట్టెను దహించినందువల్ల నష్టంగాని లేదా లాభంగానీ పొందనట్లుగా, స్వభావంగా సిద్ధమై ఉన్న విషయాలలో వృద్ధి లేదా క్షీణతలు అనేవి ఉండవు కదా!

**ప్రభవః సర్వభావానాం సతామితి వినిశ్చయః|**
**సర్వం జనయతి ప్రాణశ్చేతోంశూన్పురుషః పృథక్ || || మాం.గౌ.కా. 1-6 ||**

ఉనికి గల సకల భావనలు మూలమైన తత్వానికి చెందినవే అన్నది నిశ్చయం. ప్రాణం సకల విషయాలను ఉత్పన్నం చేస్తుంది. పురుషుడు వేరుగా చైతన్య కిరణాలను (అంటే ప్రాణులను) సృష్టిస్తాడు.

**శంకరుల భాష్యము**

**సతాం విద్యమానానాం స్వేన అవిద్యాకృతనామరూపమాయాస్వరూపేణ సర్వభావానాం విశ్వతైజసప్రాజ్ఞభేదానాం ప్రభవః ఉత్పత్తిః| వక్ష్యతి చ — 'వంధ్యాపుత్రో న తత్త్వేన మాయయా వాపి జాయతే' (మా. కా. 3| 28) ఇతి| యది హ్యసతామేవ జన్మ స్యాత్ , బ్రహ్మణోఽవ్యవహార్యస్య గ్రహణద్వారాభావాదసత్త్వప్రసంగః| దృష్టం చ రజ్జుసర్పాదీనామవిద్యాకృతమాయాబీజోత్పన్నానాం రజ్జ్వాద్యాత్మనా సత్త్వం| న హి నిరాస్పదా రజ్జుసర్పమృగతృష్ణికాదయః క్వచిదుపలభ్యంతే కేనచిత్| యథా రజ్జ్వాం ప్రాక్సర్పోత్పత్తేః రజ్జ్వాత్మనా సర్పః సన్నేవాసీత్ , ఏవం సర్వభావానాముత్పత్తేః ప్రాక్ప్రాణబీజాత్మనైవ సత్త్వమితి| శ్రుతిరపి వక్తి 'బ్రహ్మైవేదం' (ము. ఉ. 2| 2| 12) 'ఆత్మైవేదమగ్ర ఆసీత్' (బృ. ఉ. 1| 4| 1) ఇతి| అతః సర్వం జనయతి ప్రాణః చేతోంశూన్ అంశవ ఇవ రవేశ్చిదాత్మకస్య పురుషస్య చేతోరూపా జలార్కసమాః ప్రాజ్ఞతైజసవిశ్వభేదేన దేవమనుష్యతిర్యగాదిదేహభేదేషు విభావ్యమానాశ్చేతోంశవో యే, తాన్ పురుషః పృథక్ సృజతి విషయభావవిలక్షణానగ్నివిస్ఫులింగవత్సలక్షణాన్ జలార్కవచ్చ జీవలక్షణాంస్త్వితరాన్సర్వభావాన్ ప్రాణో బీజాత్మా జనయతి, 'యథోర్ణనాభిః|| యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగాః' (బృ. ఉ. 2| 1| 20) ఇత్యాదిశ్రుతేః||**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**సతామ్** అవిద్యచేత వాటంతట అవే తెలియబడే నామ-రూపాది మాయా స్వరూపాలు **సర్వభావానామ్** విశ్వ-తైజస-ప్రాజ్ఞ భేదాలతో **ప్రభవః** (మూల కారణం నుండి) ఉత్పన్నమౌతున్నాయి **ఇతి** అని **వినిశ్చయః** చక్కగా నిశ్చయించబడింది. {ఈ నామ రూపాల ఉనికికి ఏది మూలకారణమో, దాని పైననే అవి అధ్యారోపించబడినాయి. మా.ఉ. 6వ శ్లోకంలో 'ఏష యోనిః సర్వస్య ప్రభవః' అని చెప్తూ, ప్రాజ్ఞుడే ఈ దృశ్య ప్రపంచానికి మూలం అన్నారు. అయితే, 'సత్ లేదా అసత్ లను ప్రాజ్ఞుడు ఉత్పన్నం చేస్తాడా?' అన్నది ఇప్పుడు ప్రశ్న. దీనికి సమాధానమేమంటే, ప్రాజ్ఞుని నుండి ప్రతిబింబాల వంటి నామ-రూపాలు ఉత్పన్నమౌతున్నాయి మరియు వాటి మూలకారణమైన ప్రాజ్ఞుడు ఉన్నంత వరకు అవి సత్యమే అవుతాయి. – స్వామి గంభీరానంద}. రాబోయే మంత్రంలో, 'వంధ్యాపుత్రుడు నిజానికి గాని లేదా మాయ వల్ల గాని పుట్టడు' ['వంధ్యాపుత్రో న తత్త్వేన మాయయా వాపి జాయతే' (మా.గౌ.కా. 3-28)] అని చెప్పబోతున్నారు. పుట్టినది అసత్తే కనుక అయితే, కార్యాన్ని చూసి కారణాన్ని గ్రహించాల్సి ఉంటుంది కాబట్టి, వృత్తియే లేకపోతే బ్రహ్మ తెలియబడే అవకాశం ఉండదు కాబట్టి, బ్రహ్మ కూడా అసత్తే అయే పరిస్థితి ఏర్పడుతుంది. త్రాడు-పాము వంటి ఉదాహరణలలో అవిద్యవల్ల, మాయాబీజం నుండి ఉత్పన్నమైన పాము అనే ఉనికికి మూలకారణం త్రాడు ఉండడమే. ఎటువంటి ఆధారం లేదా మూలం లేకుండా త్రాడు-పాము, ఎండమావుల వంటి వాటిలో దేనినీ ఎవడూ చూడలేదు. పాము పుట్టక ముందు త్రాడులో పాము ఉన్నట్లుగా (పాము లక్షణాలున్నట్లుగా), సకల భావనలు, ఉత్పన్నం కాక మునుపే, ప్రాణంలో బీజరూపంగా ఉనికిని కలిగి ఉంటాయి. {ఇక్కడ ఒక సందేహం కలగవచ్చు. త్రాడును చూసి పాము అని భ్రమ కలగడం తెలిసిందే. కాని, ఈ భ్రమ కలగడానికి ముందే త్రాడునందు పాము లక్షణాలున్నాయని అంటున్నారు. త్రాడునందు పాము లక్షణాలు ఉండబట్టే త్రాడును చూసి పాము అనే భ్రమ కలుగుతుంది కాని, కొయ్యముక్కనో కుండనో చూసి పాము అని భ్రమించడం లేదు కదా. అంటే కొయ్యలోనూ, కుండలోనూ పాము లక్షణాలు లేకపోవడమే అందుకు కారణం. అలాగే, జీవబీజం బ్రహ్మలో ఉన్నందువలనే, బ్రహ్మమును చూస్తూ కూడా జగత్తు అనే భ్రమ కలుగుతోంది}. అందుచేతనే, శ్రుతి కూడా 'ఇది బ్రహ్మమే' ['బ్రహ్మైవేదం' (ము.ఉ. 2-2-12)]; 'ఆత్మయే దీనికి ముందు ఉన్నది' ['ఆత్మైవేదమగ్ర ఆసీత్' (బృ.ఉ. 1-4-1)] అని చెప్పింది. అందుచేత, **సర్వమ్ జనయతి ప్రాణః** సకలాన్నీ ప్రాణం ఉత్పన్నం చేస్తుంది. అయితే, **చేతోంశూన్** సూర్యుని కిరణాల లాగా చైతన్యమే స్వభావంగా గల పురుషుని యొక్క చైతన్య ప్రతిరూపాలను, నీటిలోని సూర్యబింబంలాంటి వాటిని, ప్రాజ్ఞ-తైజస-విశ్వ అనే తేడాలుగా, దేవ-మనుష్య-తిర్యగ్ అనే శరీర భేదాలుగా కనిపించే ఏ చైతన్యాంశలున్నాయో వాటిని, **పురుషః** పురుషుడు **పృథక్** వేరుగా సృష్టిస్తాడు. అంటే పురుషుడు, అగ్ని కణాలలాగా (అగ్ని కణాలకు అగ్నివంటి లక్షణాలే ఉన్నట్లుగా) తన వంటి లక్షణాలుగా అనిపించే వస్తు విషయాలకు భిన్నంగా, నీటిలోని సూర్యబింబం లాగా జీవ లక్షణాలు కలిగిన, చేతనాంశలను సృష్టిస్తాడు. మిగిలిన అన్ని భావాలను, వాటి మూలకారణమైన ప్రాణం 'సాలీడు లాగా' ['యథోర్ణనాభిః' (ముం.ఉ. 1-1-7)]; 'ఎలాగైతే అగ్నినుండి నిప్పురవ్వలు నలుదిక్కులా వ్యాపిస్తాయో' ['యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగాః' (బృ.ఉ. 2-1-20)] అనే శ్రుతివాక్యాల ప్రకారం, సృష్టిస్తుంది.

**విభూతిం ప్రసవం త్వన్యే మన్యన్తే సృష్టిచిన్తకాః|**

**స్వప్నమాయాసరూపేతి సృష్టిరన్యైర్వికల్పితా||** **|| మాం.గౌ.కా. 1-7 ||**

సృష్టిని విచారణచేసిన కొందరు ఇది ఈశ్వరుని మహిమేనంటారు. మరికొందరు ఈ సృష్టి స్వప్నం వంటిదని, మాయలాంటిదని భావిస్తారు.

## శంకరుల భాష్యము

**విభూతిర్విస్తార ఈశ్వరస్య సృష్టిరితి సృష్టిచింతకా మన్యంతే ; న తు పరమార్థచింతకానాం సృష్టావాదర ఇత్యర్థః, 'ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే' (బృ. ఉ. 2| 5| 19) ఇతి శ్రుతేః| న హి మాయావినం సూత్రమాకాశే నిఃక్షిప్య తేన సాయుధమారుహ్య చక్షుర్గోచరతామతీత్య యుద్ధేన ఖండశశ్ఛిన్నం పతితం పునరుత్థితం చ పశ్యతాం తత్కృతమాయాదిసతత్త్వచింతాయామాదరో భవతి| తథైవాయం మాయావినః సూత్రప్రసారణసమః సుషుప్తస్వప్నాదివికాసః ; తదారూఢమాయావిసమశ్చ తత్స్థప్రాజ్ఞతైజసాదిః ; సూత్రతదారూఢాభ్యామన్యః పరమార్థమాయావీ| స ఏవ భూమిష్ఠో మాయాచ్ఛన్నః అదృశ్యమాన ఏవ స్థితో యథా, తథా తురీయాఖ్యం పరమార్థతత్త్వం| అతస్తచ్చింతాయామేవాదరో ముముక్షూణామార్యాణాం , న నిష్ప్రయోజనాయాం సృష్టావాదర ఇత్యతః సృష్టిచింతకానామేవైతే వికల్పా ఇత్యాహ — స్వప్నమాయాసరూపేతి| స్వప్నసరూపా మాయాసరూపా చేతి||**

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**సృష్టిచిన్తకాః** సృష్టిని గురించిన విచారణలో నిమగ్నులైన **అన్యే తు** కొందరైతే **విభూతిమ్** ఈ సృష్టి ఈశ్వరుని యొక్క అతీతమైన మహిమయే అని **మన్యన్తే** భావిస్తారు. పరమార్థాన్ని గురించి విచారణ చేసే వారికైతే సృష్టి గురించిన చింతన ఉండదని 'మాయచేత ఇంద్రుడు పలు రూపాలుగా భావించబడుతున్నాడు' ['ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే' (బృ.ఉ. 2-5-19)] శ్రుతి ప్రకటిస్తోంది. ఇంద్రజాలికుడు తాడును ఆకాశంలో నిలబెట్టి, దానిని పట్టుకొని పైకి ఏగబాకుతూ, కనబడకుండా పోయి, యుద్ధంలో ముక్కలుగా ఖండించబడి, తిరిగి లేచినట్లుగా ప్రదర్శిస్తాడు. ఆ ఇంద్రజాలికుని ప్రదర్శనను చూసినవారు దానియందలి సత్యాన్ని గురించిగాని మరియు ఆ ప్రదర్శన యొక్క ఫలితాన్ని గురించిగాని విచారించడానికి ఆసక్తిని చూపించరు కదా. అదేవిధంగా, ఈ ఇంద్రజాలికునిచే విసరబడిన త్రాడే సుషుప్తి-స్వప్నాది వికాసాలు. ఆ త్రాడును పట్టుకొని పైకి ఏగబాకిన మాయావి వంటివారే ఆయా అవస్థలలోని ప్రాజ్ఞ-తైజసుడు మొదలైన వారు. త్రాడు మరియు పైకి ఏగబాకిన వానికి భిన్నమైనవాడే అసలైన ఇంద్రజాలికుడు. అతడు భూమి మీద చాటుగా ఉండి కనపడకుండా ఉన్నట్లే, తురీయమనే పరమార్థ తత్వం ఉన్నది. **అన్యే** ఇతరులు, మోక్షాన్ని కోరే మహానుభావులు, ఆ తురీయ స్థితిని గురించే విచారణ చేస్తారు కాని ప్రయోజనం లేని **సృష్టి వికల్పితా** సృష్టి వికల్పాలను గురించి, వారు ఆసక్తిని చూపరు. అందుచేత, సృష్టి గురించిన ఆసక్తి కలిగిన ఇతరులే ఈ విచారణలన్నీ చేస్తారని అభిప్రాయం. అందుకే సృష్టి అనేది **స్వప్నమాయాసరూపా** స్వప్నం-మాయతో సమానమైనదనే అసలైన యదార్థాన్ని ప్రకటిస్తున్నారు.

**ఇచ్ఛామాత్రం ప్రభోః సృష్టిరితి సృష్టౌ వినిశ్చితాః|**
**కాలాత్ప్రసూతిం భూతానాం మన్యన్తే కాలచిన్తకాః ||** **|| మాం.గౌ.కా. 1-8 ||**

ఈశ్వరుని ఇచ్ఛామాత్రంగా సృష్టి సృజించబడిందని కొందరి నిశ్చితాభిప్రాయం. కాలాన్ని గురించి విచారణ చేసిన వారు కాలంనుండియే భూతాలు ఉద్భవించాయని అభిప్రాయ పడుతున్నారు.

**శంకరుల భాష్యము**

**ఇచ్ఛామాత్రం ప్రభోః సత్యసంకల్పత్వాత్ సృష్టిః ఘటాదీనాం సంకల్పనామాత్రం , న సంకల్పనాతిరిక్తం| కాలాదేవ సృష్టిరితి కేచిత్||**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**ప్రభోః** ఈశ్వరుని సంకల్పం సత్యమే కావడం చేత అతని **ఇచ్ఛామాత్రమ్ సం**కల్పమాత్రం చేత **సృష్టిః** కుమ్మరి వాని ఆలోచన నుండి కుండ మొదలైనవి పుట్టినట్లుగా, ఈ జగత్తు **సృష్టా** సృజించబడింది. అంటే జగత్తు ఈశ్వరుని సంకల్పానికి మించినది కాదు. **ఇతి** ఇది **వినిశ్చితాః** (కొందరి) నిశ్చితమైన అభిప్రాయం. **కాలచిన్తకాః** కాలాన్ని గురించి విచారణ చేసిన వారు **భూతానామ్** ప్రాణులు **కాలాత్** కాలం నుండి **ప్రసూతం** ఉత్పన్నమౌతున్నాయని **మన్యన్తే** భావిస్తారు. అంటే, కాలనుండే ఈ సృష్టి ఏర్పడిందని కొందరి అభిప్రాయం.

**భోగార్థం సృష్టిరిత్యన్యే క్రీడార్థమితి చాపరే|**
**దేవస్యైష స్వభావోఽయమాప్తకామస్య కా స్పృహా||** **|| మాం.గౌ.కా. 1-9 ||**

ఈ సృష్టి (ఈశ్వరుని) భోగం కొరకని కొందరు, ఇంకొందరు (ఈశ్వరుని) క్రీడ అని భావిస్తారు. ఇది (ఈ సృష్టి) దివ్యత్వం యొక్క స్వభావమే. కోరికలన్నీ తీరిన వానికి (ఏ భోగం పట్లగాని, ఏ వినోదం పట్లగాని) ఏమి ఆసక్తి ఉంటుంది?

**శంకరుల భాష్యము**

**భోగార్థం , క్రీడార్థమితి చ అన్యే సృష్టిం మన్యంతే| అనయోః పక్షయోర్దూషణం దేవస్యైష స్వభావోఽయమితి దేవస్య స్వభావపక్షమాశ్రిత్య, సర్వేషాం వా పక్షాణాం — ఆప్తకామస్య కా స్పృహేతి| న హి రజ్జ్వాదీనామవిద్యాస్వభావవ్యతిరేకేణ సర్పాద్యాభాసత్వే కారణం శక్యం వక్తుం||**
**ఇతి|**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**అన్యే** కొందరు **సృష్టి** ఈ జగత్తు **భోగార్థమ్ ఇతి** ఈశ్వరుని భోగం కొరకని **చ అపరే** మరి కొందరు **క్రీడార్థమ్ ఇతి** వినోదం కొరకని భావిస్తారు. **దేవస్య ఏష స్వభావః అయమ్** దివ్యతమే ఈశ్వరుని స్వభావమని చెప్పి, దోషపూరితమైన ఈ రెండు భావనలను తిరస్కరిస్తున్నారు. లేదా ఈశ్వరుని యొక్క స్వభావాన్ని అశ్రయించి, అన్ని రకాల వాదనలనూ (తిరస్కరిస్తున్నారు). {ఈ స్వభావాన్నే మాయ అని కూడా అంటారు. అది ప్రత్యక్షంగా అనుభవానికి వస్తున్నా కూడా దానికి ఆది అనేది లేదు. కాబట్టి, సృష్టికి ప్రేరణ అన్నది లేదు. – స్వామి

గంభీరానంద}. అందుచేతనే, **ఆప్తకామస్య కా స్పృహా** కోరికలన్నీ తీరియున్నవాటికి వేటి మీద ఆసక్తి ఉంటుంది? అని చెప్పి (తిరస్కరిస్తున్నారు). ఎందుకంటే, త్రాడును చూసి పాముగా భ్రమించడం అనే అభాసకు కారణం అవిద్యాస్వభావమే తప్ప, వేరొక దానిని కారణంగా చెప్పడం వీలుకాదు కదా!

(ఇంతవరకు గౌడపాదుల కారికలోని 1-1 నుండి 1-9 వరకు గల శ్లోకాలకు శంకరులు వ్యాఖ్యానం చేసి, తిరిగి తరువాతి ఉపనిషత్తు మంత్రాలకు వ్యాఖ్యానాన్ని కొనసాగిస్తున్నారు.)

## ఉపనిషత్...

### శంకరుల భాష్యము

**చతుర్థః పాదః క్రమప్రాప్తో వక్తవ్య ఇత్యాహ — నాంతఃప్రజ్ఞమిత్యాదినా। సర్వశబ్దప్రవృత్తినిమిత్తశూన్యత్వాత్తస్య శబ్దానభిధేయత్వమితి విశేషప్రతిషేధేనైవ తురీయం నిర్దిదిక్షతి। శూన్యమేవ తర్హి ; తన్న, మిథ్యావికల్పస్య నిర్నిమిత్తత్వానుపపత్తేః ; న హి రజతసర్పపురుషమృగతృష్ణికాదివికల్పాః శుక్తికారజ్జుస్థాణూషరాదివ్యతిరేకేణ అవస్త్వాస్పదాః శక్యాః కల్పయితుం। ఏవం తర్హి ప్రాణాదిసర్వవికల్పాస్పదత్వాత్తురీయస్య శబ్దవాచ్యత్వమితి న ప్రతిషేధైః ప్రత్యాయ్యత్వముదకాధారాదేరివ ఘటాదేః ; న, ప్రాణాదివికల్పస్యావస్తుత్వాచ్ఛుక్తికాదిష్వివ రజతాదేః ; న హి సదసతోః సంబంధః శబ్దప్రవృత్తినిమిత్తభాక్ , అవస్తుత్వాత్ ; నాపి ప్రమాణాంతరవిషయత్వం స్వరూపేణ గవాదివత్ , ఆత్మనో నిరుపాధికత్వాత్ ; గవాదివన్నాపి జాతిమత్త్వం , అద్వితీయత్వేన సామాన్యవిశేషాభావాత్ ; నాపి క్రియావత్త్వం పాచకాదివత్ , అవిక్రియత్వాత్ ; నాపి గుణవత్త్వం నీలాదివత్ , నిర్గుణత్వాత్ ; అతో నాభిధానేన నిర్దేశమర్హతి। శశవిషాణాదిసమత్వాన్నిరర్థకత్వం తర్హి ; న, ఆత్మత్వావగమే తురీయస్యానాత్మతృష్ణావ్యావృత్తిహేతుత్వాత్ శుక్తికావగమ ఇవ రజతతృష్ణాయాః ; న హి తురీయస్యాత్మత్వావగమే సతి అవిద్యాతృష్ణాదిదోషాణాం సంభవోఽస్తి ; న చ తురీయస్యాత్మత్వానవగమే కారణమస్తి, సర్వోపనిషదాం తాదర్థ్యేనోపక్షయాత్ — 'తత్త్వమసి' (ఛా. ఉ. 6। 8। 7) 'అయమాత్మా బ్రహ్మ' (బృ. ఉ. 2। 5। 19) 'తత్సత్యం స ఆత్మా' (ఛా. ఉ. 6। 8। 7) 'యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ' (బృ. ఉ. 3। 4। 1) 'సబాహ్యాభ్యంతరో హ్యజః' (ము. ఉ. 2। 1। 2) 'ఆత్మైవేదం సర్వం' (ఛా. ఉ. 7। 25। 2) ఇత్యాదీనాం। సోఽయమాత్మా పరమార్థాపరమార్థరూపశ్చతుష్పాదిత్యుక్తః। తస్యాపరమార్థరూపమవిద్యాకృతం రజ్జుసర్పాదిసమముక్తం పాదత్రయలక్షణం బీజాంకురస్థానీయం। అథేదానీమబీజాత్మకం పరమార్థస్వరూపం రజ్జుస్థానీయం సర్పాదిస్థానీయోక్తస్థానత్రయనిరాకరణేనాహ — నాంతఃప్రజ్ఞమిత్యాదినా।**

### శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

(విశ్వ-తైజస-ప్రాజ్ఞు లనే మూడు పాదాల గురించి చెప్పిన తరువాత) వరుసలో నాల్గవది అయిన చతుర్థ పాదం గురించి చెప్పడానికే 'నాంతఃప్రజ్ఞమ్ ....' అంటూ మొదలయ్యే మంత్రాలను ఉపనిషత్తు చెప్పబోతోంది. ఆ చతుర్థపాదమైన తురీయావస్థను వివరించడానికి ఎటువంటి శబ్దం కూడా ఉపయోగపడనందుచేత, ఆ అవస్థ శబ్దం చేత వర్ణించబడేది కాదు అని విశేషణాలన్నింటిని నిషేధిస్తూ, అది తురీయం అని నిర్దేశించబడుతోంది.

**సందేహం :** అయితే అది కేవలం శూన్యమా?

**సమాధానం :** అలా కాదు. ఎందుకంటే, కారణం లేకుండా భ్రమ నిజం కాకపోవడం సంభవించదు కాబట్టి. వెండి-పాము-మనిషి-ఎండమావి మొదలైన భ్రమలు ముత్యపు చిప్ప-త్రాడు-స్తంభం-ఎడారి అనేవాటి ఆశ్రయం లేకుండా కలగడం అనేది కుదరదు కదా!

<u>**సందేహం :**</u> అలాగైతే, ప్రాణాది సకల వికల్పాలకు ఆశ్రయమైన 'తురీయం' అనేది విశేషాలు లేనిది కాదు కాబట్టి, నీటికి ఆశ్రయమైన (పట్టుకోవడానికి ఆధారమైన) కుండ వంటి వాటిని శబ్దాలచేత వివరించి నట్లుగా, తురీయ అవస్థ కూడా శబ్దం చేత చెప్పతగినదే కదా!

<u>**సమాధానం :**</u> కాదు. ఎందుకంటే, ముత్యపు చిప్ప వంటి వాటిలో కల్పించబడే వెండి వంటి వాటిలాగా, ప్రాణాది వికల్పాలు 'సత్' కాదు కాబట్టి. 'సత్' నకు 'అసత్' నకు మధ్య సంబంధమనేదే లేనందువల్ల, ఆ లేని సంబంధాన్ని శబ్దం చేత వివరించడం వీలుకాదు. ఆత్మకు ఎటువంటి ఉపాధి లేనందుచేత, గోవు లాగా ఒక స్వరూపం కలిగినది కానందుచేత, అది ఎటువంటి ప్రమాణాలకు అందదు. గోవు లాగా దానికి జాతి లేదు, అట్టిది మరొకటి లేనిదైనందున సామాన్య గుణాలు గాని విశేషమైన గుణాలు గాని లేవు, క్రియత్వం లేనందున వంటవానిలాగా క్రియా ప్రవృత్తి కూడా లేదు, గుణరహితమైనది కాబట్టి నీలం వంటి గుణాలు లేవు. అందుచేత, అది (ఆత్మ) ఏ విధమైన వివరణతోనూ సూచించబడేది కాదు.

<u>**సందేహం :**</u> అయితే, కుందేటి కొమ్ము వంటి వాటిలాగా (ఆత్మ) అర్థమే లేనిదా!

<u>**సమాధానం :**</u> కాదు. ఎందుకంటే, వెండి గురించిన భ్రమ తొలగి ముత్యపు చిప్ప తెలియబడినట్లుగా, అనాత్మ వస్తువుల పట్ల ఆసక్తి నశించి, తురీయావస్థ అనుభవానికి వస్తోంది కాబట్టి. తురీయమైన ఆత్మ స్థితి అనుభవానికి రాగానే అవిద్య-కోరిక వంటి దోషాలు సంభవించవు. మరియు, తురీయమైన ఆత్మ స్థితి అనుభవానికి రాకపోవడానికి కారణం ఉండదు. సకల ఉపనిషత్తులు ఈ అభిప్రాయాన్నే అంతిమంగా ఇలా వెల్లడి చేస్తున్నాయి. 'అది నీవే అయి ఉన్నావు' ['తత్త్వమసి' (ఛా.ఉ. 6-8-7)]; 'ఈ ఆత్మయే బ్రహ్మ' ['అయమాత్మా బ్రహ్మ' (బృ.ఉ. 2-5-19)]; 'అది ఆత్మ అదియే సత్యం' ['తత్సత్యం స ఆత్మా' (ఛా.ఉ. 6-8-7)]; 'ఏది సాక్షాత్తుగా అపరోక్షమో అదే బ్రహ్మ' ['యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ' (బృ.ఉ. 3-4-1)]; 'బాహ్యంలోనూ అంతరంలో ఉన్నవాడైనందున పుట్టుకలేని వాడు' ['సబాహ్యాభ్యంతరో హ్యజః' (ము.ఉ. 2-1-2)]; 'ఈ సకలమూ ఆత్మయే' ['ఆత్మైవేదం సర్వం' (ఛా.ఉ. 7-25-2)] అని శ్రుతులంటున్నాయి.

అటువంటి ఈ ఆత్మయొక్క పరమార్థాన్ని మరియు పరమార్థం కాని అసత్ రూపాలను గురించి వివరించే క్రమంలో నాలుగు పాదాలను చెప్తున్నారు. అవిద్య వల్ల కలిగిన, త్రాడులో పాములాగా ఒకదానికి మరొకటి బీజం-అంకురం అన్నట్లు అనిపించే ఆత్మ యొక్క అసత్ రూప లక్షణాలను ముందు మూడు పాదాలలో ప్రస్తావించి ఉన్నారు. ఇక ఇప్పుడు, ముందు చెప్పిన జాగ్రత్తు-స్వప్న-సుషుప్తి అనే మూడు అవస్థలకు భిన్నమైన, బీజాత్మకం కాని (కారణ రూపం కాని) పరమార్థ స్వరూపాన్ని నాంతఃప్రజ్ఞమ్ .... అని మొదలయ్యే మంత్రాలలో వివరిస్తున్నారు. త్రాడును పాముగా భ్రమించే ఉదాహరణలో త్రాడు స్థానంలో పరమార్థ స్వరూపాన్ని, పాము స్థానంలో అవస్థా త్రయాన్ని భావించుకొంటే విషయం తేలికగా అర్థమౌతుంది.

**నాన్తఃప్రజ్ఞం న బహిష్ప్రజ్ఞం నోభయతఃప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం న ప్రజ్ఞం నాప్రజ్ఞమ్ |**
**అదృశ్యమవ్యవహార్యమగ్రాహ్యమలక్షణమచిన్త్యమవ్యపదేశ్యమేకాత్మప్రత్యయసారం**
**ప్రపంచోపశమం శాన్తం శివమద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా స విజ్ఞేయః ||**

**|| మాం.ఉ. 1-7 ||**

తురీయంలో (స్వప్నంలోవలె లోపలి విషయాలను ప్రకాశింపచేసే) అంతఃప్రజ్ఞ లేదు, (జాగ్రత్తులో వలె బాహ్య విషయాలను ప్రకాశింపచేసే) బాహ్య ప్రజ్ఞ లేదు, (బాహ్య-అంతరాల సంధిలో వలె) రెండు విధాలైన ప్రజ్ఞ లేదు, (సుషుప్తిలో వలె) ఘనీభవించిన ప్రజ్ఞానం లేదు, (సకలాన్ని ప్రకాశింప చేసే) ప్రజ్ఞ లేదు, (ప్రకాశింప చేయకపోవడం అనే) అప్రజ్ఞ లేదు. కనబడనిది, వ్యవహార గోచరం కానిది, గ్రహించను వీలుకానిది, లక్షణము లేవీ లేనిది, విచారణకు అందనిది, నిర్దేశింపను వీలులేనిది, సకల వేదములచే ఆత్మ ఒక్కటే అని నిశ్చయించబడినది, సంసారాన్ని ఉపశమింపచేసేది, వికార రహితమైనది, మంగళకరమైనది, రెండవది లేనిదీ అయిన ఆత్మ చతుర్థ పాదమని (మహర్షులు) భావిస్తారు. అదియే (ఆ ఆత్మయే) తెలుసుకొనదగినది.

**శంకరుల భాష్యము**

**నన్వాత్మనశ్చతుష్పాత్త్వం ప్రతిజ్ఞాయ పాదత్రయకథనేనైవ చతుర్థస్యాంతఃప్రజ్ఞాదిభ్యోఽన్యత్వే సిద్ధే 'నాంతఃప్రజ్ఞం' ఇత్యాదిప్రతిషేధోఽనర్థకః ; న, సర్పాదివికల్పప్రతిషేధేనైవ రజ్జుస్వరూపప్రతిపత్తి వత్త్ర్యవస్థస్యైవాత్మనస్తురీయత్వేన ప్రతిపిపాదయిషితత్వాత్ , 'తత్త్వమసి' ఇతివత్| యది హి త్ర్యవస్థాత్మవిలక్షణం తురీయమన్యత్ , తత్ప్రతిపత్తిద్వారాభావాత్ శాస్త్రోపదేశానర్థక్యం శూన్యతాపత్తిర్వా| రజ్జురివ సర్పాదిభిర్వికల్ప్యమానా స్థానత్రయేఽప్యాత్మైక ఏవ అంతఃప్రజ్ఞాదిత్వేన వికల్ప్యతే యదా, తదా అంతఃప్రజ్ఞాదిత్వప్రతిషేధవిజ్ఞానప్రమాణసమకాలమేవ ఆత్మన్యనర్థప్రపంచనివృత్తిలక్షణం ఫలం పరిసమాప్తమితి తురీయాధిగమే ప్రమాణాంతరం సాధనాంతరం వా న మృగ్యం ; రజ్జుసర్పవివేకసమకాల ఇవ రజ్జ్వాం సర్పనివృత్తిఫలే సతి రజ్జ్వధిగమస్య| యేషాం పునస్తమోపనయనవ్యతిరేకేణ ఘటాధిగమే ప్రమాణం వ్యాప్రియతే, తేషాం ఛేద్యావయవసంబంధవియోగవ్యతిరేకేణ అన్యతరావయవేఽపి ఛ్ఛిదిర్వ్యాప్రియత ఇత్యుక్తం స్యాత్| యదా పునర్ఘటతమసోర్వివేకకరణే ప్రవృత్తం ప్రమాణమనుపాదిత్సితతమోనివృత్తిఫలావసానం ఛిదిరివ ఛ్ఛేద్యావయవసంబంధవివేకకరణే ప్రవృత్తా తదవయవద్వైధీభావఫలావసానా, తదా నాంతరీయకం ఘటవిజ్ఞానం న ప్రమాణఫలం| న చ తద్వదప్యాత్మన్యధ్యారోపితాంతఃప్రజ్ఞత్వాదివివేకకరణే ప్రవృత్తస్య ప్రతిషేధవిజ్ఞానప్రమాణస్య అనుపాదిత్సితాంతఃప్రజ్ఞత్వాదినివృత్తివ్యతిరేకేణ తురీయే వ్యాపారోపపత్తిః, అంతఃప్రజ్ఞత్వాది నివృత్తిసమకాలమేవ ప్రమాతృత్వాదిభేదనివృత్తేః| తథా చ వక్ష్యతి — 'జ్ఞాతే ద్వైతం న విద్యతే' (మా. కా. 1| 18) ఇతి| జ్ఞానస్య ద్వైతనివృత్తిక్షణవ్యతిరేకేణ క్షణాంతరానవస్థానాత్ , అవస్థానే వా అనవస్థాప్రసంగాద్ద్వైతానివృత్తిః ; తస్మాత్ప్రతిషేధవిజ్ఞానప్రమాణవ్యాపారసమకాలైవ ఆత్మన్యధ్యారోపితాంతఃప్రజ్ఞత్వాద్యనర్థనివృత్తిరితి సిద్ధం| నాంతఃప్రజ్ఞమితి తైజసప్రతిషేధః ; నబహిఃప్రజ్ఞమితి విశ్వప్రతిషేధః ; నోభయతఃప్రజ్ఞమితి జాగరితస్వప్నయోరంతరాలావస్థాప్రతిషేధః ; నప్రజ్ఞానఘనమితి సుషుప్తావస్థాప్రతిషేధః, బీజభావావివేకస్వరూపత్వాత్ ; నప్రజ్ఞమితి యుగపత్సర్వవిషయజ్ఞాతృత్వప్రతిషేధః ; నాప్రజ్ఞమిత్యచైతన్యప్రతిషేధః| కథం పునరంతఃప్రజ్ఞత్వాదీనామాత్మని గమ్యమానానాం రజ్జ్వాదౌ సర్పాదివత్ప్రతిషేధాదసత్త్వం గమ్యత ఇతి, ఉచ్యతే ; జ్ఞస్వరూపావిశేషేఽపి ఇతరేతరవ్యభిచారాదసత్యత్వం రజ్జ్వాదావివ సర్పధారాదివికల్పభేదవత్ ; సర్వత్రావ్యభిచారాజ్జ్ఞస్వరూపస్య సత్యత్వం| సుషుప్తే వ్యభిచరతీతి చేత్ ; న, సుషుప్తస్యానుభూయమానత్వాత్ , 'న హి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతే' (బృ. ఉ. 4| 3| 30) ఇతి శ్రుతేః ; అత ఏవ అదృశ్యం| యస్మాదదృశ్యం , తస్మాదవ్యవహార్యం| అగ్రాహ్యం కర్మేంద్రియైః| అలక్షణం అలింగమిత్యేతత్ , అననుమేయమిత్యర్థః| అత ఏవ అచింత్యం| అత ఏవ అవ్యపదేశ్యం శబ్దైః|**

**ఏకాత్మప్రత్యయసారం జాగ్రదాదిస్థానేషు ఏక ఏవాయమాత్మా ఇత్యవ్యభిచారీ యః ప్రత్యయః, తేనానుసరణీయం ; అథవా, ఏక ఆత్మప్రత్యయః సారః ప్రమాణం యస్య తురీయస్యాధిగమే, తత్తురీయమేకాత్మప్రత్యయసారం , 'ఆత్మేత్యేవోపాసీత' (బృ. ఉ. 1| 4| 7) ఇతి శ్రుతేః| అంతఃప్రజ్ఞత్వాదిస్థానిధర్మప్రతిషేధః కృతః| ప్రపంచోపశమమితి జాగ్రదాదిస్థానధర్మాభావ ఉచ్యతే| అత ఏవ శాంతం అవిక్రియం , శివం యతః అద్వైతం భేదవికల్పరహితం చతుర్థం తురీయం మన్యంతే, ప్రతీయమానపాదత్రయరూపవైలక్షణ్యాత్| స ఆత్మా స విజ్ఞేయః ఇతి| ప్రతీయమానసర్పదండభూచ్ఛిద్రాదివ్యతిరిక్తా యథా రజ్జుః, తథా 'తత్త్వమసి' ఇత్యాదివాక్యార్థః ఆత్మా 'అదృష్టో ద్రష్టా' (బృ. ఉ. 3| 7| 23) 'న హి ద్రష్టుర్దృష్టేర్విపరిలోపో విద్యతే' (బృ. ఉ. 4| 3| 23) ఇత్యాదిభిరుక్తో యః, స విజ్ఞేయ ఇతి భూతపూర్వగత్యా| జ్ఞాతే ద్వైతాభావః||**

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**సందేహం :** ప్రారంభంలో ఆత్మకు నాలుగుపాదలున్నాయని ప్రతిపాదించారు. మూడు పాదాల గురించి చెప్పిన తరువాత నాల్గవ పాదం ఆ ముందు చెప్పిన మూడింటికి భిన్నమైనదని తేలగా, 'నాంతఃప్రజ్ఞం ...' అంటూ నిషేధ వాక్యాలు చెప్పడం వృథా కదా!

**సమాధానం :** కాదు. ఎందుకంటే, పాము యొక్క వికల్పాన్ని నిరోధిస్తేనే త్రాడు యొక్క స్వరూపం బయటపడినట్లుగా, మూడు అవస్థలలోనూ ఉన్న ఆత్మయే తురీయంగా ప్రతిష్ఠితమై ఉన్నదని, 'తత్వమసి' (ఛాం.ఉ. 6-8-7) అన్న శ్రుతి వాక్యం చెప్పిన రీతిగా ప్రతిపాదింపబడుతోంది కాబట్టి. మూడు అవస్థలలోనున్న ఆత్మకు తురీయస్థితి వేరయినట్లైతే, ఆ తురీయస్థితిని పొందేందుకు సాధనమేదీ లేనందుచేత శాస్త్రోపదేశం వృథా అయినా కావాలి లేదా ఆ తురీయం శూన్యమైన అయి ఉండాలి. (వేదప్రమాణానికి విరుద్ధమైన వాదం తిరస్కరించవలసిందే కాబట్టి శాస్త్రోపదేశం వృథా కావడం అన్నది సంభవమే కాదు. ఇక తురీయం అంటే శూన్యత్వం అనే ప్రతిపాదనను ఇంతకు ముందే త్రోసిపుచ్చడం జరిగింది. కాబట్టి, మూడు అవస్థలలో ఉన్న ఆత్మయే తురీయంగా ప్రతిష్ఠితమై ఉన్నదని నిరూపణ చేసినట్లైంది). పామువంటి వాటిగా ఆరోపించబడుతున్న త్రాడు లాగా, మూడు అవస్థలలోనూ ఒక్కటే అయిన ఆత్మ ఎప్పుడైతే అంతఃప్రజ్ఞాదులుగా వేర్వేరుగా కనిపిస్తుందో, అప్పుడు ఆ అంతఃప్రజ్ఞాదులను వేద ప్రమాణాలతో ప్రతిషేధిస్తూ (నిర్మూలనం చేస్తూ) తద్వారా విజ్ఞానం కలిగిన ఆ సమయంలోనే ఆత్మయందు అనర్థాలనిచ్చే సంసారం నశించడమనే ఫలం పూర్తిగా సిద్ధిస్తుంది. తురీయావస్థను పొందటానికి వేరొక ప్రమాణంగాని, వేరొక సాధనంగాని అవసరమే లేదు. త్రాడు-పాముల గురించిన వివేకం కలిగిన క్షణంలో, త్రాడునందలి పాము తొలగిపోవడమే, త్రాడు తెలియడం. ఎవరు వివేక సాధనంతో చీకటిని తొలగించడమే కాక అందుకు భిన్నమైన కుండను గుర్తించడం అనే మరో క్రియను నిర్వర్తించాల్సి ఉంటుందని భావిస్తారో, వారు కట్టెను గొడ్డలితో ముక్కలుగా కొట్టటానికి భిన్నంగా ముక్కలు చేయడమనే మరొక క్రియ ఉన్నట్లుగా భావన చేసేవారే అవుతారు. (కట్టెను కొట్టడమంటేనే ముక్కలు చేయడం. అది ఒకే ప్రక్రియ. కాని దానిని కొట్టిన తర్వాత ముక్కలు చేయడం అనే రెండు విడివిడి క్రియలని అనుకోవడం అవివేకం). కట్టెను ముక్కలు చేయడమనే క్రియకు ఫలం దానిని రెండుగా విభజించడమే అయినట్లుగా, ఎప్పుడైతే కుండను ఆవరించిన చీకటిని తొలగించడమనే ప్రవృత్తి కుండను ఆవరించిన చీకటి తొలగిపోవడం అనే ఫలాన్ని పొందుతుందో అప్పుడే వెంటనే మరొక ప్రమాణం యొక్క అవసరమే లేకుండా కుండ తెలిసిపోతుంది. అదే విధంగా, (ఇదికాదు ఇదికాదు అని) నిషేధిస్తూపోయినందువల్ల కలిగిన వేదప్రమాణ జనితమైన విజ్ఞానం వల్ల, అత్మయందు అంతఃప్రజ్ఞత్వాదులు ఆరోపించబడినాయనే వివేకం ప్రవృత్తంకాగా, అంతఃప్రజ్ఞత్వాదులు నిలిచిపోయిన ఆ సమయంలోనే తెలుసుకొనేవాడు-తెలుసుకొనబడేది అనే తేడాలు నశిస్తాయి

కాబట్టి, అంతఃప్రజ్ఞత్వాల నివృత్తికి భిన్నంగా తురీయస్థితిలో మరో ప్రవృత్తి అనేది ఉండదని కూడా నిరూపితమైనది. అందుచేతనే 'జ్ఞానం కలుగగా, ద్వైతం తెలియబడదు' ['జ్ఞాతే ద్వైతం న విద్యతే' (మా.గౌ.కా. 1-18)] అని కారికలో చెప్పబోతున్నారు. ద్వైతం ఏక్షణంలో నిలిచిపోతుందో ఆ తర్వాతి క్షణంలో అంతఃప్రజ్ఞత్వాలనబడే మనోవిజ్ఞానం ఉండదు. ఒకవేళ ఉండేటట్లైతే, దానిని నివృత్తం చేయడానికి మరొక ప్రమాణం, ఆ ప్రమాణాన్ని నివృత్తి చేయడానికి ఇంకొక ప్రమాణం ఇలా అనంతంగా సాగిపోతూ, ద్వైతం ఎప్పటికీ నివృత్తి కాబోదు. అందుచేత, ప్రతిషేధ విజ్ఞాన ప్రమాణం వల్ల వివేకం కలిగిన సమయంలోనే ఆత్మయందు అధ్యారోపితమైన అంతఃప్రజ్ఞత్వాది దోషాలు నిర్మూలనమౌతాయని నిరూపణ అవుతోంది.

**న అంతఃప్రజ్ఞమ్** (స్వప్నావస్థలో ఉండే) అంతఃప్రజ్ఞ కాదు అని అన్నప్పుడు తైజసుడు తొలగిపోయాడు. **న బహిష్ప్రజ్ఞమ్** (జాగ్రదవస్థలో ఉండే) బాహ్య ప్రజ్ఞ కాదు అని అన్నప్పుడు విశ్వుడు తొలగిపోయాడు. **న ఉభయతః ప్రజ్ఞమ్** జాగ్రత్తు-స్వప్న అవస్థల మధ్యస్థితిలో ఉండే ప్రజ్ఞ (బాహ్య-అంతర ప్రజ్ఞల సమ్మేళనం) కూడా కాదు. **న ప్రజ్ఞానఘనమ్** ఘనీభవించిన చేతనత్వం కాదు అని అన్నప్పుడు, బీజభావం తెలియబడని స్వరూపం కావడం చేత, సుషుప్తి స్థితి (ప్రాజ్ఞత్వం) తొలగిపోతుంది. **న ప్రజ్ఞమ్** చేతనమే కాదు అని అన్నప్పుడు సకల విషయాలను ఏకకాలంలో తెలుసుకొనగలగటం అనే జ్ఞాతృత్వం తొలగిపోతుంది. **న అప్రజ్ఞమ్** అచేతనము కాదు అని అన్నప్పుడు జడత్వం నిరాకరించబడుతోంది. మరైతే, ఆత్మయందు భావించబడే అంతఃప్రజ్ఞాదులు, త్రాడులో నుండి పాము తొలగిపోయినట్లు, ఎలా లేకుండా పోతాయో, ఇప్పుడు చెప్తున్నారు. సాక్షిమాత్రమైన జ్ఞానానికి రూప విశేషాలు లేనప్పటికీ, త్రాడులో పాము మరియు ఎండమావులలో నీటి చారలలాగా వివిధ వికల్పాలు కలిగినట్లు, వేర్వేరు స్థితులు దానియందు కల్పించడం చేత అవి యదార్థం కాదు. జ్ఞానమైతే ఎన్నడూ మార్పుచెందేది కానందుచేత అదియే యదార్థం అని తెలుతోంది.

<u>**సందేహం**</u> : అది సుషుప్తిలో (కనబడక పోవడం చేత) మార్పు చెందుతున్నట్లే కదా!

<u>**సమాధానం**</u> : కాదు. సుషుప్తిలో అది అనుభవానికి వస్తోంది. {గాఢ నిద్రనుండి లేచిన వాడు, నేను గాఢంగా నిద్రించాను. నాకు ఏమీ తెలియలేదు అని అంటున్నాడు. అతడు ఆ స్థితిని చైతన్యం సహాయంతో సాక్షిగా అనుభవించకపోతే, ఆ అనుభవానికి సంబంధించిన వాసన ఏర్పడటం, దానిని జ్ఞప్తికి తెచ్చుకోవడం తటస్థించదు. – స్వామి గంభీరానంద}. ఈ విషయాన్ని శ్రుతి 'తెలుసుకొనేవాని తెలియడమనే ధర్మానికి ఎప్పటికీ నష్టం కలగదు' ['న హి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతే' (బృ.ఉ. 4-3-30)] అని ప్రకటించింది. అందుచేతనే అది **అదృశ్యం** గోచరం కాకుండా ఉండేది. అగోచరమైనది కాబట్టి, అది **అవ్యవహారమ్** వ్యవహరించదు. **అగ్రాహ్యమ్** కర్మేంద్రియాలచే పట్టుబడదు. **అలక్షణమ్** ఏ ప్రమాణానికి అందనిది, అనుమేయంగా చెప్పలేనిది. అందుచేతనే **అచిన్త్యమ్** విచారణకు అందనిది. విచారణకు అందనందునే **అవ్యపదేశ్యమ్** శబ్దాలచేత సూచించడం వీలుకానిది. **ఏక-ఆత్మ-ప్రత్యయ-సారమ్** జాగ్రదాది అవస్థలలో ఏటువంటి మార్పులకు లోనుకాకుండా ఏదైతే ఉన్నదో అది ఈ ఆత్మ ఒక్కటే అనే నిశ్చితాభిప్రాయం పొందినది. లేదంటే, ప్రమాణంచేత ఏ తురీయస్థితి అనుభవమౌతుందో, ఆ తురీయస్థితి ఒక్క ఆత్మయేనన్న అభిప్రాయమే **ఏకాత్మప్రత్యయసారమ్. 'ఆత్మయే** ఉపాసించవలసినది' ['ఆత్మేత్యేవోపాసీత' (బృ.ఉ. 1-4-7)] అని శ్రుతి చెప్పింది కూడా. (ఆ విధంగా) మూడు అవస్థలలోని అంతఃప్రజ్ఞత్వాది స్థితిధర్మాలు నిరాకరించారు. **ప్రపంచోపశమమ్** సంసారం ఉపశమించింది అని అన్నప్పుడు జాగ్రదాది అవస్థలలోని ధర్మాలు నశించాయని చెప్తున్నారు. అందుచేతనే, **శాంతమ్** మార్పులేకుండుట, **శివమ్** మంగళకరత్వం. **అద్వైతమ్** రెండవది లేకపోవడం

చేత, కేవలం కల్పితాలైన మూడుస్థితులకు భిన్నమైనట్టి ఆ తురీయాన్ని **చతుర్థమ్ మన్యన్తే** నాలుగవది అని భావిస్తారు. **సః ఆత్మా** అది ఆత్మ. **సః విజ్ఞేయః** అది తెలుసుకొనవలసినది. ఎలాగైతే పాముకు, మాలకు, భూమిపై చీలికకు భిన్నమైనదిగా పాము తెలుస్తుందో అదేవిధంగా (ఆత్మయందు ఆరోపించబడిన అవస్థలకు భిన్నమైనదిగా) తెలియబడే ఏ ఆత్మైతే ఉన్నదో, ఏ ఆత్మనైతే 'తత్త్వమసి' వంటి వాక్యాలకు అర్థంగా చెప్పారో, మరియు 'దర్శించబడకుండా దర్శిస్తాడు' ['అదృష్టో ద్రష్టా' (బృ.ఉ. 3-7-23)]; 'దృష్ట యొక్క దర్శనానికి ఏప్పటికీ నాశనం ఉండదు' ['న హి ద్రష్టుదృష్టేర్విపరిలోపో విద్యతే' (బృ.ఉ. 4-3-23)] వంటి శ్రుతివాక్యాలలో ప్రస్తావించారో, దానిని ఆ ఆత్మను తెలుసుకొనాలి అని పూర్వపు అజ్ఞాన దశను దృష్టిలో ఉంచుకొని చెప్తున్నారు. ఎందుకంటే, జ్ఞానంలో ద్వైతం ప్రసక్తి ఉండదు కనుక.

## గౌడపాదుల కారిక...

### శంకరుల భాష్యము

**అత్రైతే శ్లోకా భవంతి —**

### శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

ఇక్కడ గౌడపాదులవారి కారికలో ఈ శ్లోకాలున్నవి.

**నివృత్తేః సర్వదుఃఖానామీశానః ప్రభురవ్యయః|**
**అద్వైతః సర్వభావానాం దేవస్తుర్యో విభుః స్మృతః ||** **|| మాం.గౌ.కా. 1-10 ||**

సర్వదుఃఖములు తొలగిపోగా, మార్పులేకుండా ఉన్నట్టి ఈశ్వరుడే ప్రభువు. సకల భావాలలోనూ అతడు అద్వయుడే (అట్టివాడు వేరొకడు లేడు). అతడే ప్రకాశమానమైన తురీయంలో అంతటా వ్యాపించి ఉన్నాడని శ్రుతి నిర్ణయించింది.

### శంకరుల భాష్యము

**ప్రాజ్ఞతైజసవిశ్వలక్షణానాం సర్వదుఃఖానాం నివృత్తేః ఈశానః తురీయ ఆత్మా| ఈశాన ఇత్యస్య పదస్య వ్యాఖ్యానం ప్రభురితి ; దుఃఖనివృత్తిం ప్రతి ప్రభుర్భవతీత్యర్థః, తద్విజ్ఞాననిమిత్తత్వాద్దుఃఖనివృత్తేః| అవ్యయః న వ్యేతి, స్వరూపాన్న వ్యభిచరతి న చ్యవత ఇత్యేతత్| కుతః ? యస్మాత్ అద్వైతః, సర్వభావానాం — సర్పాదీనాం రజ్జురద్వయా సత్యా చ ; ఏవం తురీయః, 'న హి ద్రష్టుర్దృష్టేర్విపరిలోపో విద్యతే' (బృ. ఉ. 4| 3| 23) ఇతి శ్రుతేః — అతో రజ్జుసర్పవన్మృషాత్వాత్| స ఏష దేవః ద్యోతనాత్ తుర్యః చతుర్థః విభుః వ్యాపీ స్మృతః||**

**విశ్వాదీనాం సామాన్యవిశేషభావో నిరూప్యతే తుర్యయాథాత్మ్యావధారణార్థం —**

### శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

ప్రాజ్ఞ-తైజస-విశ్వ లక్షణాలైన **సర్వదుఃఖానామ్ నివృత్తేః** సకల దుఃఖాలు నశించిన మీదట **ఈశానః** ఈశ్వరుడే తురీయమైన ఆత్మ. **ఈశానః** అన్న పదానికి **ప్రభుః** అన్నది వివరణ. ఈశ్వరుని గురించిన జ్ఞానం కలిగిన కారణంగా దుఃఖం నివారణౌతుంది కాబట్టి, దుఃఖ వినాశనంతోపాటుగా ప్రభుత్వం కలుగుతుందని అభిప్రాయం. అట్టి

ఈశ్వరుడు **అవ్యయః** మార్పును పొందడు. అంటే తన స్వరూపం నుండి మారిపోడు లేదా జారిపోడు అని. ఎందుకని? ఎందుకంటే **అద్వైతః సర్వభావానామ్** పాములవంటి వాటిలో త్రాడు ఒక్కటే సత్యం మిగిలినవన్నీ అసత్యాలైన విధంగా, సకల భావనలలోనూ సత్యమైన అతని వంటి వాడు మరొకడు లేడు కాబట్టి. మరియు 'దృష్ట యొక్క దర్శనానికి ఎప్పటికీ నాశనం ఉండదు' ['న హి ద్రష్టుర్దృష్టేర్విపరిలోపో విద్యతే' (బృ.ఉ. 4-3-23)] అనే శ్రుతి వాక్యం ప్రకారంగా కూడా, అది తురీయావస్థ. అదియే **దేవః** ప్రకాశమానమైన **తుర్యః** నాల్గవది **విభుః** వ్యాప్తమైనది అని **స్మృతః** నిశ్చయింపబడినది.

తురీయావస్థ యొక్క యదార్థ స్వభావాన్ని నిర్ణయించాలనే ఉద్దేశ్యంతో, విశ్వ-తైజస-ప్రాజ్ఞుల యొక్క సామాన్యమైన మరియు ప్రత్యేకమైన లక్షణాలను ఈ క్రింది శ్లోకంలో ప్రస్తావిస్తున్నారు.

**కార్యకారణబద్ధౌ తావిష్యేతే విశ్వతైజసౌ|**

**ప్రాజ్ఞః కారణబద్ధస్తు ద్వౌ తౌ తుర్యే న సిధ్యతః||** **|| మాం.గౌ.కా. 1-11 ||**

విశ్వ తైజసులిద్దరూ కార్య-కారణాలతో బంధింపబడి ఉంటారు. ప్రాజ్ఞుడు కారణంతో బంధింపబడి ఉంటాడు. కాని, ఆ (కార్య-కారణాలు) రెండూ తురీయంలో ఉండవు.

**<u>శంకరుల భాష్యము</u>**

**కార్యం క్రియత ఇతి ఫలభావః, కారణం కరోతీతి బీజభావః| తత్త్వాగ్రహణాన్యథాగ్రహణాభ్యాం బీజఫలభావాభ్యాం తౌ యథోక్తౌ విశ్వతైజసౌ బద్ధౌ సంగృహీతౌ ఇష్యేతే| ప్రాజ్ఞస్తు బీజభావేనైవ బద్ధః| తత్త్వాప్రతిబోధమాత్రమేవ హి బీజం ప్రాజ్ఞత్వే నిమిత్తం| తతః ద్వౌ తౌ బీజఫలభావౌ తత్త్వాగ్రహణాన్యథాగ్రహణే తురీయే న సిధ్యతః న విద్యేతే, న సంభవత ఇత్యర్థః||**

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

**కార్యమ్** అంటే ఉత్పత్తి చేయబడింది అనే అర్థంలో అది ఫలభావం. **కారణమ్** అంటే చేస్తుంది అనే అర్థంలో అది బీజభావం. తత్త్వాన్ని గ్రహించకపోవడం మరియు తప్పుగా గ్రహించడం వంటి **తౌ** ఈ చెప్పబడిన రెండు బీజ-ఫల భావనలతో **విశ్వతైజసౌ** విశ్వుడు మరియు తైజసుడు **బద్ధౌ** బంధించబడి ఉంటారని **ఇష్యతే** అంగీకరించబడింది. **తు** అయితే **ప్రాజ్ఞః** ప్రాజ్ఞుడు **కారణ బద్ధః** బీజభావంతో మాత్రమే బంధింపబడినవాడు. తత్త్వాన్ని గ్రహించకపోవడం మాత్రమే ప్రాజ్ఞత్వస్థితికి కారణం. అందువలన, **ద్వౌ తౌ** తత్త్వాన్ని గ్రహించకపోవడం మరియు తప్పుగా గ్రహించడం అనే బీజ-ఫల భావాలు రెండూ **తుర్యే** తురీయావస్థలో **న సిధ్యతః** తెలియబడవు, సంభవించవు అని అభిప్రాయం.

**నాత్మానం న పరం చైవ న సత్యం నాపి చానృతమ్|**

**ప్రాజ్ఞః కిఞ్చన సంవేత్తి తుర్యం తత్సర్వదృక్సదా||** **|| మాం.గౌ.కా. 1-12 ||**

ప్రాజ్ఞుడు దేనినీ తెలుసుకోలేడు. తనను తాను తెలుసుకొలేడు, తనకు వేరైన దానిని కూడా తెలుసుకోలేడు. సత్యాన్ని మరియు అసత్యాన్ని కూడా తెలుసుకోలేడు. తురీయుడైతే సర్వదా తానే సర్వమై సాక్షియై ఉంటాడు.

## శంకరుల భాష్యము

**కథం పునః కారణబద్ధత్వం ప్రాజ్ఞస్య తురీయే వా తత్త్వాగ్రహణాన్యథాగ్రహణలక్షణౌ బంధౌ న సిధ్యత ఇతి ? యస్మాత్ — ఆత్మానం , విలక్షణం , అవిద్యాబీజప్రసూతం వేద్యం బాహ్యం ద్వైతం — ప్రాజ్ఞో న కించన సంవేత్తి, యథా విశ్వతైజసౌ ; తతశ్చాసౌ తత్త్వాగ్రహణేన తమసా అన్యథాగ్రహణబీజభూతేన బద్ధో భవతి| యస్మాత్ తుర్యం తత్సర్వదృక్సదా తురీయాదన్యస్యాభావాత్ సర్వదా సదైవ భవతి, సర్వం చ తద్దృక్చేతి సర్వదృక్ ; తస్మాన్న తత్త్వాగ్రహణలక్షణం బీజం| తత్ర తత్ప్రసూతస్యాన్యథాగ్రహణస్యాప్యత ఏవాభావః| న హి సవితరి సదాప్రకాశాత్మకే తద్విరుద్ధమప్రకాశనమన్యథాప్రకాశనం వా సంభవతి, 'న హి ద్రష్టుర్దృష్టేర్విపరిలోపో విద్యతే' (బృ. ఉ. 4| 3| 23) ఇతి శ్రుతేః| అథవా, జాగ్రత్స్వప్నయోః సర్వభూతావస్థః సర్వవస్తుదృగాభాసస్తురీయ ఏవేతి సర్వదృక్సదా, 'నాన్యదతోఽస్తి ద్రష్టృ' (బృ. ఉ. 3| 8| 11) ఇత్యాదిశ్రుతేః||**

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

మరి ప్రాజ్ఞునికి కారణబద్ధత్వం ఎలా కలిగింది? తురీయంలో తత్త్వాన్ని గ్రహించకపోవడం (అగ్రహణం), తప్పుగా గ్రహించడమనే (అన్యథాగ్రహణమనే) లక్షణాలు కలిగిన బంధం ఎలా కలగడం లేదు? ఎందువల్లనంటే – విశ్వ-తైజసుల లాగా **ప్రాజ్ఞః** ప్రాజ్ఞుడు **కిఞ్చన** దేనినీ, అంటే తననుగాని మరియు తనకు భిన్నంగా బాహ్యంలో అవిద్యాబీజం నుండి పుట్టిన ద్వైతాన్నిగాని **న సంవేత్తి** తెలియడు. అందుచేత అతనికి (ఆ ప్రాజ్ఞునికి) అన్యథా గ్రహణానికి బీజ రూపమైన చీకటి వల్ల యదార్థతత్త్వాన్ని గ్రహించకపోవడంచేత బంధం కలుగుతోంది. **తత్ తుర్యమ్** తురీయావస్థలో తురీయానికి అన్యంగా వేరేదీ లేనందుచేత **సదా** ఎల్లప్పుడూ ఉనికి కలిగే ఉండి, సర్వమును సాక్షిగా దర్శించడం చేత ఆ తురీయమే **సర్వదృక్**. కాబట్టి తత్త్వాన్ని గ్రహించకపోవడమనే లక్షణానికి కారణమైన బీజం ఆ తురీయావస్థలో లేదు. అందుచేత, ఆ కారణ బీజం నుండి పుట్టే అన్యథాగ్రహణం కూడా అక్కడ ఉండదు. 'దృష్ట యొక్క దర్శనానికి ఎప్పటికీ నాశనం ఉండదు' ['న హి ద్రష్టుదృష్టేర్విపరిలోపో విద్యతే' (బృ.ఉ. 4-3-23)] అనే శ్రుతి వాక్యం ప్రకారం ఎల్లప్పుడూ ప్రకాశిస్తూ ఉన్న సూర్యునియందు ఆ ప్రకాశానికి విరుద్ధమైన చీకటిగాని, భిన్నమైన ఇతర ప్రకాశంగాని సంభవించనట్లే, తత్త్వాన్ని గ్రహించకపోవడమనే స్థితి మరియు వేరుగా గ్రహించడమనే స్థితులు తురీయావస్థలో ఉండవు. లేదా, జాగ్రత్తు-స్వప్నాలలో సర్వభూతాలలో ఉండి సర్వాన్ని సాక్షిమాత్రంగా చూచుట అనే స్థితి తురీయమే కాబట్టి అదియే **సర్వదృక్** అని కూడా చెప్పవచ్చు. ఇదే విషయాన్ని 'ఇది కాక వేరొక సాక్షి లేదు' **[**'నాన్యదతోఽస్తి ద్రష్టృ' (బృ.ఉ. 3-8-11)] వంటి శ్రుతి వాక్యాలు ప్రకటిస్తున్నాయి.

**ద్వైతస్యాగ్రహణం తుల్యముభయోః ప్రాజ్ఞతుర్యయోః|**
**బీజనిద్రాయుతః ప్రాజ్ఞః సా చ తుర్యే న విద్యతే || || మాం.గౌ.కా. 1-13 ||**

ప్రాజ్ఞ-తురీయులు ఇద్దరకూ ద్వైతాన్ని అనుభవించకపోవడం సమానమే. నిద్ర అనే కారణ స్థితి ప్రాజ్ఞునిది. కాని అది తురీయంలో ఉండదు.

### శంకరుల భాష్యము

**నిమిత్తాంతరప్రాప్తాశంకానివృత్త్యర్థోఽయం శ్లోకః — కథం ద్వైతాగ్రహణస్య తుల్యత్వే కారణబద్ధత్వం ప్రాజ్ఞస్యైవ, న తురీయస్యేతి ప్రాప్తా ఆశంకా నివర్త్యతే ; యస్మాత్ బీజనిద్రాయుతః, తత్త్వాప్రతిబోధో నిద్రా ; సైవ చ విశేషప్రతిబోధప్రసవస్య బీజం ; సా బీజనిద్రా ; తయా యుతః ప్రాజ్ఞః| సదాసర్వదృక్స్వభావత్వాత్తత్త్వాప్రతిబోధలక్షణా బీజనిద్రా తుర్యే న విద్యతే ; అతో న కారణబంధస్తస్మిన్నిత్యభిప్రాయః||**

### శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

వేరే కారణంగా కలిగిన సంశయాన్ని నివృత్తి చేయడానికి ఈ శ్లోకం చెప్తున్నారు. "ద్వైత అగ్రహణం (ద్వైతాన్ని అనుభవించకపోవడం) సమానమైనప్పుడు కారణంతో బంధం ప్రాజ్ఞునికే ఎందుకు ఉంటోంది? తురీయునికి ఎందుకు ఉండటం లేదు?" అనే సందేహాన్ని ఈ శ్లోకం నివారిస్తోంది. **ప్రాజ్ఞ తుర్యయోః ఉభయోః** ప్రాజ్ఞ-తురీయులు ఇద్దరిలోనూ **ద్వైతస్య అగ్రహణమ్** ద్వైతాన్ని గుర్తించకపోవడం **తుల్యమ్** సమానమే. అయితే, **బీజనిద్రాయుతః** – యదార్థతను తెలియకపోవడమే **నిద్ర,** అదియే వివిధత్వాన్ని గుర్తించడమనేదాని పుట్టుకకు కారణం, **బీజనిద్రాయుతః** అటువంటి బీజనిద్రతో కూడిన **ప్రాజ్ఞః** ప్రాజ్ఞునిలో ఉండే అటువంటి యదార్థతను తెలియకపోవడమనే బీజనిద్రా లక్షణం, ఎల్లప్పుడూ సకలాన్ని సాక్షిగా దర్శించే స్వభావం కల **తురీయే** తురీయస్థితిలో **న విద్యతే** ఉండదు. అందుచేత తురీయావస్థలో కారణబంధం ఉండదని అభిప్రాయం.

**స్వప్ననిద్రాయుతావాద్యౌ ప్రాజ్ఞస్త్వస్వప్ననిద్రయా|**
**న నిద్రాం నైవ చ స్వప్నం తుర్యే పశ్యన్తి నిశ్చితాః|| || మాం.గౌ.కా. 1-14 ||**

మొదటి తైజస-విశ్వులు ఇరువురూ స్వప్నస్థితి, నిద్రాస్థితి కలవారు. ప్రాజ్ఞునిదైతే స్వప్నం లేని నిద్రాస్థితి. తురీయ స్థితిలో నిద్రను కాని స్వప్నాన్ని కాని మహర్షులు నిశ్చయంగా దర్శించరు.

### శంకరుల భాష్యము

**స్వప్నః అన్యథాగ్రహణం సర్ప ఇవ రజ్జ్వాం , నిద్రోక్తా తత్త్వాప్రతిబోధలక్షణం తమ ఇతి ; తాభ్యాం స్వప్ననిద్రాభ్యాం యుతౌ విశ్వతైజసౌ ; అతస్తౌ కార్యకారణబద్ధావిత్యుక్తౌ| ప్రాజ్ఞస్తు స్వప్నవర్జితయా కేవలయైవ నిద్రయా యుత ఇతి కారణబద్ధ ఇత్యుక్తం| నోభయం పశ్యంతి తురీయే నిశ్చితాః బ్రహ్మవిద ఇత్యర్థః, విరుద్ధత్వాత్సవితరీవ తమః| అతో న కార్యకారణబద్ధ ఇత్యుక్తస్తురీయః||**

**కదా తురీయే నిశ్చితో భవతీత్యుచ్యతే —**

### శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**స్వప్న** త్రాడునందు పాములాగా అన్యథాగ్రహణ లక్షణం (అసలైనదాన్ని మరొకటిగా భ్రమించడమనే లక్షణం) కలది స్వప్నం. **నిద్ర** యదార్థాన్ని గ్రహించకపోవడమనే లక్షణం కలిగిన చీకటిని నిద్ర అంటారు. **యుతః** ఆ స్వప్న-నిద్రలతో కూడిన వారు **ఆద్యౌ** మొదట చెప్పిన విశ్వ-తైజసులిద్దరూ. అందుచేత వారిద్దరూ కార్య-కారణాలతో బంధింపబడి ఉంటారని (మాం.గౌ.కా 1-11లో) చెప్పారు. **ప్రాజ్ఞః తు** ప్రాజ్ఞుడైతే **అస్వప్న నిద్రయా** స్వప్నం లేని

కేవలనిద్రతో ఉండి కారణంతో బంధింపబడతాడని చెప్పారు. సూర్యకాంతి-చీకటి ఒకదాని కొకటి విరుద్ధమైనట్లే, **తుర్యే** తురీయంలో **న నిద్రాం న ఏవ చ స్వప్నం పశ్యన్తి** నిద్ర మరియు స్వప్నమూ లేవని **నిశ్చితాః** బ్రహ్మవేత్తలు నిశ్చయించారు అని అభిప్రాయం. అందుచేత కార్య-కరణాలతో బంధింపబడని స్థితియే తురీయం అని అన్నారు.

ఎప్పుడు తురీయంలో స్థిరత్వం కలుగుతుందో చెప్తున్నారు.

**అన్యథా గృహ్ణతః స్వప్నో నిద్రా తత్త్వమజానతః|**
**విపర్యాసే తయోః క్షీణే తురీయం పదమశ్నుతే || || మాం.గౌ.కా. 1-15 ||**

స్వప్నంలో అన్యథా గ్రహణత్వం, నిద్రలో యదార్థతను గ్రహించకపోవడం అనే రెండు దోషాలు క్షయం కాగా తురీయస్థితిని పొందుతాడు.

**శంకరుల భాష్యము**

**స్వప్నజాగరితయోః అన్యథా రజ్జ్వాం సర్పవత్ గృహ్ణతః తత్త్వం స్వప్నో భవతి ; నిద్రా తత్త్వమజానతః తిసృష్వవస్థాసు తుల్యా| స్వప్ననిద్రయోస్తుల్యత్వాద్విశ్వతైజసయోరేకరాశిత్వం| అన్యథాగ్రహణప్రాధాన్యాచ్చ గుణభూతా నిద్రేతి తస్మిన్విపర్యాసః స్వప్నః| తృతీయే తు స్థానే తత్త్వాగ్రహణలక్షణా నిద్రైవ కేవలా విపర్యాసః| అతః తయోః కార్యకారణస్థానయోః అన్యథాగ్రహణతత్త్వాగ్రహణలక్షణవిపర్యాసే కార్యకారణబంధరూపే పరమార్థతత్త్వప్రతిబోధతః క్షీణే తురీయం పదమశ్నుతే ; తదా ఉభయలక్షణం బంధనం తత్రాపశ్యంస్తురీయే నిశ్చితో భవతీత్యర్థః||**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**స్వప్నః** స్వప్నం అంటే **అన్యథా గృహ్ణతః** త్రాడునందు పామును చూసినట్లు యదార్థానికి బదులు వేరొకదానిని గ్రహించడమే. **నిద్రా** నిద్ర అంటే **తత్త్వమ్ అజానతః** తత్వాన్ని తెలియకపోవడం అనేది మూడు అవస్థలలోనూ సమానమే. విశ్వ-తేజసులలో స్వప్నం-నిద్ర అనేవి రెండూ సమానమే కనుక అవి ఒక జట్టు. అన్యథా గ్రహణం ప్రధానంగా ఉండటంచేత అగ్రహణమైన నిద్రయందలి స్వప్నం విలక్షణమైన దోష స్థితి. మూడవ స్థానంలో అయితే తత్వాన్ని గ్రహించకపోవడమనే లక్షణంకల కేవలనిద్ర మాత్రమే దోషం. **తయోః** (విశ్వ-తైజసులు కలిపి ఒకటి మరియు ప్రాజ్ఞుడు రెండు అనే) ఆ రెండు కార్యకారణస్థానాలలో అన్యథాగ్రహణం-తత్వాగ్రహణం అనే **విపర్యాసే** దోషాలవల్ల కలిగే పరమార్థ తత్వాన్ని తెలియడానికి కార్యకారణ రూపమైన ప్రతిబంధకాలు **క్షీణే** నశించగా **తురీయమ్ పదమ్** తురీయస్థితిని **అశ్నుతే** పొందుతాడు. అప్పుడు, ఈ రెండు విధాలైన బంధాలు అక్కడ తురీయంలో కనిపించవు అనే నిశ్చయం కలిగినవాడు అవుతాడు అని అభిప్రాయం.

**అనాదిమాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే|**
**అజమనిద్రమస్వప్నమద్వైతం బుధ్యతే తదా|| || మాం.గౌ.కా. 1-16 ||**

ఆదిలేని మాయాప్రభావం చేత నిద్రిస్తున్న జీవుడు ఎప్పుడైతే మేల్కొంటాడో అప్పుడు పుట్టుకలేని, నిద్రారహిత-స్వప్నరహిత అద్వయస్థితిని అనుభవిస్తాడు.

**<u>శంకరుల భాష్యము</u>**

**యోఽయం సంసారీ జీవః, సః ఉభయలక్షణేన తత్త్వాప్రతిబోధరూపేణ బీజాత్మనా, అన్యథాగ్రహణలక్షణేన చానాదికాలప్రవృత్తేన మాయాలక్షణేన స్వాపేన, మమాయం పితా పుత్రోఽయం నప్తా క్షేత్రం గృహం పశవః, అహమేషాం స్వామీ సుఖీ దుఃఖీ క్షయితోఽహమనేన వర్ధితశ్చానేన ఇత్యేవంప్రకారాన్స్వప్నాన్ స్థానద్వయేఽపి పశ్యన్సుప్తః, యదా వేదాంతార్థతత్త్వాభిజ్ఞేన పరమకారుణికేన గురుణా 'నాస్యేవం త్వం హేతుఫలాత్మకః, కింతు తత్త్వమసి' ఇతి ప్రతిబోధ్యమానః, తదైవం ప్రతిబుధ్యతే| కథం ? నాస్మిన్బాహ్యమాభ్యంతరం వా జన్మాదిభావవికారోఽస్తి, అతః అజం 'సబాహ్యాభ్యంతరో హ్యజః' (ము. ఉ. 2| 1| 2) ఇతి శ్రుతేః, సర్వభావవికారవర్జితమిత్యర్థః| యస్మాజ్జన్మాదికారణభూతం , నాస్మిన్నవిద్యాతమోబీజం నిద్రా విద్యత ఇతి అనిద్రం ; అనిద్రం హి తత్తురీయం ; అత ఏవ అస్వప్నం , తన్నిమిత్తత్వాదన్యథాగ్రహణస్య| యస్మాచ్చ అనిద్రమస్వప్నం , తస్మాదజం అద్వైతం తురీయమాత్మానం బుధ్యతే తదా||**

**ప్రపంచనివృత్త్యా చేత్ప్రతిబుధ్యతే, అనివృత్తే ప్రపంచే కథమద్వైతమితి, ఉచ్యతే|**

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

ఈ సంసారి అయిన **జీవః** జీవుడున్నాడో, అతడు తత్త్వజ్ఞానానికి రెండువిధాలైన ప్రతిబంధకాలను కలిగించే బీజం కలిగినవాడు. **అనాది మాయయా** అన్యథాగ్రహణ లక్షణమైన, అనాదియైన కాలంనుండి ఉత్పన్నమైన మాయా లక్షణమైన, నిద్ర కారణంగా, ఇతడు నా తండ్రి, నా పుత్రుడు, నా తాత, నా భూమి, నా ఇల్లు, నా ఫశువులు, నేను యజమానిని, సుఖించేవాడిని, దుఃఖించేవాడిని, వీటివల్ల నష్టపడతాను, వీటివల్ల లాభపడతాను, అనుకొంటూ ఈ ప్రకారంగా జాగ్రత్తు-స్వప్నములనే రెండు స్థితులలోనూ (జీవుడు) **సుప్తః** నిద్రిస్తున్నాడు. **యదా** ఏప్పుడైతే వేదాంత తత్త్వమును తెలిసిన, పరమ దయామయుడైన గురువుచే 'నీవు కార్య-కారణాత్మకమైన వాడవుకావు. నీవు అదియే (బ్రహ్మమే) అయి ఉన్నావు' ['నాస్యేవం త్వం హేతుఫలాత్మకః, కింతు తత్త్వమసి'] అని **ప్రబుధ్యతే** బోధించబడుతాడో, అప్పుడు తెలుసుకొంటాడు. ఏ విధంగా? దానిలో బయట-లోపల అనే తేడాలు కాని, జన్మవంటి భావ వికారాలు కాని లేనందుచేత **అజమ్** పుట్టుక లేనిది అని 'సబాహ్యాభ్యంతరో హ్యజః' (ము.ఉ. 2-1-2) అని శ్రుతి చెప్పినట్లుగా, ఎటువంటి భావ వికారాలు లేనిదిగా తెలుసుకొంటాడని అభిప్రాయం. దేనియందు జన్మాదులకు కారణమైనదీ, అవిద్య అనే చీకటికి కారణబీజమైనదీ అయిన నిద్ర ఉండదో అది **అనిద్రమ్.** అట్టి అనిద్రయే తురీయం. అలా అన్యథాగ్రహణానికి కారణమనేది లేకపోవడం చేత అదియే **అస్వప్నమ్.** అనిద్రమ్-అస్వప్నమ్ అయినట్టి అది పుట్టుక లేనిదని అదియే **అద్వైతమ్** రెండవది ఏదీ లేని తురీయస్థితి అని **తదా** అప్పుడు తెలుసుకొంటాడు.

ప్రపంచం నిర్మూలనం కాగా మేల్కొంటాడు అనేటట్లైతే, ప్రపంచం నిర్మూలనం కానప్పుడు అద్వైతమెక్కడుంది? అన్న సందేహానికి సమాధానం చెప్తున్నారు.

**ప్రపఞ్చో యది విద్యేత నివర్తేత న సంశయః|**

**మాయామాత్రమిదం ద్వైతమద్వైతం పరమార్థతః || || మాం.గౌ.కా. 1-17 ||**

ప్రపంచం ఉన్నట్లుగా తెలియబడితే, నిర్మూలనమవడంలో ఎటువంటి సందేహం లేదు. ఈ ద్వైతం మాయ మాత్రమే. అద్వైతమే అసలు యదార్థం.

**శంకరుల భాష్యము**

**సత్యమేవం స్యాత్ప్రపంచో యది విద్యేత ; రజ్జ్వాం సర్ప ఇవ కల్పితత్వాన్న తు స విద్యతే| విద్యమానశ్చేత్ నివర్తేత, న సంశయః| న హి రజ్జ్వాం భ్రాంతిబుద్ధ్యా కల్పితః సర్పో విద్యమానః సన్వివేకతో నివృత్తః ; న చ మాయా మాయావినా ప్రయుక్తా తద్దర్శినాం చక్షుర్బంధాపగమే విద్యమానా సతీ నివృత్తా ; తథేదం ప్రపంచాఖ్యం మాయామాత్రం ద్వైతం ; రజ్జువన్మాయావివచ్చ అద్వైతం పరమార్థతః ; తస్మాన్న కశ్చిత్ప్రపంచః ప్రవృత్తో నివృత్తో వాస్తీత్యభిప్రాయః||**

**నను శాస్తా శాస్త్రం శిష్య ఇత్యయం వికల్పః కథం నివృత్త ఇతి, ఉచ్యతే —**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**ప్రపఞ్చః** ప్రపంచం సత్యమే **యది విద్యేత** అని తెలుస్తున్నంత కాలం, త్రాడు నందలి పాములాగా, అది కల్పితమని భావించలేం. ప్రపంచం కల్పితమని తెలుసుకోగానే అది **నివర్తేత** తొలగిపోతుంది అనడంలో సందేహం లేదు. త్రాడునందలి సర్పం నిజానికి ఉండి తనకు వివేకం కలుగగా వెళ్ళిపోవడం కానే కాదు. ఇంద్రజాలికునిచే ప్రయోగించబడిన మాయ నిజానికి ఉండి, చూచేవాని కళ్ళగంతలు తీయగానే పోయేది కాదు. అదేవిధంగా **ఇదమ్** ఈ ప్రపంచమనేది **మాయా మాత్రమ్** మాయ మాత్రమే అయిన **ద్వైతమ్** ద్వైతం. త్రాడులాగా, ఇంద్రజాలికునిలాగా **అద్వైతమ్** అద్వైతమే **పరమార్థతః** అసలైన సత్యం. అందుచేత కనిపించే-కనపించకుండా పోయే ప్రపంచానికి ఉనికియే లేదు అని అభిప్రాయం.

అయితే, బోధకుడు, భోధించబడే శాస్త్రం, శిష్యుడు అనే ఈ వైవిధ్యాలు ఎలా తొలగిపోతాయి? అనే సందేహానికి సమాధానం చెప్తున్నారు.

**వికల్పో వినివర్తేత కల్పితో యది కేనచిత్|**

**ఉపదేశాదయం వాదో జ్ఞాతే ద్వైతం న విద్యతే|| || మాం.గౌ.కా. 1-18 ||**

కల్పించబడిన ఏ వైవిధ్యమైనా సరే తొలగిపోవల్సిందే. (బోధ, అచార్యుడు, శిష్యుడు అనే) ఈ వాదం కేవలం ఉపదేశం కొరకే. (యదార్థ సత్యం) తెలియబడిన మీదట రెండవది అనే భావన తొలగిపోతుంది.

**శంకరుల భాష్యము**

**వికల్పో వినివర్తేత యది కేనచిత్కల్పితః స్యాత్| యథా అయం ప్రపంచో మాయారజ్జుసర్పవత్ , తథా అయం శిష్యాదిభేదవికల్పోఽపి ప్రాక్ప్రతిబోధాదేవోపదేశనిమిత్తః ; అత ఉపదేశాదయం వాదః — శిష్యః శాస్తా శాస్త్రమితి| ఉపదేశకార్యే తు జ్ఞానే నిర్వృత్తే జ్ఞాతే పరమార్థతత్త్వే, ద్వైతం న విద్యతే||**
**ఇతి|**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**యది కల్పితః** కల్పించబడిన **కేనచిత్ వికల్పః** ఏ వైవిధ్యమైనా **వినివర్తేత** పూర్తిగా తొలగిపోయేదే. మాయవంటి, త్రాడు నందలి పాము లాంటి ఈ ప్రపంచం లాగానే, ఈ శిష్యుడు మొదలైన వివిధ భావనలు కూడా జ్ఞానం కలగడానికి పూర్వం ఉపదేశించే నిమిత్తంగా కల్పించబడినవే. **అయమ్ వాదః** శిష్యుడు, ఆచార్యుడు, శాస్త్రం అనే ఈ వాదనలన్నీ **ఉపదేశాత్** ఉపదేశించుట కొరకే. ఈ ఉపదేశాలు అన్నీ జ్ఞానం కలుగగానే తొలగిపోతాయి. **జ్ఞాతే** పరమార్థ తత్త్వాన్ని తెలుసుకొన్న మీదట **ద్వైతమ్** ద్వైతం అంటే రెండవది అనేది **న విద్యతే** ఉండదు.

## ఉపనిషత్ ...

**సోఽయమాత్మాధ్యక్షరమోఙ్కారోఽధిమాత్రం పాదా మాత్రా మాత్రాశ్చ పాదా అకార ఉకారో మకార ఇతి || || మాం.ఉ. 1-8 ||**

అట్టి ఈ ఆత్మయే అక్షరమైన ఓంకారంతో సూచించబడేది. దాని పాదములే మాత్రలు. అ-కార, ఉ-కార, మ-కారములనే మాత్రలే పాదములు.

**శంకరుల భాష్యము**

**అభిధేయప్రాధాన్యేన ఓంకారశ్చతుష్పాదాత్మేతి వ్యాఖ్యాతో యః, సోఽయం ఆత్మా అధ్యక్షరం అక్షరమధికృత్య అభిధానప్రాధాన్యేన వర్ణ్యమానోఽధ్యక్షరం| కిం పునస్తదక్షరమిత్యాహ — ఓంకారః| సోఽయమోంకారః పాదశః ప్రవిభజ్యమానః, అధిమాత్రం మాత్రామధికృత్య వర్తత ఇత్యధిమాత్రం| కథం ? ఆత్మనో యే పాదాః, తే ఓంకారస్య మాత్రాః| కాస్తాః ? అకార ఉకారో మకార ఇతి||**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఓంకారమే నాలుగు పాదములున్న ఆత్మ అంటూ ఏ ధ్యేయవస్తువు ప్రధానంగా 2వ మంత్రంలో వ్యాఖ్యానించబడినదో, సః **అయమ్ ఆత్మా** అదియే ఈ ఆత్మ. **అధ్యక్షరమ్** అక్షరాన్ని ప్రధానంగా చేసుకొని, అక్షరాన్ని దృష్టిలో ఉంచుకొని ఇపుడు వివరించబడుతోంది. మరి ఆ అక్షరం ఏమిటో చెప్తున్నారు. **ఓంకారః** అది ఓంకారం. అటువంటి ఓంకారం పాదములుగా విభజింపబడి, **అధిమాత్రమ్** మాత్రల రూపంగా ఉన్నది. ఎలా? **పాదా మాత్రా మాత్రాశ్చ పాదా** ఆత్మకు ఏ పాదాలున్నాయో అవి ఓంకారం యొక్క మాత్రలే. ఏమిటవి? **అ-కారః ఉ-కారః మ-కారః ఇతి** అవి అ-కార, ఉ-కార, మ-కారాలు.

**జాగరితస్థానో వైశ్వానరోఽకారః ప్రథమా మాత్రాప్తేరాదిమత్త్వాద్వాప్నోతి హ వై సర్వాన్కామానాదిశ్చ భవతి య ఏవం వేద|| || మాం.ఉ. 1-9 ||**

జాగ్రదవస్థయందుండే వైశ్వానరుడే (ఓంకారం యొక్క) మొదటి మాత్ర అయిన అ-కారం. అది ప్రారంభమైనది లేదా వ్యాపనశీలమైనది. ఈ విధంగా తెలుసుకొన్నవాడు, సకల కోర్కెలను పొందుతాడు మరియు ప్రధానమైనవాడౌతాడు.

**శంకరుల భాష్యము**

**తత్ర విశేషనియమః క్రియతే — జాగరితస్థానః వైశ్వానరః యః, స ఓంకారస్య అకారః ప్రథమా మాత్రా| కేన సామాన్యేనేత్యాహ — ఆప్తేః ; ఆప్తిర్వ్యాప్తిః ; అకారేణ సర్వా వాగ్వ్యాప్తా, 'అకారో వై సర్వా వాక్' (ఐ. ఆ. 2| 3| 19) ఇతి శ్రుతేః| తథా వైశ్వానరేణ జగత్ , 'తస్య హ వా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాః' (ఛా. ఉ. 5| 18| 2) ఇత్యాదిశ్రుతేః| అభిధానాభిధేయయోరేకత్వం చావోచామ| ఆదిరస్య విద్యత ఇత్యాదిమత్ ; యథైవ ఆదిమదకారాఖ్యమక్షరం , తథా వైశ్వానరః ; తస్మాద్వా సామాన్యాదకారత్వం వైశ్వానరస్య| తదేకత్వవిదః ఫలమాహ — ఆప్నోతి హ వై సర్వాన్కామాన్ , ఆదిః ప్రథమశ్చ భవతి మహతాం , య ఏవం వేద, యథోక్తమేకత్వం వేదేత్యర్థః||**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఇక వాటికి సంబంధించిన విశేషాలు నిర్దేశించబడుతున్నాయి. **జాగరితస్థానః వైశ్వానరః** జాగ్రదవస్థలో ఏ వైశ్వానరుడున్నాడో అతడు ఓంకారం యొక్క **ప్రథమా మాత్రా** ప్రారంభ మాత్ర అయిన **అకారః** అ-కారం. వాటికున్న సామాన్యత్వం ఏమిటి? **ఆప్తేః** ఆప్తి అంటే వ్యాపనశీలత్వం. 'అ-కారం నుండే సర్వవాక్కులు వ్యాప్తమౌతాయి' ['అకారో వై సర్వా వాక్' (ఐ.ఆ. 2-3-19)] అని శ్రుతి చెప్తోంది. అలాగే వైశ్వానరుని నుండి జగత్తు పుడుతోంది అని కూడా 'అట్టి ఆ వైశ్వానరుని యొక్క శిరస్సే తేజోవంతమైన స్వర్గం' ['తస్య హ వా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాః' (ఛా.ఉ. 5-18-2)] శ్రుతి చెప్పింది. పదము మరియు అది సూచించే అర్థం రెండూ ఒకటే అని చెప్పియున్నాం. **వా** లేదా **ఆదిమత్** ఓంకారానికి ప్రారంభం కనుక. అక్షరాలకు మొదటిది అ-కారం అయినట్లే, వైశ్వానరుడు కూడా (జగత్తు యొక్క ప్రారంభ స్థానమే). అందుచేత అ-కారానికి వైశ్వానరునికి ఆదిసామాన్యత్వం కలదు. ఆ ఏకత్వం తెలియడం వల్ల కలిగే ప్రయోజనం ఏమిటో చెప్తున్నారు. **య ఏవమ్ వేద** ఈవిధమైన ఏకత్వాన్ని తెలుసుకొన్నవాడు **ఆప్నోతి హ వై సర్వాన్ కామాన్** సకలమైన కోర్కెలను నిశ్చయంగా పొందుతాడు. **ఆదిః చ** మహాత్ములలో మొదటివాడు కూడా **భవతి** అవుతాడు అని అభిప్రాయం.

**స్వప్నస్థానస్తైజస ఉకారో ద్వితీయా మాత్రోత్కర్షాదు భయత్వాద్వోత్కర్షతి హ వై జ్ఞానసన్తతిం సమానశ్చ భవతి నాస్యాబ్రహ్మవిత్కులే భవతి య ఏవం వేద || || మాం.ఉ. 1-10 ||**

ఉత్కృష్టము లేదా ఉభయత్వం (తైజసునికి మరియు ఉ-కారానికి రెండింటికీ) సమానమే కాబట్టి స్వప్నావస్థలో ఉండే తైజసుడే రెండవ మాత్రయైన ఉ-కారం. ఆ విధంగా దీనిని తెలిసినవాడు జ్ఞాన పరంపరను వృద్ధిపరచుకొంటాడు మరియు అన్నింటితో సమానత్వాన్ని పొందుతాడు. అతని వంశంలో బ్రహ్మమును తెలియని వాడు ఉండడు.

**శంకరుల భాష్యము**

**స్వప్నస్థానః తైజసః యః, స ఓంకారస్య ఉకారః ద్వితీయా మాత్రా| కేన సామాన్యేనేత్యాహ — ఉత్కర్షాత్ ; అకారాదుత్కృష్ట ఇవ హ్యుకారః ; తథా తైజసో విశ్వాత్| ఉభయత్వాద్వా ; అకారమకారయోర్మధ్యస్థ ఉకారః ; తథా విశ్వప్రాజ్ఞయోర్మధ్యే తైజసః ; అత ఉభయభాక్త్వసామాన్యాత్| విద్వత్ఫలముచ్యతే — ఉత్కర్షతి హ వై జ్ఞానసంతతిం విజ్ఞానసంతతిం వర్ధయతీత్యర్థః ; సమానః తుల్యశ్చ, మిత్రపక్షస్యేవ శత్రుపక్షాణామప్యప్రద్వేష్యో భవతి ; అబ్రహ్మవిచ్చ అస్య కులే న భవతి, య ఏవం వేద||**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**స్వప్నస్థానః తైజసః** స్వప్నావస్థలోని తైజసుడే **ద్వితీయ మాత్రా** ఓంకారం యొక్క రెండవ మాత్ర అయిన **ఉ-కారః** ఉ-కారం. ఏది వాటి రెండింటికి సమానధర్మమో చెప్తున్నారు. **ఉత్కర్షాత్** అ-కారం కన్నా ఉ-కారం మిన్నదైనట్లుగానే తైజసుడు విశ్వుని కన్నా గొప్పవాడు అయినందువల్ల కాని **ఉభయత్వాత్ వా** లేదా అ-కార మ-కారాలకు ఉ-కారం మధ్యది అయినట్లుగా విశ్వ-ప్రాజ్ఞులు ఇద్దరకూ మధ్యలో తైజసుడు. అందుచేత ఉ-కారానికి మరియు తైజసునికీ మధ్యత్వం అనే సామాన్యత ఉన్నందువల్ల కాని (వాటి ఏకత్వం సిద్ధిస్తోంది). **య ఏవమ్ వేద** అలా తెలుసుకొన్నందు వల్ల ప్రయోజనాన్ని చెప్తున్నారు. **ఉత్కర్షతి హ వై జ్ఞానసంతతిమ్** అతని జ్ఞాన ప్రవాహం వృద్ధిని పొందుతుంది అని అభిప్రాయం. **చ సమానః భవతి** సర్వముతోనూ సామ్యతను పొందుతాడు. ఎలాగైతే మిత్రపక్షం పట్ల ద్వేషాన్ని కలిగి ఉండడో, శత్రుపక్షం పట్లకూడా ద్వేషభావాన్ని పొందడు. **అబ్రహ్మవిత్ చ అస్య కులే న భవతి** అతని కులంలో బ్రహ్మమును తెలియనివాడంటూ ఉండడు.

**సుషుప్తస్థానః ప్రాజ్ఞో మకారస్తృతీయా మాత్రా మితేరపీతేర్వామినోతి హ వా ఇదం సర్వమపీతిశ్చ భవతి య ఏవం వేద|| || మాం.ఉ. 1-11 ||**

కొలవడం లేదా కలుపుకోవడం అనేది (ప్రాజ్ఞునికీ మరియు మ-కారానికి) సమానమే కాబట్టి, సుషుప్తి అవస్థలోని ప్రాజ్ఞుడే మూడవమాత్ర అయిన మ-కారం. ఆ విధంగా దీనిని తెలిసినవాడు, జగత్తు యదార్థతను అంచనా వేస్తాడు మరియు సర్వాన్ని తనలో కలుపుకొంటాడు.

**శంకరుల భాష్యము**

**సుషుప్తస్థానః ప్రాజ్ఞః యః, స ఓంకారస్య మకారః తృతీయా మాత్రా। కేన సామాన్యేనేత్యాహ — సామాన్యమిదమత్ర — మితేః ; మితిర్మానం ; మీయేతే ఇవ హి విశ్వతైజసౌ ప్రాజ్ఞేన ప్రలయోత్పత్త్యోః ప్రవేశనిర్గమాభ్యాం ప్రస్థేనేవ యవాః ; తథా ఓంకారసమాప్తౌ పునః ప్రయోగే చ ప్రవిశ్య నిర్గచ్ఛత ఇవ అకారోకారౌ మకారే। అపీతేర్వా ; అపీతిరప్యయ ఏకీభావః ; ఓంకారోచ్చారణే హి అంత్యేఽక్షరే ఏకీభూతావివ అకారోకారౌ ; తథా విశ్వతైజసౌ సుషుప్తకాలే ప్రాజ్ఞే। అతో వా సామాన్యాదేకత్వం ప్రాజ్ఞమకారయోః। విద్వత్ఫలమాహ — మినోతి హ వై ఇదం సర్వం , జగద్యాథాత్మ్యం జానాతీత్యర్థః ; అపీతిశ్చ జగత్కారణాత్మా చ భవతీత్యర్థః। అత్రావాంతరఫలవచనం ప్రధానసాధనస్తుత్యర్థం।।**

### <u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>

**సుషుప్తస్థానః ప్రాజ్ఞః** సుషుప్తి అవస్థలోని ప్రాజ్ఞుడే, **తృతీయ మాత్రా** ఓంకారం యొక్క మూడవ మాత్ర అయిన **మ-కారః** మ-కారం. వాటి మధ్య (ప్రాజ్ఞునికి మరియు మ-కారానికి మధ్య) ఏ సామాన్య ధర్మం ఉన్నదో చెప్తున్నారు. ఇక్కడ సామాన్య ధర్మం **మితేః** కొలవడం లేదా కొలమానం. బార్లీవంటి ధాన్యాన్ని మానికలతో కొలిచినట్లు, ప్రలయ-ఉత్పత్తి కాలాలలో ప్రాజ్ఞునియందు విశ్వ-తైజసులు ప్రవేశించేటప్పుడు మరియు నిర్గమించేటప్పుడు వాటి పరిమాణాలను కొలుస్తున్నట్లే (వాటి యదార్థతను అంచనావేస్తున్నట్లే), ఓంకారం పూర్తి అయేటప్పుడు మరియు తిరిగి ప్రారంభించేటప్పుడు అ-కార ఉ-కారాలు మ-కారంలో ప్రవేశించి నిర్గమిస్తున్నాయి. **వా అపీతే** లేదా కలిపేసుకోవడం, తనలో ఏకం చేసుకోవడం. ఓంకార ఉచ్చారణలో అ-కార ఉ-కారాలు అంత్యాక్షరంలో ఒకటైపోయినట్లుగా, విశ్వ-తైజసులు సుషుప్తికాలంలో ప్రాజ్ఞునిలో ఏకమౌతారు. అందుచేత ప్రాజ్ఞునికి మ-కారానికి ఏకీకృతం చేయడం అనే సామాన్య ధర్మం ఉన్నది. అది తెలుసుకొన్నందువల్ల కలిగే ఫలాన్ని చెప్తున్నారు. **మినోతి హ వై ఇదమ్ సర్వమ్** జగత్తు యొక్క ఈ యదార్థతను తెలుసుకొంటాడు, **చ అపీతి భవతి** జగత్తుకు కారణమైన ఆత్మ కూడా అవుతాడు అని అభిప్రాయం. ప్రధాన ఫలసాధన యొక్క ఘనతను కీర్తించేందుకే ఇక్కడ అవాంతర (గౌణ) ఫలాన్ని చెప్పారు.

## గౌడపాదుల కారిక ...

### <u>శంకరుల భాష్యము</u>

**అత్రైతే శ్లోకా భవంతి —**

### <u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>

ఇక్కడ (ఈ విషయానికి సంబంధించి) గౌడపాదులవారి కారికలో ఈ శ్లోకాలున్నవి.

**విశ్వస్యాత్వవివక్షాయామాదిసామాన్యముత్కటమ్।**
**మాత్రాసమ్ప్రతిపత్తౌస్యాదాప్తిసామాన్యమేవ చ ।।** **।। మాం.గౌ.కా. 1-19 ।।**

విశ్వుడు అ-కారమే అని పోల్చి చెప్పినప్పుడు 'మొదటిది' అనే వాటి సామాన్యత్వం సుస్పష్టం. అదే మాత్రతో ఏకత్వాన్ని చెప్పడంచేత వ్యాప్తమనే ధర్మం కూడా వాటికి సమానమే.

**శంకరుల భాష్యము**

**విశ్వస్య అత్వం అకారమాత్రత్వం యదా వివక్ష్యతే, తదా ఆదిత్వసామాన్యం ఉక్తన్యాయేన ఉత్కటం ఉద్భూతం దృశ్యత ఇత్యర్థః| అత్వవివక్షాయామిత్యస్య వ్యాఖ్యానం — మాత్రాసంప్రతిపత్తౌ ఇతి| విశ్వస్య అకారమాత్రత్వం యదా సంప్రతిపద్యతే ఇత్యర్థః| ఆప్తిసామాన్యమేవ చ, ఉత్కటమిత్యనువర్తతే, చ - శబ్దాత్||**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**విశ్వస్య** విశ్వునికి **అత్వ** అ-కార మాత్రతో **వివక్షాయామ్** పోలికచేసి చెప్పినప్పుడు, **ఆది సామాన్యం** వాటి మధ్య 'మొదటివి' అని ముందట చెప్పిన ఆదిసామాన్యం అనే ధర్మం **ఉత్కటమ్** సుస్పష్టంగా కనబడుతోంది అని అభిప్రాయం. 'అత్వ వివక్షాయామ్' అన్నదా 'మాత్రాసంప్రతిపత్తౌ' అన్న పదం వివరంగా చెప్తోంది. **మాత్రా సంప్రతిపత్తౌ** ఎప్పుడైతే విశ్వునికి కేవలం అ-కార మాత్రతో ఏకత్వాన్ని భావిస్తారో అని అభిప్రాయం. అప్పుడు **ఆప్తి సామాన్యమ్ ఏవ చ** సర్వవ్యాపకత్వమనే ఆప్తిసామన్యత్వం కూడా **ఉత్కటమ్** స్పష్టమోతుంది. 'ఉత్కటమ్' అన్న శబ్దాన్ని ఇక్కడ కూడా అనువర్తించుకోవాలి.

**తైజసస్యోత్వవిజ్ఞాన ఉత్కర్షో దృశ్యతే స్ఫుటమ్|**
**మాత్రాసమ్ప్రతిపత్తౌ స్యాదుభయత్వం తథావిధమ్ || || మాం.గౌ.కా. 1-20 ||**

తైజసుని ఉ-కారంగా తెలియడంలో జ్ఞాన ఉద్దీపనం (అనే సామాన్యత) స్పష్టంగా కనిపిస్తుంది. అదేవిధంగా తైజసునకు ఉ-కార మాత్రకు ఏకత్వాన్ని చెప్పినపుడు ఉభయత్వం (రెండింటికి మధ్యనున్నది అనే సామన్యత) కన్పిస్తుంది.

**శంకరుల భాష్యము**

**తైజసస్య ఉత్వవిజ్ఞానే ఉకారత్వవివక్షాయాం ఉత్కర్షో దృశ్యతే స్ఫుటం స్పష్టమిత్యర్థః| ఉభయత్వం చ స్ఫుటమేవేతి| పూర్వవత్సర్వం||**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**తైజసస్య** తైజసుని యొక్క **ఉత్వ విజ్ఞానే** ఉ-కార మాత్రతో పోలిక **ఉత్కర్షః** ఉద్దీపనత్వం (అనే సామాన్యం ధర్మాన్ని) **దృశ్యతే స్ఫుటమ్** స్పష్టం చేస్తుంది అని అబిప్రాయం. **మాత్రా సంప్రతిపత్తౌ** తైజసునికి మాత్రతో మాత్రమే ఏకత్వాన్ని భావించినప్పుడు **తథావిధమ్ ఆవిధంగా ఉభయత్వమ్** రెండిటి మధ్య ఉండుట అనే సామాన్యధర్మం అంటే ఉభయసామాన్యత్వం కూడా స్పష్టంగా కనబడుతుంది. మిగిలినదంతా ముందు శ్లోకానికి వ్యాఖ్యానించిన విధంగానే అన్వయించుకోవాలి.

**మకారభావే ప్రాజ్ఞస్య మానసామాన్యముత్కటమ్|**
**మాత్రాసమ్ప్రతిపత్తౌ తు లయసామాన్యమేవ చ || || మాం.గౌ.కా. 1-21 ||**

ప్రాజ్ఞుడిని మ-కారంగా భావించడంలో కొలత అనే సామాన్యధర్మం స్పష్టం. ప్రాజ్ఞునికి మ-కారంతో ఏకత్వాన్ని భావనచేస్తే, లీనం చేసుకొనుట అనే సామాన్యధర్మం కూడా స్పష్టమే.

**శంకరుల భాష్యము**

**మకారత్వే ప్రాజ్ఞస్య మితిలయావుత్కృష్టే సామాన్యే ఇత్యర్థః||**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

పాజ్ఞుడిని మ-కారంగా భావించడంలో కొలుచుట, లీనం చేసుకొనుట అంటే లయసామాన్యత్వం అనేవి సామాన్యధర్మాలని స్పషంగా తెలుస్తోంది అని అభిప్రాయం.

**త్రిషు ధామసు యస్తుల్యం సామాన్యం వేత్తి నిశ్చితః|**

**స పూజ్యః సర్వభూతానాం వన్ద్యశ్చైవ మహామునిః ||** **|| మాం.గౌ.కా. 1-22 ||**

మూడు అవస్థలలోనూ ఏది సామాన్యధర్మమో దానిని నిశ్చయించి తెలుసుకొన్నవాడు మహాముని. అతడు సకల జీవులకు పూజనీయుడు మరియు వందనీయుడు.

**శంకరుల భాష్యము**

**యథోక్తస్థానత్రయే యః తుల్యముక్తం సామాన్యం వేత్తి, ఏవమేవైతదితి నిశ్చితః సస్ సః పూజ్యః వంద్యశ్చ బ్రహ్మవిత్ లోకే భవతి||**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఈ చెప్పబడిన **త్రిషు ధామసు** మూడు అవస్థలలో **యః తుల్యమ్** ఏది సమంగా **సామాన్యమ్** సాధారణంగా ఉన్నదని చెప్పబడినదో, అదియే ఇది అని **నిశ్చితః** నిశ్చయించి **వేత్తి సః** తెలుసుకొన్నవాడు **సర్వభూతానామ్** సకల ప్రాణులకు **పూజ్యః** ఆరాధించదగిన వాడు **వన్ద్యః చ ఏవ** మరియు నమస్కరించదగిన వాడే. **మహాముని** మునులందరిలోకి ఉన్నతుడు. అతడు బ్రహ్మవేత్తల లోకంలో ఉంటాడు.

**అకారో నయతే విశ్వముకారశ్చాపి తైజసమ్|**

**మకారశ్చ పునః ప్రాజ్ఞం నామాత్రే విద్యతే గతిః ||** **|| మాం.గౌ.కా. 1-23 ||**

అ-కారం విశ్వుని స్థితికి చేరుస్తుంది, అలాగే ఉ-కారం తైజసుని స్థితికి, మరియు తిరిగి మ-కారం పాజ్ఞుని స్థితికి (చేరుస్తుంది). అమాత్ర స్థితిలో చేరడం అనేది ఉండదు.

### శంకరుల భాష్యము

**యథోక్తైః సామాన్యైః ఆత్మపాదానాం మాత్రాభిః సహ ఏకత్వం కృత్వా యథోక్తోంకారం ప్రతిపద్యతే యో ధ్యాయీ, తం అకారః నయతే విశ్వం ప్రాపయతి| అకారాలంబనమోంకారం విద్వాన్వైశ్వానరో భవతీత్యర్థః| తథా ఉకారః తైజసం ; మకారశ్చాపి పునః ప్రాజ్ఞం , చ - శబ్దాన్నయత ఇత్యనువర్తతే| క్షీణే తు మకారే బీజభావక్షయాత్ అమాత్రే ఓంకారే గతిః న విద్యతే క్వచిదిత్యర్థః|| ఇతి|**

### శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

ముందు చెప్పినట్లుగా ఆత్మ యొక్క పాదాలకు ఓంకారంలోని మాత్రలకుగల సమాన ధర్మాలను గ్రహించడం ద్వారా వాటి ఏకత్వాన్ని సాధిస్తూ ఓంకారాన్ని ధ్యానంచేసిన సాధకుడిని, **అకారః** అ-కారం **విశ్వమ్** విశ్వుని స్థాయి **నయతే** పొందేలా చేస్తుంది. అ-కార ప్రధానంగా ఓంకారాన్ని ధ్యానించిన సాధకుడు వైశ్వానరుడు అవుతాడని అభిప్రాయం. **అపి ఉ-కారః చ తైజసమ్** అలాగే ఉ-కారం కూడా తైజసుని స్థాయిని మరియు **మకారః చ పునః ప్రాజ్ఞమ్** మ-కారం తిరిగి ప్రాజ్ఞుని స్థాయిని పొందేలా చేస్తుంది. 'చ' అన్న శబ్దంచేత 'నయత' అన్న క్రియాపదాన్ని వీటికి కూడా అన్వయం చేసుకోవాలి. మ-కారం క్షీణించగా బీజభావం అన్నది నశించడం చేత, ఓంకారంలో ఏమాత్రా లేనిదశలో (అంటే తురీయావస్థలో) పొందడం అన్నది ఏ మాత్రం ఉండదు అని అభిప్రాయం.

## ఉపనిషత్ ...

**అమాత్రశ్చతుర్థోఽవ్యవహార్యః ప్రపఞ్చోపశమః శివోఽద్వైత ఏవమోఙ్కార ఆత్మైవ సంవిశత్యాత్మనాత్మానం య ఏవం వేద|| || మాం.ఉ. 1-12 ||**

మాత్రలేని నాల్గవ అవస్థ వ్యవహారానికి అతీతమైన స్థితి. ఓంకారమే ఆత్మయనేది ప్రపంచం ఉపశమించిన, మంగళకరమైన, అద్వైత అవస్థ. దీనిని తెలిసినవాడు తాను ఆత్మస్వరూపుడై ఆత్మయందే ప్రవేశిస్తాడు.

### శంకరుల భాష్యము

**అమాత్రః మాత్రా యస్య న సంతి, సః అమాత్రః ఓంకారః చతుర్థః తురీయః ఆత్మైవ కేవలః అభిధానాభిధేయరూపయోర్వాఙ్మనసయోః క్షీణత్వాత్ అవ్యవహార్యః ; ప్రపంచోపశమః శివః అద్వైతః సంవృత్తః ఏవం యథోక్తవిజ్ఞానవతా ప్రయుక్త ఓంకారస్త్రిమాత్రస్త్రిపాద ఆత్మైవ ; సంవిశతి ఆత్మనా స్వేనైవ స్వం పారమార్థికమాత్మానం , య ఏవం వేద ; పరమార్థదర్శనాత్ బ్రహ్మవిత్ తృతీయం బీజభావం దగ్ధ్వా ఆత్మానం ప్రవిష్ట ఇతి న పునర్జాయతే, తురీయస్యాబీజత్వాత్| న హి రజ్జుసర్పయోర్వివేకే రజ్జ్వాం ప్రవిష్టః సర్పః బుద్ధిసంస్కారాత్పునః పూర్వవత్తద్వివేకినాముత్థాస్యతి| మందమధ్యమధియాం తు ప్రతిపన్నసాధకభావానాం సన్మార్గగామినాం సంన్యాసినాం మాత్రాణాం పాదానాం చ క్లృప్తసామాన్యవిదాం యథావదుపాస్యమాన ఓంకారో బ్రహ్మప్రతిపత్తయే ఆలంబనీభవతి| తథా చ వక్ష్యతి — 'ఆశ్రమాస్త్రివిధాః' (మా. కా. 3| 16) ఇత్యాది||**

**ఇతి మాండూక్యోపనిషత్సమాప్తా||**

శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**ఓంకారః** ఓంకారమందు **అమాత్రః** ఎక్కడ మాత్ర అన్నది ఉండదో అది అమాత్ర దశ **చతుర్థః** నాల్గవది చివరిది **ఆత్మ ఏవ** కేవలం ఆత్మయే. తెలియచేసేవి-తెలియబడేవి అనే వాటికి రూపాలైన వాక్కు-మననం అనే క్రియలు దానియందు (తురీయావస్థలో) క్షీణించడం చేత **అవ్యవహార్యః** అది వ్యవహారములకు అతీతమైన స్థితి. ఆ స్థితిలో **ప్రపంచోపశమః** జగత్తు అన్నది ఉపశమించగా (తొలగిపోగా) **శివః** మంగళకరమైన **అద్వైతః** అద్వయస్థితి ఆవరిస్తుంది. **ఏవమ్** ముందు చెప్పినట్లుగా ప్రయత్నం చేసి (విచారణ చేసి) **ఓంకారః** మూడు మాత్రలు కలిగిన ఓంకారం **ఆత్మ ఏవ** మూడుపాదాలు కలిగిన ఆత్మయే అని **య ఏవమ్ వేద** ఏ విద్వాంసుడు తెలుసుకొంటాడో అతడు **ఆత్మనా** స్వయంగా తన ఆత్మయందే **ఆత్మానమ్** యదార్థమైన ఆత్మతత్త్వంలో **సంవిశతి** ప్రవేశిస్తాడు. పరమార్థ తత్త్వాన్ని దర్శించడం చేత బ్రహ్మవేత్తకు తృతీయావస్థలోని బీజభావం దహించిపోగా ఆత్మయందు ప్రవేశిస్తాడు. తురీయావస్థలో మరుజన్మకు కారణమైన బీజం ఉండనందుచేత తిరిగి జన్మను పొందడు. త్రాడునందు పాము ఆరోపితమైనదనే వివేకం ఒకసారి కలిగిన వానికి సర్పభావన త్రాడునందు కలిసిపోగా త్రాడు యదార్థమని తెలిసిన తర్వాత తిరిగి ఆ వివేకిబుద్ధిలో పూర్వంలాగా త్రాడు నందు సర్పమనే సంస్కారానికి తావు ఉండదు. మంద బుద్ధులు మరియు మధ్యరకమైన బుద్ధి కలవారైనా కూడా, తాము సాధకులమని భావిస్తూ, సన్మార్గాన్ని ఆచరించే వారైనా, సంన్యాసులైనా సాధారణంగానైనా (ఓంకారం యొక్క) మాత్రలను మరియు (ఆత్మయొక్క) పాదాలను పైన చెప్పినవిధంగా తెలుసుకొని ఓంకారాన్ని ధ్యానించినట్లైతే వారికి బ్రహ్మపదం పొందేందుకు అది ఆధారం అవుతుంది. ఈ విషయాన్నే 'ఆశ్రమాస్త్రివిధాః' (మా.గౌ.కా. 3-16) అని మాండూక్య కారికలో ప్రస్తావించబోతున్నారు.

.. మాండూక్యోపనిషత్ సమాప్తం..

శంకరుల భాష్యము

**పూర్వవదత్రైతే శ్లోకా భవంతి —**

శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

పూర్వంలో లాగానే, ఇక్కడ గౌడపాదులవారి కారికలో ఈ శ్లోకాలున్నాయి.

## గౌడపాదుల కారిక ...

**ఓఙ్కారం పాదశో విద్యాత్పాదా మాత్రా న సంశయః|**

**ఓఙ్కారం పాదశో జ్ఞాత్వా న కిఞ్చిదపి చిన్తయేత్ ||** **|| మాం.గౌ.కా. 1-24 ||**

ఓంకారాన్ని ఒక్కొక్క పాదంగా తెలుసుకోవాలి. పాదములే మాత్రలు అన్నదానిలో సందేహం లేదు. ఓంకారాన్ని ఒక్కొక్క పాదంగా తెలుసుకొన్న మీదట ఇక దేనిని సంకల్పించడమనేది ఉండదు.

శంకరుల భాష్యము

**యథోక్తైః సామాన్యైః పాదా ఏవ మాత్రాః, మాత్రాశ్చ పాదాః ; తస్మాత్ ఓంకారం పాదశః విద్యాత్ ఇత్యర్థః| ఏవమోంకారే జ్ఞాతే దృష్టార్థమదృష్టార్థం వా న కించిదపి ప్రయోజనం చింతయేత్ , కృతార్థత్వాదిత్యర్థః||**

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

ముందు చెప్పబడిన సామాన్య ధర్మములు కలిగిన **పాదా మాత్రా** మాత్రలే పాదములు మరియు పాదములే మాత్రలు. ఈ విషయంలో **న సంశయః** సందేహం ఏమీలేదు. అందువలన, **ఓంకారమ్** ఓంకారాన్ని **పాదశః** పాదము తర్వాత పాదముగా **విద్యాత్** తెలుసుకోవాలని అభిప్రాయం. ఈ విధంగా **ఓంకారమ్ పాదశః జ్ఞాత్వా** ఓంకారాన్ని పాదము తర్వాత పాదముగా తెలుసుకొన్న మీదట దృష్టమైన లేదా అదృష్టమైన ఫలాల కొరకు **కిమ్ చిత్ అపి** ఎటువంటి సంకల్పాన్ని గురించి సాధకుడు **న చిన్తయేత్** ఆలోచన చేయడు. అంటే, అన్ని ప్రయోజనాలు సిద్ధించినవాడవుతాడు అని అర్థం.

**యుఞ్జీత ప్రణవే చేతః ప్రణవో బ్రహ్మ నిర్భయమ్|**
**ప్రణవే నిత్యయుక్తస్య న భయం విద్యతే క్వచిత్ || || మాం.గౌ.కా. 1-25 ||**

మనసును ప్రణవంతో అనుసంధానించుకోవాలి. భయానికి అతీతమైన బ్రహ్మమే ప్రణవం. నిరంతరం ప్రణవంతో అనుసంధానమైన వానికి ఏమాత్రం భయం తెలియదు.

**<u>శంకరుల భాష్యము</u>**

**యుంజీత సమాదధ్యాత్ యథావ్యాఖ్యాతే పరమార్థరూపే ప్రణవే చేతః మనః ; యస్మాత్ప్రణవః బ్రహ్మ నిర్భయం ; న హి తత్ర సదాయుక్తస్య భయం విద్యతే క్వచిత్ , 'విద్వాన్న బిభేతి కుతశ్చన' (తై. ఉ. 2| 9| 1) ఇతి శ్రుతేః||**

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

**చేతః** మనసును **ప్రణవే** ఓంకారమునందే అంటే పైన చెప్పిన విధంగా పరమార్థ రూపమనే భావనతో **యుంజీత** ఏకాగ్రం చేయాలి. **ప్రణవః** ఓంకారము **బ్రహ్మ నిర్భయమ్** భయానికి అతీతమైన బ్రహ్మయే కాబట్టి, **ప్రణవే** ఓంకారమునందే **నిత్యయుక్తస్య** నిరంతరం అనుసంధానమై యున్నవాడు **క్వచిత్ భయమ్** ఏ మాత్రం భయాన్ని **విద్యతే** తెలియడు. 'జ్ఞాని దేని గురించి భీతి చెందడు' ['విద్వాన్న బిభేతి కుతశ్చన' (తై.ఉ. 2-9-1)] అని శ్రుతి ప్రకటించింది.

**ప్రణవో హ్యపరం బ్రహ్మ ప్రణవశ్చ పరం స్మృతః|**
**అపూర్వోఽనన్తరోఽబాహ్యోఽనపరః ప్రణవోఽవ్యయః|| || మాం.గౌ.కా. 1-26 ||**

ఓంకారం అపర బ్రహ్మ మరియు పర బ్రహ్మ కూడా అని మహర్షులు చెప్తున్నారు. దానికి కారణమైనది లేదు, దానికి లోపల, బయట దానివంటిది మరొకటి లేదు, దాని కార్యమైనది ఏదీ లేదు. ఓంకారం నశించేది కాదు.

**శంకరుల భాష్యము**

**పరాపరే బ్రహ్మణీ ప్రణవః ; పరమార్థతః క్షీణేషు మాత్రాపాదేషు పర ఏవాత్మా బ్రహ్మ ఇతి ; న పూర్వం కారణమస్య విద్యత ఇత్యపూర్వః ; నాస్య అంతరం భిన్న జాతీయం కించిద్విద్యత ఇతి అనంతరః, తథా బాహ్యమన్యత్ న విద్యత ఇత్యబాహ్యః ; అపరం కార్యమస్య న విద్యత ఇత్యనపరః, సబాహ్యాభ్యంతరో హ్యజః సైంధవఘనవత్ప్రజ్ఞానఘన ఇత్యర్థః||**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**ప్రణవః** ఓంకారము **అపరమ్ బ్రహ్మ** అపరబ్రహ్మ మరియు **ప్రణవః** ఓంకారము **పరః** పర బ్రహ్మ కూడా **స్మృతః** మహర్షులు చెప్తున్నారు. మాత్రలు పాదములు నశించడంలో వాటికి పరమమైనట్టిది అనే అర్థంలో పరబ్రహ్మ. అందుచేత, దానికి కారణమన్నదే లేనందుచేత అది **అపూర్వః**. దానికి అంతరం అంటే దానిలోపల దానివంటిది మరొకటి ఏమాత్రం లేకపోవడం చేత అది **అనంతరః**. అలాగే దానికి వెలుపల వేరేదీ లేనందుచేత అది **అబాహ్యః**. దానికి భిన్నంగా మరొక కార్యమనేది లేనందుచేత **అనపరః**. అంటే, సమిష్టిగా లోపల మరియు బయట ఉన్న అంతటితో కలిసి పుట్టుకనేది లేని, ఉప్పు కల్లులాగా, ఘనీభవించిన చైతన్యమని అభిప్రాయం.

**సర్వస్య ప్రణవో హ్యాదిర్మధ్యమన్తస్తథైవ చ|**
**ఏవం హి ప్రణవం జ్ఞాత్వా వ్యశ్నుతే తదనన్తరమ్ || || మాం.గౌ.కా. 1-27 ||**

అలాగే సకలానికి ప్రణవమే ఆది-మధ్య-అంత్యము కూడా. ఈ విధంగా ప్రణవాన్ని తెలుసుకొన్నవాడు వెంటనే దానిని నిశ్చయంగా పొందుతాడు.

**శంకరుల భాష్యము**

**ఆదిమధ్యాంతా ఉత్పత్తిస్థితిప్రలయాః సర్వస్య ప్రణవ ఏవ| మాయాహస్తిరజ్జుసర్పమృగతృష్ణికా స్వప్నాదివదుత్పద్యమానస్య వియదాదిప్రపంచస్య యథా మాయావ్యాదయః, ఏవం హి ప్రణవమాత్మానం మాయావ్యాదిస్థానీయం జ్ఞాత్వా తత్క్షణాదేవ తదాత్మభావం వ్యశ్నుత ఇత్యర్థః||**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**సర్వస్య** సకలమునకూ **ప్రణవః హి** ప్రణవమే **ఆదిః మధ్యమ్ అంతః** ఉత్పత్తి-స్థితి-ప్రలయ స్థానం. మాయ ఏనుగు, త్రాడు నందు పాము, ఎండమావి, స్వప్నం మొదలైనవన్నీ మాయావి మొదలైన వారిచే కల్పించబడినట్లు, **తథా ఏవ చ** అదే విధంగానే, ఆకాశం-వాయువు మొదలైనవాటితో కూడిన ప్రపంచాన్ని మాయావి మొదలైన వాటిస్థానంలో **ఏవమ్ హి ప్రణవమ్** ఆత్మయే అయిన ఓంకారమే కల్పిస్తోందని **జ్ఞాత్వా** తెలుసుకోగానే **తత్ అనంతరమ్** ఆ క్షణంలోనే వాటి ఆత్మభావాన్ని **వ్యశ్నుతే** పొందుతాడు అని అభిప్రాయం.

**ప్రణవం హీశ్వరం విద్యాత్సర్వస్య హృదయే స్థితమ్|**
**సర్వవ్యాపినమోఙ్కారం మత్వా ధీరో న శోచతి|| || మాం.గౌ.కా. 1-28 ||**

సకల ప్రాణుల హృదయాలలో ఉన్న ఈశ్వరుడు ఓంకారమే అని తెలుసుకోవాలి. ఓంకారాన్ని సర్వవ్యాప్తమైనదిగా ధ్యానించిన వివేకి శోకించడు.

**శంకరుల భాష్యము**

**సర్వస్య ప్రాణిజాతస్య స్మృతిప్రత్యయాస్పదే హృదయే స్థితమీశ్వరం ప్రణవం విద్యాత్ సర్వవ్యాపినం వ్యోమవత్ ఓంకారమాత్మానమసంసారిణం ధీరః ధీమాన్బుద్ధిమాన్ ఆత్మతత్త్వం మత్వా జ్ఞాత్వా న శోచతి, శోకనిమిత్తానుపపత్తేః, 'తరతి శోకమాత్మవిత్' (ఛా. ఉ. 7| 1| 3) ఇత్యాదిశ్రుతిభ్యః||**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**సర్వస్య** సకల ప్రాణుల యొక్క జ్ఞప్తికి, అనుభవానికి స్థానమైన **హృదయే స్థితమ్** హృదయంలో ఉన్న **ఈశ్వరమ్** ఈశ్వరుడు **ప్రణవమ్ హి** ఓంకారమే అని తెలుసుకోవాలి. **సర్వవ్యాపినమ్** ఆకాశంవలె సర్వాన్నివ్యాపించియున్న, సంసారానికి అతీతమైన ఆత్మతత్వాన్ని **ఓంకారమ్** ఓంకారంగా **మత్వా** ధ్యానించి తెలుసుకొన్న **ధీరః** వివేకవంతుడు బుద్ధిమంతుడు **న శోచతి** శోకానికి కారణమేదీ లేకపోవడం చేత దుఃఖించడు. 'ఆత్మవేత్త శోకంనుండి తరిస్తాడు' ['తరతి శోకమాత్మవిత్' (ఛా.ఉ. 7-1-3)] అని శ్రుతి కూడా ప్రకటిస్తోంది.

**అమాత్రోఽనన్తమాత్రశ్చ ద్వైతస్యోపశమః శివః|**
**ఓఙ్కారో విదితో యేన స మునిర్నేతరో జనః ||** **|| మాం.గౌ.కా. 1-29 ||**

కొలతలు లేని, అపరిమితమైన, మంగళకరమైన దేనియందైతే ద్వైతమంతా తొలగిపోతుందో దానిని ఓంకారంగా తెలుసుకొన్నవాడే ముని. ఇతర జనులు మునులు కారు.

**శంకరుల భాష్యము**

**అమాత్రః తురీయ ఓంకారః, మీయతే అనయేతి మాత్రా పరిచ్ఛిత్తిః, సా అనంతా యస్య సః అనంతమాత్రః ; నైతావత్త్వమస్య పరిచ్ఛేత్తుం శక్యత ఇత్యర్థః| సర్వద్వైతోపశమత్వాదేవ శివః| ఓంకారో యథావ్యాఖ్యాతో విదితో యేన, స ఏవ పరమార్థతత్త్వస్య మననాన్మునిః ; నేతరో జనః శాస్త్రవిదపీత్యర్థః||**

**.. ఇతి ప్రథమమాగమప్రకరణం సంపూర్ణమ్..**

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

దేనిచేతనైతే కొలత వేస్తామో దానిని మాత్ర లేదా కొలమానం అంటారు. **అమాత్రః** అటువంటి కొలతలనేవి లేని తురీయావస్థయే ఓంకారం. దేనియందు ఆ కొలతకు అంతమనేది ఉండదో అది **అనంతమాత్రః**. అంటే దాని యొక్క పరిధి ఇంత మాత్రమని కొలిచి చెప్పడం సాధ్యపడదని అభిప్రాయం. **ద్వైతస్య ఉపశమః** దానియందు సకల ద్వైత ప్రపంచమంతా ఉపశమిస్తుంది కనుక అది **శివః** మంగళకరం. ఈ విధంగా వివరించి చెప్పబడిన దానిని **ఓంకారః** ఓంకారం అని **యేన విదిత్వా** ఎవడు తెలుసుకొంటాడో **సః** అతడే **మునిః** పరమార్థ

తత్వాన్ని నిరంతరం మననం చేసేవాడే ముని. **న ఇతరః జనః** కేవలం శాస్త్రాన్ని తెలిసికొన్నంత మాత్రంచేత ఇతరులెవ్వరూ మునులు కాజాలరు. అదీ అభిప్రాయం.

.. మొదటి అధ్యాయమైన ఆగమ ప్రకరణానికి వ్యాఖ్యానం సమాప్తం ..

# ద్వితీయ అధ్యాయం

# వైతథ్య ప్రకరణం

### శంకరుల భాష్యము

'జ్ఞాతే ద్వైతం న విద్యతే' ఇత్యుక్తం 'ఏకమేవాద్వితీయం' (ఛా. ఉ. 6 . 2 . 1) ఇత్యాదిశ్రుతిభ్యః . ఆగమమాత్రం తత్ . తత్ర ఉపపత్త్యాపి ద్వైతస్య వైతథ్యం శక్యతేఽవధారయితుమితి ద్వితీయం ప్రకరణమారభ్యతే —

### శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

'(ఆత్మ) ఒక్కటే, రెండవది లేదు' ['ఏకమేవాద్వితీయం' (ఛా.ఉ. 6-2-1)] అని చెప్పిన శ్రుతి ప్రమాణానికి తగినట్లుగా 'తెలుసుకొంటే ద్వైతమన్నది ఉండదు' ['జ్ఞాతే ద్వైతం న విద్యతే' (మాం.గౌ.కా. 1-18)] అని గౌడపాదులవారు తమ కారికలో చెప్పి ఉన్నారు. అయితే, శ్రుతి వచనం (ఉపనిషత్తు చెప్పినది) ఇంతవరకు మాత్రమే. ఇక ఇక్కడ, ద్వైతం యొక్క అసత్యాన్ని హేతుబద్ధంగా నిరూపణ చేయవచ్చునంటూ, ఆ నిరూపణ విధానాన్ని తెలియపరచడం కోసం కారికలో రెండవ అధ్యాయంగా ఈ వైతథ్య ప్రకరణాన్ని ప్రారంభిస్తున్నారు.

**వైతథ్యం సర్వభావానాం స్వప్న ఆహుర్మనీషిణః |**
**అన్తఃస్థానాత్తు భావానాం సంవృతత్వేన హేతునా || || మాం.గౌ.కా. 2-1 ||**

స్వప్నంలోని సమస్త భావనలు, అంతరంగంలోనివే కావడం చేత మరియు ఆ భావనలన్నీ అందులోనే ఇమిడిపోవడం కారణంగా, అసత్యమేనని విద్వాంసులు అంటారు.

### శంకరుల భాష్యము

వైతథ్యమిత్యాదినా . వితథస్య భావో వైతథ్యం ; అసత్యత్వమిత్యర్థః . కస్య ? సర్వేషాం బాహ్యాధ్యాత్మికానాం భావానాం పదార్థానాం స్వప్నే ఉపలభ్యమానానాం , ఆహుః కథయంతి మనీషిణః ప్రమాణకుశలాః . వైతథ్యే హేతుమాహ — అంతఃస్థానాత్ , అంతః శరీరస్య మధ్యే స్థానం యేషాం ; తత్ర హి భావా ఉపలభ్యంతే పర్వతహస్త్యాదయః, న బహిః శరీరాత్ ; తస్మాత్ తే వితథా భవితుమర్హంతి . నను అపవరకాద్యంతరుపలభ్యమానైర్ఘటాదిభిరనైకాంతికో హేతురిత్యాశంక్యాహ — సంవృతత్వేన హేతునేతి . అంతః సంవృతస్థానాదిత్యర్థః . న హ్యంతః సంవృతే దేహాంతర్నాడీషు పర్వతహస్త్యాదీనాం సంభవోఽస్తి ; న హి దేహే పర్వతోఽస్తి ..

స్వప్నదృశ్యానాం భావానామంతః సంవృతస్థానమిత్యేతదసిద్ధం , యస్మాత్ప్రాచ్యేషు సుప్త ఉదక్షు స్వప్నాన్పశ్యన్నివ దృశ్యత ఇత్యేతదాశంక్యాహ —

### శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**వైతథ్యమ్ –** నిజానికి లేకపోవడం 'వైతథ్యమ్', అంటే అసత్యం అని అర్థం. (ఈ అసత్యత్వం వేటికి? **స్వప్నే** స్వప్నంలో అనుభవానికి వచ్చే **సర్వభావానామ్** సకల భావనలకు సంబంధించి బాహ్యంలోనూ, అంతరంగంలోనూ గల వస్తు విషయాలు అన్నీ (అసత్యమేనని) **మనీషిణః** ప్రమాణాల గురించిన నైపుణ్యం కల

విద్వాంసులు **ఆహుః** చెప్తారు. వైతథ్యానికి కారణం చెప్తున్నారు. **అంతఃస్థానాత్** – అంతః అంటే దేహానికి మధ్య స్థానంలో, అక్కడే పర్వతాలు, ఏనుగులు వంటివన్నీ అనుభవానికి వస్తాయి కాబట్టి, దేహానికి బయట కాదు. అందువల్ల అవి అసత్యం కావలిసిందే. అయితే ఇంటిలోపల ఉన్న కుండలు మొదలైన వాటిలాగా, లోపల ఉన్నవన్నీ నిజాలు కావేమో అనే సందేహం కలుగవచ్చని ఊహించి, **సంవృతత్వేన హేతునా** ఇమిడిపోవడం అనే మరొక కారణాన్ని ప్రస్తావిస్తున్నారు. అంటే లోపల ఇమిడిపోవడం అని అర్థం. పర్వతాలు, ఏనుగుల వంటి భారీ వస్తువులు దేహంలోపల నాడులలో ఇమిడిపోవడం అసంభవం. దేహంలో పర్వతం ఉండదు కదా! (అంటే, పర్వతాలు, ఏనుగుల వంటి పెద్ద పెద్ద వస్తు విషయాలు కూడా స్వప్నంలో అనుభవానికి వస్తున్నాయి కదా. మరి అంత పెద్ద వస్తువిషయాలు ఈ చిన్న దేహంలో ఇమిడి ఉండటం అన్నది అసాధ్యం కాబట్టి వాటి అనుభవం అసత్యమని చెప్తున్నారు).

తూర్పున నిద్రించినవానికి స్వప్నంలో ఉత్తరదిక్కును చూస్తున్న అనుభవం కలుగుతోంది కాబట్టి, కేవలం లోపల ఇమిడి ఉండటం సాధ్యం కాదనే ఒకే ఒక కారణంగా స్వప్నదృశ్యాలలోని భావనల అసత్యత్వాన్ని (వైతథ్యాన్ని ) చెప్పడం కుదరదు కదా అనే సందేహానికి సమాధానాన్ని ఈ శ్లోకంలో ఇలా వివరిస్తున్నారు.

**అదీర్ఘత్వాచ్చ కాలస్య గత్వా దేశాన్న పశ్యతి |**
**ప్రతిబుద్ధశ్చ వై సర్వస్తస్మిన్దేశే న విద్యతే ||          || మాం.గౌ.కా. 2-2 ||**

స్వప్నంలో కాలప్రమాణం తగినంత లేనందున, (స్వప్నంలోని) చూడడం అన్నది ఆయా ప్రదేశాలకు వెళ్ళిచూడడం కాదు. మేల్కొన్నప్పుడు ప్రతివాడు స్వప్నంలో తానున్న ప్రదేశంలో ఖచ్చితంగా ఉండడు.

## శంకరుల భాష్యము

న దేహాద్బహిర్దేశాంతరం గత్వా స్వప్నాన్పశ్యతి ; యస్మాత్సుప్తమాత్ర ఏవ దేహదేశాద్యోజనశతాంతరితే మాసమాత్రప్రాప్యే దేశే స్వప్నాన్పశ్యన్నివ దృశ్యతే ; న చ తద్దేశప్రాప్తేరాగమనస్య చ దీర్ఘః కాలోఽస్తి ; అతః అదీర్ఘత్వాచ్చ కాలస్య న స్వప్నదృగ్దేశాంతరం గచ్ఛతి . కించ, ప్రతిబుద్ధశ్చ వై సర్వః స్వప్నదృక్ స్వప్నదర్శనదేశే న విద్యతే . యది చ స్వప్నే దేశాంతరం గచ్ఛేత్ , యస్మిందేశే స్వప్నాన్పశ్యేత్ , తత్రైవ ప్రతిబుధ్యేత . న చైతదస్తి . రాత్రౌ సుప్తః అహనీవ భావాన్పశ్యతి ; బహుభిః సంగతో భవతి ; యైశ్చ సంగతః స తైర్గృహ్యేత, న చ గృహ్యతే ; గృహీతశ్చేత్త్వామద్య తత్రోపలబ్ధవంతో వయమితి బ్రూయుః ; న చైతదస్తి . తస్మాన్న దేశాంతరం గచ్ఛతి స్వప్నే ..

ఇతశ్చ స్వప్నదృశ్యా భావా వితథాః,

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

అలా కాదు. కలగనేవాడు దేహానికి బాహ్యంగా ఎక్కడికో వెళ్ళి చూడటం లేదు. ఎందుకంటే, నిద్రించిన వెంటనే, దేహానికి 800 యోజనాల దూరంలో ఉన్న ప్రదేశాన్ని, వెళ్ళడానికే దాదాపు నెలరోజులు సమయం పట్టే ప్రదేశాన్ని, చూసినట్లుగా కలగంటాడు. ఆ ప్రదేశానికి వెళ్ళిరావడానికి తగినంత సమయం స్వప్నంలో ఉండదు. అందుచేత, **అదీర్ఘత్వాత్ చ కాలస్య** అంత దీర్ఘంకాని కాలం వల్ల స్వప్నద్రష్ట మరో ప్రదేశానికి

(నిజంగా) వెళ్ళడు. అంతేకాదు, **ప్రతిబుద్ధః చ వై సర్వః** ప్రతి స్వాప్నికుడు మేల్కొన్నప్పుడు **తస్మిన్ దేశే** స్వప్నంలో దర్శించిన ప్రదేశాన్ని **న విద్యతే** తెలియడు. ఒకవేళ స్వప్నంలో వేరే ప్రదేశానికే వెళ్ళి ఉంటే, ఆ స్వప్న ప్రదేశంలోనే మేల్కొని ఉండాల్సింది. కాని, నిజానికి అలా జరగడం లేదు. రాత్రి సమయంలో నిద్రించి పగటిలో ఉన్నట్లుగా విషయాలను కలగంటున్నాడు. కలలో అనేకమైన వారితో వ్యవహారం చేసినప్పుడు, మేల్కొన్న తర్వాత వారు ఇతడు చేసిన వ్యవహారాన్ని గుర్తించాలి కదా. అలా గుర్తించడం లేదు. ఎందుకంటే, ఎవరితోనైతే స్వప్నంలో వ్యవహారాన్ని జరిపాడో వారు ఇతడు ఫలానా అని నిజంగా గుర్తించినట్లైతే, వారు 'మేము నిన్ను అక్కడ ఆ ప్రదేశంలో గమనించాము' అని చెప్పేవారు. కాని, అలా జరగడం లేదు. కాబట్టి, స్వప్నంలో వేరే ప్రదేశానికి వెళ్ళడం అనేది యదార్థంగా లేదు.

స్వప్నంలో దర్శించినవి నిజంకావు అనడానికి మరొక కారణాన్ని క్రింది శ్లోకంలో చెప్తున్నారు.

**అభావశ్చ రథాదీనాం శ్రూయతే న్యాయపూర్వకమ్ |**
**వైతథ్యం తేన వై ప్రాప్తం స్వప్న ఆహుః ప్రకాశితమ్ || || మాం.గౌ.కా. 2-3 ||**

రథాదులు లేవని ఉపనిషత్తులలో వింటున్నది హేతుపూర్వకమే. వాటికి అసత్యత్వం ప్రాప్తించడం స్వప్న సందర్భంలో సహేతుకమని నిశ్చయంగా చెప్పారు.

**శంకరుల భాష్యము**

యతః అభావశ్చ రథాదీనాం స్వప్నదృశ్యానాం శ్రూయతే, న్యాయపూర్వకం యుక్తితః శ్రుతౌ 'న తత్ర రథాః' (బృ. ఉ. 4 . 3 . 10) ఇత్యత్ర . తేన అంతఃస్థానసంవృతత్వాదిహేతునా ప్రాప్తం వైతథ్యం తదనువాదిన్యా శ్రుత్యా స్వప్నే స్వయంజ్యోతిష్ట్వప్రతిపాదనపరయా ప్రకాశితమాహుః బ్రహ్మవిదః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

'అక్కడ రథాలు లేవు' ['న తత్ర రథాః' (బృ.ఉ. 4-3-10)] అని బృహదారణ్యకంలో ప్రస్తావించిన స్వప్నంలో దర్శించబడే రథాదుల అభావం, సహేతుకమైన యుక్తితో చెప్పినదే. స్వప్నంలో ఆత్మ యొక్క స్వయంప్రకాశకత్వాన్ని ప్రతిపాదించే శ్రుతులు, లోపల ఇమిడిపోవనే కారణం చేత స్వప్నంలో రథాదులకు వైతథ్యం (అసత్యత్వం) ప్రాప్తిస్తోంది అనే విషయాన్ని అనువదిస్తున్నాయని బ్రహ్మవేత్తలు చెప్తున్నారు.

**అంతఃస్థానాత్తు భేదానాం తస్మాజ్జాగరితే స్మృతమ్ |**
**యథా తత్ర తథా స్వప్నే సంవృతత్వేన భిద్యతే || || మాం.గౌ.కా. 2-4 ||**

స్వప్నంలో దర్శించబడే దృశ్యాలు ఎలాగైతే అసత్యమో, అలాగే జాగ్రత్తులో దర్శించబడే దృశ్యాలు కూడా అసత్యమే. భేదమంతా, లోపల ఉండటం, ఇమిడి పోవడం అన్న దానిలో మాత్రమే.

**శంకరుల భాష్యము**

జాగ్రద్దృశ్యానాం భావానాం వైతథ్యమితి ప్రతిజ్ఞా . దృశ్యత్వాదితి హేతుః . స్వప్నదృశ్యభావవదితి దృష్టాంతః . యథా తత్ర స్వప్నే దృశ్యానాం భావానాం వైతథ్యం , తథా జాగరితేఽపి దృశ్యత్వమవిశిష్టమితి హేతూపనయః . తస్మాజ్జాగరితేఽపి వైతథ్యం స్మృతమితి నిగమనం . అంతఃస్థానాత్సంవృతత్వేన చ స్వప్నదృశ్యానాం భావానాం జాగ్రద్దృశ్యేభ్యో భేదః . దృశ్యత్వమసత్యత్వం చావిశిష్టముభయత్ర ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

జాగ్రత్తులో కనిపించే విషయాలు అసత్యమని నిరూపించాలన్నది ప్రతిజ్ఞ (అంటే ప్రతిపాదన). దీనికి దృశ్యత్వం అన్నది కారణం (హేతువు). 'స్వప్నంలో దృశ్య విషయం లాగా' అన్నది దృష్టాంతం (ఉదాహరణ). **తత్ర** అక్కడ **యథా స్వప్నే** స్వప్నంలో ఎలాగైతే దర్శించబడే విషయాలకు అసత్యత్వం కలిగిందో, **తథా** అలాగే జాగ్రత్తులో కూడా దృశ్యత్వం అనేదానిలో తేడాలేకపోవడం ఉపనయం. కాబట్టి, జాగ్రత్తులో దర్శించబడే విషయాలకు కూడా అసత్యత్వం ఆపాదించబడటం నిగమనం (అంటే చేసిన ప్రతిపాదన నిరూపితమైంది అని అర్థం). స్వప్నంలో దర్శించే విషయాలకు మరియు జాగ్రత్తులో దర్శించే విషయాలలో **భేదానామ్** తు అయితే భేదమంతా **అంతఃస్థానాత్** లోపల ఉండుట, **సంవృతత్వేన** ఇమిడిపోయి ఉండుట అనేదే. (స్వప్న దృశ్యంలో విషయాలు దేహంలోపల ఇమిడి ఉంటాయి. జాగ్రత్తులో దృశ్యవిషయాలు దేహానికి బాహ్యంలో ఉంటాయి. ఇది ఒక్కటే తేడా). రెండింటికీ (స్వప్నంలో విషయాలకీ మరియు జాగ్రత్తులోని విషయాలకీ) దృశ్యత్వం మరియు అసత్యత్వంలో తేడా ఏమీ లేదు. {హేతువాదంలో ఐదు భాగాలున్నాయి. ప్రతిజ్ఞా, హేతు, ఉదాహరణ, ఉపనయ, నిగమన అనే ఆ ఐదింటిలో మొదట ప్రతిజ్ఞతో ప్రారంభమవుతుంది వాదం. ప్రతిజ్ఞ అంటే ఒక విషయాన్ని మొదట ప్రతిపాదించటం. 'పర్వతో వహ్నిమాన్.' కొండమీద నిప్పున్నది అని చెప్పటం ప్రతిజ్ఞ (ప్రతిపాదన). (నిప్పు ఉంటే పొగ ఉంటుంది కాబట్టి) పొగ అన్నది ఆ ప్రతిపాదనకు హేతువు. 'వంట గదిలో పొగ వలె' అన్నది ఉదాహరణ. ఉదాహరణలోని హేతువైన పొగ పర్వతంలో కూడా ఉండటం ఉపనయం. కాబట్టి, (కొండమీద నిప్పు ఉన్నది అని) చేసిన ప్రతిపాదన సరైనదే అని తేలడం నిగమనం.}

**స్వప్నజాగరితే స్థానే హ్యేకమాహుర్మనీషిణః |**
**భేదానాం హి సమత్వేన ప్రసిద్ధేనైవ హేతునా || || మాం.గౌ.కా. 2-5 ||**

ప్రముఖమైన భిన్నత్వం కలవైనప్పటికీ వాటిలో (దృశ్యత్వం అనే) హేతువు సమంగా ఉన్న కారణంచేత, స్వప్న-జాగ్రదవస్థలు రెండూ ఒక్కటేనని జ్ఞానులు చెప్తున్నారు.

**శంకరుల భాష్యము**

ప్రసిద్ధేనైవ భేదానాం గ్రాహ్యత్వేన హేతునా సమత్వేన స్వప్నజాగరితస్థానయోరేకత్వమాహుర్వివేకిన ఇతి పూర్వప్రమాణసిద్ధస్యైవ ఫలం ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**భేదానామ్ హి** భిన్నత్వాలు **ప్రసిద్ధేన ఏవ** ప్రధానంగా (ప్రస్ఫుటంగా) కనిపిస్తున్నప్పటికీ, **సమత్వేన హేతునా** హేతువు సమానంగా ఉండటం చేత, **స్వప్న జాగరితే స్థానే** స్వప్న-జాగ్రత్తులు అనే రెండు అవస్థలూ **ఏకమ్** ఒక్కటే అని **మనీషిణః** వివేకవంతులు **ఆహుః** చెప్తారు. ఇదియే గత శ్లోకంలో అనుమాన ప్రమాణంతో తేల్చిచెప్పినదానికి సారాంశం.

**ఆదావన్తే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా |**

**వితథైః సదృశాః సంతోఽవితథా ఇవ లక్షితాః ||** **|| మాం.గౌ.కా. 2-6 ||**

ఆది-అంతములలో ఏది లేదో వర్తమానంలో కూడా అది ఉండదు అన్న కారణంగా అసత్యత్వం కలవే అయినా, అవి అసత్యం కాదు అన్నట్లుగా కనిపిస్తున్నాయి.

**శంకరుల భాష్యము**

ఇతశ్చ వైతథ్యం జాగ్రద్దృశ్యానాం భేదానాం ఆద్యంతయోరభావాత్ , యదాదావంతే చ నాస్తి వస్తు మృగతృష్ణికాది, తన్మధ్యేఽపి నాస్తీతి నిశ్చితం లోకే ; తథేమే జాగ్రద్దృశ్యా భేదాః ఆద్యంతయోరభావాత్ వితథైరేవ మృగతృష్ణికాదిభిః సదృశత్వాద్వితథా ఏవ ; తథాపి అవితథా ఇవ లక్షితా మూఢైరనాత్మవిద్భిః ..

స్వప్నదృశ్యవజ్జాగరితదృశ్యానామప్యసత్త్వమితి యదుక్తం తదయుక్తం ; యస్మాజ్జాగ్రద్దృశ్యా అన్నపానవాహనాదయః క్షుత్పిపాసాదినివృత్తిం కుర్వంతో గమనాగమనాది కార్యం చ సప్రయోజనా దృష్టాః . న తు స్వప్నదృశ్యానాం తదస్తి . తస్మాత్స్వప్నదృశ్యవజ్జాగ్రద్దృశ్యానామసత్త్వం మనోరథమాత్రమితి . తన్న . కస్మాత్ ?

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

జాగ్రత్తులో వేర్వేరుగా కనబడే విషయాలకు అసత్యత్వం అన్నది ఆది-అంతాలలో లేకపోవడమనే మరొక కారణం చేత కూడా కలుగుతోంది. **యత్** ఏది **ఆదౌ అంతే చ** ఆది-అంతాలలో **న అస్తి** ఉండదో **తత్** అది, అంటే ఎండమావి వంటి వస్తు విషయాలు **వర్తమానే అపి** మధ్యకాలంలో కూడా ఉండవు అన్నది లోకంలో నిశ్చితమైన విషయం. **తథా** అదేవిధంగా జాగ్రత్తులోని భిన్నత్వం కలిగిన దృశ్యవిషయాలకు ఆది-అంతములు లేనందుచేత **వితథైః సదృశాః** ఎండమావుల లాగా అవి అసత్యములే. అలా అయినప్పటికీ ఆత్మజ్ఞానం లేని మూఢులు **అవితథా ఇవ** వాటిని అసత్యం కానివే అన్నట్లు **లక్షితాః** భావిస్తారు.

**సందేహం** : స్వప్నదృశ్యంలాగా జాగ్రత్తులోని దృశ్యం కూడా అసత్యమే అని చెప్పినది సమంజసం కాదు. ఎందుకంటే, జాగ్రత్తులో అన్నము, నీరు, వాహనాదుల వల్ల ఆకలి-దప్పికలు తీరడం, రాకపోకలవంటి కార్యాలు చేయడం అనే ప్రయోజనాలు కనబడుతూ ఉన్నాయి కాబట్టి. స్వప్నంలో అయితే ఇలాంటి ప్రయోజనాలు కలుగవు. అందుచేత స్వప్నదృశ్యంలాగా జాగ్రత్తులోని దృశ్యం అసత్యం అనడం కేవలం మనసులో కలిగే భావన మాత్రమే అయి ఉండాలి.

**సమాధానం** : కాదు.

**సందేహం** : ఎందువలన?

**సమాధానం** : ఎందువల్లనంటే,..

**సప్రయోజనతా తేషాం స్వప్నే విప్రతిపద్యతే |**

**తస్మాదాద్యన్తవత్త్వేన మిథ్యైవ ఖలు తే స్మృతాః || || మాం.గౌ.కా. 2-7 ||**

స్వప్నంలో ఆయా ప్రయోజనాలకు వైరుధ్యం కనిపిస్తోంది. అందువల్ల, వాటికి ఆది-అంతాలు ఉండటం చేత అవి అసత్యమే అని మహర్షులు అంటున్నారు.

**శంకరుల భాష్యము**

యస్మాద్యా సప్రయోజనతా దృష్టా అన్నపానాదీనాం , సా స్వప్నే విప్రతిపద్యతే . జాగరితే హి భుక్త్వా పీత్వా చ తృప్తో వినివర్తితతృట్ సుప్తమాత్ర ఏవ క్షుత్పిపాసాద్యార్తమహోరాత్రోపోషితమభుక్తవంతమాత్మానం మన్యతే, యథా స్వప్నే భుక్త్వా పీత్వా చ అతృప్తోత్థితః, తథా . తస్మాజ్జాగ్రద్దృశ్యానాం స్వప్నే విప్రతిపత్తిర్దృష్టా . అతో మన్యామహే తేషామప్యసత్త్వం స్వప్నదృశ్యవదనాశంకనీయమితి . తస్మాదాద్యంతవత్త్వముభయత్ర సమానమితి మిథ్యైవ ఖలు తే స్మృతాః ..

స్వప్నజాగ్రద్భేదయోః సమత్వాజ్జాగ్రద్భేదానామసత్త్వమితి యదుక్తం , తదసత్ . కస్మాత్ ? దృష్టాంతస్యాసిద్ధత్వాత్ . కథం ? న హి జాగ్రద్దృశ్యా యే, తే భేదాః స్వప్నే దృశ్యంతే . కిం తర్హి ? అపూర్వం స్వప్నే పశ్యతి చతుర్దంతం గజమారూఢోఽష్టభుజమాత్మానం . అన్యదప్యేవంప్రకారమపూర్వం పశ్యతి స్వప్నే . తన్నాన్యేనాసతా సమమితి సదేవ . అతో దృష్టాంతోఽసిద్ధః . తస్మాత్స్వప్నవజ్జాగరితస్యాసత్త్వమిత్యయుక్తం . తన్న . స్వప్నే దృష్టమపూర్వం యన్మన్యసే, న తత్స్వతః సిద్ధం . కిం తర్హి ?

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**తేషామ్** ఏ అన్నపానాదుల వల్ల జాగ్రత్తులో **సప్రయోజనతా** ఆ ప్రయోజనాలు కనబడుతున్నాయో, అవి **స్వప్నే** స్వప్నంలో **విప్రతిపద్యతే** విరుద్ధమౌతున్నాయి. జాగ్రత్తులో భోజనం చేసి నీరు తాగి తృప్తిగా వెనువెంటనే క్షణకాలంలో నిద్రించిన వానికి పగలు రాత్రి ఉపవాసాల వల్ల భోజనం చేయనివానిలాగా ఆకలి దప్పికలతో అలమటిస్తున్నట్లు కలలో అనిపిస్తుంది. అలాగే, స్వప్నంలో భుజించి, నీటిని త్రాగినవాడు, మేల్కొనగానే ఆకలి దప్పికలను పొందుతున్నాడు. అందుచేత, జాగ్రత్తులోని దృశ్యాలకు స్వప్నంలోని దృశ్యాలకు విప్రతిపత్తి (వైరుధ్యత) కనబడుతోంది. అందుచేత, స్వప్న దృశ్యాల వలెనే, జాగత్తులోని దృశ్యాల అసత్యత్వం (వైతథ్యం), సందేహానికి అతీతం అని మేము భావిస్తున్నాం. అందుచేతనే, **ఆద్యంతవత్త్వేన** ఆది-అంతములు ఉండటం అనేది వాటి రెండింటికి సమానమే **తస్మాత్** కాబట్టి అవి **మిథ్య ఏవ ఖలు** అసత్యమే కదా అని **తే స్మృతాః** మహర్షులు అనడం సమంజసమే.

**సందేహం** : జాగ్రత్తులోని వివిధ విషయాలకు మరియు స్వప్నంలోని వివిధ విషయాలకు సామాన్యత్వం ఉన్నంతమాత్రం చేత, జాగ్రత్తులోని విషయాలు భ్రమ అని నిర్ధారించడం తప్పు.

**సమాధానం** : ఎందుచేత?

**సందేహం** : ఉదాహరణ సరియైనది కానందువలన.

**సమాధానం** : ఎలా?

**సందేహం** : కేవలం జాగ్రత్తులో దర్శించిన విషయాలు మాత్రమే స్వప్నంలో దర్శించబడటం లేదు కాబట్టి.

**సమాధానం** : అయితే, స్వప్నంలో దర్శించబడేవి ఏమిటి?

**సందేహం** : ఎనిమిది చేతులు కలవాడు నాలుగు దంతాలున్న ఏనుగును ఏక్కినట్లుగా స్వప్నంలో అంతకు ముందు లేని కొత్తవాటిని (అపూర్వతను) చూస్తున్నాం. ఇలాంటివే ఇంకెన్నో అంతకు ముందు జాగ్రత్తులో లేనివాటిని స్వప్నంలో చూస్తున్నాం. అసత్యానికి అన్యమైనది సత్యంతో సమానమే. అందుచేత, ఉదాహరణ సరిపోవడం లేదు. కనుక, స్వప్న జాగ్రత్తుల యొక్క దృశ్యాలు అసత్యం అని చెప్పడం సరికాదు.

**సమాధానం** : కాదు. స్వప్నంలో అంతకు ముందు లేని దాన్ని (అపూర్వాన్ని) చూడటం అనేది దానంతట అదే కలిగేది కాదు.

**సందేహం** : మరైతే ఎలా (కలుగుతోంది)?

**అపూర్వం స్థానిధర్మో హి యథా స్వర్గనివాసినామ్ |**
**తానయం ప్రేక్షతే గత్వా యథైవేహ సుశిక్షితః ||** **|| మాం.గౌ.కా. 2-8 ||**

స్వర్గంలో నివసించే వారిని దర్శించినట్లుగా అపూర్వం అన్నది ఒక స్థితిలో ఉన్న ద్రష్ట యొక్క ధర్మం. ఈ లోకంలో సుశిక్షితుడైన వాడు క్రొత్తప్రదేశంలో ఎలా (ఇబ్బంది లేకుండా) వ్యవహరిస్తాడో అలా, ద్రష్ట ఆ స్థితిలో అపూర్వాన్ని దర్శిస్తాడు.

## శంకరుల భాష్యము

అపూర్వం స్థానిధర్మో హి, స్థానినో ద్రష్టురేవ హి స్వప్నస్థానవతో ధర్మః ; యథా స్వర్గనివాసినామింద్రాదీనాం సహస్రాక్షత్వాది, తథా స్వప్నదృశోఽపూర్వోఽయం ధర్మః, న స్వతఃసిద్ధో ద్రష్టుః స్వరూపవత్ . తాన్ ఏవంప్రకారానపూర్వాన్స్వచిత్తవికల్పాన్ అయం స్థానీ యః స్వప్నదృక్స్వప్నస్థానం గత్వా ప్రేక్షతే . యథైవ ఇహ లోకే సుశిక్షితదేశాంతరమార్గస్తేన మార్గేణ దేశాంతరం గత్వా పదార్థాన్పశ్యతి, తద్వత్ . తస్మాద్యథా స్థానిధర్మాణాం రజ్జుసర్పమృగతృష్ణికాదీనామసత్త్వం , తథా స్వప్నదృశ్యానామప్యపూర్వాణాం స్థానిధర్మత్వమేవేత్యసత్త్వం ; అతో న స్వప్నదృష్టాంతస్యాసిద్ధత్వం ..

అపూర్వత్వాశంకాం నిరాకృత్య స్వప్నదృష్టాంతస్య పునః స్వప్నతుల్యతాం జాగ్రద్భేదానాం ప్రపంచయన్నాహ —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**అపూర్వమ్** అంతకు ముందు లేనిది **హి స్థానిధర్మః** ఆ స్థితిలో ఉన్నవాని యొక్క ధర్మమే. 'స్థానీ' అంటే స్వప్నస్థితిని కలిగిన ఉన్న ద్రష్టయే. 'అపూర్వమ్' అన్నది ఆ ద్రష్టకు సంబంధించిన ధర్మం. **యథా స్వర్గనివాసినామ్** స్వర్గంలో నివసించే ఇంద్రాదులకు వేయికన్నులు మొదలైనవి ఉన్నట్లుగానే, స్వప్నదృష్టకు ఈ అపూర్వం అనేది స్వప్నస్థితికి చేరుకొన్న ద్రష్ట యొక్క స్థానిధర్మం. అది ద్రష్ట యొక్క స్వరూపంలాగా స్వతఃసిద్ధమైనది కాదు. ఈ విధమైన అపూర్వాలు మనసు యొక్క వికల్పాలు. **యథా ఏవ** ఎలాగైతే **ఇహ** ఈ లోకంలో వేరే ప్రదేశాన్ని చేరడానికి తగిన మార్గాన్ని గురించి **సుశిక్షితః** బాగా విచారించి తెలుసుకొన్నవాడు ఆ మార్గంలో ఆ ప్రదేశానికి **గత్వా** వెళ్ళి ఆయా వస్తువులను చూసినట్లుగా, **అయమ్** ఈ స్వప్నద్రష్ట స్వప్నస్థితిని చేరి

**తాస్** అపూర్వాన్ని **ప్రేక్షతే** చూస్తాడు. అందువలన, కొన్ని పరిస్థితుల కారణంగా కనిపిస్తున్నప్పటికీ త్రాడు యందు పాము, ఎండమావి మొదలైనవి అసత్యములైనట్లుగా, స్వప్న దృశ్యాలైన అపూర్వాలు కూడా స్థానిధర్మాలే కావడం చేత అవి అసత్యమే. కనుక, స్వప్నదృష్టాంతం సరియైనదే అని నిరూపితమైంది.

స్వప్న దృష్టాంతంలోని అపూర్వానికి సంబంధించిన సందేహాన్ని నివృత్తి చేసి, తిరిగి స్వప్న జాగ్రత్తులలోని విషయాల సమతుల్యతను మరింతగా వివరించడానికి గౌడపాదులు కారికలో ఇలా చెప్తున్నారు.

**స్వప్నవృత్తావపి త్వన్తశ్చేతసా కల్పితం త్వసత్ |**
**బహిశ్చేతో గృహీతం సద్దృష్టం వైతథ్యమేతయోః ||** **|| మాం.గౌ.కా. 2-9 ||**

**స్వప్నావస్థలో కూడా అంతఃచేతనతో కల్పించబడితే అది అసత్, బాహ్య చేతనతో గ్రహించబడితే అది సత్. అయినా, ఈ రెండింటిలోనూ వైతథ్యమే (అసత్యత్వమే) కనబడుతోంది.**

**శంకరుల భాష్యము**

స్వప్నవృత్తావపి స్వప్నస్థానేఽపి అంతశ్చేతసా మనోరథసంకల్పితమసత్ ; సంకల్పానంతరసమకాలమేవాదర్శనాత్ . తత్రైవ స్వప్నే బహిశ్చేతసా గృహీతం చక్షురాదిద్వారేణోపలబ్ధం ఘటాది సదిత్యేవమసత్యమితి నిశ్చితేఽపి సదసద్విభాగో దృష్టః . ఉభయోరప్యంతర్బహిశ్చేతః కల్పితయోర్వైతథ్యమేవ దృష్టం ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**స్వప్నవృత్తౌ అపి** స్వప్నావస్థలో కూడా **అంతశ్చేతనా తు** మనసుచేత **కల్పితమ్** సంకల్పించబడినదైతే దానికి **అసత్** ఉనికి లేదు, అంటే సంకల్పించిన తరువాత కాలంలో కనిపించకుండా పోతుంది కనుక. ఆ స్వప్నావస్థలోనే **బహిశ్చేతసా** బాహ్యచేతనచే **గృహీతమ్ తు** అనుభవానికి వచ్చే అంటే కన్నులు మొదలైన ఇంద్రియాల ద్వారా అనుభవానికి వచ్చే కుండ మొదలైనవైతే **సత్** ఉనికి కలవే అయినా కూడా అసత్యమేనని నిశ్చయంగా కనబడుతోంది. అంతఃచేతన మరియు బాహ్యచేతనలతో కల్పించబడినవే కాబట్టి, **ఏతయోః** ఈ సత్ మరియు అసత్ అనే రెండు విభాగాలు కూడా **వైతథ్యమ్** అసత్యమైనవిగా **దృష్టమ్** (స్వప్నావస్థలో) చూడబడుతున్నాయి.

**జాగ్రద్వృత్తావపి త్వన్తశ్చేతసా కల్పితం త్వసత్ |**
**బహిశ్చేతోగృహీతం సద్యుక్తం వైతథ్యమేతయోః ||** **|| మాం.గౌ.కా. 2-10 ||**

**జాగ్రదావస్థలో కూడా లోపలి చైతన్యంచేత కల్పించబడే అసత్, బాహ్యచేతనతో అనుభవానికి వచ్చే సత్, ఈ రెండూ కూడా వైతథ్యమేనని చెప్తున్నారు.**

**శంకరుల భాష్యము**

సదసతోర్వైతథ్యం యుక్తం , అంతర్బహిశ్చేతఃకల్పితత్వావిశేషాదితి . వ్యాఖ్యాతమన్యత్ ..

చోదక ఆహ —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

జాగ్రత్తులో కూడా అంతఃచేతన-బాహ్య చేతనలచే కల్పించబడిన వాటిలో తేడా ఏమీ లేనందుచేత, సత్-అసత్ లకు వైతథ్యాన్ని చెప్పడం సమంజసమే. మిగిలిన భాగానికి వ్యాఖ్యానాన్ని ముందు శ్లోకానికి చెప్పినట్లుగానే అన్వయించుకోవాలి.

దానికి సందేహి ఇలా ప్రశ్నిస్తున్నాడు.

**ఉభయోరపి వైతథ్యం భేదానాం స్థానయోర్యది |**
**క ఏతాన్బుధ్యతే భేదాన్కో వై తేషాం వికల్పకః || || మాం.గౌ.కా. 2-11 ||**

రెండు అవస్థలలోని భిన్నవిషయాలు కూడా వైతథ్యమైనవే అయితే, వీటిలోని భేదాన్ని తెలుసుకొనేది ఎవడు? వాటిని కల్పించినవాడు ఎవడు?

**శంకరుల భాష్యము**

స్వప్నజాగ్రత్స్థానయోర్భేదానాం యది వైతథ్యం , క ఏతానంతర్బహిశ్చేతఃకల్పితాన్బుధ్యతే . కో వై తేషాం వికల్పకః ; స్మృతిజ్ఞానయోః క ఆలంబనమిత్యభిప్రాయః ; న చేన్నిరాత్మవాద ఇష్టః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**ఉభయోః స్థానయోః అపి** స్వప్న-జాగ్రత్తులనే రెండు అవస్థలలోని **భేదానామ్** భిన్నభిన్న విషయాలు కూడా **యది వైతథ్యమ్** అసత్యమైనవే అయితే, **ఏతాన్** ఇవన్నీ లోపలి చైతన్యంచేత బాహ్యచైతన్యంచేత **భేదాన్** వేర్వేరుగా కల్పించబడినాయని **కః బుధ్యతే** తెలుసుకొనేవాడు ఏవ్వడు? **వై తేషామ్** అసలు వాటిని **కః వికల్పకః** ఎవడు కల్పిస్తున్నాడు? అంటే ఆత్మ లేదనే వాదనని ఇష్ట పడకపోతే, మరి స్మృతికి జ్ఞానానికి ఆధారం ఎవ్వడు? అని ప్రశ్న. (మీ వాదన చూస్తుంటే అసలు ఆత్మలేదనే మా వాదననే మీరు బలపరుస్తున్నట్లుంది. అలా కాకుంటే, స్మతికి జ్ఞానానికి ఆధారం ఎవరో ఒకరు ఉండి తీరాల్సిందే కదా. కాబట్టి, ఆ ఆధారం ఏమిటో మీరు చూపవలసి ఉంటుంది అని అద్వైతిని శూన్యవాది ఇక్కడ ప్రశ్నిస్తున్నాడు).

దీనికి ఇలా సమాధానం ఇవ్వబడుతోంది.

**కల్పయత్యాత్మనాత్మానమాత్మా దేవః స్వమాయయా |**
**స ఏవ బుధ్యతే భేదానితి వేదాన్తనిశ్చయః || || మాం.గౌ.కా. 2-12 ||**

స్వయం ప్రకాశమానమైన ఆత్మ తనయందు తాను తన మాయచే కల్పిస్తోంది. అదియే విభిన్నతలను తెలుసుకుంటోందని ఉపనిషత్తులు నిశ్చయించాయి.

**శంకరుల భాష్యము**

స్వయం స్వమాయయా స్వమాత్మానమాత్మా దేవః ఆత్మన్యేవ వక్ష్యమాణం భేదాకారం కల్పయతి రజ్జ్వాదావివ సర్పాదీన్ , స్వయమేవ చ తాన్బుధ్యతే భేదాన్ , తద్వదేవేత్యేవం వేదాంతనిశ్చయః . నాన్యోఽస్తి జ్ఞానస్మృత్యాశ్రయః . న చ నిరాస్పదే ఏవ జ్ఞానస్మృతీ వైనాశికానామివేత్యభిప్రాయః ..

సంకల్పయన్కేన ప్రకారేణ కల్పయతీత్యుచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**స్వమాయయా** తన మాయ ద్వారా **దేవః ఆత్మా** స్వయం ప్రకాశమానమైన ఆత్మ **ఆత్మని ఆత్మానమ్** తనయందే తాను, ముందు చెప్పబోయే భిన్నమైన విషయాలను, త్రాడునందు పాము వంటి వాటి లాగా, **కల్పయతి** కల్పించుకొంటోంది. **స ఏవ** స్వయంగా తానే **భేదాన్** భిన్నత్వాలను **బుధ్యతే** తెలుసుకొంటుంది **ఇతి** అని ఈ విధంగా **వేదాంత నిశ్చయః** వేదాంతములైన ఉపనిషత్తులు నిశ్చయించాయి. జ్ఞానానికి, స్మృతికి ఆధారంగా ఆత్మ తప్ప మరొకటి లేదు. శూన్యవాదులు చెప్పినట్లు, జ్ఞాన-స్మృతులు నిరాధారమైనవి కావు. ఇదీ అభిప్రాయం.

అలా సంకల్పించేటప్పుడు ఏ ప్రకారంగా కల్పన చేస్తాడో చెప్తున్నారు.

**వికరోత్యపరాన్భావానంతశ్చిత్తే వ్యవస్థితాన్ |**
**నియతాంశ్చ బహిశ్చిత్త ఏవం కల్పయతే ప్రభుః || || మాం.గౌ.కా. 2-13 ||**

ఈశ్వరుడు చిత్తం లోపల అవ్యక్తంగా ఉన్న లౌకిక విషయాలను అనేకంగా వ్యక్త పరుస్తాడు. ఆ చిత్తానికి బాహ్యంగా స్థూలవిషయాలను కూడా నిర్దేశిస్తాడు. ఆ విధంగా ఈశ్వరుడు కల్పన చేస్తాడు.

**శంకరుల భాష్యము**

వికరోతి నానా కరోతి అపరాన్ లౌకికాన్ భావాన్ పదార్థాఞ్శబ్దాదీనన్యాంశ్చ అంతశ్చిత్తే వాసనారూపేణ వ్యవస్థితానవ్యాకృతాన్ నియతాంశ్చ పృథివ్యాదీననియతాంశ్చ కల్పనాకాలాన్ బహిశ్చిత్తః సన్ , తథా అంతశ్చిత్తో మనోరథాదిలక్షణానిత్యేవం కల్పయతి, ప్రభుః ఈశ్వరః, ఆత్మేత్యర్థః ..

స్వప్నవచ్చిత్తపరికల్పితం సర్వమిత్యేతదాశంక్యతే — యస్మాచ్చిత్తపరికల్పితైర్మనోరథాది లక్షణైశ్చిత్తపరిచ్ఛేద్యైర్వైలక్షణ్యం బాహ్యానామన్యోన్యపరిచ్ఛేద్యత్వమితి, సా న యుక్తాశంకా .

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**అపరాన్** లోకాలకు సంబంధించిన **భావాన్** శబ్దము మొదలైన ఇతర విషయాలను **అంతఃచిత్తే** మనసు లోపల వాసనల రూపంగా **వ్యవస్థితాన్** అవ్యక్తంగా ఉన్నవాటిని, **వికరోతి** అనేక విధాలుగా చేస్తాడు. **బహిః**

**చిత్తః** మనసుకు బాహ్యంగా మరలిన వాడై **నియతాన్ చ** పృథివి మొదలైన స్థూల విషయాలను మరియు స్థూలం కాని విషయాలను కూడా కల్పనాకాలంలో (అనేక విధాలుగా నియంత్రిస్తాడు). అదేవిధంగా, మనసు లోపలి మనోరథాలు మొదలైన లక్షణాలు కలవాటిని కూడా. **ఏవమ్** ఈ ప్రకారంగా **ప్రభుః** ఈశ్వరుడు అంటే ఆత్మ **కల్పయతి** కల్పన చేస్తుంది అని అభిప్రాయం.

సర్వమూ స్వప్నంలో లాగా మనసుచేత (ఆత్మచేత) కల్పించబడినాయి అనే ప్రతిపాదన పట్ల ఈ సందేహం కలిగే అవకాశం ఉంది. అది ఏమంటే, బాహ్యంలోని విషయాలు మనసుచేత వ్యాప్తమై పరిచ్ఛిన్నం కాబడుతూనే, వాటిలో వాటికి కూడా పరిచ్ఛిన్నత్వం కలుగుతోంది కనుక, మనసునందు కల్పితమైన మనోరథాది లక్షణాలకు బాహ్యంలోని పరిచ్ఛినమైన విషయాలు విలక్షణమైనవి. (ఈవిధంగా చిత్తం లోపల కల్పితమైన విషయాలకు, చిత్తానికి బాహ్యంలోని విషయాలకు తేడా ఉన్నందుచేత, అవి వేర్వేరు లక్షణాలున్నవి అని భావించినట్లేతే, సర్వమూ మనసుచేతనే కల్పించబడినాయి అనే ప్రతిపాదన యుక్తియుక్తం కాదు కదా అనే సందేహం కలుగవచ్చు). ఆ సందేహం సరికాదని తర్వాత శ్లోకంలో చెప్తున్నారు.

**చిత్తకాలా హి యేఽన్తస్తు ద్వయకాలాశ్చ యే బహిః |**
**కల్పితా ఏవ తే సర్వే విశేషో నాన్యహేతుకః || || మాం.గౌ.కా. 2-14 ||**

మనసు కల్పించినంతవరకు లోపల ఉండే విషయాలు, బాహ్యంలో రెండుకాలములు కలిగిన విషయాలు అన్నీ కూడా కల్పితములే. ప్రత్యేకించడానికి ఇతర కారణం లేదు.

**<u>శంకరుల భాష్యము</u>**

చిత్తకాలా హి యేఽన్తస్తు చిత్తపరిచ్ఛేద్యాః, నాన్యశ్చిత్తకాలవ్యతిరేకేణ పరిచ్ఛేదకః కాలో యేషాం , తే చిత్తకాలాః ; కల్పనాకాల ఏవోపలభ్యంత ఇత్యర్థః . ద్వయకాలాశ్చ భేదకాలా అన్యోన్యపరిచ్ఛేద్యాః, యథా ఆగోదోహనమాస్తే ; యావదాస్తే తావద్గాం దోగ్ధి ; యావద్గాం దోగ్ధి తావదాస్తే, తావానయమేతావాన్స ఇతి పరస్పరపరిచ్ఛేద్యపరిచ్ఛేదకత్వం బాహ్యానాం భేదానాం , తే ద్వయకాలాః . అంతశ్చిత్తకాలా బాహ్యాశ్చ ద్వయకాలాః కల్పితా ఏవ తే సర్వే . న బాహ్యో ద్వయకాలత్వవిశేషః కల్పితత్వవ్యతిరేకేణాన్యహేతుకః . అత్రాపి హి స్వప్నదృష్టాంతో భవత్యేవ ..

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

**చిత్తకాలా హి యే అన్తః తు** ఆలోచన ఉన్నంత కాలం వరకు మాత్రమే ఉండే విషయాలు. మనసు యొక్క ఆలోచనతో ఆవరించబడి, ఆ ఆలోచనా కాలంలో తప్ప మిగిలిన కాలంలో ఉండని విషయాలను 'చిత్తకాలాః' అంటారు. మనసు సంకల్పిస్తున్నంతసేపు మాత్రమే అవి కనిపిస్తూ ఉంటాయని అభిప్రాయం. బహిః **చ** మరియు బాహ్యంలోని విషయాలు **ద్వయకాలాః** 'ఆవుపాలు పితుకుతున్నాడు' అన్నట్లుగా ఒకదానిపై మరొకటి ఆధారపడినందువల్ల అవి వేర్వేరు కాలాలు కలిగిన విషయాలు. ఎంత కాలం అతడున్నాడో అంతకాలం పాలను పితుకుతున్నాడు. పాలు పితుకుతున్నంత కాలం అతడున్నాడు. ఇది అంతకాలం, అది ఇంతకాలం అనే పరస్పరం ఒకదానిని మరొకటి వాటి కాలాన్ని వాటిలో అవి పరిమితం చేసుకొనే **యే బహిః** బాహ్యంలోని విషయభేదాలు రెండు కాలాలు కలిగినవి ఉన్నయో వాటిని 'ద్వయకాలాః' అంటారు. **కల్పితా ఏవ తే సర్వే** లోపల

ఉన్న ఆలోచనాకాలంలో మాత్రమే ఉండే చిత్తకాలాలు మరియు బాహ్యంలోని ద్వయకాలాలు అన్నీ కూడా కల్పితములే. **విశేషః న** బాహ్యంలోని విషయాల యొక్క ద్వయకాలత్వమనే విశేషం కల్పనకు భిన్నమైనది అని చెప్పడానికి **న అన్యహేతుకః** వేరొక కారణం ఏదీ లేదు. ఇక్కడ కూడా స్వప్నదృష్టాంతం సరియైనదిగానే తేలింది.

**అవ్యక్తా ఏవ యేఽన్తస్తు స్ఫుటా ఏవ చ యే బహిః |**
**కల్పితా ఏవ తే సర్వే విశేషస్త్విన్ద్రియాన్తరే || || మాం.గౌ.కా. 2-15 ||**

ఏవైతే లోపల అవ్యక్తంగా ఉన్నాయో, బాహ్యంలో ఏవి స్థూలంగా ఉన్నవో అవి అన్నీ కూడా కల్పితములే. ఇంద్రియ భిన్నత్వమే (ఆ రెండింటిలోని) తేడా.

**శంకరుల భాష్యము**

యదపి అంతరవ్యక్తత్వం భావానాం మనోవాసనామాత్రాభివ్యక్తానాం స్ఫుటత్వం వా బహిశ్చక్షురాదీంద్రియాంతరే విశేషః, నాసౌ భేదానామస్తిత్వకృతః, స్వప్నేఽపి తథా దర్శనాత్ . కిం తర్హి ? ఇంద్రియాంతరకృత ఏవ . అతః కల్పితా ఏవ జాగ్రద్భావా అపి స్వప్నభావవదితి సిద్ధం ..

బాహ్యాధ్యాత్మికానాం భావానామితరేతరనిమిత్తనైమిత్తికతయా కల్పనాయాః కిం మూలమిత్యుచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**యే అంతః తు** ఏ లోపలి విషయాలైతే **అవ్యక్తా ఏవ** అవ్యక్తంగా మనోవాసనలుగా మాత్రమే సూక్ష్మంగా ఉండటం అనేది, **యే బహిః** ఏవి బాహ్యంలో **స్ఫుటా ఏవ** స్థూలవిషయాలుగా, కన్నులు మొదలైన ఇంద్రియాలకు విషయాలుగా ప్రత్యేకంగా గ్రహించబడటం అనేది ఉన్నదో, ఆ తారతమ్యం ఆయా విషయాల అస్తిత్వం వల్ల (ఆయా విషయాలు నిజానికి ఆ విధంగా ఉన్నవైనందువల్ల) కలిగినది కాదు. ఎందుకంటే, స్వప్నంలో కూడా అలాగే కనిపిస్తున్నాయి కాబట్టి. మరి దేనివల్ల (ఈ తారతమ్యం కలుగుతోంది)? **ఇంద్రియాంతరే విశేషః తు** జ్ఞానేంద్రియాలలో తారతమ్యత వల్లనే. {మనసు అంతరింద్రియము. కన్ను మొదలైనవి బాహ్యేంద్రియములు. ఈ తేడా వలన అస్ఫుట-స్ఫుటములనే తేడా వచ్చినది. కల్పితములే అయినప్పటికీ, మనోవాసనామాత్రకల్పితములు అస్ఫుటంగా ఉండుట, కన్నులు మొదలైన ఇంద్రియములు సాహాయంతో కానవచ్చేవి స్ఫుటంగా ఉండుట సహజం. అంతే. – స్వామి తత్త్వవిదానంద సరస్వతి}. కనుక, **తే సర్వే** ఇవన్నీ, జాగ్రత్తులోని విషయాలు కూడా స్వప్న విషయాల లాగానే **కల్పితా ఏవ** కల్పించబడినవే అని నిరూపితమైంది.

బాహ్య-అంతర విషయాలలో పరస్పరం ఒకదానికి మరొకటి కారణ కార్యాలుగా కల్పించడానికి ఏది మూలకారణమో చెప్తున్నారు.

**జీవం కల్పయతే పూర్వం తతో భావాన్పృథగ్విధాస్ |**
**బాహ్యానాధ్యాత్మికాంశ్చైవ యథావిద్యస్తథాస్మృతిః || || మాం.గౌ.కా. 2-16||**

ముందు జీవుడిని, తర్వాత బాహ్యం-అంతరం అనే విభాగం కల వేర్వేరు విషయాలను కల్పించాడు. (జీవుని) ఆలోచనా సంస్కారాలకు అనుగుణంగా స్మృతిని కల్పించాడు.

## శంకరుల భాష్యము

జీవం హేతుఫలాత్మకం 'అహం కరోమి, మమ సుఖదుఃఖే' ఇత్యేవంలక్షణం . అనేవంలక్షణ ఏవ శుద్ధ ఆత్మని రజ్జ్వామివ సర్పం కల్పయతే పూర్వం . తతస్తాదర్థ్యేన క్రియాకారకఫలభేదేన ప్రాణాదీన్నానావిధాన్భావాన్బాహ్యానాధ్యాత్మికాంశ్చైవ కల్పయతే . తత్ర కల్పనాయాం కో హేతురిత్యుచ్యతే — యోఽసౌ స్వయం కల్పితో జీవః సర్వకల్పనాయామధికృతః, సః యథావిద్యః యాదృశీ విద్యా విజ్ఞానమస్యేతి యథావిద్యః, తథావిధైవ స్మృతిస్తస్యేతి తథాస్మృతిర్భవతి స ఇతి . అతో హేతుకల్పనావిజ్ఞానాత్ఫలవిజ్ఞానం , తతో హేతుఫలస్మృతిః, తతస్తద్విజ్ఞానం , తతః తదర్థక్రియాకారకతత్ఫలభేదవిజ్ఞానాని, తేభ్యస్తత్స్మృతిః, తత్స్మృతేశ్చ పునస్తద్విజ్ఞానాని ఇత్యేవం బాహ్యానాధ్యాత్మికాంశ్చ ఇతరేతరనిమిత్తనైమిత్తికభావేనానేకధా కల్పయతే ..

తత్ర జీవకల్పనా సర్వకల్పనామూలమిత్యుక్తం ; సైవ జీవకల్పనా కింనిమిత్తేతి దృష్టాంతేన ప్రతిపాదయతి —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**జీవమ్** అనగా కారణ-కార్యరూపమే. 'నేను చేస్తున్నాను. సుఖదుఃఖములు నావి' అనేది జీవలక్షణం. ఆ జీవలక్షణాన్ని శుద్ధమైన ఆత్మయందు, త్రాడునందు పాములాగా, **కల్పయతే పూర్వమ్** మొదట కల్పించారు. **తతః** ఆ తరువాత, అతని కొరకు (తనను తాను జీవునిగా కల్పించుకొన్నందున జీవుని కొరకు అన్నా తన కొరకు అన్నా తేడాలేదు కాబట్టి జీవుని కొరకు) క్రియలు, సాధనాలు, ఫలాలు అనే **పృథక్విధాస్ భావాస్** వైవిధ్యం కల ప్రాణం మొదలైన నానావిధాలైన విషయాలను **బాహ్యాస్ ఆధ్యాత్మికాస్ చ ఏవ** బాహ్యంలోనూ మరియు అంతరంలోనూ కల్పించాడు. ఆ కల్పించడానికి కల కారణాన్ని చెప్తున్నారు. స్వయంగా తనచే కల్పించబడిన జీవుడు, సకల కల్పనలకూ సమర్థుడు. (పరమాత్మ తనను తాను జీవునిగా కల్పించుకొని ఉండటం చేత, పరమాత్మ యొక్క సకల విషయాల కల్పనా సామర్థ్యం జీవునిలో కూడా ఉండటం సహజమే). అయితే అతడు (ఆ జీవుడు) **యథావిద్యః** తన ఆలోచనలకు, సంస్కారాలకు అనుగుణంగా **తథాస్మృతి** అటువంటి జ్ఞప్తినే పొందుతాడు అని. కారణాన్ని కల్పించిన విజ్ఞానం నుండి ఫలం యొక్క విజ్ఞానం, దాని నుండి కారణ-ఫలితాల స్మృతి కలుగుతుంది. ఆ కారణ-ఫలితాల స్మృతినుండి కారకం-కార్యం యొక్క విజ్ఞానం, తర్వాత వాటి యొక్క క్రియ, కారకం, ఫలాలోని తారతమ్యతల గురించిన విజ్ఞానం, ఆ విజ్ఞానం నుండి ఆయా వాటి గురించిన స్మృతి, ఆ స్మృతి నుండి తిరిగి వాటి గురించిన విజ్ఞానం, ఈ విధంగా బయట-లోపల కూడా వేర్వేరు కారణ-కార్య విషయాలు అనేకంగా కల్పితమౌతున్నాయి.

{1. ఆకలి-దాహం కలిగినప్పుడు ఆహారాన్ని తినడం చేత, నీటిని తాగడం చేత తృప్తి కలుగుతుంది. తినడం, తాగడం అనేది లేకపోయినట్లైతే, తృప్తి కలగడం ఉండదు. కాబట్టి, ఆహారపానీయాల స్వీకారాదులు తృప్తికి కారణాలు.

2. ఆహార పానీయాదులు తృప్తి అనే స్థితికి కారణమౌతున్నాయి అని ఒకసారి తెలిసిన తర్వాత ఆ ఎఱుక స్మృతిగా మారుతుంది. మరొక సందర్భంలో అదే తృప్తి కలుగ వలసిన పరిస్థితి ఏర్పడినప్పుడు ఆ తృప్తి కలిగేందుకు అవసరమైన ఆహార పానీయాలను సమకూర్చుకోవడం కొరకు వండటం అనే క్రియ, దానికి అవసరమైన

బియ్యం వంటి వాటిని సమకూర్చుకోవడం అనే కారకం, తద్వారా అన్నాన్ని పొందటం అనే ఫలం అనేవి ఉత్పన్నమౌతాయి. – స్వామి గంభీరానంద}

సకల కల్పనలకూ మూలం జీవుని కల్పించడమే అని ప్రస్తుత శ్లోకంలో చెప్పిన తర్వాత, ఆ జీవుడిని కల్పన చేయడానికి గల కారణాన్ని ఉదాహరణ పూర్వకంగా తర్వాత శ్లోకంలో చెప్తున్నారు.

**అనిశ్చితా యథా రజ్జురన్ధకారే వికల్పితా |**
**సర్పధారాదిభిర్భావైస్తద్వదాత్మా వికల్పితః || || మాం.గౌ.కా. 2-17 ||**

ఎలాగైతే చీకటిలో త్రాడు అన్నదాన్ని సరిగా గుర్తించక, పాముగా లేదా నీటి చారగా భావిస్తామో అలాగే ఆత్మయందు వికల్పం కలుగుతోంది.

**శంకరుల భాష్యము**

యథా లోకే స్వేన రూపేణ అనిశ్చితా అనవధారితా ఏవమేవేతి రజ్జుః మందాంధకారే కిం సర్ప ఉదకధారా దండ ఇతి వా అనేకధా వికల్పితా భవతి పూర్వం స్వరూపానిశ్చయనిమిత్తం . యది హి పూర్వమేవ రజ్జుః స్వరూపేణ నిశ్చితా స్యాత్ , న సర్పాదివికల్పోఽభవిష్యత్ , యథా స్వహస్తాంగుల్యాదిషు ; ఏష దృష్టాంతః . తద్వద్ధేతుఫలాదిసంసారధర్మానర్థవిలక్షణతయా స్వేన విశుద్ధవిజ్ఞప్తిమాత్ర సత్తాద్వయరూపేణానిశ్చితత్వాజ్జీవ ప్రాణాద్యనంతభావభేదైరాత్మా వికల్పిత ఇత్యేష సర్వోపనిషదాం సిద్ధాంతః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**యథా** ఎలాగైతే లోకంలో **అంధకారే** మసక చీకటిలో **రజ్జుః** త్రాడు అని **అనిశ్చితా** ఇదమిత్థంగా అసలు స్వరూపం నిశ్చయం కాకముందు **సర్ప ధారాభిః భావై** అది పామా? లేక నీటి చారా? లేక కర్రా? అని అనేక విధాలుగా **వికల్పితా** ఆలోచనలు, స్వరూపాన్ని నిశ్చయించే కారణంగా కలుతున్నాయో. తన చేతికి ఉన్న ఉంగరం స్పష్టంగా కనిపించినట్లుగా, ఒకవేళ పూర్వమే అది త్రాడు అనే నిశ్చయం కలిగితే, పాము అనే సందేహం కలుగనే కలుగదు. ఇదీ ఉదాహరణ. **తద్వత్** అదేవిధంగా, అంటే హేతువు-ఫలం వంటి అనర్థాన్ని కలిగించే సంసార ధర్మాలకన్నా విలక్షణమై, తన స్వస్వరూపాన్ని, అత్యంత శుద్ధమైన, కేవల ఎఱుక మాత్రమే అయిన ఉనికి కల, అద్వయ రూపంగా నిశ్చయించగా గ్రహించక, జీవుడు-ప్రాణము వంటి అనంతమైన భేధాలను **ఆత్మా** ఆత్మయందు కల్పించుకొంటున్నాడు. ఇదియే సకల ఉపనిషత్తులు సిద్ధాంతీకరించిన విషయం.

**నిశ్చితాయాం యథా రజ్జ్వాం వికల్పో వినివర్తతే |**
**రజ్జురేవేతి చాద్వైతం తద్వదాత్మవినిశ్చయః || || మాం.గౌ.కా. 2-18 ||**

ఏవిధంగా త్రాడును చూసి అది త్రాడే, మరొకటి కాదు అనే నిశ్చయం కలగగానే కల్పించబడిన భావనలు వెనుతిరుగతాయో, అదేవిధంగా ఆత్మ గురించి నిశ్చయం కలుగుతుంది.

**శంకరుల భాష్యము**

రజ్జురేవేతి నిశ్చయే సర్పాదివికల్పనివృత్తౌ రజ్జురేవేతి చాద్వైతం యథా, తథా నేతి నేతీతి సర్వసంసారధర్మశూన్యప్రతిపాదకశాస్త్రజనిత విజ్ఞానసూర్యాలోకకృతాత్మవినిశ్చయః 'ఆత్మైవేదం సర్వమపూర్వో ఽనపరోఽనంతరోఽబాహ్యః సబాహ్యాభ్యంతరో హ్యజోఽజరోఽమృతోఽభయ ఏక ఏవాద్వయః' ఇతి ..

యది ఆత్మైక ఏవేతి నిశ్చయః, కథం ప్రాణాదిభిరనంతైర్భావైరేతైః సంసారలక్షణైర్వికల్పిత ఇతి ? ఉచ్యతే శృణు —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**యథా** ఎలాగైతే **రజ్జ్వామ్ నిశ్చితాయామ్** త్రాడును చూసి ఇది త్రాడే అనే నిశ్చయంతో పాము వంటి **వికల్పాః వినివర్తతే** కల్పనలు నివారణమై **రజ్జుః ఏవ ఇతి** ఇది త్రాడు మాత్రమే **అద్వయమ్ చ** మరొకటి ఏదీ కాదు అనే అద్వయత్వం ప్రకటనమైనట్లుగా, 'ఇది కాదు ఇదికాదు' ['నేతి నేతి' (బృ.ఉ. 4-4-22)] అనే సకల సంసారధర్మములేవీ లేవనే శాస్త్ర ప్రతిపాదనల నుండి పుట్టిన విజ్ఞానమనే సూర్యతేజస్సులో ఆత్మ యొక్క ఉనికి నిశ్చయంగా తెలియబడుతుంది. దీనినే 'ఈ సకలమూ ఆత్మయే' ['ఆత్మైవేదం సర్వమ్' (ఛాం.ఉ. 7-25-2)]; 'పూర్వాపరాలు, బాహ్యాంతరాలు లేనిది' ['అపూర్వోఽనపరోఽనంతరోఽబాహ్యమ్' (బృ.ఉ. 2-5-19)]; 'బాహ్యాంతరాలలో అంతటా తానై ఉన్నందున, పుట్టుకలేనిది' ['సబాహ్యాభ్యంతరో హ్యజః' (ముం.ఉ. 2-1-2)]; 'క్షీణత-మరణం-భయం లేనిది ' ['అజరోఽమృతోఽభయ' (బృ.ఉ. 4-4-25)]; 'అది ఒక్కటే, రెండవది లేదు' ['ఏక ఏవాద్వితీయమ్' (ఛాం.ఉ. 6-2-1)] అని ఉపనిషత్తు వాక్యాలు ప్రకటిస్తున్నాయి.

ఆత్మ ఒక్కటే అని నిశ్చయించేటట్లైతే, సంసార లక్షణం కలిగిన ఈ ప్రాణాదులనే అంతులేని భావనలు ఎలా కల్పించబడినాయి? దీనికి సమాధానం ఇస్తున్నారు వినండి.

**ప్రాణాదిభిరనన్తైశ్చ భావైరేతైర్వికల్పితః |**
**మాయైషా తస్య దేవస్య యయా సంమోహితః స్వయమ్ || || మాం.గౌ.కా. 2-19 ||**

**ఈ ఆత్మయే ప్రాణాదులనే అనంత భావనలుగా కల్పితమైనది. ఇదియే ఆ దివ్యత్వం (ఆత్మ ప్రకాశత్వం) యొక్క మాయ. దానిచే (ఆ మాయచే) అదియే (ఆ ఆత్మయే) స్వయంగా భ్రమను పొందింది.**

**శంకరుల భాష్యము**

మాయైషా తస్యాత్మనో దేవస్య . యథా మాయావినా విహితా మాయా గగనమతివిమలం కుసుమితైః సపలాశైస్తరుభిరాకీర్ణమివ కరోతి, తథా ఇయమపి దేవస్య మాయా, యయా అయం స్వయమపి మోహిత ఇవ మోహితో భవతి . 'మమ మాయా దురత్యయా' (భ. గీ. 7 . 14) ఇత్యుక్తం ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**ఏతైః** ఈ **ప్రాణాదిభిః అనంతైః భావైః చ** ప్రాణాది అనంత భావనలు కూడా **తస్య దేవస్య** ఆ ఆత్మ ప్రకాశం యొక్క **ఏషా మాయా** ఈ మాయచేత **వికల్పితః** కల్పించబడినవే. ఎలాగైతే ఇంద్రజాలికుడు మాయచేత

నిర్మలమైన ఆకాశాన్ని వికసించిన పూలు, ఆకులు గల చెట్లతో నిండినట్లుగా భ్రమింపచేస్తాడో, అలాగే ఆత్మయొక్క ప్రకాశంచేత కలిగిన **యయా** ఏ మాయకలదో దాని చేతనే, ఈ భ్రమను **స్వయమ్** ఆత్మయే స్వయంగా తాను కూడా పొందినట్లుగా, **సంమోహితః** మోహానికి గురి అవుతుంది. అందుకే, 'నా మాయను అధిగమించడం కష్టం' ['మమ మాయా దురత్యయా' (భ.గీ. 7-14)] అని భగవానుడు అన్నారు.

**ప్రాణ ఇతి ప్రాణవిదో భూతానీతి చ తద్విదః |**
**గుణా ఇతి గుణవిదస్తత్త్వానీతి చ తద్విదః ||** **|| మాం.గౌ.కా. 2-20 ||**

ప్రాణాన్ని గురించి తెలిసిన వారు (వైశేషికులు) ఈ ఆత్మనే ప్రాణమని, పృథివి మొదలైన భూతములే ఆ ఆత్మయని వాటిని గురించి తెలిసినవారు (లోకాయతులు), గుణాల గురించి తెలిసిన వారు (సాంఖ్యులు) ఆ ఆత్మనే సత్వ-రజ-తమో గుణములని, తత్వాన్ని తెలిసినవారు (ఆత్మ-అవిద్య-శివం అనేది జగత్తు ఉపాదాన కారణమని చెప్పే శైవులు) ఆ ఆత్మనే తత్త్వమని (భావిస్తారు).

**పాదా ఇతి పాదవిదో విషయా ఇతి తద్విదః |**
**లోకా ఇతి లోకవిదో దేవా ఇతి చ తద్విదః ||** **|| మాం.గౌ.కా. 2-21 ||**

(విశ్వ-తైజస-ప్రాజ్ఞులనే పాదాలుగా) పాదముల గురించి తెలిసిన వారు ఆ పాదములే ఆత్మయని, ఇంద్రియవిషయాలను గురించి తెలిసిన వారు (వాత్సాయనాదులు) ఆ ఇంద్రియవిషయాలే ఆత్మయని, లోకముల గురించిన విజ్ఞానం కలిగిన వారు (పౌరాణికులు) ఆ లోకములే ఆత్మయని, దేవతలను ఆరాధించేవారు (మీమాంసకులు) ఆ దేవతలే ఆత్మయని (భావిస్తారు).

**వేదా ఇతి వేదవిదో యజ్ఞా ఇతి చ తద్విదః |**
**భోక్తేతి చ భోక్తృవిదో భోజ్యమితి చ తద్విదః ||** **|| మాం.గౌ.కా. 2-22 ||**

వేదవేత్తలు ఆ ఆత్మనే వేదమని, యజ్ఞవేత్తలు (బౌద్ధాయనుడు వంటివారు) ఆ ఆత్మనే యజ్ఞమని, భోగాలను తెలుసుకొన్నవారు (సాంఖ్యులు) ఆ ఆత్మయే భోగమని, భుజించే వాటిని గురించి తెలిసినవారు ఆ భుజించబడేదే ఆత్మ అని (భావిస్తారు).

**సూక్ష్మ ఇతి సూక్ష్మవిదః స్థూల ఇతి చ తద్విదః |**

**మూర్త ఇతి మూర్తవిదోఽమూర్త ఇతి చ తద్విదః ||** **|| మాం.గౌ.కా. 2-23 ||**

సూక్ష్మతనెరిగిన వారు సూక్ష్మతయే ఆత్మ అని, స్థూలత్వాన్ని శోధించినవారు ఆ స్థూలత్వమే ఆత్మ అని, విగ్రహారాధకులు విగ్రహమే ఆత్మ అని, రూపరహితాన్ని తెలుసుకొన్న వారు ఆత్మను రూపరహితమైనదిగా (భావిస్తారు).

**కాల ఇతి కాలవిదో దిశ ఇతి చ తద్విదః |**
**వాదా ఇతి వాదవిదో భువనానీతి తద్విదః ||** **|| మాం.గౌ.కా. 2-24 ||**

కాలజ్ఞులు కాలమే ఆత్మ అని, దిక్కులను ఆరాధించేవారు దిక్కులే ఆత్మ అని, వాదరతులు వాదమే ఆత్మ అని, భువనాలను గురించి తెలిసినవారు ఆ భువనాలే ఆత్మ అని (భావిస్తారు).

**మన ఇతి మనోవిదో బుద్ధిరితి చ తద్విదః |**
**చిత్తమితి చిత్తవిదో ధర్మాధర్మౌ చ తద్విదః ||** **|| మాం.గౌ.కా. 2-25 ||**

మనోవేత్తలు (కొందరు వస్తువాదులు) మనసునే ఆత్మ అని, బుద్ధి గురించి శోధించిన వారు (కొందరు బౌద్ధులు) బుద్ధియే ఆత్మ అని, చిత్తాన్ని ఎఱిగిన వారు (బాహ్య విషయాలతో సంబంధంలేని ఆలోచనలనునమ్మే కొందరు బౌద్ధులు) చిత్తమే ఆత్మ అని, ధర్మ-అధర్మాలను గురించి తెలిసినవారు (మీమాంసకులు) అవే ఆత్మ అని (భావిస్తారు).

**పఞ్చవింశక ఇత్యేకే షడ్వింశ ఇతి చాపరే |**
**ఏకత్రింశక ఇత్యాహురనన్త ఇతి చాపరే ||** **|| మాం.గౌ.కా. 2-26 ||**

కొందరు అది (ఆ ఆత్మ) ఇరువది అయిదు అంశాలు కలదనీ, మరి కొందరు ఇరువది ఆరు అంశాలు కలదనీ, ఇంకొందరు ముప్పది ఒక్క గుణాలున్నదనీ, ఇతరులు అనంతమైన అంశాలున్నదనీ అంటారు.

[1. సాంఖ్యులు పురుషుడి, ప్రధానం లేదా ప్రకృతి, మహత్తు, అహంకారం, అయిదు సూక్ష్మ భూతాలు, అయిదు జ్ఞానేంద్రియాలు, అయిదు కర్మేంద్రియాలు, అయిదు జ్ఞానేంద్రియ విషయాలు మరియు మనసుతో కలిపి 25 అంశాలు కలది ఆత్మ అని అన్నారు.

2. పతంజలి మహర్షి పై 25 తత్త్వాలకు ఈశ్వరుడిని జోడించి మొత్తం 26 అంశాలు గలది ఆత్మ అన్నారు.

3. పాశుపతులు రాగం, అవిద్య, నియతి, కాలకలా మరియు మాయా అని పై 26 అంశాలకు జతచేసి మొత్తం 31 అంశాలు గలది ఆత్మ అని చెప్పారు. – స్వామి గంభీరానంద]

**లోకాంల్లోకవిదః ప్రాహురాశ్రమా ఇతి తద్విదః |**
**స్త్రీపుంనపుంసకం లైఙ్గాః పరాపరమథాపరే || || మాం.గౌ.కా. 2-27 ||**

లౌకిక విషయాలలో నేర్పరులు (లౌకికులు) లౌకిక భోగాలే ఆత్మయని అంటారు. ఆశ్రమ ధర్మాలు తెలిసిన వారు (దక్షుడు వంటివారు) ఆశ్రమాలే ఆత్మతత్త్వమని, (వైయాకరణులు) స్త్రీ, పురుష, నపుంసక లింగములే ఆత్మతత్త్వమని, మిగిలిన వారు ఆత్మతత్త్వం పరం-అపరం (కారణం-కార్యం) అనే రెండు విధాలని (భావిస్తారు).

**సృష్టిరితి సృష్టివిదో లయ ఇతి చ తద్విదః |**
**స్థితిరితి స్థితివిదః సర్వే చేహ తు సర్వదా || || మాం.గౌ.కా. 2-28 ||**

సృష్టివిధానాన్ని తెలిసినవారు సృష్టియే ఆత్మయని, లయాన్ని తెలిసినవారు లయమే ఆత్మయని, స్థితిని తెలిసినవారు స్థితియే ఆత్మయని, ఇలా సకల కాలాలలోనూ అనేకవిధములైన వాదములు ఆత్మను గురించి భావన చేస్తున్నాయి.

**శంకరుల భాష్యము**

ప్రాణః ప్రాజ్ఞో బీజాత్మా, తత్కార్యభేదా హీతరే స్థిత్యంతాః . అన్యే చ సర్వే లౌకికాః సర్వప్రాణిపరికల్పితా భేదా రజ్జ్వామివ సర్పాదయః . తచ్ఛూన్యే ఆత్మన్యాత్మస్వరూపానిశ్చయహేతోరవిద్యయా కల్పితా ఇతి పిండితోఽర్థః . ప్రాణాదిశ్లోకానాం ప్రత్యేకం పదార్థవ్యాఖ్యానే ఫల్గుప్రయోజనత్వాత్సిద్ధపదార్థత్వాచ్చ యత్నో న కృతః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ప్రాణం అంటే బీజ రూపంలో గల ఆత్మ అయినటువంటి ప్రాజ్ఞుడు. స్థితిని చివరగా చెప్పిన ఇతరాలన్నీ ఆ బీజరూపమైన ఆత్మ యొక్క వివిధ కార్యములే. లోకంలో ప్రాచుర్యంలో ఉన్న మిగిలిన వన్నీ కూడా, త్రాడునందు పామువలే, సకల ప్రాణులచే కల్పించబడిన భేదములే. అజ్ఞానం మూలంగా ఆత్మయొక్క స్వరూపము గురించిన నిశ్చయము లేని కారణంగా, ఇవేవీ నిజానికి లేకపోయినప్పటికీ, కల్పించబడుతున్నాయి. మొత్తం మీద ఇదియే అభిప్రాయం. పై ప్రాణాది శ్లోకాలలో (20వ శ్లోకం నుండి 28 వరకు గల శ్లోకాలలో) ప్రస్తావించిన ఒక్కొక్క విషయానికి ప్రత్యేకంగా వ్యాఖ్యానించడంవల్ల సిద్ధించే ప్రయోజనం అల్పమే కనుక మరియు అవి బాగా పరిచయంలో ఉన్న విషయాలే కాబట్టి, వ్యాఖ్యానించే ప్రయత్నం చేయడంలేదు.

**యం భావం దర్శయేద్యస్య తం భావం స తు పశ్యతి |**

**తం చావతి స భూత్వాసౌ తద్గ్రహః సముపైతి తమ్ ||　　　　　|| మాం.గౌ.కా. 2-29 ||**

ఎవనికి (వారి వారి ఆచార్యులు) ఆత్మతత్వాన్ని ఏ విషయంగా దర్శింపచేశారో, ఆ విషయాన్నే (ఆ ఆత్మతత్వంగా) అతడు చూస్తాడు. ఆ విషయం వానితో కలిసిపోయి రక్షిస్తుంది కూడా. ఆ కలయికే వానిని తనలో (ఆ విషయంలో) ఐక్యం చేసుకొంటుంది.

**<u>శంకరుల భాష్యము</u>**

కిం బహునా ? ప్రాణాదీనామన్యతమముక్తమనుక్తం వా అన్యం యం భావం పదార్థం దర్శయేత్ యస్యాచార్యోఽన్యో వా ఆప్తః ఇదమేవ తత్త్వమితి, స తం భావమాత్మభూతం పశ్యత్యయమహమితి వా మమేతి వా, తం చ ద్రష్టారం స భావోఽవతి, యో దర్శితో భావః, అసౌ స భూత్వా రక్షతి ; స్వేనాత్మనా సర్వతో నిరుణద్ధి . తస్మిన్గ్రహస్తద్గ్రహస్తదభినివేశః ఇదమేవ తత్త్వమితి స తం గ్రహీతారముపైతి, తస్యాత్మభావం నిగచ్ఛతీత్యర్థః ..

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

ఇన్ని ఎందుకు? **యమ్** ఎవనికి **యస్య భావమ్** ఏ వస్తువిషయాన్ని ఆత్మగా **దర్శయేత్** ఏ గురువు గాని మరియే ఇతర ఆప్తులుగాని, చెప్పబడిన ప్రాణాదులు మరియు ఇతర విషయాలను లేదా చెప్పబడని ఇతర విషయాలను చూపిస్తూ 'ఇది మాత్రమే తత్త్వం' అని దర్శింపచేశారో, **సః** అతడు **తమ్ భావమ్ తు** ఆ వస్తువిషయాన్నే తన ఆత్మస్వరూపంగా, 'ఇదియే నేను' అని లేదా 'ఇది నాది' అని గాని **పశ్యతి** చూస్తాడు. **తమ్ చ సః** ఏ దర్శించబడిన వస్తువిషయం ఉన్నదో అదియే **అసౌ భూత్వా** అతనితో ఐక్యమై **అవతి** రక్షిస్తుంది. అంటే తన స్వరూపంతో అన్ని విధాలుగా అతడిని బంధిస్తుంది అని అర్థం. **తత్ గ్రహః** అటువంటి స్థితిలో ఉన్నవాడై, అంటే 'ఇదియే తత్త్వం' అనే అభిప్రాయానికి కట్టుబడిన **తమ్** ఆ పట్టుబడిన వానిని **సముపైతి** చేరుతుంది అంటే అతనితో కలిసి ఉంటుంది అని అభిప్రాయం.

**ఏతైరేషోఽపృథగ్భావైః పృథగేవేతి లక్షితః |**

**ఏవం యో వేద తత్త్వేన కల్పయేత్సోఽవిశఙ్కితః ||　　　　　|| మాం.గౌ.కా. 2-30 ||**

ఆత్మకు భిన్నం కాని ఈ విషయాల ద్వారానే (అజ్ఞానులు) ఆత్మను భిన్నమైనదిగా చూస్తారు. ఎవరైతే ఈ విధంగా (విషయాలు ఆత్మకు భిన్నం కావని) తత్వాన్ని గ్రహిస్తారో వారు సందేహం లేనివారు.

**<u>శంకరుల భాష్యము</u>**

ఏతైః ప్రాణాదిభిః ఆత్మనోఽపృథగ్భూతైరపృథగ్భావైః ఏషః ఆత్మా రజ్జురివ సర్పాదివికల్పనారూపైః పృథగేవేతి లక్షితః అభిలక్షితః నిశ్చితః మూఢైరిత్యర్థః . వివేకినాం తు రజ్జ్వామివ కల్పితాః సర్పాదయో నాత్మవ్యతిరేకేణ ప్రాణాదయః సంతీత్యభిప్రాయః ; 'ఇదం సర్వం యదయమాత్మా' (బృ. ఉ. 2 . 4 . 6) ఇతి శ్రుతేః . ఏవమాత్మవ్యతిరేకేణాసత్త్వం

రజ్జుసర్పవదాత్మని కల్పితానామాత్మానం చ కేవలం నిర్వికల్పం యో వేద తత్త్వేన శ్రుతితో యుక్తితశ్చ, సః అవిశంకితో వేదార్థం విభాగతః కల్పయేత్ కల్పయతీత్యర్థః — ఇదమేవంపరం వాక్యం అదోऽన్యపరం ఇతి . న హ్యనధ్యాత్మవిద్వేదాన్జ్ఞాతుం శక్నోతి తత్త్వతః, 'న హ్యనధ్యాత్మవిత్కశ్చిత్క్రియాఫలముపాశ్నుతే' (మను. 6 . 82) ఇతి హి మానవం వచనం ..

యదేతద్ద్వైతస్యాసత్త్వముక్తం యుక్తితః, తదేతద్వేదాంతప్రమాణావగత మిత్యాహ —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**అపృథక్ భావైః** ఆత్మకు అభిన్నమైన **ఏషః** ఈ **ఏతైః** ప్రాణాదులను, త్రాడునందు పామును చూసినట్లుగా వికల్పరూపాలుగా **పృథక్ ఏవ ఇతి** ఆత్మకు భిన్నమైనవిగా మూఢులు **లక్షితః** నిశ్చయిస్తారు. వివేకులైతే పాము మొదలైనవి త్రాడుకు వేరుగా లేనట్లగా ప్రాణాదులు ఆత్మకు భిన్నంగాలేవని భావిస్తారు అని అభిప్రాయం. 'ఇవి అన్నీ ఈ ఆత్మయే' ['ఇదం సర్వం యదయమాత్మా' (బృ.ఉ. 2-4-6)] అని శ్రుతి. **ఏవమ్** ఈ విధంగా త్రాడు-పాము లాగా ఆత్మయందు కల్పించబడిన భిన్నత్వాలు ఆత్మయందు లేకపోవడం చేత, ఆత్మ కేవలం నిర్వికల్పమని **యో వేద తత్త్వేన** ఏవడైతే వేద ప్రమాణంగా యుక్తితో తత్త్వాన్ని గ్రహిస్తాడో **సః** అతడు **అవిశఙ్కితః** ఎటువంటి సందేహం లేకుండా **కల్పయేత్** వేదం యొక్క అభిప్రాయాన్ని సందర్భానుసారం గ్రహిస్తాడు. అంటే, 'ఈ వాక్యం ఈ సందర్భంలో ఈ అర్థాన్ని చెప్తోంది', 'మరొక వాక్యం మరో సందర్భంలో వేరొక అర్థాన్ని చెప్తోంది' అని విచక్షణతో వివేకించి వేదం యొక్క యదార్థమైన అభిప్రాయాన్ని గ్రహిస్తాడు. ఆత్మను తెలియని వాడు వేదముల పరమార్థాన్ని తెలుసుకొనలేడు. ఈ అభిప్రాయాన్నే, 'అత్మజ్ఞాని తప్ప వేరొకడు వేదప్రమాణముల వల్ల కలిగే ప్రయోజనాన్ని పొందడు' ['న హ్యనధ్యాత్మవిత్కశ్చిత్క్రియాఫలముపాశ్నుతే' (మను. 6-82)] అని మనువు కూడా ప్రకటించాడు.

ఇలా హేతుబద్ధంగా చెప్పబడిన ద్వైతం యొక్క అసత్యత్వాన్ని, వేద ప్రమాణాలతో కూడా నిశ్చయించి తర్వాత శ్లోకంలో ఇలా చెప్తునారు.

**స్వప్నమాయే యథా దృష్టే గన్ధర్వనగరం యథా |**
**తథా విశ్వమిదం దృష్టం వేదాన్తేషు విచక్షణైః || || మాం.గౌ.కా. 2-31 ||**

**ఎలాగైతే స్వప్నం మరియు ఇంద్రజాలం అన్నవి ఆకాశంలోని గంధర్వనగరంలాగా (కల్పితమైనవిగా) కన్పిస్తున్నాయో అలాగే ఈ విశ్వం కూడా (కల్పితమైనదే) అని ఉపనిషత్తులలో వివేకం గల వారిచేత దర్శించబడింది.**

## శంకరుల భాష్యము

స్వప్నశ్చ మాయా చ స్వప్నమాయే అసద్వస్త్వాత్మికే సత్యౌ సద్వస్త్వాత్మికే ఇవ లక్ష్యేతే అవివేకిభిః . యథా చ ప్రసారితపణ్యాపణగృహప్రాసాదస్త్రీపుంజనపదవ్యవహారాకీర్ణమివ గంధర్వనగరం దృశ్యమానమేవ సత్ అకస్మాదభావతాం గతం దృష్టం , యథా చ స్వప్నమాయే దృష్టే అసద్రూపే, తథా విశ్వమిదం ద్వైతం సమస్తమసద్దృష్టం . క్వేత్యాహా — వేదాంతేషు, 'నేహ నానాస్తి కించన' (క. ఉ. 2 . 1 . 11) 'ఇంద్రో మాయాభిః' (బృ. ఉ. 2 . 5 . 19) 'ఆత్మైవేదమగ్ర ఆసీత్' (బృ. ఉ. 1 . 4 . 1) 'బ్రహ్మైవేదమగ్ర ఆసీత్' (బృ. ఉ. 1 . 4 . 10) 'ద్వితీయాద్వై భయం భవతి' (బృ. ఉ. 1 . 4 . 2) 'న తు తద్ద్వితీయమస్తి' (బృ. ఉ.

4 . 3 . 23) 'యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్' (బృ. ఉ. 4 . 5 . 15) ఇత్యాదిషు విచక్షణైః నిపుణతరవస్తుదర్శిభిః పండితైరిత్యర్థః ; 'తమః శ్వభ్రనిభం దృష్టం వర్షబుద్బుదసంనిభం . నాశప్రాయం సుఖాద్ధీనం నాశోత్తరమభావగం' (మో. ధ. 301 . 60) ఇతి వ్యాసస్మృతేః ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**స్వప్నమాయే** అంటే స్వప్నము మరియు మాయ అనేవి అసత్ విషయాలతో కూడినవైనందున అసత్యమే అయినప్పటికీ అవివేకులు వాటిని సత్యమైన వాటితో కూడినవే అని భావిస్తారు. **యథా** ఎలాగైతే **గంధర్వనగరమ్** ఆకాశంలో అంగళ్ళు, సరుకులు, గృహాలు, ప్రాసాదాలు, స్త్రీ పురుషులతో అలరారే గ్రామాలతో విలసిల్లే గంధర్వనగరం నిజమైనదా అన్నట్లు కన్పించేది అకస్మాత్తుగా చూస్తుండగానే లేకుండాపోతుందో, లేదా **యథా** ఎలాగైతే **స్వప్నమాయే** స్వప్నము-మాయ కూడా అసత్యములుగా **దృష్టే** కన్పిస్తాయో, **తథా** అలాగే **విశ్వమ్ ఇదమ్** ద్వైతంగా కనిపించే ఈ సమస్త ప్రపంచం దృష్టమ్ అసత్తుగా చూడబడుతుంది. ఎక్కడ? అనేది చెప్తున్నారు. 'అక్కడ నానాత్వం అన్నది ఏమాత్రం లేదు' ['నేహ నానాస్తి కించన' (క.ఉ. 2-1-11)]; 'మాయచేత ఈశ్వరుడు అనేకంగా కన్పిస్తున్నాడు' ['ఇంద్రో మాయాభిః' (బృ.ఉ. 2-5-19)]; 'మొదటగా ఉన్నది ఆత్మయే' ['ఆత్మైవేదమగ్ర ఆసీత్' (బృ.ఉ. 1-4-1)]; 'మొదటగా ఉన్నది బ్రహ్మమే' ['బ్రహ్మైవేదమగ్ర ఆసీత్' (బృ.ఉ. 1-4-10)]; 'రెండవదాని వల్లనే భయం కలుగుతుంది' ['ద్వితీయాద్వై భయం భవతి' (బృ.ఉ. 1-4-2)]; 'దానికైతే ద్వితీయమన్నది లేదు' ['న తు తద్ద్వితీయమస్తి' (బృ.ఉ. 4-3-23)]; 'ఎక్కడైతే అతనికి సర్వమూ ఆత్మయే అవుతుందో' ['యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్' (బృ.ఉ. 4-5-15)] వంటి (ఈ ద్వైత ప్రపంచం యొక్క మిథ్యాత్వాన్ని ప్రకటించే) ప్రమాణాలను **వేదాన్తేషు** ఉపనిషత్తు వాక్యాలలో **విచక్షణైః** విషయాలను నైపుణ్యంతో పరిశీలించ గలిగిన పండితులు దర్శిస్తారు అని అభిప్రాయం. వ్యాస భగవానుడు స్మృతిలో (మహాభారతంలోని మోక్షధర్మ పర్వంలో) ఈ విషయాన్ని ఇలా ధృవీకరించారు. 'చీకటిలో తాడు లాగా, భూమి మీది చారిక లాగా, వర్షం వల్ల కలిగే బుడగలాగా (ఈ ద్వైత ప్రపంచం మిథ్యామాత్రమై) నశించేది, సుఖమనేది లేనిది, లేకుండా పోయేదే (అని జ్ఞానులు భావిస్తారు)' ['తమః శ్వభ్రనిభం దృష్టం వర్షబుద్బుదసంనిభం. నాశప్రాయం సుఖాద్ధీనం నాశోత్తరమభావగం' (మో.ధ. 301-60)].

**న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః |**
**న ముముక్షుర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా || || మాం.గౌ.కా. 2-32 ||**

నిరోధమూ లేదు, ఉత్పత్తి లేదు, బంధమూ లేదు, సాధకుడూ లేడు, ముముక్షువూ లేడు, ముక్తుడూ లేడు. ఇదియే యదార్థమైన సత్యం.

## శంకరుల భాష్యము

ప్రకరణార్థోపసంహారార్థోఽయం శ్లోకః — యదా వితథం ద్వైతం ఆత్మైవైకః పరమార్థతః సన్ , తదా ఇదం నిష్పన్నం భవతి — సర్వోఽయం లౌకికో వైదికశ్చ వ్యవహారోఽవిద్యావిషయ ఏవేతి . తదా న నిరోధః, నిరోధనం నిరోధః ప్రలయః, ఉత్పత్తిః జననం , బద్ధః సంసారీ జీవః, సాధకః సాధనవాన్మోక్షస్య, ముముక్షుః మోచనార్థీ, ముక్తః విముక్తబంధః . ఉత్పత్తిప్రలయయోరభావాద్బద్ధాదయో న సంతీత్యేషా పరమార్థతా . కథముత్పత్తిప్రలయయోరభావ ఇతి, ఉచ్యతే —

ద్వైతస్యాసత్త్వాత్ . 'యత్ర హి ద్వైతమివ భవతి' (బృ. ఉ. 2 . 4 . 14) 'య ఇహ నానేవ పశ్యతి' (క. ఉ. 2 . 1 . 10) 'ఆత్మైవేదం సర్వం' (ఛా. ఉ. 7 . 25 . 2) 'బ్రహ్మైవేదం సర్వం' 'ఏకమేవాద్వితీయం' (ఛా. ఉ. 6 . 2 . 1) 'ఇదం సర్వం యదయమాత్మా' (బృ. ఉ. 2 . 4 . 6) ఇత్యాదినానాశ్రుతిభ్యో ద్వైతస్యాసత్త్వం సిద్ధం . సతో హ్యుత్పత్తిః ప్రలయో వా స్యాత్ , నాసతః శశవిషాణాదేః . నాప్యద్వైతముత్పద్యతే ప్రలీయతే వా . అద్వైతం చ, ఉత్పత్తిప్రలయవచ్చేతి విప్రతిషిద్ధం . యస్తు పునర్ద్వైతసంవ్యవహారః, స రజ్జుసర్పవదాత్మని ప్రాణాదిలక్షణః కల్పిత ఇత్యుక్తం ; న హి మనోవికల్పనాయా రజ్జుసర్పాదిలక్షణాయా రజ్జ్వాం ప్రలయ ఉత్పత్తిర్వా ; న చ మనసి రజ్జుసర్పస్యోత్పత్తిః ప్రలయో వా, న చోభయతో వా . తథా మానసత్వావిశేషాద్ద్వైతస్య . న హి నియతే మనసి సుషుప్తే వా ద్వైతం గృహ్యతే ; అతో మనోవికల్పనామాత్రం ద్వైతమితి సిద్ధం . తస్మాత్సూక్తం — ద్వైతస్యాసత్త్వాన్నిరోధాద్యభావః పరమార్థతేతి . యద్యేవం ద్వైతాభావే శాస్త్రవ్యాపారః, నాద్వైతే, విరోధాత్ ; తథా చ సత్యద్వైతస్య వస్తుత్వే ప్రమాణాభావాచ్ఛూన్యవాదప్రసంగః, ద్వైతస్య చాభావాత్ ; న, రజ్జువత్సర్పాదికల్పనాయా నిరాస్పదత్వేఽనుపపత్తిరితి ప్రత్యుక్తమేతత్కథముజ్జీవయసీతి, ఆహ — రజ్జురపి సర్పవికల్పస్యాస్పదభూతా కల్పితైవేతి దృష్టాంతానుపపత్తిః ; న, వికల్పనాక్షయే అవికల్పితస్యావికల్పితత్వాదేవ సత్త్వోపపత్తేః ; రజ్జుసర్పవదసత్త్వమితి చేత్ , న ఏకాంతేనావికల్పితత్వాత్ అవికల్పితరజ్జ్వంశవత్ప్రాక్సర్పాభావవిజ్ఞానాత్ , వికల్పయితుశ్చ ప్రాగ్వికల్పనోత్పత్తేః సిద్ధత్వాభ్యుపగమాదేవాసత్త్వానుపపత్తిః . కథం పునః స్వరూపే వ్యాపారాభావే శాస్త్రస్య ద్వైతవిజ్ఞాననివర్తకత్వం ? నైష దోషః, రజ్జ్వాం సర్పాదివదాత్మని ద్వైతస్యావిద్యాధ్యస్తత్వాత్ కథం సుఖ్యహం దుఃఖీ మూఢో జాతో మృతో జీర్ణో దేహవాన్ పశ్యామి వ్యక్తావ్యక్తః కర్తా ఫలీ సంయుక్తో వియుక్తః క్షీణో వృద్ధోఽహం మమైతే ఇత్యేవమాదయః సర్వే ఆత్మన్యధ్యారోప్యంతే . ఆత్మా ఏతేష్వనుగతః, సర్వత్రావ్యభిచారాత్ , యథా సర్పధారాదిభేదేషు రజ్జుః . యదా చైవం విశేష్యస్వరూపప్రత్యయస్య సిద్ధత్వాన్న కర్తవ్యత్వం శాస్త్రేణ . అకృతకర్తృ చ శాస్త్రం కృతానుకారిత్వే అప్రమాణం . యతః అవిద్యాధ్యారోపితసుఖిత్వాదివిశేషప్రతిబంధాదేవాత్మనః స్వరూపేణానవస్థానం , స్వరూపావస్థానం చ శ్రేయః ఇతి సుఖిత్వాదినివర్తకం శాస్త్రమాత్మన్యసుఖిత్వాదిప్రత్యయకరణేన నేతి నేత్యస్థూలాదివాక్యైః ; ఆత్మస్వరూపవదసుఖిత్వాదిరపి సుఖిత్వాదిభేదేషు నానువృత్తోఽస్తి ధర్మః . యద్యనువృత్తః స్యాత్ , నాధ్యారోప్యేత సుఖిత్వాదిలక్షణో విశేషః, యథోష్ణత్వగుణవిశేషవత్యగ్నౌ శీతతా ; తస్మాన్నిర్విశేష ఏవాత్మని సుఖిత్వాదయో విశేషాః కల్పితాః . యత్త్వసుఖిత్వాదిశాస్త్రమాత్మనః, తత్సుఖిత్వాదివిశేషనివృత్త్యర్థమేవేతి సిద్ధం . 'సిద్ధం తు నివర్తకత్వాత్' ఇత్యాగమవిదాం సూత్రం ..

<u>**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**</u>

ఈ ప్రకరణ ప్రయోజనాన్ని సమీక్షించి ముగించే ఉద్దేశ్యంతో ఈ శ్లోకం చెప్పబడుతోంది. ఎపుడు ద్వైతం అసత్యమై ఆత్మ ఒక్కటే యదార్థమైన సత్యంగా ఉంటుందో, అపుడు ఈ లౌకికమైన, వైదికమైన వ్యవహారాలన్నీ అవిద్యా విషయాలే అని నిరూపితమౌతుంది. అపుడు, **న నిరోధః** నిరోధ అంటే నిరోధనమే, అనగా ప్రళయం, **ఉత్పత్తిః** పుట్టుక కలవాడు, **బద్ధః** సంసారి, జీవుడు **సాధకః** మోక్షానికై ప్రయత్నాలు చేసేవాడు, **ముముక్షుః** మోక్షాన్ని కోరేవాడు, **ముక్తః** బంధంనుండి విముక్తి కలవాడు ఉండడు. పుట్టుక, వినాశాలు లేనందుచేత బద్ధత మొదలైనవి ఉండవు. **ఇతి ఏషా పరమార్థతా** ఇదియే పరమసత్యం. ఉత్పత్తి-ప్రళయాలు లేకపోవడం ఎలా? అన్న ప్రశ్నకు ఇలా చెప్తున్నారు. ద్వైతం అసత్యం కాబట్టి. 'ఎక్కడ ద్వైతం ఉన్నట్లుగా కన్పిస్తుందో' ['యత్ర హి ద్వైతమివ భవతి' (బృ.ఉ. 2-4-14)]; 'ఎవడు ఇక్కడ భేదాన్నే చూస్తాడో' ['య ఇహ నానేవ పశ్యతి' (క.ఉ. 2-1-10)]; 'ఈ సర్వమూ ఆత్మయే' ['ఆత్మైవేదం సర్వం' (ఛా.ఉ. 7-25-2)]; 'ఈ సర్వమూ బ్రహ్మచేతనే' ['బ్రహ్మణా ఇదం సర్వం' (నృ.ఉ.ఉ. 7)]; 'ఒక్కటియే, రెండవదంటూ లేదు' ['ఏకమేవాద్వితీయం' (ఛా.ఉ. 6-2-1)]; 'ఈ సర్వమంతా ఈ

ఆత్మయే' ['ఇదం సర్వం యదయమాత్మా' (బృ.ఉ. 2-4-6)] అని ఎన్నో శ్రుతి వాక్యాలలో ద్వైతం యొక్క అసత్యత్వాన్ని ప్రకటించారు. ఉనికి గల పదార్థాలకే ఉత్పత్తి లేదా ప్రళయం గాని, కుందేటి కొమ్ము వంటి ఉనికిలేని (ఊహాజనిత) పదార్థాలకు కాదు. అలాగే, అద్వయమైనది కూడా పుట్టేది లేదా నశించేది కాదు. అద్వయం అన్నప్పుడు ఉత్పత్తి-ప్రళయాల ప్రస్తావన చేయడం నిషిద్ధం. మరైతే, ద్వైతంగా కనబడుతున్న ఈ (ప్రపంచమనే) వ్యవహారం విషయంలో, త్రాడునందు పాములాగా, ఆత్మయందు ప్రాణాది లక్షణాలు కల్పితమైనాయని చెప్తున్నారు. ఎందుకంటే, త్రాడు నందు మనసుచే కల్పించబడిన పాము అనే లక్షణానికి పుట్టుకా లేదు నశించడమూ లేదు. మనసులో కూడా త్రాడు లోని పాముకు పుట్టుక లేదు, నాశమూ లేదు. రెండింటిలోనూ ఉత్పత్తి-ప్రళయాలు లేవు. (అంటే త్రాడులో కల్పించబడిన పాములో కాని, ఏ మనసులో ఈ కల్పన కలుగుతోందో ఆ మనసులో కాని, పాము పుట్టడం లేదు నశించడమూ లేదు). అదేవిధంగా మనసులో స్ఫురించే ద్వైత ప్రపంచం విషయానికి కూడా పుట్టుక-వినాశం అన్నది లేదు. సుషుప్తి స్థితిలో ఏకాగ్రత పొందిన మనస్సులో ద్వైత ప్రపంచం గ్రహించబడటం లేదు. అందుచేత, ద్వైత ప్రపంచం అనేది మనసు యొక్క కల్పన మాత్రమే అని నిరూపితమౌతోంది. కాబట్టి, ద్వైత ప్రపంచం యొక్క అసత్యత్వం వల్ల దానికి నాశమన్నది లేకపోవడమే పరమమైన సత్యం అని, చక్కగా వివరించారు.

**సందేహం** : అలాగైనట్లైతే, శాస్త్రం యొక్క ఉద్దేశ్యం ద్వైతం యొక్క అభావాన్ని ప్రకటించడం మాత్రమే కాని, దానికి విరుద్ధమైన అద్వైతాన్ని ప్రతిపాదించడం లేదు కదా! ఆ విధంగా కూడా ద్వైతం యొక్క అభావం వల్ల అద్వైత వస్తువును నిరూపించేందుకు ప్రమాణం అనేది ఏదీ లేకపోవడంచేత అది శూన్యవాదానికే దారితీస్తుంది కదా!

**సమాధానం** : అలా కాదు.

ఎందుకంటే, త్రాడువంటి ఆధారం ఏదీ లేకుండా పాము వంటి కల్పన కలగదని గతంలో ఒకసారి నిర్ణయించి చెప్పిన సమాధానాన్ని తిరిగి ఎందుకు లేవనెత్తుతున్నారు? అని అంటే, దానికి సందేహి ఇలా అంటున్నాడు.

**సందేహం** : పాము యొక్క వికల్పానికి ఆధారమైన త్రాడు కూడా కల్పితమే అయినందుచేత, (మీరు చెప్పిన త్రాడునందలి పాము అనే) దృష్టాంతం సరిపోవడం లేదు.

**సమాధానం** : కాదు. వికల్పం తొలగిపోయినప్పటికీ, అవికల్పమైనది వికల్పించబడకపోవడం చేత అలాగే ఉంటుంది.

**సందేహం** : త్రాడు కూడా పాములాగా కల్పితమైనదే కదా!

**సమాధానం** : కాదు. ఎందుకంటే (త్రాడు అనేది) కల్పించబడకుండా అంతటా (దృష్టాంత పర్యంతమూ) ఉన్నది కాబట్టి. పాము యొక్క అభావాన్ని తెలియక పూర్వం కూడా కల్పనలో భాగంగా కల్పించబడని త్రాడు ఉన్నది. (పాము యొక్క అభావం తెలిసిన తర్వాత ఎలాగూ కల్పితం కాని తాడు ఉండనే ఉంది). ఆ విధంగా కల్పనకు పూర్వమూ ఉన్నది కల్పన తొలగిన తర్వాత కూడా సిద్ధమై ఉన్నందుచేత అది లేకపోవడమనేదే లేదు. (అంటే అద్వయమైన ఆత్మ ఎప్పటికీ ఉన్నదే కాబట్టి, ద్వైతం తొలగిపోగా మిగిలి ఉండేది ఆత్మయే. ద్వైతం నివారణను నిరూపించడమంటే, అద్వయ పరమాత్మను నిరూపించడమే అవుతుంది అని సందేహికి సమాధానం ఇస్తున్నారు).

**సందేహం** : మరైతే, శాస్త్రం ఆత్మ యదార్థ స్వరూపాన్ని గురించి బోధించకపోతే, ద్వైతం నివారణ అయిందని తెలియడం కుదరదు కదా?

**సమాధానం** : అదేమీ దోషం కాదు. త్రాడునందు పాము లాగా, ఆత్మయందు అజ్ఞానం కారణంగా ద్వైతం ఆధ్యారోపించబడిందే కాబట్టి.

**సందేహం** : ఎలా?

**సమాధానం** : నేను సుఖిని, దుఃఖిని, మూర్ఖుడను, పుట్టుక-మరణం-వృద్ధాప్యం కలవాడను, శరీరం కలవాడిని, చూస్తాను, వ్యక్తాన్ని-అవ్యక్తాన్ని, కర్తను, కర్మ ఫలాలను పొందేవాడిని, కలయికలు-వియోగాలున్న వాడిని, క్షీణత-వృద్ధి కలవాడిని, నేను-నాది వంటి సకల భావనలూ ఆత్మయందు అధ్యారోపించబడినాయి. పాము, నీటి చార వంటి విభిన్న కల్పిత విషయాలలో త్రాడు ఉన్నట్లుగానే, సర్వత్రా నిండియున్న ఆత్మ, వీటన్నింటియందు వ్యాపించే ఉంటుంది. ఆ విధంగా విశేష్యమైన ఆత్మయొక్క స్వరూప స్వభావం సిద్ధించే (లభ్యమయ్యే) ఉన్నప్పుడు ఇక శాస్త్రం యొక్క కర్తవ్యం (అంటే చేయవలసింది లేదా వివరించవలసింది) ఉండదు. సిద్ధించని దాన్ని సిద్ధింపచేసే శాస్త్రం, సిద్ధించిన దాన్నే సిద్ధింపచేస్తుంది అని అంటే ఆ శాస్త్రాన్ని ప్రమాణంగా స్వీకరించలేం. అజ్ఞానం చేత అధ్యారోపితమైన సౌఖ్యాది విశేషాలతో బంధిపబడినట్లుగా ఉండే ఆత్మ తన స్వరూపంలో స్థిరంగా లేకపోవడం వల్ల, స్వరూపంలో స్థిరంగా ఉండటమే శ్రేయం కాబట్టి, ఆరోపితమైన సౌఖ్యాదులను ఆత్మయందు అసౌఖ్యాది విషయ సాధనాలచేత (నేను సుఖిని కాదు దుఃఖిని కాదు అనే ధారణ చేత) తొలగించేందుకై శాస్త్రం 'ఇది కాదు, ఇది కాదు' ['నేతి నేతి' (బృ.ఉ. 4-4-22)]; 'స్థూలం కానిది' ['అస్థూల ....' (బృ.. 3-3-8)] అనే వాక్యాలను ప్రకటిస్తున్నాయి. సౌఖ్యాది భేదాలలో ఆత్మస్వరూపం లాగా అసౌఖ్యాది ధర్మం కూడా మరలా మరలా కలిగేది కాదు. అది మరలా మరలా కలిగేదే అయితే, ఉష్ణత్వం అనే గుణవిశేషం కలిగిన అగ్నిలో చల్లదనం ఎలా ఉండదో అలాగే, అధ్యారోపితమైన సౌఖ్యాదిలక్షణం ప్రత్యేకించి ఉండదు. అందుచేత విశేషతలే లేని ఆత్మయందు, సౌఖ్యాది విశేషాలు కల్పించబడినవే. కాబట్టి, ఆత్మయందు అసౌఖ్యత్వాన్ని ప్రస్తావించే శాస్త్రాల ప్రయోజనం, ఆత్మయందు ఆరోపించబడిన సౌఖ్యాది విశేషాలను తొలగించేదుకే అనేది నిరూపణైనది. ఆత్మయందలి సౌఖ్యాది ధర్మాలు నివారించబడిన మాత్రం చేతనే శాస్త్ర ప్రమాణం సిద్ధిస్తుంది అనే భావననే 'సిద్ధం తు నివర్తకత్వాత్' అని వేదవేత్తలు సూత్రీకరించారు. {ఈ సూత్రాన్ని ద్రవిడాచార్యులు ఇలా నిర్దేశించారు. 'వాక్యాలు బ్రహ్మగురించి యదార్థమైన వివరణను చెప్పలేకపోయినప్పటికీ, శాస్త్రం యొక్క ప్రామాణ్యత సిద్ధించే ఉంటుంది. ఎందుకంటే, విశేషాలను త్రోసిపుచ్చే వాక్యాలు, ఆ యా విశేషాలు ఆత్మయందు లేవని సూచిస్తూ, సకలమైన ద్వైతాన్ని ఆత్మనుండి నిర్మూలన చేస్తున్నాయి – స్వామి గంభీరానంద}.

**భావైరసద్భిరేవాయమద్వయేన చ కల్పితః |**
**భావా అప్యద్వయేనైవ తస్మాదద్వయతా శివా || || మాం.గౌ.కా. 2-33 ||**

అసత్ అయిన (ప్రాణాది) విషయాలు కూడా ఈ అద్వయం నుండే కల్పించబడినాయి. కనుక (ప్రాణాది) విషయాలన్నీ కూడా ఈ అద్వయమైన ఆత్మయే. అందువల్ల అద్వయమే మంగళప్రదం.

**శంకరుల భాష్యము**

పూర్వశ్లోకార్థస్య హేతుమాహ — యథా రజ్జ్వామసద్భిః సర్పధారాదిభిః అద్వయేన చ రజ్జుద్రవ్యేణ సతా అయం సర్ప ఇతి ధారేయం దండోఽయమితి వా రజ్జుద్రవ్యమేవ కల్ప్యతే, ఏవం ప్రాణాదిభిరనంతైః అసద్భిరేవ అవిద్యమానైః, న పరమార్థతః . న హ్యప్రచలితే మనసి కశ్చిద్భావ ఉపలక్షయితుం శక్యతే కేనచిత్ ; న చాత్మనః ప్రచలనమస్తి . ప్రచలితస్యైవోపలభ్యమానా భావా న పరమార్థతః సంతః కల్పయితుం శక్యాః . అతః అసద్భిరేవ ప్రాణాదిభిర్భావైరద్వయేన చ పరమార్థసతా ఆత్మనా రజ్జువత్సర్వవికల్పాస్పదభూతేన అయం స్వయమేవాత్మా కల్పితః సదైకస్వభావోఽపి సన్ . తే చాపి ప్రాణాదిభావాః అద్వయేనైవ సతా ఆత్మనా వికల్పితాః ; న హి నిరాస్పదా కాచిత్కల్పనా ఉపపద్యతే ; అతః సర్వకల్పనాస్పదత్వాత్స్వేనాత్మనా అద్వయస్య అవ్యభిచారాత్ కల్పనావస్థాయామపి అద్వయతా శివా ; కల్పనా ఏవ త్వశివాః, రజ్జుసర్పాదివత్త్రాసాదికారిణ్యో హి తాః . అద్వయతా అభయా ; అతః సైవ శివా ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

పూర్వ శ్లోకంలో చెప్పిన అర్థానికి కారణాన్ని ఈ శ్లోకంలో చెప్తున్నారు.

'ఇది పాము', లేదా 'ఇది కర్ర', లేదా 'ఇది నీటి చార' అన్న భ్రమలన్నీ త్రాడునందే కలుగుతున్నందు చేత, పాము, కర్ర, నీటిచార అనే అసత్ వస్తువులు త్రాడు అనే వస్తువు తప్ప మరేమీ కానట్లే, అనంతమైన ప్రాణాదులు అజ్ఞానం వల్ల కల్పితమైన అసత్ విషయాలే కాని, వాటి పరమార్థత లేదు. మనసు స్పందించకపోతే ఏ విషయాన్నైనా భావించడం ఎవనికీ సాధ్యపడదు. ఆత్మయందు స్పందన లేదు. మనసుచేత స్పందించబడితేనే అనుభవానికి వచ్చే విషయాలను యదార్థంగా ఉన్నవిగా భావించడం కుదరదు. అందుచేత, **భావా అసద్భిః ఏవ** ప్రాణాది విషయాలు అసత్ మాత్రమే. ఎల్లప్పుడూ ఒకే స్వభావం కలిగిన ఆత్మయే యదార్థమైన సత్ వస్తువు. త్రాడు లాగా, సకల వికల్పాలకు ఆశ్రయమైన ఆ సద్వస్తువైన **అయమ్ అద్వయేన చ కల్పితః** ఆత్మకు భిన్నంకాని కల్పనలే అవుతాయి. ఆశ్రయం లేని విషయాలనైతే కల్పించడం కుదరదు కదా! అందుచేత **భావా అపి అద్వయ ఏన ఏవ** సకల కల్పనలకూ కూడా అద్వయమైన ఆత్మయే ఆశ్రయమైనందున, అట్టి అద్వయమైన ఆత్మ తన స్వరూపం నుండి జారిపోవడం అన్నది లేకపోవడం చేత, కల్పితమైన సకల అవస్థలన్నీ కూడా **అద్వయతా శివా** రెండవదంటూ లేనందున మంగళదాయకమైనవే. కల్పనలు, త్రాడునందలి పాములాగా భయాన్ని కలిగించేవి అయినందున, మంగళకరమైనవి కావు. **అద్వయతా** అద్వయమనగా భయరహిత స్థితి. అందుచేత అది **శివా** మంగళప్రదమైనది.

**నాత్మభావేన నానేదం న స్వేనాపి కథఞ్చన |**
**న పృథఙ్ నాపృథక్కిఞ్చిదితి తత్త్వవిదో విదుః ||** **|| మాం.గౌ.కా. 2-34 ||**

ఈ నానాత్వం ఆత్మభావనలోనూ లేదు. (తనంత తానుగానూ) స్వతఃసిద్ధంగానూ లేదు. (ఆత్మతత్వానికి) భిన్నంగానూ లేదు, ఏ మాత్రం అభిన్నంగానూ లేదు అని తత్త్వవేత్తలు తెలుసుకొంటారు.

## శంకరుల భాష్యము

కుతశ్చాద్వయతా శివా ? నానాభూతం పృథక్త్వం అన్యస్య అన్యస్మాత్ యత్ర దృష్టం , తత్రాశివం భవేత్ . న హ్యత్రాద్వయే పరమార్థసత్యాత్మని ప్రాణాదిసంసారజాతమిదం జగత్ ఆత్మభావేన పరమార్థస్వరూపేణ నిరూప్యమాణం నానా వస్త్వంతరభూతం భవతి ; యథా రజ్జుస్వరూపేణ ప్రకాశేన నిరూప్యమాణో న నానాభూతః కల్పితః సర్పోఽస్తి, తద్వత్ . నాపి స్వేన ప్రాణాద్యాత్మనా ఇదం విద్యతే కదాచిదపి, రజ్జుసర్పవత్కల్పితత్వాదేవ . తథా అన్యోన్యం న పృథక్ ప్రాణాది వస్తు, యథా అశ్వాన్మహిషః పృథగ్విద్యతే, ఏవం . అతః అసత్త్వాత్ నాపి అపృథక్ విద్యతేఽన్యోన్యం పరేణ వా కించిదితి . ఏవం పరమార్థతత్త్వవిదో బ్రాహ్మణా విదుః . అతః అశివహేతుత్వాభావాదద్వయతైవ శివేత్యభిప్రాయః ..

తదేతత్సమ్యగ్దర్శనం స్తూయతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

మరింకా ఏ కారణంగా అద్వయ స్థితి మంగళప్రదమౌతోంది? ఎక్కడ నానాత్వం, అంటే ఒకదానికి మరొకటి వేరైనదిగా, కన్పడుతోందో అక్కడ అమంగళత్వం కలుగుతుంది. ఎలాగైతే ప్రకాశం చేత త్రాడు యొక్క స్వరూపం నిరూపణ కాగానే అనేక విధాలుగా కల్పితమైన పాము మొదలైన భావనలు ఉండవో అలాగే, ఏ అద్వయ స్థితిలో పరమార్థ సత్యమైన ఆత్మయందు ప్రాణాదులతో కూడిన సంసారంగా కల్పించబడిన **ఇదమ్** ఈ జగత్తుకు **ఆత్మభావేన** పరమార్థ స్వరూపంగా నిరూపణాయోగ్యత కలుగగానే **నానా** దాని (జగత్తులోని) విభిన్నత్వం లేకుండా పోతుంది. త్రాడు నందలి పాములాగా, ఆత్మయందు ప్రాణాదులు కల్పించబడినవే అయినందుచేత వాటికి **స్వేన అపి** స్వయంగా ఎప్పుడూ కూడా ఉనికి అనేది లేదు. గుఱ్ఱానికి, ఎద్దుకు తేడా ఉన్నట్లుగా, ప్రాణం-మనసు మొదలైన వాటికి వాటిలో వాటికి **న పృథక్** భిన్నత్వం అనేది ఉండదు. ద్వైతం అన్నదే అసత్ అయినందున, వాటిలో వాటికి లేదా వాటికి పరమాత్మతో **న అపృథక్ కిఞ్చిత్** ఏమాత్రం అభిన్నత్వం కూడా ఉండదు. (వాటిలో వాటికి భిన్నత్వం గాని అభిన్నత్వం గాని చెప్పాలంటే అసలు ఆ వస్తువులనేవి ఉండాలి కదా. అద్వయస్థితిలో రెండవ వస్తువే లేదని నిరాకరిస్తున్నప్పుడు, ఆ రెండవవి అనే వస్తువులలో భిన్నత్వాన్ని గాని ఏకత్వాన్ని గాని దర్శించడం అన్నది సంభవమే కాదు). ఈ విధంగా పరమార్థాన్ని **తత్త్వవిదః** బ్రహ్మవేత్తలైన వారు **విదుః** తెలుసుకొన్నారు. అందుచేత, అద్వయ స్థితిలో అమంగళత్వానికి కారణమనేది లేనందువల్ల ఆ స్థితి మంగళప్రదమే అని వారి అభిప్రాయం.

ఈ చక్కటి దర్శనాన్ని ఇలా ప్రస్తుతిస్తున్నారు.

**వీతరాగభయక్రోధైర్మునిభిర్వేదపారగైః |**
**నిర్వికల్పో హ్యయం దృష్టః ప్రపఞ్చోపశమోఽద్వయః || || మాం.గౌ.కా. 2-35 ||**

వేదములను సమగ్రంగా ఏకాగ్రతతో విచారణ చేసిన మునులు, రాగ-భయ-క్రోధాలను జయించి, ఈ ప్రపంచం ఉపశమించినవారై, ఎటువంటి వికల్పాలు లేని అద్వయస్థితిని దర్శించారు.

**శంకరుల భాష్యము**

విగతరాగభయక్రోధాదిసర్వదోషైః సర్వదా మునిభిః మననశీలైర్వివేకిభిః వేదపారగైః అవగతవేదాంతార్థతత్త్వైర్జ్ఞానిభిః నిర్వికల్పః సర్వవికల్పశూన్యః అయం ఆత్మా దృష్టః ఉపలబ్ధో వేదాంతార్థతత్పరైః, ప్రపంచోపశమః, ప్రపంచో ద్వైతభేదవిస్తారః,

తస్యోపశమోఽభావో యస్మిన్ , స ఆత్మా ప్రపంచోపశమః, అత ఏవ అద్వయః విగతదోషైరేవ పండితైర్వేదాంతార్థతత్పరైః సంన్యాసిభిః అయమాత్మా ద్రష్టుం శక్యః, నాన్యైః రాగాదికలుషితచేతోభిః స్వపక్షపాతిదర్శనైస్తార్కికాదిభిరిత్యభిప్రాయః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**వీతరాగభయక్రోధైః** రాగ-భయ-క్రోధాలనే సకల దోషాలను విడిచిపెట్టి **మునిభిః** ఎల్లప్పుడూ మననశీలురైన వివేకులు **వేదపారగైః** ఉపనిషత్తుల అభిప్రాయాన్ని జ్ఞానుల నుండి గ్రహించిన వారై **హి నిర్వికల్పః** సకల కల్పనలు నిర్మూలించు కొన్నవారే. వారే **అయమ్** ఈ ఆత్మను **దృష్టః** ఉపనిషత్తులు అభిప్రాయపడిన విధంగా లభింపచేసుకొన్న వారు. **ప్రపంచోపశమః** ద్వైత భేదంగా విస్తరించినది ప్రపంచం. ఆ ప్రపంచం ఉపశమించింది అనే భావన ఎవరిలో కలుగుతుందో వారు 'ప్రపంచోపశమః'. అదియే **అద్వయః** రెండవదంటూ లేని స్థితి. దోషములు నశించి, ఉపనిషత్తుల అభిప్రాయాన్ని సిద్ధింపచేసుకొన్న పండితులు, సంన్యాసులు మాత్రమే ఈ ఆత్మను దర్శింపగలుగుతారు. అన్యులు అంటే, రాగాది దోషాలతో కలుషితమైన చిత్తం కలవారు, అంటే తమ వాదములతోనే తమ సిద్ధాంతాలను వ్యతిరేకించుకొనే తర్కవాదులు, దర్శింపలేరు అని అభిప్రాయం.

**తస్మాదేవం విదిత్వైనమద్వైతే యోజయేత్స్మృతిమ్ |**
**అద్వైతం సమనుప్రాప్య జడవల్లోకమాచరేత్ || || మాం.గౌ.కా. 2-36 ||**

అందుచేత, ఈ విధంగా తెలుసుకొన్నవాడు స్మృతిని అద్వైతంతో అనుసంధానించుకోవాలి. అద్వయస్థితిని అందుకొన్న మీదట అతడు లోకంలో జడుని వలె ప్రవర్తిస్తాడు.

**శంకరుల భాష్యము**

యస్మాత్సర్వానర్థోపశమరూపత్వాదద్వయం శివమభయం , అతః ఏవం విదిత్వైనం అద్వైతే స్మృతిం యోజయేత్ ; అద్వైతావగమాయైవ స్మృతిం కుర్యాదిత్యర్థః . తచ్చ అద్వైతం అవగమ్య 'అహమస్మి పరం బ్రహ్మ' ఇతి విదిత్వా అశనాయాద్యతీతం సాక్షాదపరోక్షాదజమాత్మానం సర్వలోకవ్యవహారాతీతం జడవత్ లోకమాచరేత్ ; అప్రఖ్యాపయన్నాత్మానమహమేవంవిధ ఇత్యభిప్రాయః ..

కయా చర్యయా లోకమాచరేదితి, ఆహ —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

సకల దోషాల ఉపశమన రూపమైన అద్వయస్థితి మంగళప్రదమైనది భయరహితమైనందుచేత, **ఏవమ్** ఈ విధంగా **విదిత్వా ఏనమ్** దానిని తెలుసుకొన్నవాడు **అద్వైతే** అద్వయస్థితియందే **స్మృతిమ్ యోజయేత్** తన మనసును అనుసంధానం చేసుకోవాలి. అద్వైతస్థితి అనుభవంలోకి వచ్చేలా నిరంతరంగా మననం చేసుకోవాలి అని అభిప్రాయం. {ఉపనిషత్తులలో బోధించబడిన అద్వయస్థితిని అర్థం చేసుకొన్న తర్వాత, తన మనసులో నిరంతరంగా ఆ బోధనా విషయాలను పదేపదే గుర్తుచేసుకొంటూ, ఆ భావనలో స్థిరంగా ఉండేలా అభ్యాసం చేయాలి – స్వామి గంభీరానంద}. **అద్వైతం** ఆ అద్వయస్థితిని **సమనుప్రాప్య** చేరుకొని 'నేను ఆ పరబ్రహ్మమును' అని తెలుసుకొన్నవాడై, ఆకలిదప్పుల వంటి వాటికి అతీతుడై, సాక్షాత్తుగా అపరోక్షుడను పుట్టుకలేని వాడననే భావనతో,

సకల లోకవ్యవహారాలకు అతీతుడై, **జడవత్** జడునివలె **లోకమ్ ఆచరేత్** లోకంలో సంచరిస్తాడు. అంటే, 'నేను ఫలానా, నేను ఇలాంటి వాడిని' అనే అభిప్రాయాలన్నీ తనయందు తొలగిపోయి ఉంటాడని అభిప్రాయం.

అటువంటి ఆత్మజ్ఞాని లోకంలో ఏ కార్యాలను ఆచరిస్తాడో చెప్తున్నారు.

**నిఃస్తుతిర్నిర్నమస్కారో నిఃస్వధాకార ఏవ చ |**
**చలాచలనికేతశ్చ యతిర్యాదృచ్ఛికో భవేత్ || || మాం.గౌ.కా. 2-37 ||**

పొగడ్తలకు, నమస్కారాలకు, కర్మలకు అతీతుడు. కేవలం దేహం మరియు ఆత్మయే అశ్రయం కలవానిగా, యాదృచ్ఛికునిగా (ప్రయత్నశీలత లేనివానిగా) అవుతాడు.

**శంకరుల భాష్యము**

స్తుతినమస్కారాదిసర్వకర్మవివర్జితః త్యక్తసర్వబాహ్యైషణః ప్రతిపన్నపరమహంసపారివ్రాజ్య ఇత్యభిప్రాయః, 'ఏతం వై తమాత్మానం విదిత్వా' (బృ. ఉ. 3 . 5 . 1) ఇత్యాదిశ్రుతేః, 'తద్బుద్ధయస్తదాత్మానస్తన్నిష్ఠాస్తత్పరాయణాః' (భ. గీ. 5 . 17) ఇత్యాదిస్మృతేశ్చ . చలం శరీరం , ప్రతిక్షణమన్యథాభావాత్ ; అచలం ఆత్మతత్త్వం . యదా కదాచిద్భోజనాదిసంవ్యవహారనిమిత్తమాకాశవదచలం స్వరూపమాత్మతత్త్వం ఆత్మనో నికేతమాశ్రయమాత్మస్థితిం విస్మృత్య అహమితి మన్యతే యదా, తదా చలో దేహో నికేతో యస్య సోఽయమేవం చలాచలనికేతో విద్వాన్న పునర్బాహ్యవిషయాశ్రయః . స చ యాదృచ్ఛికో భవేత్ , యదృచ్ఛాప్రాప్తకౌపీనాచ్ఛాదనగ్రాసమాత్రదేహస్థితిరిత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**నిఃస్తుతిః నిర్నమస్కారః నిఃస్వధాకారః ఏవ** పొగడ్తలు, నమస్కారాది సకల కర్మలు వదిలిపెట్టినవాడు మాత్రమే. బాహ్య విషయాల పట్ల ఆసక్తిని వదలినవాడు. పరమహంస పారివ్రాజ్యమనే ఉన్నత స్థాయి త్యాగాన్ని ఆహ్వానించినవాడు అని అభిప్రాయం. 'ఈ ఆత్మనే నిశ్చయంగా తెలుసుకొని బ్రాహ్మణులు ....... ' ['ఏతం వై తమాత్మానం విదిత్వా బ్రాహ్మణాః .....' (బృ.ఉ. 3-5-1)] వంటి శ్రుతి వాక్యాలు, 'దానియందే బుద్ధిని, దానియందే ఆత్మభావాన్ని, దానియందే స్థితిని, అదియే పరమమైన ఆశ్రయమనీ ..... ' ['తద్బుద్ధయస్తదాత్మానస్తన్నిష్ఠాస్తత్పరాయణాః' (భ.గీ. 5-17)] వంటి స్మృతి వాక్యాలు కూడా ఇదే అంటున్నాయి. **చలమ్** దేహం, ప్రతిక్షణం మార్పుచెందుతుంది కాబట్టి. **అచలమ్** ఆత్మతత్త్వం. ఎప్పుడైనా ఒకసారి భోజనాది వ్యవహారం కారణంగా, తనకు ఆశ్రయస్థానమైన ఆత్మస్థితిని మరిచి నేను దేహాన్ని ఆశ్రయించి ఉన్నాను అనుకొంటే అప్పుడు **నికేతః** ఆశ్రయం చలం. అందుచేత, నేను మార్పు చెందే దాని ఆశ్రయించి ఉన్నవాడిని మరియు ఎప్పటికీ మార్పు చెందని ఆత్మతత్వాన్ని కూడా అని తెలుసుకొన్నవాడు. అంతేకాని, బాహ్య విషయాలను ఆశ్రయించే వాడు కాదు. **చ** మరియు అతడు **యాదృచ్ఛికః భవేత్** అనుకోకుండా లభించిన కౌపీనం, కప్పుకొనే వస్త్రం, ఆహారంతో మాత్రమే దేహస్థితిని నిలుపుకొనేవాడు అవుతాడు అని అభిప్రాయం.

**తత్త్వమాధ్యాత్మికం దృష్ట్వా తత్త్వం దృష్ట్వా తు బాహ్యతః |**
**తత్త్వీభూతస్తదారామస్తత్త్వాదప్రచ్యుతో భవేత్ ||** **|| మాం.గౌ.కా. 2-38 ||**

తత్త్వాన్ని తన అంతర్యంలోనూ తనకు బాహ్యంలోనూ ఆవిష్కరించుకొని, తత్త్వమే తానై, దానియందే రమించేవాడు, ఆ తత్త్వభావననుండి జారిపోడు.

**శంకరుల భాష్యము**

బాహ్యం పృథివ్యాది తత్త్వమాధ్యాత్మికం చ దేహాదిలక్షణం రజ్జుసర్పాదివత్స్వప్నమాయాదివచ్చ అసత్ , 'వాచారంభణం వికారో నామధేయం' (ఛా. ఉ. 6 . 1 . 4) ఇత్యాదిశ్రుతేః . ఆత్మా చ సబాహ్యాభ్యంతరో హ్యజోఽపూర్వోఽనపరోఽనంతరోఽబాహ్యః కృత్స్నః తథా ఆకాశవత్సర్వగతః సూక్ష్మోఽచలో నిర్గుణో నిష్కలో నిష్క్రియః 'తత్సత్యం స ఆత్మా తత్త్వమసి' (ఛా. ఉ. 6 . 8 . 7) ఇతి శ్రుతేః, ఇత్యేవం తత్త్వం దృష్ట్వా తత్త్వీభూతస్తదారామో న బాహ్యరమణః ; యథా అతత్త్వదర్శీ కశ్చిత్తమాత్మత్వేన ప్రతిపన్నశ్చిత్తచలనమను చలితమాత్మానం మన్యమానః తత్త్వాచ్చలితం దేహాదిభూతమాత్మానం కదాచిన్మన్యతే ప్రచ్యుతోఽహమాత్మతత్త్వాదిదానీమితి, సమాహితే తు మనసి కదాచిత్తత్త్వభూతం ప్రసన్నమాత్మానం మన్యతే ఇదానీమస్మి తత్త్వీభూత ఇతి ; న తథా ఆత్మవిద్భవేత్ , ఆత్మన ఏకరూపత్వాత్ , స్వరూపప్రచ్యవనాసంభవాచ్చ . సదైవ బ్రహ్మాస్మీత్యప్రచ్యుతో భవేత్తత్త్వాత్ , సదా అప్రచ్యుతాత్మతత్త్వదర్శనో భవేదిత్యభిప్రాయః ; 'శుని చైవ శ్వపాకే చ' (భ. గీ. 5 . 18) 'సమం సర్వేషు భూతేషు' (భ. గీ. 13 . 27) ఇత్యాదిస్మృతేః ..

.. ఇతి ద్వితీయం వైతథ్యప్రకరణం సంపూర్ణం ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**బాహ్యతః** బాహ్యంలోని పృథివి మొదలైనవి, **ఆధ్యాత్మికమ్** అంతర్యంలోని దేహం మొదలైన లక్షణాలు త్రాడునందలి పాములాగా, స్వప్నం, మాయ మొదలైన వాటిలాగా అసత్యమని 'పరిణామాలు వాక్కుతో ప్రారంభమయ్యేవే. అవి నామధేయాలు మాత్రమే' ['వాచారంభణం వికారో నామధేయం' (ఛా.ఉ. 6-1-4)] శ్రుతి ప్రకటిస్తోంది. బాహ్యంలోనూ, అంతర్యంలోనూ, పుట్టుక లేనిది, కారణ-కార్యములు లేనిది, లోపల-బయట అనే తారతమ్యత లేనిది, పరిపూర్ణమైనది ఆత్మ. ఆవిధంగా, ఆకాశంలాగా సకలాన్ని వ్యాపించి, సూక్ష్మంగా, కదలిక లేకుండా, గుణ రహితమై, విభాగాలు లేనిదై, క్రియా రహితంగా ఉన్న ఆ ఆత్మయే 'అది సత్యం. అది ఆత్మా. అది నీవే' ['తత్సత్యం స ఆత్మా తత్త్వమసి' (ఛా.ఉ. 6-8-7)] అని శ్రుతి నిర్దేశించింది. ఈ విధంగా **తత్త్వమ్ దృష్ట్వా** తత్త్వాన్ని దర్శించి, **తత్త్వీభూతః** ఆ తత్త్వమే తానై, **తత్ ఆరామః** ఆ తత్త్వంలోనే రమించే వాడు. అంటే, బాహ్య వస్తువులతో ఆసక్తిని చూపని వాడు. ఎలాగైతే తత్త్వాన్ని దర్శించని వాడు ఒక్కొక్కప్పుడు మనసునే ఆత్మగా భావించి, దాని కదలికలనే తానుగా భావిస్తాడో అలా లేదా ఒక్కొక్కప్పుడు కదిలే దేహాన్నే ఆత్మగా భావిస్తాడో మరియు మనసు ఏకాగ్రమై ఉన్న సమయంలో నేను ఆత్మతత్త్వంనుండి జారిపోయాను అని అనుకొని, ఎప్పుడో ఒకప్పుడు ఆత్మ తత్త్వంతో ఐక్యమై ప్రశాంతతను పొంది నేను తత్త్వీభూతుడనైనాను అని భావిస్తుంటాడో, అలా ఆత్మవేత్త ఉండడు. ఎందుకంటే, ఆత్మ ఎల్లప్పుడూ ఒకే స్వరూపం కాబట్టి. అట్టి స్వరూపంనుండి జారిపోవడం అనేది సంభవమే కాదు. నేను బ్రహ్మమును అని రూఢిగా సత్యాన్ని గ్రహించిన మీదట **తత్త్వాత్** ఆ తత్త్వ స్థితినుండి **అప్రచ్యుతః భవేత్** తొలగిపోవడం సంభవించదు. అంటే, సమస్త కాలాలలోనూ చెదరని ఆత్మతత్త్వాన్ని దర్శించిన వాడౌతాడు అని అభిప్రాయం. 'శునకమైనా శునకభక్షకుడైనా జ్ఞానికి సమదృష్టియే' ['శుని చైవ శ్వపాకే చ' (భ.గీ.

5-18)]; 'సకల ప్రాణుల యందు సమత్వాన్ని దర్శిస్తాడు' ['సమం సర్వేషు భూతేషు' (భ.గీ. 13-27)] అని స్మృతివాక్యాలు ఈ విషయాన్నే ప్రకటిస్తున్నాయి.

.. ద్వితీయ అధ్యాయమైన పైతథ్య ప్రకరణానికి వ్యాఖ్యానం సమాప్తం ..

# తృతీయ అధ్యాయం

# అద్వైత ప్రకరణం

**శంకరుల భాష్యము**

ఓంకారనిర్ణయే ఉక్తః ప్రపంచోపశమః శివోఽద్వైత ఆత్మేతి ప్రతిజ్ఞామాత్రేణ, 'జ్ఞాతే ద్వైతం న విద్యతే' (మా.కా. 1.18) ఇతి చ . తత్ర ద్వైతాభావస్తు వైతథ్యప్రకరణేన స్వప్నమాయాగంధర్వనగరాది దృష్టాంతైర్దృశ్యత్వాద్యంతవత్త్వాదిహేతుభిస్తర్కేణ చ ప్రతిపాదితః . అద్వైతం కిమాగమమాత్రేణ ప్రతిపత్తవ్యం , ఆహోస్విత్తర్కేణాపీత్యత ఆహ — శక్యతే తర్కేణాపి జ్ఞాతుం ; తత్కథమిత్యద్వైతప్రకరణమారభ్యతే . ఉపాస్యోపాసనాదిభేదజాతం సర్వం వితథం , కేవలశ్చాత్మా అద్వయః పరమార్థ ఇతి స్థితమతీతే ప్రకరణే ;

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఓంకారం యొక్క స్వభావాన్ని నిర్ణయించే సందర్భంలో, ద్వైత ప్రపంచం ఉపశమించగా మంగళకరమైన అద్వయస్థితియే ఆత్మ అని అంటూ 'జ్ఞాతే ద్వైతం న విద్యతే' (మా.కా. 1.18) అని ప్రథమాధ్యాయమైన ఆగమ ప్రకరణంలో కేవలం ప్రతిపాదన మాత్రమే చేశారు. ఆ మీదట, ద్వితీయాధ్యాయమైన వైతథ్య ప్రకరణంలో స్వప్నం-మాయ-గంధర్వనగరం మొదలైన ఉదాహరణలతోనూ మరియు దర్శిపబడటం, ఆద్యంతాలు ఉండటం అనే కారణాలు చూపిస్తూ యుక్తిపరంగా ఆ ప్రతిపాదనను బలపరిచారు. అద్వైతాన్ని కేవలం వేదం మాత్రమే ప్రతిపాదిస్తోందా? లేదా తర్కంచేత కూడా దానిని నిరూపణ చేయవచ్చునా? అన్న దానికి సమాధానంగా, తర్కంచేత కూడా దానిని తెలుసుకొనవచ్చని అంటున్నారు. అది ఎలాగో చెప్పడానికే ఈ అద్వైత ప్రకరణాన్ని ప్రారంభిస్తున్నారు. ఉపాసకుడు-ఉపాస్యము-ఉపాసన అనే భేదాలనుండి పుట్టే సకలమూ అసత్యమే. కేవలం పరమార్థమైన అద్వయమైనది ఆత్మ మాత్రమే అని గడిచిన ప్రకరణంలో తేల్చి చెప్పారు.

-

**ఉపాసనాశ్రితో ధర్మో జాతే బ్రహ్మణి వర్తతే |**
**ప్రాగుత్పత్తేరజం సర్వం తేనాసౌ కృపణః స్మృతః || || మాం.గౌ.కా. 3-1 ||**

ఉపాసనలను ఆశ్రయించిన జీవుడు కార్యబ్రహ్మలోనే చరిస్తాడు. పుట్టుకకు ముందు సకలమూ పుట్టుక లేనిదే. అందుచేత అతనిని (అట్టి ఉపాసనాజీవుడిని) మహాత్ములు దీనునిగా పరిగణిస్తారు.

**శంకరుల భాష్యము**

యతః ఉపాసనాశ్రితః ఉపాసనామాత్మనో మోక్షసాధనత్వేన గతః ఉపాసకోఽహం మమోపాస్యం బ్రహ్మ . తదుపాసనం కృత్వా జాతే బ్రహ్మణీదానీం వర్తమానః అజం బ్రహ్మ శరీరపాతాదూర్ధ్వం ప్రతిపత్స్యే ప్రాగుత్పత్తేశ్చాజమిదం సర్వమహం చ . యదాత్మకోఽహం ప్రాగుత్పత్తేరిదానీం జాతో జాతే బ్రహ్మణి చ వర్తమాన ఉపాసనయా పునస్తదేవ ప్రతిపత్స్యే ఇత్యేవముపాసనాశ్రితో ధర్మః సాధకః యేనైవం క్షుద్రబ్రహ్మవిత్ , తేనాసౌ కారణేన కృపణో దీనోఽల్పకః స్మృతో

నిత్యాజబ్రహ్మదర్శిభిర్మహాత్మభిరిత్యభిప్రాయః, 'యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే . తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే' (కే. ఉ. 1 . 5) ఇత్యాదిశ్రుతేస్తలవకారాణాం ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**ఉపాసనాశ్రితః ధర్మః** ఉపాసనలను మోక్షసాధనలుగా భావించి ఆశ్రయించేవాడు, 'నేను ఉపాసకుడను. నేను ఉపాసించేది బ్రహ్మము' అనే నమ్మకాన్ని కలిగి ఉంటాడు. అలా ఉపాసించిన వాడు **జాతే బ్రహ్మణి వర్తతే** ఈ కార్యబ్రహ్మమునందే చరిస్తున్నాను, **ప్రాక్ ఉత్పత్తేః అజః సర్వమ్** పుట్టుకకు ముందు నాతో సహా ఈ సకలమూ ఏ పుట్టుకే లేని పరబ్రహ్మంగా అయితే ఉన్నదో దానిని నేను దేహపతనానంతరం పొందుతాను అనుకొంటాడు. ఈ సృష్టికి పూర్వం ఏది ఉన్నదో అదియే తాను అయినా, పుట్టిన తర్వాత కార్యబ్రహ్మలో వర్తిల్లుతూ తిరిగి ఉపాసనల సహాయంతో దానినే (సృష్టికి పూర్వ స్థితిని) తిరిగి ఎవడు పొందాలనుకొంటాడో అతడే ఉపాసనాశ్రితమైన ధర్మం కల సాధకుడు. అతడు కేవలం కార్యబ్రహ్మను మాత్రమే తెలుసుకొంటాడు. **తేన అసౌ** ఆ కారణంగా అతడు **కృపణః** దీనుడని **స్మృతః** శాశ్వతమైన, పుట్టుక లేని బ్రహ్మమును దర్శించిన మహాత్ముల అభిప్రాయం. 'ఏది వాక్కుచే తెలియబడదో, ఏది వాక్కును తెలిసేలా చేస్తుందో అదియే బ్రహ్మ అని నీవు తెలుసుకో. 'ఇది' అంటూ దేనినైతే ఉపాసిస్తున్నావో అది కాదు' ['యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే . తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే' (కే.ఉ. 1-5) వంటి తలవకారశాఖకు చెందిన వేదవాక్యాలు ఇదే అభిప్రాయాన్ని ప్రకటిస్తున్నాయి.

**అతో వక్ష్యామ్యకార్పణ్యమజాతి సమతాం గతమ్ |**
**యథా న జాయతే కిఞ్చిజ్జాయమానం సమన్తతః || || మాం.గౌ.కా. 3-2 ||**

అందుచేత దైన్యత్వం లేని పుట్టుక లేని సమమైన (మార్పులేని) స్థితిని గురించి చెప్తున్నాను. ఎలాగైతే, జన్మిస్తున్నట్లుగా కనిపించేది ఏ మాత్రం కూడా జన్మించడం లేదో అటువంటి సర్వసమానమైన స్థితిని (చెప్తున్నాను)

**శంకరుల భాష్యము**

సబాహ్యాభ్యంతరమజమాత్మానం ప్రతిపత్తుమశక్నువన్ అవిద్యయా దీనమాత్మానం మన్యమానః జాతోఽహం జాతే బ్రహ్మణి వర్తే తదుపాసనాశ్రితః సన్బ్రహ్మ ప్రతిపత్స్యే ఇత్యేవం ప్రతిపన్నః కృపణో భవతి యస్మాత్ , అతో వక్ష్యామి అకార్పణ్యం అకృపణభావమజం బ్రహ్మ . తద్ధి కార్పణ్యాస్పదం , 'యత్రాన్యోఽన్యత్పశ్యత్యన్యచ్ఛృణోత్యన్యద్విజానాతి తదల్పం' (ఛా. ఉ. 7 . 24 . 1) 'మర్త్యం తత్' 'వాచారంభణం వికారో నామధేయం' (ఛా. ఉ. 6 . 1 . 4) ఇత్యాదిశ్రుతిభ్యః . తద్విపరీతం సబాహ్యాభ్యంతరమజమకార్పణ్యం భూమాఖ్యం బ్రహ్మ ; యత్ప్రాప్యావిద్యాకృతసర్వకార్పణ్యనివృత్తిః, తదకార్పణ్యం వక్ష్యామీత్యర్థః . తత్ అజాతి అవిద్యమానా జాతిరస్య . సమతాం గతం సర్వసామ్యం గతం ; కస్మాత్ ? అవయవవైషమ్యాభావాత్ . యద్ధి సావయవం వస్తు, తదవయవవైషమ్యం గచ్ఛజ్జాయత ఇత్యుచ్యతే ; ఇదం తు నిరవయవత్వాత్సమతాం గతమితి న కైశ్చిదవయవైః స్ఫుటతి ; అతః అజాతి అకార్పణ్యం సమంతతః సమంతాత్ , యథా న జాయతే కించిత్ అల్పమపి న స్ఫుటతి

రజ్జుసర్పవదవిద్యాకృతదృష్ట్యా జాయమానం యేన ప్రకారేణ న జాయతే సర్వతః అజమేవ బ్రహ్మ భవతి, తథా తం ప్రకారం శృణ్విత్యర్థః ..

అజాతి బ్రహ్మాకార్పణ్యం వక్ష్యామీతి ప్రతిజ్ఞాతం ; తత్సిద్ధ్యర్థం హేతుం దృష్టాంతం చ వక్ష్యామీత్యాహ —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

అజ్ఞానం కారణంగా బాహ్యాంతరాలలో పుట్టుక లేకుండా ఉన్న ఆత్మను పొందలేక తనను తాను దీనునిగా పరిగణిస్తున్నవాడై, 'నేను జన్మించాను, అపర బ్రహ్మలో చరిస్తున్నాను, దాని (ఆ అపర బ్రహ్మయొక్క) ఉపాసనను ఆశ్రయించిన వాడనై పరబ్రహ్మను పొందుతాను' అనే విధంగా ఆలోచించి దీనుడై ఉన్నాడు. అందుచేత, ఇప్పుడు **అకార్పణ్యమ్** దైన్యత లేని పుట్టుక లేని బ్రహ్మను గురించి **వక్ష్యామి** చెప్తున్నాను. 'ఎక్కడ ఒకటి వేరొకదానిని చూస్తుందో, వేరొకదానిని వింటుందో, వేరొకదానిని తెలుసుకొంటుందో అది అల్పమే..........అది నశించేదే' ['యత్రాన్యోఽన్యత్పశ్యత్యన్యచ్ఛృణోత్యన్యద్విజానాతి తదల్పం ...... తత్ మర్త్యం' (ఛా.ఉ. 7-24-1)]; 'వాక్కే మార్పులన్నింటికీ ప్రారంభ స్థానం, అది నామధేయమే' ['వాచారంభణం వికారో నామధేయం' (ఛా.ఉ. 6-1-4)] వంటి శ్రుతి వాక్యాలన్నీ అజ్ఞానమే ఆ కార్పణ్యానికి (దీనతకు) మూలం అని ప్రకటించాయి. దీనికి వ్యతిరేకంగా బాహ్యాంతరాలలో పుట్టుకనేది లేని దైన్యత్వం లేని 'భూమా' అని పిలువబడేదే పరబ్రహ్మ. దేనిని పొందగా, అవిద్య వల్ల కలిగిన సకల దైన్యత్వాలు నివారణమౌతాయో ఆ అకార్పణ్యాన్ని (దైన్యత్వం లేని దాని గురించి) చెప్తున్నాను అని అభిప్రాయం. **అజాతి** దానికి పుట్టుక అనేది లేదు. అది **సమతామ్ గతమ్** సర్వసామాన్యస్థితిలో ఉంటుంది. ఎందువల్ల? అవయవ విభాగం లేనందువల్ల. ఏదైనా విభాగాలు (అవయవాలు) కలిగిన వస్తువు తన విభాగాలలో అసమత్వం వల్ల మార్పుకు లోనవుతుంది. కాని ఇక్కడైతే, అవయవ విభాగం అనేది లేకుండా అంతటా సమంగా ఉన్నందువల్ల ఏ భాగంలోనూ మార్పు అనేది లేకుండా స్థిరంగా ఉంటుంది. అందువలన, జన్మించడం , దైన్యత్వం అనేవి లేని సామాన్యమైన స్థితియే అంతటా ఉంటుంది. **యథా** ఏ విధంగానైతే **జాయమానమ్** అజ్ఞానం వల్ల, త్రాడునందు పాములాగా, జన్మించినట్లుగా కనిపించే జగత్తు **కించిత్** ఏ మాత్రం కూడా, స్వల్పంగా కూడా **న జాయతే** పుట్టదో ఆ ప్రకారంగానే అంతటా జననం లేకుండా పరబ్రహ్మ ఉంటుందని గ్రహించండి అని అభిప్రాయం.

పుట్టుకలేని, దైన్యత్వం లేని పరబ్రహ్మను గురించి చెప్తాను అని ప్రతిపాదించి, దానిని నిరూపించేందుకు తగిన కారణాలను మరియు దానికి సరిపోయే ఉదాహరణలను ఇలా చెప్తున్నారు.

**ఆత్మా హ్యాకాశవజ్జీవైర్ఘటాకాశైరివోదితః |**
**ఘటాదివచ్చ సంఘాతైర్జాతావేతన్నిదర్శనమ్ || || మాం.గౌ.కా. 3-3 ||**

ఆకాశం నుండి ఘటాకాశం ఏర్పడుతున్నట్లే ఆత్మ నుండి జీవుడు ఉత్పన్నమైనాడు. ఘటాది పరిమితులలో ఆకాశం ఉన్నట్లే దేహసంఘాతాలలో ఆత్మ పరిమితమై ఉంటుంది. పుట్టింది అనేందుకు ఇంతమాత్రమే నిదర్శనం.

**శంకరుల భాష్యము**

ఆత్మా పరః హి యస్మాత్ ఆకాశవత్ సూక్ష్మో నిరవయవః సర్వగత ఆకాశవదుక్తః జీవైః క్షేత్రజ్ఞైః ఘటాకాశైరివ ఘటాకాశతుల్యైః ఉదితః ఉక్తః ; స ఏవ ఆకాశసమః పర ఆత్మా . అథవా ఘటాకాశైర్యథా ఆకాశ ఉదితః ఉత్పన్నః, తథా పరో జీవాత్మభిరుత్పన్నః ; జీవాత్మనాం పరస్మాదాత్మన ఉత్పత్తిర్యా శ్రూయతే వేదాంతే, సా మహాకాశాద్ఘటాకాశోత్పత్తిసమా, న పరమార్థత ఇత్యభిప్రాయః . తస్మాదేవాకాశాద్ఘటాదయః సంఘాతా యథా ఉత్పద్యంతే, ఏవమాకాశస్థానీయాత్పరమాత్మనః పృథివ్యాదిభూతసంఘాతా ఆధ్యాత్మికాశ్చ కార్యకరణలక్షణా రజ్జుసర్పవద్వికల్పితా జాయంతే ; అత ఉచ్యతే — ఘటాదివచ్చ సంఘాతైరుదిత ఇతి . యదా మందబుద్ధిప్రతిపిపాదయిషయా శ్రుత్యా ఆత్మనో జాతిరుచ్యతే జీవాదీనాం , తదా జాతావుపగమ్యమానాయాం ఏతత్ నిదర్శనం దృష్టాంతః యథోదితాకాశవదిత్యాదిః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**హి** ఎందువల్లనంటే **ఆత్మా** అంటే పరమాత్మ **ఆకాశవత్** ఆకాశంలాగా సూక్ష్మమైనది, విభాగాలు లేనిది, అంతటా వ్యాపించినదిగా చెప్పారు. **జీవైః** జీవులను అంటే క్షేత్రజ్ఞులను, దేహంలో ఉండి తెలుసుకొనే వ్యక్తిపరమైన ప్రత్యగాత్మలను **ఘటాకాశైః ఇవ** ఘటాకాశాల లాగా **ఉదితః** ఉత్పన్నం చేస్తుందని చెప్పారు. అవి ఆకాశంతో పోల్చబడిన పరమాత్మయే. లేదా, ఆకాశం ఘటాకాశంగా ఉత్పన్నమైన విధంగానే, పరమాత్మ జీవాత్మగా ఉత్పన్నమైనాడు. పరమాత్మ నుండి జీవాత్మలు ఉత్పత్తి కావడమని ఏదైతే ఉపనిషత్తులలో వినబడుతోందో, అది మహాకాశం నుండి ఘటాకాశ ఉత్పత్తికి పోలినదే కాని, అది పరమార్థం కాదని అభిప్రాయం. అందువలననే, ఆకాశం నుండి ఘటాకాశాది సంఘాతాలు ఉత్పన్నమైన విధంగానే, ఆకాశంతో పోల్చబడిన పరమాత్మనుండి త్రాడు-పాము లాగా కల్పితమైనట్టి కార్య-కరణ లక్షణాలున్న పృథివి మొదలైన పంచభూతాల సంఘాతాలు మరియు దేహేంద్రియ సంఘాతాలు పుడుతున్నాయి. అందుచేతనే, **ఘటాదివత్ చ** మరియు ఘటాదుల వలె **సంఘాతైః** సంఘాతాలు ఉత్పన్నమౌతున్నాయి అని, అంటున్నారు. మందమతులు ప్రతిపాదించిన విషయాన్ని సరిగా గ్రహించేందుకు వీలుగా వేదములలో ఆత్మ జీవాదులుగా పుడుతోంది అని చెప్పినప్పుడు, **జాతౌ** పుట్టుట అనేది యదార్థంగా ప్రాప్తిస్తున్నందుచేత (అది యదార్థంగా పుట్టటం కాదు అని చెప్పడం కోసమే), ఈ ఆకాశం నుండి పుట్టినట్లు అనే **ఏతత్ నిదర్శనమ్** ఈ ఉపమానాన్ని చెప్తున్నారు.

**ఘటాదిషు ప్రలీనేషు ఘటాకాశాదయో యథా |**
**ఆకాశే సమ్ప్రలీయన్తే తద్వజ్జీవా ఇహాత్మని ||** **|| మాం.గౌ.కా. 3-4 ||**

ఘటాదులు నశించగానే ఎలాగైతే ఘటాకాశం మహాకాశంలో విలీనమౌతుందో అలాగే జీవులు ఇక్కడ ఆత్మలో (విలీనమౌతారు).

**శంకరుల భాష్యము**

యథా ఘటాద్యుత్పత్త్యా ఘటాకాశాద్యుత్పత్తిః, యథా చ ఘటాదిప్రలయేన ఘటాకాశాదిప్రలయః, తద్వద్దేహాదిసంఘాతోత్పత్త్యా జీవోత్పత్తిః తత్ప్రలయేన చ జీవానాం ఇహ ఆత్మని ప్రలయః, న స్వత ఇత్యర్థః ..

సర్వదేహేష్వాత్మైకత్వే ఏ కస్మిన్ జననమరణసుఖదుఃఖాదిమత్యాత్మని సర్వాత్మనాం తత్సంబంధః క్రియాఫలసాంకర్యం చ స్యాదితి యే త్వాహుర్ద్వైతినః, తాన్ప్రతీదముచ్యతే —

<u>**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**</u>

**యథా** ఎలాగైతే ఘటం ఏర్పడినంతనే ఘటాకాశం ఏర్పడుతుందో మరియు **ఘటాదిషు ప్రలీనేషు** ఘటం నశించగానే **ఘటాకాశాదయః** ఘటాకాశాదులు **ఆకాశే** ఆకాశంలో **సంప్రలీయంతే** చక్కగా విలీనమౌతాయో, **తద్వత్** అదేవిధంగా దేహాదిసంఘాతం పుట్టగానే జీవులు పుడుతున్నారు, ఆ సంఘాతం నశించగానే **జీవాః** జీవులు **ఇహ** ఇక్కడ ఈ **ఆత్మని** ఆత్మయందే లయమౌతున్నారు. అంటే జీవులకు పుట్టుట, నశించుట అనేవి స్వతహాగా లేవని అభిప్రాయం.

సకల దేహములలోని ఆత్మ ఒక్కటే అయితే, వాటిలో ఒక దేహంలోని ఆత్మకు కలిగే జనన-మరణ-సుఖ-దుఃఖాదులతో సకల దేహములలోని ఆత్మలకు సంబంధం కలగవలసి వస్తుంది అని మరియు (ఆ జీవాత్మల యొక్క) క్రియ-ఫలాల సంకరం అనే సంక్లిష్టస్థితి కలిగే పరిస్థితి ఏర్పడుతోంది కదా అని ద్వైతులు ఏదైతే సంశయిస్తున్నారో, దానికి సమాధానాన్ని తర్వాత శ్లోకంలో ఇలా చెప్తున్నారు.

**యథైకస్మిన్ఘటాకాశే రజోధూమాదిభిర్యుతే |**
**న సర్వే సమ్ప్రయుజ్యన్తే తద్వజ్జీవాః సుఖాదిభిః ||** **|| మాం.గౌ.కా. 3-5 ||**

ఎలాగైతే ఒక ఘటాకాశంలో నిండిన దుమ్ము-పొగ మిగతా అన్ని ఘటాకాశాలలో ఉండవో, అలాగే జీవుల సుఖదుఃఖాలు కూడా (అంటే ఒక జీవి యొక్క సుఖఃదుఃఖాదులతో మిగిలిన జీవులకు సంబంధం ఉండదు).

<u>**శంకరుల భాష్యము**</u>

యథా ఏకస్మిన్ ఘటాకాశే రజోధూమాదిభిః యుతే సంయుక్తే, న సర్వే ఘటాకాశాదయః తద్రజోధూమాదిభిః సంయుజ్యంతే, తద్వత్ జీవాః సుఖాదిభిః . నను, ఏక ఏవాత్మా ; బాఢం ; నను న శ్రుతం త్వయా ఆకాశవత్సర్వసంఘాతేష్వేక ఏవాత్మేతి ? యద్యేక ఏవాత్మా, తర్హి సర్వత్ర సుఖీ దుఃఖీ చ స్యాత్ ; న చేదం సాంఖ్యస్య చోద్యం సంభవతి ; న హి సాంఖ్య ఆత్మనః సుఖదుఃఖాదిమత్త్వమిచ్ఛతి, బుద్ధిసమవాయాభ్యుపగమాత్సుఖదుఃఖాదీనాం ; న చోపలబ్ధిస్వరూపస్యాత్మనో భేదకల్పనాయాం ప్రమాణమస్తి . భేదాభావే ప్రధానస్య పారార్థ్యానుపపత్తిరితి చేత్ , న ; ప్రధానకృతస్యార్థస్యాత్మన్యసమవాయాత్ ; యది హి ప్రధానకృతో బంధో మోక్షో వా అర్థః పురుషేషు భేదేన సమవైతి, తతః ప్రధానస్య పారార్థ్యమాత్మైకత్వే నోపపద్యత ఇతి యుక్తా పురుషభేదకల్పనా ; న చ సాంఖ్యైర్బంధో మోక్షో వార్థః పురుషసమవేతోఽభ్యుపగమ్యతే, నిర్విశేషాశ్చ చేతనమాత్రా ఆత్మానోఽభ్యుపగమ్యంతే ; అతః పురుషసత్తామాత్రప్రయుక్తమేవ ప్రధానస్య పారార్థ్యం సిద్ధం , న తు పురుషభేదప్రయుక్తమితి ; అతః పురుషభేదకల్పనాయాం న ప్రధానస్య పారార్థ్యం హేతుః ; న చాన్యత్పురుషభేదకల్పనాయాం ప్రమాణమస్తి సాంఖ్యానాం . పరసత్తామాత్రమేవ చైతన్నిమిత్తీకృత్య స్వయం బధ్యతే ముచ్యతే చ ప్రధానం ; పరశ్చోపలబ్ధిమాత్రసత్తాస్వరూపేణ ప్రధానప్రవృత్తౌ హేతుః, న కేనచిద్విశేషేణేతి, కేవలమూఢతయైవ పురుషభేదకల్పనా వేదార్థపరిత్యాగశ్చ . యే త్వాహుర్వైశేషికాదయః ఇచ్ఛాదయ ఆత్మసమవాయిన ఇతి ; తదప్యసత్ , స్మృతిహేతూనాం సంస్కారాణామప్రదేశవత్యాత్మన్యసమవాయాత్ , ఆత్మమనఃసంయోగాచ్చ స్మృత్యుత్పత్తేః స్మృతినియమానుపపత్తిః, యుగపద్వా సర్వస్మృత్యుత్పత్తిప్రసంగః . న చ

భిన్నజాతీయానాం స్పర్శాదిహీనానామాత్మనాం మనఆదిభిః సంబంధో యుక్తః . న చ ద్రవ్యాద్రూపాదయో గుణాః కర్మసామాన్యవిశేషసమవాయా వా భిన్నాః సంతి . పరేషాం యది హ్యత్యంతభిన్నా ఏవ ద్రవ్యాత్స్యుః ఇచ్ఛాదయశ్చాత్మనః, తథా సతి ద్రవ్యేణ తేషాం సంబంధానుపపత్తిః . అయుతసిద్ధానాం సమవాయలక్షణః సంబంధో న విరుధ్యత ఇతి చేత్ , న ; ఇచ్ఛాదిభ్యోఽనిత్యేభ్య ఆత్మనో నిత్యస్య పూర్వసిద్ధత్వాన్నాయుతసిద్ధత్వోపపత్తిః . ఆత్మనా అయుతసిద్ధత్వే చ ఇచ్ఛాదీనామాత్మగతమహత్త్వవన్నిత్యత్వప్రసంగః . స చానిష్టః, ఆత్మనోఽనిర్మోక్షప్రసంగాత్ . సమవాయస్య చ ద్రవ్యాదన్యత్వే సతి ద్రవ్యేణ సంబంధాంతరం వాచ్యం , యథా ద్రవ్యగుణయోః . సమవాయో నిత్యసంబంధ ఏవేతి న వాచ్యమితి చేత్ , తథా సతి సమవాయసంబంధవతాం నిత్యసంబంధప్రసంగాత్పృథక్త్వానుపపత్తిః . అత్యంతపృథక్త్వే చ ద్రవ్యాదీనాం స్పర్శవదస్పర్శద్రవ్యయోరివ షష్ఠ్యర్థానుపపత్తిః . ఇచ్ఛాద్యుపజనాపాయవద్గుణవత్త్వే చ ఆత్మనోఽనిత్యత్వప్రసంగః . దేహఫలాదివత్సావయవత్వం విక్రియావత్త్వం చ దేహాదివదేవేతి దోషావపరిహార్యౌ . యథా త్వాకాశస్య అవిద్యాధ్యారోపితఘటాద్యుపాధికృతరజోధూమమలవత్త్వాదిదోషవత్త్వం , తథా ఆత్మనః అవిద్యాధ్యారోపితబుద్ధ్యాద్యుపాధికృతసుఖదుఃఖాదిదోషవత్త్వే బంధమోక్షాదయో వ్యావహారికా న విరుధ్యంతే ; సర్వవాదిభిరవిద్యాకృతవ్యవహారాభ్యుపగమాత్ పరమార్థానభ్యుపగమాచ్చ . తస్మాదాత్మభేదపరికల్పనా వృథైవ తార్కికైః క్రియత ఇతి ..

కథం పునరాత్మభేదనిమిత్త ఇవ వ్యవహార ఏకస్మిన్నాత్మన్యవిద్యాకృత ఉపపద్యత ఇతి, ఉచ్యతే .

## <u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>

**యథా** ఎలాగైతే **ఏకస్మిన్** ఒకానొక **ఘటాకాశే** ఘటాకాశం **రజోధూమాదిభిః యుతే** దుమ్ము-పొగతో కూడి ఉన్నా **సర్వే** ఇతర ఘటాకాశాలన్నీ ఆ ధూమం-పొగతో **న సంప్రయుజ్యన్తే** నిండియుండవో **తద్వత్** అదేవిధంగా **జీవాః** జీవుల **సుఖాదిభిః** సుఖఃదుఃఖాదులు కూడా (ఒక జీవి యొక్క సుఖః దుఃఖాదులతో మిగిలిన అన్ని జీవులకు సంబంధం ఉండదు అని అభిప్రాయం).

**<u>సందేహం</u>** : ఆత్మ ఒక్కటే కదా?

**<u>సమాధానం</u>** : అవును. ఆకాశం లాగా సకల (దేహేంద్రియ) సంఘాతాలలో ఉన్నది ఒకే ఆత్మ అని నీచే వినబడలేదా?

**<u>సందేహం</u>** : ఆత్మ ఒక్కటే అయితే, సర్వత్రా అది సుఖాన్నీ, దుఃఖాన్నీ కలిగి ఉండాలి.

**<u>సమాధానం</u>** : ఈ సందేహం సాంఖ్యులకు కలిగే అవకాశం లేదు. ఎందుకంటే, సాంఖ్యుల అభిప్రాయం ప్రకారం సుఖదుఃఖాదులు ఆత్మకు లేవు. వారు సుఖదుఃఖాదులు బుద్ధితో మాత్రమే విడదీయరాని సంబంధం (సమవాయం) కలవి అని అంటారు. అనుభవము లేదా ఎఱుకయే స్వరూపంగా గల ఆత్మ యందు (సుఖ దుఃఖాది) భేదాలను కల్పించడమన్నదానికి ప్రమాణం లేదు.

**<u>సందేహం</u>** : భేదమనేదే లేనప్పుడు, ప్రధానం ఇతరుల కొరకు (చేతనులైన అనేక పురుషుల ప్రయోజనానికై) మార్పును పొందుతుంది అనే (సాంఖ్యుల) సిద్ధాంతం నిలబడదు కదా?

**<u>సమాధానం</u>** : కాదు. ఎందుకంటే, ప్రధానం కలిగించే ప్రయోజనం ఆత్మతో సమవాయసంబంధాన్ని కలిగి ఉండేది కాదు కాబట్టి. (రెండు పదార్థాలకు మధ్యనుండే విడదీయలేని సంబంధాన్ని సమవాయసంబంధం అంటారు. ద్రవ్యానికి దాని గుణానికీ మధ్యన ఉండేది సమవాయ సంబంధానికి ఉదాహరణ. సంబంధం కనుక విడిపోయేదైతే దానిని సంయోగం అంటారు). ఒకవేళ ప్రధానం కలిగించే బంధం లేదా మోక్షం రూపమైన ప్రయోజనం పురుషులలో

వేర్వేరుగా కలిగేటట్లైతేనే, అప్పుడు ప్రధానం ఇతర చేతన పురుషులకు వేర్వేరుగా కలుగజేసే ప్రయోజనం ఆత్మ ఏకమే అనే ప్రతిపాదనను వ్యతిరేకిస్తుంది కాబట్టి, చేతన పురుషులలో భేదాన్ని కల్పించడం సాధ్యమౌతుంది. కాని ఏ ప్రయోజనమైనా, బంధం కాని మోక్షం కాని ఏదైనా, పురుషునితో సమవాయసంబంధాన్ని కలిగి ఉండదని, కేవలం చేతనులైన పురుషులు కూడా ఎటువంటి విశిష్టతలు లేనివారే అయినందున ఆ ఆత్మలందు కూడా సమవాయసంబంధమనేది కలగదు అని సాంఖ్యులు అంటున్నారు. అందుచేత, పురుషుడు ఉన్నంత మాత్రంచేతనే ప్రధానం ప్రవర్తిల్లుతున్నందున, ఆ ప్రధానం ఇతరముల (చేతన పురుషుల) కొరకు ప్రవర్తిల్లడం అనేది సిద్ధిస్తోందే కాని, చేతన పురుషులోని భేదం ప్రధానాన్ని ప్రవర్తిల్ల చేయడం లేదు. అందుచేత, చేతన పురుషులలోని భేద కల్పనకు, ప్రధానం యొక్క పరుల కొరకు ప్రవర్తిల్లడమనేది కారణం కాదు. చేతన పురుషులలోని భేద కల్పనకు కారణాన్ని చెప్పే మరొక ప్రమాణమేదీ సాంఖ్యుల వద్ద లేదు. కేవలం పరమ పురుషుడు ఉండటం మాత్రం చేత ప్రధానమే స్వయంగా బంధాన్ని మరియు మోక్షాన్ని పొందుతోంది అనేటట్లైతే, అంటే కేవలం ఎఱుకయే స్వరూపంగాగల పరమ పురుషుని ఉనికియే ప్రధానం యొక్క ప్రవృత్తికి హేతువు కాని, ఏదైనా ప్రత్యేకత వల్ల ప్రధానానికి ప్రవృత్తి కలుగుతుంది అనడం, వేదం చెప్పిన అభిప్రాయాన్ని త్యజించి కేవలం మూర్ఖంగా పురుషులలో భేదాన్ని కల్పించడమే అవుతుంది. (ఆ విధంగా పరమ పురుషుడిని మరియు అనేక చేతనములైన ఆత్మలను ప్రతిపాదించే సాంఖ్యుల సిద్ధాంతంతో ఇక్కడ విభేదిస్తున్నారు).

వైశేషికాదులు కోరిక మొదలైనవాటికి ఆత్మతో సమవాయి సంబంధాన్ని (విడదీయలేని సంబంధాన్ని) చెప్పారు. అది కూడా అసత్యమే. ఎందుకంటే, స్మృతులకు (గడచిన అనుభవాలకు) కారణమైన సంస్కారాలు, ఆత్మతో సంబంధం కలిగి ఉంటూ ఒక ప్రదేశమంటూ లేని ఆత్మయందు ఒక ప్రత్యేక ప్రదేశంలో ఉండటం కుదరదు. (వైశేషికుల అభిప్రాయం ప్రకారం) స్మరణలు అన్నవి ఆత్మతో మనసుయొక్క కలయిక వల్ల ఉత్పన్నమౌతున్నాయి. అందుచేత, స్మరణలు ఒక నియమానుసారంగా (ఒక నిర్దిష్ట క్రమంలో) కలుగుతున్నాయని చెప్పడానికి వీలులేదు. లేదా ఒకేసారి అన్ని స్మరణలూ కలుగవచ్చు. ఇంకా, భిన్న జాతీయాలైనవి మరియు స్పర్శ అనే ధర్మం లేనివి అయిన ఆత్మలతో మనసు మొదలైనవి సంబంధ కలిగి ఉన్నాయనడం కూడా సమంజసం కాదు. మరింకా, రూపాది గుణాలు లేదా కర్మ-సామాన్యత్వం-ప్రత్యేకత్వం లేదా సమవాయత్వం అనే ధర్మాలు ద్రవ్యధర్మాలకు భిన్నంగా స్వతంత్రంగా ఉంటాయి. (ఈ చెప్పబడిన గుణాలు) ద్రవ్యానికి అత్యంత భిన్నమైనవే అని నిశ్చయం కాగా గుణాలకు ద్రవ్యంతో సంబంధం లేనట్లుగానే, కోరిక మొదలైనవాటికి ఆత్మతో సంబంధం నిరూపించబడటం లేదు. (ఈ విధంగా వైశేషికుల సిద్ధాంతాన్ని కూడా నిరాకరిస్తున్నారు).

**<u>సందేహం</u>** : కలయిక అనేది (అన్ని కాలాలలోనూ) సిద్ధమై ఉండటం సమవాయలక్షణమైన సంబంధానికి (విడదీయరాని సంబంధానికి) విరుద్ధమేమీ కాదు కదా!

**<u>సమాధానం</u>** : కాదు. కోరిక మొదలైనవి అశాశ్వతములు, ఆత్మ వాటన్నింటికి పూర్వమే నిత్యంగా సిద్ధమై ఉన్నందుచేత 'అయుతసిద్ధత్వం' (అన్ని కాలాలలోనూ కలిసి ఉండటం అనే స్థితి) అన్నది లేదు. ఆత్మయందు కోరికలకు 'అయుతసిద్ధత్వం' చెప్పినట్లైతే, ఆ కోరికలు మొదలైనవాటికి ఆత్మగతమైన మహత్తత్వం లాగా నిత్యత్వం ప్రాప్తిస్తుంది. అది అంగీకారం కాదు. ఎందుకంటే, (కోరికలు శాశ్వతంగా ఆత్మతో కూడినవైనందు చేత) ఆత్మకు మోక్షం కలిగే పరిస్థితి ఉండదు. ఆత్మకు కోరికలకు సమవాయత్వం లేకపోతే, (ఆత్మకు కోరికలకు మధ్య)

సమవాయత్వానికి భిన్నమైన వేరొక సంబంధాన్ని వైశేషికులు చెప్పవలసి ఉంటుంది. (కాని, అటువంటి సంబంధాన్ని వారు చెప్పడం లేదు. అందుచేత, ఆత్మకు కోరికలతో సంబంధం లేదనే నిర్ధారణ అవుతోంది).

**సందేహం** : సమవాయం అనేది శాశ్వతమైన సంబంధమే కాబట్టి, (ద్రవ్యానికి దానితో) మరొక సంబంధాన్ని చెప్పనవసరం లేదు కదా!

**సమాధానం** : అలా అయినా సమవాయ సంబంధం కలవి నిత్యసంబంధం కలవే అవుతాయి కాబట్టి వాటిలో భిన్నత్వం అనేది ఉండదు. స్పర్శ అనే గుణం కల ద్రవ్యం, స్పర్శ అనే గుణం లేని ద్రవ్యం లాగా, పూర్తిగా భిన్నత్వం కలిగిన వాటికి షష్ఠీ విభక్తి అర్థాన్ని చెప్పలేం. (అంటే, కోరికలను వాటికి పూర్తిగా భిన్నమైన ఆత్మకు సంబంధించినవి అన్నట్లు 'ఆత్మ యొక్క కోరికలు' అని చెప్పడం కుదరదు). పెరుగుట, తరుగుట అనే గుణాలున్న కోరికలు మొదలైనవాటితో సంబంధం కలిగిన ఆత్మకు - దేహాలు, కర్మఫలాలు వంటి విభాగాలు కలగటం మరియు మార్పుకు లోనవడం వంటి అనివార్యమైన దోషాలు కలిగిన దేహాలకు వలెనే - అనిత్యత్వం ప్రాప్తిస్తుంది. ఘటం వంటి ఉపాధుల వల్ల కలిగిన దుమ్ము-పొగ-మలినం వంటి దోషాలను అజ్ఞానంచేత ఆకాశాన్ని ఆపాదిస్తున్నట్లే, బుద్ధి వంటి ఉపాధుల వల్ల కలిగిన సుఖదుఃఖాది దోషాలు అజ్ఞానంచేత ఆత్మయందు అధ్యారోపితమౌతున్నాయి అనడం, బంధ-మోక్షాదులనే వ్యవహారాలతో విభేదించదు. అన్నిరకాల వాదాల వారు అజ్ఞానంవల్ల ఈ వ్యవహారం అన్నది కలుగుతున్నదని అంగీకరించినప్పటికీ, దాని పరమమైన అర్థాన్ని మాత్రం గ్రహించడం లేదు. అందుచేత, తార్కికులచే కల్పించబడిన ఆత్మయందలి ఈ భేదం అవసరంలేనిది అని అభిప్రాయం.

మరైతే, ఆత్మలయందు భేదమే కారణం అన్నట్లుగా ఈ వ్యవహారమంతా అవిద్యచేత కల్పించబడి, ఒకే ఆత్మయందు ఎలా సంప్రాప్తిస్తోందో తర్వాత శ్లోకంలో చెప్తున్నారు.

**రూపకార్యసమాఖ్యాశ్చ భిద్యన్తే తత్ర తత్ర వై |**
**ఆకాశస్య న భేదోఽస్తి తద్వజ్జీవేషు నిర్ణయః || || మాం.గౌ.కా. 3-6 ||**

రూపాలు, కార్యాలు, నామాలు అనే విభిన్నతలు అంతటా ఉన్నా, ఆకాశంలో ఎలాంటి భేదం లేదో, అలాగే జీవుల విషయంలో (అభిన్నత్వం) నిర్ధారితమౌతోంది.

**శంకరుల భాష్యము**

యథా ఇహాకాశే ఏకస్మిన్ఘటకరకాపవరకాద్యాకాశానా మల్పత్వమహత్త్వాదిరూపాణి భిద్యంతే, తథా కార్యముదకాహరణధారణశయనాది, సమాఖ్యాశ్చ ఘటాకాశః కరకాకాశ ఇత్యాద్యాః తత్కృతాశ్చ భిన్నా దృశ్యంతే, తత్ర తత్ర వై వ్యవహారవిషయే ఇత్యర్థః . సర్వోఽయమాకాశే రూపాదిభేదకృతో వ్యవహారః అపరమార్థ ఏవ . పరమార్థతస్త్వాకాశస్య న భేదోఽస్తి . న చాకాశభేదనిమిత్తో వ్యవహారోఽస్తి అంతరేణ పరోపాధికృతం ద్వారం . యథైతత్ , తద్వద్దేహోపాధిభేదకృతేషు జీవేషు ఘటాకాశస్థానీయేష్వాత్మసు నిరూపణాత్కృతః బుద్ధిమద్భిః నిర్ణయః నిశ్చయ ఇత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఇక్కడ ఒకే ఆకాశంలో ఎలాగైతే కుండ-బాన-ఇల్లు మొదలైన వాటిచే ఆవరించబడిన ఆకాశాలలో చిన్నది, పెద్దది అనే **రూప** రూపాలలో తేడాలున్నట్లు అన్పిస్తోందో, అలాగే నీటిని తెచ్చుకునేది, నీటితో నింపబడేది,

శయనించేది వంటి అనేక **కార్య** కార్యాలలో తేడాలు **చ** మరియు ఘటాకాశం-బాన ఆకాశం-గృహాకాశం మొదలైన భిన్నమైన **సమాఖ్యాః** పేర్లవంటివి అన్నీ కుండ, బాన, మొదలైనవాటి వల్ల ఏర్పడి **భిద్యన్తే** భిన్నమైనవిగా **తత్ర తత్ర వై** వ్యవహరింపబడుతున్నాయి అని అభిప్రాయం. ఆకాశంలోని ఈ సకలమైన వివిధ రూపాలచే కలిగిన వ్యవహారమంతా నిజం కానిదే. నిజానికి **ఆకాశస్య** ఆకాశానికి **న భేదః అస్తి** ఎటువంటి భేదం లేదు. ఆకాశానికి బాహ్యంలోని ఉపాధుల ద్వారా ఈ వ్యవహారం కలుగుతోందే కాని, ఆకాశంలో అంతర్గతమైన భేదం కారణంగా కలగటం లేదు. **తద్వత్** ఈ విధంగానే **జీవేషు** ఘటాకాశాలతో పోలికల కలగి, దేహములనే ఉపాధిభేదాల వల్ల కలిగిన జీవులలో కూడా ఎటువంటి భేదం లేదని వివేకవంతులు నిరూపణ చేసి **నిర్ణయః** నిశ్చయించారు అని అభిప్రాయం.

**నాకాశస్య ఘటాకాశో వికారావయవౌ యథా |**
**నైవాత్మనః సదా జీవో వికారావయవౌ తథా || || మాం.గౌ.కా. 3-7 ||**

ఘటాకాశం ఆకాశం యొక్క వికారంగాని అవయవంగాని ఎలా కాదో, అలాగే అన్ని కాలాలలోనూ జీవుడు ఆత్మయొక్క వికారమూ కాదు, అవయవమూ కాదు.

**<u>శంకరుల భాష్యము</u>**

నను తత్ర పరమార్థకృత ఏవ ఘటాకాశాదిషు రూపకార్యాదిభేదవ్యవహార ఇతి ; నైతదస్తి, యస్మాత్పరమార్థాకాశస్య ఘటాకాశో న వికారః, యథా సువర్ణస్య రుచకాదిః, యథా వా అపాం ఫేనబుద్బుదహిమాదిః ; నాప్యవయవః, యథా వృక్షస్య శాఖాదిః . న తథా ఆకాశస్య ఘటాకాశో వికారావయవౌ యథా, తథా నైవాత్మనః పరస్య పరమార్థసతో మహాకాశస్థానీయస్య ఘటాకాశస్థానీయో జీవః సదా సర్వదా యథోక్తదృష్టాంతవన్న వికారః, నాప్యవయవః . అత ఆత్మభేదకృతో వ్యవహారో మృషైవేత్యర్థః ..

యస్మాద్యథా ఘటాకాశాదిభేదబుద్ధినిబంధనో రూపకార్యాదిభేదవ్యవహారః, తథా దేహోపాధిజీవభేదకృతో జన్మమరణాదివ్యవహారః, తస్మాత్తత్కృతమేవ క్లేశకర్మఫలమలవత్త్వమాత్మనః, న పరమార్థత ఇత్యేతమర్థం దృష్టాంతేన ప్రతిపిపాదయిషన్నాహ —

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

**<u>సందేహం</u>** : కాని, అక్కడ ఉదాహరణలోని ఘటాకాశాలలో రూపం-కార్యం-నామం అనే విభిన్నమైన వ్యవహారాలు యదార్థంగా జరుగుతున్నాయి కదా!

**<u>సమాధానం</u>** : లేదు. అలా ఉండటం లేదు. ఎందుకంటే, బంగారం నుండి ఆభరణం లాగా లేదా నీటి నుండి ఉత్పన్నమైన నురగ, బుడగ, మంచు లాగా, **ఘటాకాశః** ఘటాకాశం యదార్థంగా **ఆకాశస్య** ఆకాశం యొక్క **వికారః న** వికారం కాదు కాబట్టి. మరియు చెట్టుకు కొమ్మల లాగా, **అవయవః న** అవయవమూ కాదు. ఆవిధంగా, ఎలాగైతే ఘటాకాశం ఆకాశం యొక్క వికారమూ మరియు అవయవమూ కాదో, **తథా** అలాగే, ఘటాకాశంతో పోల్చదగిన **జీవః** జీవుడు **సదా** ఎల్లప్పుడూ **ఆత్మనః** ఉదాహరణలో చెప్పిన మహాకాశంతో పోల్చదగిన పరమమైన యదార్థమైన సత్యము యొక్క వికారమూ (పరిణామము) కాదు, అవయవము కూడా కాదు. అందుచేత, ఆత్మయందు భేదాన్ని కలిగించే వ్యవహారం అంతా మిథ్యయే (సత్యము కాదు) అని అభిప్రాయం.

ఏ అజ్ఞానం వల్లనైతే, ఘటాకాశం మొదలైన భేదాలచే పరిమితమైన బుద్ధి రూపం-కార్యం-నామం అనే భేదాలతో వ్యవహరించినట్లుగా, దేహాది ఉపాధి భేదాలు కల జీవుడు జన్మ-మరణాదులలో ప్రవర్తిల్లుతున్నాడో, ఆ అజ్ఞానం కారణంగానే దుఃఖం-కర్మఫలం-మలినత్వాదులు ఆత్మయందు ఆరోపించబడుతున్నాయి కాని, యదార్థంగా అవి ఆత్మయందు లేవు అనే అభిప్రాయాన్ని ఉదాహరణ పూర్వకంగా ప్రతిపాదిస్తూ తర్వాత శ్లోకాన్ని చెబుతున్నారు.

**యథా భవతి బాలానాం గగనం మలినం మలైః |**
**తథా భవత్యబుద్ధానామాత్మాపి మలినో మలైః ||** **|| మాం.గౌ.కా. 3-8 ||**

మూఢులకు ఎలాగైతే ఆకాశం దుమ్ము ధూళితో మలినమైనట్లు కనిపిస్తుందో, అలాగే అవివేకులకు ఆత్మ కూడా దోషాలతో నిండినట్లుగా కనిపిస్తుంది.

**శంకరుల భాష్యము**

యథా భవతి లోకే బాలానాం అవివేకినాం గగనం ఆకాశం ఘనరజోధూమాదిమలైః మలినం మలవత్ , న గగనయాథాత్మ్యవివేకవతాం , తథా భవతి ఆత్మా పరోఽపి — యో విజ్ఞాతా ప్రత్యక్ — క్లేశకర్మఫలమలైర్మలినః అబుద్ధానాం ప్రత్యగాత్మవివేకరహితానాం , నాత్మవివేకవతాం . న హ్యూషరదేశః తృడ్వత్ప్రాణ్యధ్యారోపితోదకఫేనతరంగాదిమాన్ , తథా నాత్మా అబుధారోపితక్లేశాదిమలైః మలినో భవతీత్యర్థః ..

పునరప్యుక్తమేవార్థం ప్రపంచయతి —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

లోకంలో **యథా** ఎలాగైతే **బాలానామ్** తెలివిలేని వారికి **గగనమ్** ఆకాశం **మలైః** దట్టమైన దుమ్ము, పొగ వంటివాటితో నిండి **మలినమ్** మలినమైనదిగా **భవతి** అనిపించినట్లుగా, అకాశం యొక్క యదార్థస్వరూపాన్ని తెలిసిన వివేకులకు అలా అనిపించదు. అలాగే **ఆత్మా అపి** ఆత్మ కూడా **అబుద్ధానామ్** ఎవరైతే యదార్థాన్ని తెలియకున్నారో వారికి, అంటే పత్యగాత్మ గురించిన వివేకం లేనివారికి, పరమాత్మ గురించి తెలియని వారికి **మలైః** దుఃఖము, కర్మఫలాదుల వంటి మలినాలతో **మలినః** దోషభూయిష్టమైనదిగా **భవతి** అనిపిస్తుంది. ఎలాగైతే దప్పికగొన్న ప్రాణి ఆరోపించిన నీరు, నురగ, తరంగాలు నిజానికి ఎడారి ప్రదేశానికి ఉండవో, అలాగే వివేకరహితులచే అధ్యారోపణం చేయబడిన సుఖదుఃఖాది దోషాలు నిజానికి ఆత్మయందు లేవు అని అభిప్రాయం.

ఇదే అభిప్రాయాన్నే మరింత వివరంగా వెల్లడి చేస్తూ తర్వాత శ్లోకాన్ని చెప్తున్నారు.

**మరణే సమ్భవే చైవ గత్యాగమనయోరపి |**
**స్థితౌ సర్వశరీరేషు చాకాశేనావిలక్షణః ||** **|| మాం.గౌ.కా. 3-9 ||**

సకల శరీరాలలో జనన-మరణాదులు, రాక-పోకాది స్థితులు కలిగి ఉండటంలో (ఆత్మకు) ఆకాశంతో విలక్షణత (వైరుధ్యం) లేదు.

**శంకరుల భాష్యము**

ఘటాకాశజన్మనాశగమనాగమనస్థితివత్సర్వశరీరేష్వాత్మనో జన్మమరణాది రాకాశేనావిలక్షణః ప్రత్యేతవ్య ఇత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఘటాకాశానికి జననం-మరణం, రాక-పోక-స్థితి ఉన్నట్లుగానే, జనన-మరణాది విషయాలలో సకల దేహాలలోని ఆత్మకు, ఆకాశంతో ఎటువంటి భేదం లేదు అని అభిప్రాయం. (అంటే జనన-మరణాదులు ఘటానికే గాని ఘటాకాశానికి లేవు. అలాగే జనన-మరణాదులు దేహానికే గాని దేహంలోని ఆత్మకు లేవు అని తెలుసుకోవాలి).

**సంఘాతాః స్వప్నవత్సర్వ ఆత్మమాయావిసర్జితాః |**
**ఆధిక్యే సర్వసామ్యే వా నోపపత్తిర్హి విద్యతే || || మాం.గౌ.కా. 3-10 ||**

దేహేంద్రియ సంఘాతాలన్నీ, స్వప్నంలాగా ఆత్మ యొక్క మాయచేత కల్పించబడినవే. (వాటి) పుట్టుకచేత గొప్పవని గాని లేదా సర్వసామాన్యమైనవి అని గాని నిశ్చయించి చెప్పడం కుదరదు.

**శంకరుల భాష్యము**

ఘటాదిస్థానీయాస్తు దేహాదిసంఘాతాః స్వప్నదృశ్యదేహాదివన్మాయా వికృతదేహాదివచ్చ ఆత్మమాయావిసర్జితాః, ఆత్మనో మాయా అవిద్యా, తయా ప్రత్యుపస్థాపితాః, న పరమార్థతః సంతీత్యర్థః . యది ఆధిక్యమధికభావః తిర్యగ్దేహాద్యపేక్షయా దేవాదికార్యకరణసంఘాతానాం , యది వా సర్వేషాం సమతైవ, తేషాం న హ్యుపపత్తిసంభవః, సంభవప్రతిపాదకో హేతుః న విద్యతే నాస్తి ; హి యస్మాత్ , తస్మాదవిద్యాకృతా ఏవ, న పరమార్థతః సంతీత్యర్థః ..

ఉత్పత్త్యాదివర్జితస్యాద్వయస్యాస్యాత్మతత్త్వస్య శ్రుతిప్రమాణకత్వప్రదర్శనార్థం వాక్యాన్యుపన్యస్యంతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**సంఘాతాః** ఘటాదులతో పోల్చదగిన దేహేంద్రియ సంఘాతాలు **స్వప్నవత్** స్వప్నంలో కనిపించే దేహాలలాగా మరియు ఇంద్రజాలికుడు కల్పించిన దేహాలలాగా **ఆత్మమాయా** ఆత్మ యొక్క మాయ, అంటే అజ్ఞానం. ఆ అజ్ఞానం చేత **విసర్జితాః** రూపొందించబడినవి మాత్రమే, అంటే యదార్థంగా లేవు అని అభిప్రాయం. ఒకవేళ **ఆధిక్యే** పశుపక్ష్యాదులతో పోలిస్తే దేవతలు మొదలైన దేహేంద్రియ సంఘాతాలు ఉన్నతమైనవి అనే భావనలో గాని **వా** లేదా **సర్వ సామ్యే** సకల ప్రాణులు సమానమే అనే భావనలో గాని, వాటి **హి** నిశ్చయంగా **ఉపపత్తి** సంభవాన్ని నిరూపించడం, సంభవానికి కారణాన్ని నిరూపించి చెప్పడం **న విద్యతే** ఉండదు. అందుచేత, అవన్నీ (దేహేంద్రియ సంఘాతాలన్నీ ) అజ్ఞానం చేత కల్పించబడినవే కాని యదార్థానికి లేవు అని అభిప్రాయం.

ఆత్మతత్త్వం యొక్క ఉత్పత్తిరహిత స్థితిని గురించి శ్రుతి ప్రమాణాలను చూపెట్టేందుకు తర్వాత శ్లోకాలను బోధిస్తున్నారు.

**రసాదయో హి యే కోశా వ్యాఖ్యాతాస్తైత్తిరీయకే |**

**తేషామాత్మా పరో జీవః ఖం యథా సంప్రకాశితః ||** **|| మాం.గౌ.కా. 3-11 ||**

తైత్తిరీయోపనిషత్తులో వివరించబడిన అన్నమయాది రసాలతో నిండిన కోశాల లోపల, ఆత్మతో పోలిక చెప్పబడిన పరమాత్మయే, జీవునిగా ప్రకాశిస్తున్నాడు.

**శంకరుల భాష్యము**

రసాదయః అన్నరసమయః ప్రాణమయ ఇత్యేవమాదయః కోశా ఇవ కోశాః అస్యాదేః, ఉత్తరోత్తరాపేక్షయా బహిర్భావాత్పూర్వపూర్వస్య వ్యాఖ్యాతాః విస్పష్టమాఖ్యాతాః తైత్తిరీయకే తైత్తిరీయకశాఖోపనిషద్వల్ల్యాం , తేషాం కోశానామాత్మా యేనాత్మనా పంచాపి కోశా ఆత్మవంతోఽన్తరతమేన . స హి సర్వేషాం జీవననిమిత్తత్వాజ్జీవః . కోఽసావిత్యాహ — పర ఏవాత్మా యః పూర్వం 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' (తై. ఉ. 2 . 1 . 1) ఇతి ప్రకృతః ; యస్మాదాత్మనః స్వప్నమాయాదివదాకాశాదిక్రమేణ రసాదయః కోశలక్షణాః సంఘాతా ఆత్మమాయావిసర్జితా ఇత్యుక్తం . స ఆత్మా అస్మాభిః యథా ఖం తథేతి సంప్రకాశితః, 'ఆత్మా హ్యాకాశవత్' (మా. కా. 3 . 3) ఇత్యాదిశ్లోకైః . న తార్కికపరికల్పితాత్మవత్పురుషబుద్ధిప్రమాణగమ్య ఇత్యభిప్రాయః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**రసాదయః** అన్నరసమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములైన **కోశాః** కోశముల వంటివి, తరువాత వాటితో పోలిస్తే దానికి ముందు ఉన్నవి బాహ్యామైనవి అని **తైత్తిరీయకే** తైత్తిరీయక శాఖకు సంబంధించిన ఉపనిషత్తులోని వల్లీలలో **వ్యాఖ్యాతాః** వివరంగా వ్యాఖ్యానించబడినవో, **తేషామ్ ఆత్మా** ఆ కోశముల ఆత్మగా, ఆ కోశముల లోపల ఉన్న ఏ ఆత్మచేత ఆ అయిదు కోశాలు ఆత్మకలిగినవైనాయో అదియే సకలప్రాణుల యొక్క జీవనానికి కారణమైన **జీవః** జీవుడు. ఆ జీవుడు ఎవరనేది చెప్తున్నారు. 'సత్యము, జ్ఞానము, అనంతము అయిన బ్రహ్మ' ['సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' (తై.ఉ. 2-1- 1)] అని ఆ తైత్తిరీయోపనిషత్తులోని ముందు మంత్రాలలో దేనిని ప్రస్తావించారో ఆ **పరః ఆత్మా** పరమాత్మయే. ఏ ఆత్మనుండి స్వప్నంలాగా, ఇంద్రజాలికం లాగా ఆకాశం నుండి వరుసగా అన్నమయాది కోశ లక్షణాలు కల దేహేంద్రియ సంఘాతాల వరకు అన్నీ కూడా ఆత్మ యొక్క మాయ చేత కల్పించబడినవే అని చెప్తున్నారు. ఆకాశం వలె అని పోలికచేసి 'ఆత్మా హ్యాకాశవత్' (మా.గౌ.కా. 3-3) అని దేనిని మేము చెప్పామో ఆ ఆత్మయే **సంప్రకాశితః** చక్కగా ప్రకాశిస్తోంది. అంతేకాని, అది తర్కవాదులచేత (సాంఖ్యులు, వైశేషికుల వంటి వారి చేత) కేవలం మానవ బుద్ధికి తోచిన అనుమాన ప్రమాణాల ద్వారా కల్పించబడిన ఆత్మ వంటిది కాదు అని అభిప్రాయం.

**ద్వయోర్ద్వయోర్మధుజ్ఞానే పరం బ్రహ్మ ప్రకాశితమ్ |**

**పృథివ్యాముదరే చైవ యథాకాశః ప్రకాశితః ||** **|| మాం.గౌ.కా. 3-12 ||**

భూమియందూ మరియూ ఉదరంలోనూ ఆకాశం ప్రకాశితమైనట్లే, రెండు ద్వంద్వాలకు సంబంధించి చెప్పిన మధువిద్యలో కూడా పరబ్రహ్మమే ప్రకాశితమౌతుంది.

**<u>శంకరుల భాష్యము</u>**

కించ, అధిదైవతమధ్యాత్మం చ తేజోమయోఽమృతమయః పురుషః పృథివ్యాద్యంతర్గతో యో విజ్ఞాతా పర ఏవాత్మా బ్రహ్మ సర్వమితి ద్వయోర్ద్వయోః ఆ ద్వైతక్షయాత్ పరం బ్రహ్మ ప్రకాశితం ; క్వేత్యాహ — బ్రహ్మవిద్యాఖ్యం మధు అమృతం , అమృతత్వం మోదనహేతుత్వాత్ , తద్విజ్ఞాయతే యస్మిన్నితి మధుజ్ఞానం మధుబ్రాహ్మణం , తస్మిన్నిత్యర్థః . కిమివేత్యాహ — పృథివ్యాం ఉదరే చైవ యథా ఏక ఆకాశః అనుమానేన ప్రకాశితః లోకే, తద్వదిత్యర్థః ..

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

మరింకా, అధిదైవత సందర్భంలో (అంటే సకల జగత్తు రూపంలో ఉన్న పరమాత్మ గురించి ప్రస్తావించే సందర్భంలో) పృథివి మొదలైన వాటిలో మరియు అధ్యాత్మ సందర్భంలో (అంటే ప్రాణుల ఆత్మ స్వరూపాన్ని గురించి ప్రస్తావించే సందర్భాలలో) అంతర్గతంగా ఏ తేజోమయుడు మరియు అమృతమయుడైన పురుషునిగా తెలియబడేది పరమాత్మయే, బ్రహ్మయే. ఇలా సకలమైన **ద్వయోః ద్వయోః** రెండు ద్వంద్వాలలోని (అధిదైవికం-అధ్యాత్మం, తేజోమయం-అమృతమయం అనే రెండు ద్వంద్వాలుగా) ఆద్వైత భావన నశించేంతవరకూ అంతర్గతంగా ఉండి, నశించగానే **పరమ్ బ్రహ్మ** పరబ్రహ్మ **ప్రకాశితమ్** ప్రకటనమౌతుంది. అలా అని ఎక్కడ అన్నారో చెప్తున్నారు. బ్రహ్మవిద్య అని పిలువబడే మధువు (తేనె), ఆనందానికి కారణమైనందున అదియే అమృతం. అమృతం అంటే అమృతత్వం (మరణ రహిత స్థితి లేదా మోక్షం). ఏ జ్ఞానం కలగడంచేత అది తెలియబడుతుందో అది మధుజ్ఞానం. ఆ మధువిద్య ఏ బ్రాహ్మణంలో కలదో దానినే 'మధుబ్రాహ్మణం' అంటారు. ఆ **మధుజ్ఞానే** మధుబ్రాహ్మణంలో (బృహదారణ్యకోపనిషత్తులో) పై విధంగా చెప్పారు అని అభిప్రాయం. అది ఏ విధంగా ఉన్నదో చెప్తున్నారు. లోకంలో **పృథివ్యామ్ ఉదరే చ** భూమియందు మరియు ఉదరంలో కూడా (రెండుగా) **యథా** ఏవిధంగా **ఆకాశః** ఒకే ఆకాశం అనుమాన ప్రమాణంచేత **ప్రకాశితః** ప్రకటనమౌతున్నదో ఆ విధంగా అని అభిప్రాయం. (భూమిలోనూ మరియు ఉదరం లోపల కూడా ఉన్నది ఒకే ఆకాశమని ఎలాగైతే అనుమాన ప్రమాణం చేత స్పష్టంగా తెలుసుకొంటున్నామో ఆ విధంగా ఒకే పరమాత్మ సర్వత్రా ఉన్నాడనే సత్యాన్ని మధువిద్య బోధిస్తోంది అని అర్థం).

**జీవాత్మనోరనన్యత్వమభేదేన ప్రశస్యతే |**
**నానాత్వం నిన్ద్యతే యచ్చ తదేవం హి సమఞ్జసమ్ || || మాం.గౌ.కా. 3-13 ||**

దేని ద్వారా (ఏ ప్రకటన ద్వారా) జీవునకు ఆత్మ వేరుకాదనే సత్యం ఏకగ్రీవంగా ప్రశంసించబడి, అనేకత్వం నిందించబడుతోందో, అదియే (ఆ ప్రకటనయే) సరియైనది.

**<u>శంకరుల భాష్యము</u>**

యద్యుక్తితః శ్రుతితశ్చ నిర్ధారితం జీవస్య పరస్య చాత్మనోఽనన్యత్వం అభేదేన ప్రశస్యతే స్తూయతే శాస్త్రేణ వ్యాసాదిభిశ్చ, యచ్చ సర్వప్రాణిసాధారణం స్వాభావికం శాస్త్రబహిర్ముఖైః కుతార్కికైర్విరచితం నానాత్వదర్శనం నింద్యతే, 'న తు తద్ద్వితీయమస్తి' (బృ. ఉ. 4 . 3 . 23) 'ద్వితీయాద్వై భయం భవతి' (బృ. ఉ. 1 . 4 . 2) 'ఉదరమంతరం కురుతే, అథ తస్య భయం భవతి' (తై. ఉ. 2 . 7 . 1) 'ఇదం సర్వం యదయమాత్మా' (బృ. ఉ. 2 . 4 . 6) 'మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ

పశ్యతి' (క. ఉ. 2 . 4 . 10) ఇత్యేవమాదివాక్యైరన్యైశ్చ బ్రహ్మవిద్భిః యచ్చైతత్ , తదేవం హి సమంజసం ఋజ్వవబోధం న్యాయ్యమిత్యర్థః . యాస్తు తార్కికపరికల్పితాః కుదృష్టయః, తాః అనృజ్వ్యో నిరూప్యమాణా న ఘటనాం ప్రాంచంతీత్యభిప్రాయః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**జీవః ఆత్మనః అనన్యత్వమ్** జీవుని యొక్క ఆత్మకు, పరమమైన ఆత్మ (అంటే పరమాత్మ) వేరైనది కాదని, ఏదైతే చెప్పబడిందో మరియు శ్రుతి చేత నిశ్చయించబడిందో దానిని శాస్త్రములు మరియు వ్యాసమహర్షి మొదలైన వారు కూడా **అభేదేన** భిన్నాభిప్రాయం లేకుండా **ప్రశస్యతే** ప్రశంసిస్తున్నారు. సకల ప్రాణులకు సాధారణమైన స్వభావంతో, శాస్త్రాభిప్రాయాన్ని అంగీకరించకుండా ధిక్కరించి బహిర్ముఖులైన వారిచే, కుటిలమైన తర్కంతో నిర్మాణం చేసిన **నానాత్వమ్** అనేకత్వాన్ని దర్శించడం అనేది (శాస్త్రములు మరియు వ్యాసమహర్షులు మొదలైన వారిచే) **నిన్ద్యతే** నిందించబడుతోంది. 'ద్వితీయమన్నదైతే లేదు' ['న తు తద్ద్వితీయమస్తి' (బృ.ఉ. 4-3-23)]; 'ద్వితీయం చేత భయం నిశ్చయం' ['ద్వితీయాద్వై భయం భవతి' (బృ.ఉ. 1-4-2)]; 'ఏ కొద్ది తేడా ఉన్నా, దానిచేత భయం కలుగుతుంది' ['ఉదరమంతరం కురుతే, అథ తస్య భయం భవతి' (తై.ఉ. 2-7-1)]; 'ఈ సమస్తమూ ఈ ఆత్మయే' ['ఇదం సర్వం యదయమాత్మా' (బృ.ఉ. 2-4-6)]; 'ఇక్కడ నానాత్వాన్నే దర్శించిన వాడు మృత్యువు నుండి మృత్యవునే పొందుతాడు' ['మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి' (క.ఉ. 2-4-10)] వంటి అనేక వాక్యాలచే బ్రహ్మ వేత్తలు కూడా నానాత్వాన్ని నిందించారు. **యత్ చ తత్** ఈ చెప్పిన ఇదంతా **ఏవమ్ హి** మాత్రమే **సమంజసమ్** యదార్థమైనది, యుక్తమైనది లేదా న్యాయ సమ్మతమైనదని అభిప్రాయం. తార్కికులచే కల్పన చేయబడినవైతే దురూహమైనవి. అవి యదార్థములు కావు. సత్యప్రమాణములు కానందున అవి నిరూపణకు నిలబడవు.

**జీవాత్మనోః పృథక్త్వం యత్ప్రాగుత్పత్తేః ప్రకీర్తితమ్ |**
**భవిష్యద్వృత్త్యా గౌణం తన్ముఖ్యత్వం హి న యుజ్యతే || || మాం.గౌ.కా. 3-14 ||**

పూర్వం సృష్టి సందర్భంలో జీవునకు ఆత్మతో ప్రకటించబడిన భిన్నత్వం కలగబోయే ఫలితం దృష్ట్యా గౌణమే. వాటి అభిన్నత్వమే ముఖ్యార్థం.

**శంకరుల భాష్యము**

నను శ్రుత్యాపి జీవపరమాత్మనోః పృథక్త్వం యత్ ప్రాగుత్పత్తేః ఉత్పత్త్యర్థోపనిషద్వాక్యేభ్యః పూర్వం ప్రకీర్తితం కర్మకాండే అనేకశః కామభేదతః ఇదంకామః అదఃకామ ఇతి, పరశ్చ 'స దాధార పృథివీం ద్యాం' (ఋ. 10 . 121 . 1) ఇత్యాదిమంత్రవర్ణైః ; తత్ర కథం కర్మజ్ఞానకాండవాక్యవిరోధే జ్ఞానకాండవాక్యార్థస్యైవైకత్వస్య సామంజస్యమవధార్యత ఇతి . అత్రోచ్యతే — 'యతో వా ఇమాని భూతాని జాయంతే' (తై. ఉ. 3 . 1 . 1) 'యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగాః' (బృ. ఉ. 2 . 1 . 20) 'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః' (తై. ఉ. 2 . 1 . 1) 'తదైక్షత తత్తేజోఽసృజత' (ఛా. ఉ. 6 . 2 . 3) ఇత్యాద్యుత్పత్త్యర్థోపనిషద్వాక్యేభ్యః ప్రాక్పృథక్త్వం కర్మకాండే ప్రకీర్తితం యత్ , తన్న పరమార్థతః . కిం తర్హి ? గౌణం ; మహాకాశఘటాకాశాదిభేదవత్ , యథా ఓదనం పచతీతి భవిష్యద్వృత్త్యా, తద్వత్ . న హి భేదవాక్యానాం కదాచిదపి ముఖ్యభేదార్థకత్వముపపద్యతే, స్వాభావికావిద్యావత్ప్రాణిభేదదృష్ట్యనువాదిత్వాదాత్మభేదవాక్యానాం . ఇహ చ ఉపనిషత్సు ఉత్పత్తిప్రలయాదివాక్యైర్జీవపరాత్మనోరేకత్వమేవ ప్రతిపిపాదయిషితం 'తత్త్వమసి' (ఛా. ఉ. 6 . 8 . 7)

'అన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేద' (బృ. ఉ. 1 . 4 . 10) ఇత్యాదిభిః ; అత ఉపనిషత్స్వేకత్వం శ్రుత్యా ప్రతిపిపాదయిషితం భవిష్యతీతి భావినీమివ వృత్తిమాశ్రిత్య లోకే భేదదృష్ట్యనువాదో గౌణ ఏవేత్యభిప్రాయః . అథవా, 'తదైక్షత. . . తత్తేజోఽసృజత' (ఛా. ఉ. 6 . 2 . 3) ఇత్యాద్యుత్పత్తేః ప్రాక్ 'ఏకమేవాద్వితీయం' (ఛా. ఉ. 6 . 2 . 2) ఇత్యేకత్వం ప్రకీర్తితం ; తదేవ చ 'తత్సత్యం స ఆత్మా, తత్త్వమసి' (ఛా. ఉ. 6 . 8 . 7) ఇత్యేకత్వం భవిష్యతీతి తాం భవిష్యద్వృత్తిమపేక్ష్య యజ్జీవాత్మనోః పృథక్త్వం యత్ర క్వచిద్వాక్యే గమ్యమానం , తద్గౌణం ; యథా ఓదనం పచతీతి, తద్వత్ ..

నను యద్యుత్పత్తేః ప్రాగజం సర్వమేకమేవాద్వితీయం , తథాపి ఉత్పత్తేరూర్ధ్వం జాతమిదం సర్వం జీవాశ్చ భిన్నా ఇతి . మైవం , అన్యార్థత్వాదుత్పత్తిశ్రుతీనాం . పూర్వమపి పరిహృత ఏవాయం దోషః — స్వప్నవదాత్మమాయావిసర్జితాః సంఘాతాః, ఘటాకాశోత్పత్తిభేదాదివజ్జీవానా ముత్పత్తిభేదాదిరితి . ఇత ఏవ ఉత్పత్తిభేదాదిశ్రుతిభ్య ఆకృష్య ఇహ పునరుత్పత్తిశ్రుతీనామైదంపర్యప్రతిపిపాదయిషయోపన్యాసః

## <u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>

**<u>సందేహం</u>** : కాని శ్రుతి కూడా **జీవాత్మనః** జీవునికి పరమాత్మకు **పృథక్త్వమ్** భేదాన్ని **ప్రాక్ ఉత్పత్తేః** ఉపనిషత్తు వాక్యాలకన్నా పూర్వమే సృష్టి సందర్భంలో, అంటే కర్మకాండలో భిన్నమైన కోరికలకు సంబంధించిన అనేక విధానాలలో 'ఆ కోరికతో'; 'ఈ కోరికతో' అని మరియు పరమాత్మను కూడా 'అతడు భూమినీ స్వర్గాన్నీ ధరించాడు' ['స దాధార పృథివీం ద్యాం' (ఋ. 10-121-1)] వంటి మంత్ర వర్ణాలలో (జీవుడు వివిధమైన కోరికలు కలిగి ఉండి ఆ కోరికలను తీర్చుకొనేందుకు వివిధ కర్మలను చేస్తుంటాడు. పరమాత్మ కూడా కొన్ని విశిష్టమైన కర్మలను చేస్తున్నాడు) అని, **ప్రకీర్తితమ్** ప్రకటించింది కదా! అక్కడ కర్మకాండలోని వాక్యాలకు జ్ఞానకాండలోని వాక్యాలతో విరోధం కలుగతుండగా, జ్ఞానకాండ వాక్యాల అభిప్రాయమైన ఏకత్వమే సమంజసమైనది అని అర్థంచేసుకోవడం ఎలా?

**<u>సమాధానం</u>** : దానికి ఈ సమాధానం చెప్పబడుతోంది. 'ఎక్కడ నుండి ఈ ప్రాణులు పుడుతున్నాయో' ['యతో వా ఇమాని భూతాని జాయంతే' (తై.ఉ. 3-1-1)]; 'అగ్నినుండి చిన్న నిప్పుకణాలు విరజిమ్ముతున్నాయో' ['యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగాః' (బృ.ఉ. 2-1-20)]; 'అందుచేతనే ఈ పర మాత్మనుండే ఆకాశం ఉత్పన్నమౌతోంది' ['తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః' (తై.ఉ. 2-1-1)]; 'అది సంకల్పించింది. అది తేజస్సును సృజించింది' ['తదైక్షత తత్తేజోఽసృజత' (ఛా.ఉ. 6-2-3)] వంటి ఉపనిషత్తు వాక్యాలు కూడా, పూర్వం కర్మకాండలో ప్రకటించిన (జీవాత్మ-పరమాత్మల) భిన్నత్వాన్ని, సృష్టి సందర్భంలో గౌణార్థంలో ప్రకటించాయే కాని, ముఖ్యార్థంలో కాదు. మరి ఎలా (ముఖ్యార్థంలో కాకుండా ఎలా ప్రకటించాయి)? గౌణార్థంలో (ప్రకటించాయి). మహాకాశానికి ఘటాకాశానికి గల భేదం లాంటిది అనే అర్థంలో. అన్నాన్ని వండుతున్నాడు అని అన్నప్పుడు కలగబోయే అన్నం అనే ఫలితాన్ని ముందుగానే చెప్పినట్లుగా. (అన్నం అన్నది వండిన తర్వాత కలిగే ఫలితం. అయినా అన్నాన్ని వండుతున్నాడు అనే అంటాం కాని బియ్యాన్ని వండుతున్నాడు అనడం లేదు కదా. అలాగే, జీవ-పరమాత్మల భేధం జ్ఞానం కలుగక పూర్వం ఉన్నప్పటికీ, జ్ఞాన ఫలంగా జీవునికి పరమాత్మకు భేధం లేకపోవడం అనేది భవిష్యత్తులో తెలియబోతున్నందు చేత, జీవ-పరమాత్మల అభేదాన్ని ప్రకటించడమే ముఖ్యార్థం అవుతుంది. సృష్టి సందర్భంలో ఉపనిషత్తులు ప్రకటించిన జీవ-పరమాత్మల భేదం గౌణార్థమే అవుతుంది కాని అది ముఖ్యార్థం కాదు అని గ్రహించాలి). (జీవాత్మ-పరమాత్మల) భేదాన్ని సూచించినట్లుగా కనిపించే వాక్యాలు ఎక్కడ చెప్పినా కూడా, ఆ వాక్యాలను అజ్ఞానం కలిగిన ప్రాణుల స్వభావాన్ని దృష్టిలో ఉంచుకొని చెప్పినవిగానే భావించాలి కాని ఆ భేదత్వం

ముఖ్యమైన అర్థాన్ని ప్రతిపాదించడం లేదని గ్రహించాలి. ఇక్కడ ఉపనిషత్తులలో చెప్పిన సృష్టి-ప్రళయాది సందర్భాలలోని వాక్యాలతో పాటుగా జీవాత్మ-పరమాత్మల ఏకత్వాన్ని ప్రతిపాదించాలనే ఉద్దేశ్యంతోనే 'అది నీవే అయి ఉన్నావు' ['తత్త్వమసి' (ఛా.ఉ. 6-8-7)]; 'ఇది నాకు వేరు, నేను దీనికి వేరుగా ఉన్నాను అని భావించేవాడు తెలిసిన వాడు కాదు' ['అన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేద' (బృ.ఉ. 1-4-10)] వంటి వాక్యాలు కూడా చెప్పబడినాయి. అందువల్ల వేదం ఉపనిషత్తులలో (జీవాత్మ-పరమాత్మల) ఏకత్వాన్ని ప్రతిపాదిస్తూ, **భవిష్యత్ వృత్త్యా** భవిష్యత్తులో అది అనుభవానికి రాబోతోందని భావిస్తోంది కనుక లోకంలోని సామన్యంగా కనిపించే బేధ దృష్టిని తెలియచెప్పడాన్ని (జీవాత్మ-పరమాత్మల బేధాన్ని ప్రకటించడాన్ని) **గౌణమ్** గౌణార్థంగా స్వీకరించాలని అభిప్రాయం. లేదంటే (మరో విధంగా కూడా చెప్పవచ్చు) – 'అది సంకల్పించింది ...... అది తేజస్సును సృష్టించింది' ['తదైక్షత. . . తత్తేజోఽసృజత' (ఛా.ఉ. 6-2-3)] వంటి వాక్యాలు సృష్టికి పూర్వం అది 'ఒక్కటే. రెండవది లేదు' ['ఏకమేవాద్వితీయం' (ఛా.ఉ. 6-2-2)] అని ఏకత్వాన్నే ప్రబోధించాయి. 'అది సత్యం. అది ఆత్మ. అది నీవే అయి ఉన్నావు' ['తత్సత్యం స ఆత్మా, తత్త్వమసి' (ఛా.ఉ. 6-8-7)] అంటూ ఆ ఏకత్వం భవిష్యత్తులో అనుభవమౌతుందని చెప్పారు. ఆ భవిష్యత్తులో కలిగే అనుభవాన్ని అపేక్షంచి, ఎక్కడైనా కొన్ని వాక్యాలలో జీవాత్మ-పరమాత్మలకు భిన్నత్వం సూచించబడుతోందో అది, 'అన్నాన్ని వండుతున్నాను' అన్నట్లుగా, గౌణమైన అర్థంలో చెప్పారనే గ్రహించాలి. **తత్ ముఖ్యత్వం హి న యుజ్యతే** దానిని (జీవాత్మ-పరమాత్మల భేదాన్ని) ముఖ్యార్థంగా గ్రహించనే కూడదు.

**సందేహం** : సృష్టికి పూర్వమే సర్వమూ పుట్టుక లేకుండా రెండవదేదీ లేని ఒక్కటిగా ఉన్నప్పటికీ, సృష్టికి తర్వాత ఈ వివిధ రకాలైన ప్రాణులుగా జనించవచ్చు కదా!

**సమాధానం** : ఆ విధంగా కుదరదు. ఎందుకంటే సృష్టిగురించి చెప్పే శ్రుతుల అభిప్రాయం అదికాదు కాబట్టి. దేహేంద్రియ సంఘాతాలు స్వప్నంలాగే మాయచేత కల్పించబడినవని, జీవుల సృష్టి భేదం ఘటాకాశం ఉత్పన్నం కావడం వంటిదని, పూర్వమే ఈ దోషాన్ని నివారణచేసి చెప్పాం. (సృష్టి యొక్క మిథ్యాత్వాన్ని ముందే చెప్పి ఉన్నాము కాబట్టి) అందుచేత, సృష్టిభేదాలను చెప్పే శ్రుతి వాక్యాలను మథనం చేసి ఇక్కడ తిరిగి సృష్టి క్రమాన్ని తెలిపే శ్రుతులకు కూడా అద్వయ పరమాత్మయందే అభిప్రాయమని ప్రతిపాదించే ఉద్దేశ్యంతో ఈ ఉపన్యాసాన్ని (గౌడపాదుల వారు) చేస్తున్నారు.

**మృల్లోహవిస్ఫులిఙ్గాద్యైః సృష్టిర్యా చోదితాన్యథా |**
**ఉపాయః సోఽవతారాయ నాస్తి భేదః కథఞ్చన || || మాం.గౌ.కా. 3-15 ||**

ఏ సృష్టి యొక్క వైవిధ్యం అయితే మృత్తిక, లోహము, నిప్పురవ్వలు మొదలైన ఉదాహరణలతో నిరూపించబడినదో, అది అంతా (బుద్ధియందు జీవాత్మ-పరమాత్మల) ఏకత్వాన్ని కలిగించే ఉపాయం మాత్రమే కాని, భేదం అన్నది ఏ విధంగానూ లేదు.

## శంకరుల భాష్యము

మృల్లోహవిస్ఫులింగాదిదృష్టాంతోపన్యాసైః సృష్టిః యా చ ఉదితా ప్రకాశితా కల్పితా అన్యథాన్యథా చ, స సర్వః సృష్టిప్రకారో జీవపరమాత్మైకత్వబుద్ధ్యవతారాయోపాయోఽస్మాకం , యథా ప్రాణసంవాదే వాగాద్యాసురపాప్మవేధాద్యాఖ్యాయికా కల్పితా ప్రాణవైశిష్ట్యబోధావతారాయ ; తదప్యసిద్ధమితి చేత్ ; న, శాఖాభేదేష్వన్యథాన్యథా చ ప్రాణాదిసంవాదశ్రవణాత్ . యది హి వాదః పరమార్థ ఏవాభూత్ , ఏకరూప ఏవ సంవాదః సర్వశాఖాస్వశ్రోష్యత, విరుద్ధానేకప్రకారేణ నాశ్రోష్యత ; శ్రూయతే తు ; తస్మాన్న తాదర్థ్యం సంవాదశ్రుతీనాం . తథోత్పత్తివాక్యాని ప్రత్యేతవ్యాని . కల్పసర్గభేదాత్సంవాదశ్రుతీనాముత్పత్తిశ్రుతీనాం చ ప్రతిసర్గమన్యథాత్వమితి చేత్ ; న, నిష్ప్రయోజనత్వాద్యథోక్తబుద్ధ్యవతారప్రయోజనవ్యతిరేకేణ . న హ్యన్యప్రయోజనవత్త్వం సంవాదోత్పత్తిశ్రుతీనాం శక్యం కల్పయితుం . తథాత్వప్రత్తిపత్తయే ధ్యానార్థమితి చేత్ ; న, కలహోత్పత్తిప్రలయానాం ప్రతిపత్తేరనిష్టత్వాత్ . తస్మాదుత్పత్త్యాదిశ్రుతయ ఆత్మైకత్వబుద్ధ్యవతారాయైవ, నాన్యార్థాః కల్పయితుం యుక్తాః . అతో నాస్త్యుత్పత్త్యాదికృతో భేదః కథంచన ..

యది హి పర ఏవాత్మా నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావ ఏకః పరమార్థతః సన్ 'ఏకమేవాద్వితీయం' (ఛా. ఉ. 6 . 2 . 2) ఇత్యాదిశ్రుతిభ్యః, అసదన్యత్ , కిమర్థేయముపాసనోపదిష్టా 'ఆత్మా వా అరే ద్రష్టవ్యః' (బృ. ఉ. 2 . 4 . 5) 'య ఆత్మాపహతపాప్మా' (ఛా. ఉ. 8 . 7 . 1) 'స క్రతుం కుర్వీత' (ఛా. ఉ. 3 . 14 . 1) 'ఆత్మేత్యేవోపాసీత' (బృ. ఉ. 1 . 4 . 7) ఇత్యాదిశ్రుతిభ్యః, కర్మాణి చాగ్నిహోత్రాదీని ? శృణు తత్ర కారణం —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**సృష్టి యా** ఏ సృష్టి యొక్క **అన్యథా** వైవిధ్యం అయితే **మృత్-లోహ-విస్ఫులిఙ్గ-ఆద్యైః** మృత్తిక, లోహము, నిప్పురవ్వలు మొదలుగా గల ఉదాహరణలతో (పూర్వమే) **చోదితా** కల్పితమైనదిగా వివరించబడిందో, **సః** ఆ సకలమైన సృష్టి కార్యక్రమమంతా **అవతారాయ** జీవాత్మ-పరమాత్మల ఏకత్వాన్ని మన బుద్ధికి కలుగచేసేందుకు **ఉపాయః** సాధనం. ఇది ఎలా ఉందంటే (ప్రశ్నోపనిషత్తులో 2వ ప్రశ్నలో చెప్పినట్లుగా) ఆసురీపాపమైన భోగాసక్తితో బాధింపబడిన వాక్కులు మొదలైనవి ప్రాణంతో సంవాదించాయనే కథనం ప్రాణం యొక్క విశిష్టతను బోధించడానికి కల్పించబడినట్లుగా ఉంది.

**సందేహం** : అది కూడా (వాక్కులు మొదలైనవి ప్రాణాదులతో వాదించడమనే కథనం కల్పితమైనది అనడం) అంగీకారం కాకపోతే?

**సమాధానం** : కాదు (అంగీకరించక పోవడం సంభవం కాదు). ఎందుకంటే, వేర్వేరు వేదశాఖలలో వేర్వేరుగా ప్రాణాదుల సంవాదం వినబడుతోంది కాబట్టి. ఒకవేళ ఆ కథనాలు యదార్థమే అయితే సకల వేదశాఖలలో వినబడే సంవాదం ఒకటే కావాలి కాని, ఒకదానికొకటి విరుద్ధమైన ప్రకారంలో వినబడకూడదు. కాని, అలా వేర్వేరుగా వినబడుతోంది. అందుచేత, శ్రుతులలో చెప్పిన సంవాదాన్ని వాక్యార్థంగా గ్రహించరాదు. అదేవిధంగా, సృష్టికి సందర్భంలో శ్రుతి చెప్పిన వాక్యాలకు కూడా సృష్టి యదార్థత యందు తాత్పర్యం కాదు అనే గ్రహించాలి.

**సందేహం** : వేరు వేరు కల్పాలలోని సృష్టి వేర్వేరుగా ఉండడం చేత, సృష్టికి సంబంధించిన శ్రుతి వాక్యాలు మరియు ప్రాణాదుల సంబంధించిన శ్రుతివాక్యాలు ఒక్కొక్క సర్గానికి ఒక్కొక్క విధంగా చెప్పిఉండవచ్చు కదా!

**సమాధానం** : కాదు. ఎందుకంటే, (అలా వేర్వేరు కథనాలు చెప్పినందువల్ల) కలిగే ప్రయోజనం ఏదీ లేదు. అంతేకాక, ముందు చెప్పబడిన బుద్ధికి జీవాత్మ-పరమాత్మల ఏకత్వాన్ని కలిగించడమనే ప్రయోజనానికి అది

వ్యతిరేకమైనది కూడా కాబట్టి. ఈ ప్రాణాదుల సంవాదాన్ని తెలిపే శ్రుతి వాక్యాలకు మరియు సృష్టి సందర్భంలో చెప్పిన శ్రుతి వాక్యాలకు వేరొక ప్రయోజనాన్ని కల్పించడం సాధ్యం కాదు.

**సందేహం** : ప్రాణాదిసంవాద శ్రుతిలోని ప్రాణాదులస్థితిని, సృష్టి సందర్భంలో చెప్పిన వివిధ భూతజాలాన్ని ధ్యానంచేత పొందటం కొరకు చెప్పి ఉండవచ్చునేమో కదా!

**సమాధానం** : కాదు. ఎందుకంటే, ప్రాణాదిసంవాద శ్రుతిలో చెప్పిన కలహం, సృష్టికి సందర్భంలో ప్రస్తావించిన పుట్టుక, లయం కావడం అనేవి ఎవరూ పొందాలని కోరుకోరు కాబట్టి. కాబట్టి, సృష్టి-ప్రాణాదుల సంవాదాలకు సంబంధించిన శ్రుతులు, కేవలం ఆత్మ ఏకమైనదనే బుద్ధిని కలిగించడం కొరకు మాత్రమే ఉద్దేశించబడినవి. వేర్వేరు అర్థాలను కల్పించడం సమంజసం కాదు. అందుచేత, సృష్టి సందర్భంలో చెప్పబడిన శ్రుతి వాక్యాలు ఏ విధంగానూ భేదాన్ని కలగచేయడం లేదు.

**సందేహం** : 'ఒక్కటే. రెండవది లేదు' ['ఏకమేవాద్వితీయం' (ఛా.ఉ. 6-2-2)] అన్న శ్రుతి వాక్యం ప్రకారం పరమాత్మ యదార్థంగా కేవలం నిత్య-శుద్ధ-బుద్ధ-ముక్త స్వభావం మాత్రమే అయిన ఏకత్వమే కనుక అయినట్లైతే, 'ఆత్మయే నిశ్చయంగా పొందతగినది (వినదగినది, విచారించదగినది, ధ్యానించదగినది)' ['ఆత్మా వా అరే ద్రష్టవ్యః' (బృ.ఉ. 2-4-5)]; 'పాపము తొలగిన ఈ ఆత్మనే అన్వేషించాలి' ['య ఆత్మాపహతపాప్మా.........అన్వేష్టవ్యః' (ఛా.ఉ. 8-7-1)]; 'అతడు (సకలమూ పరమాత్మయే అనే) నిశ్చయాన్ని ఏర్పరచుకోవాలి' ['స క్రతుం కుర్వీత' (ఛా.ఉ. 3-14-1)]; 'ఆత్మ అనియే ఉపాసించాలి' ['ఆత్మేత్యేవోపాసీత' (బృ.ఉ. 1-4-7)] వంటి శ్రుతి వాక్యాలలో ఆత్మ ఉపాసనను మరియు అగ్నిహోత్రాది కర్మలను ఎందుకు ఉపదేశించారు?

**సమాధానం** : అందుకు కారణం చెప్తున్నాము వినండి.

**ఆశ్రమాస్త్రివిధా హీనమధ్యమోత్కృష్టదృష్టయః |**
**ఉపాసనోపదిష్టేయం తదర్థమనుకమ్పయా || || మాం.గౌ.కా. 3-16 ||**

**హీనులు, మధ్యములు, ఉత్తములు అని అన్ని ఆశ్రమాలకు చెందిన (సాధకులు) మూడు విధములైన యోగ్యతలు కలవారు ఉన్నారు. వారిపట్ల కరుణతో ఈ ఉపాసన ఉద్దేశించబడినది.**

## శంకరుల భాష్యము

ఆశ్రమాః ఆశ్రమిణోఽధికృతాః, వర్ణినశ్చ మార్గగాః, ఆశ్రమశబ్దస్య ప్రదర్శనార్థత్వాత్ , త్రివిధాః . కథం ? హీనమధ్యమోత్కృష్టదృష్టయః హీనా నికృష్టా మధ్యమా ఉత్కృష్టా చ దృష్టిః దర్శనసామర్థ్యం యేషాం తే, మందమధ్యమోత్తమబుద్ధిసామర్థ్యోపేతా ఇత్యర్థః . ఉపాసనా ఉపదిష్టా ఇయం తదర్థం మందమధ్యమదృష్ట్యాశ్రమాద్యర్థం కర్మాణి చ . న చాత్మైక ఏవాద్వితీయ ఇతి నిశ్చితోత్తమదృష్ట్యర్థం . దయాలునా దేవేనానుకంపయా సన్మార్గగాః సంతః కథమిమాముత్తమామేకత్వదృష్టిం ప్రాప్నుయురితి, 'యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతం . తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే' (కే. ఉ. 1 . 5) 'తత్త్వమసి' (ఛా. ఉ. 6 . 8 . 7) 'ఆత్మైవేదం సర్వం' (ఛా. ఉ. 7 . 25 . 2) ఇత్యాదిశ్రుతిభ్యః ..

శాస్త్రోపపత్తిభ్యామవధారితత్వాదద్వయాత్మదర్శనం సమ్యగ్దర్శనం , తద్బాహ్యత్వాన్మిథ్యాదర్శనమన్యత్ . ఇతశ్చ మిథ్యాదర్శనం ద్వైతినాం రాగద్వేషాదిదోషాస్పదత్వాత్ . కథం ?

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**ఆశ్రమాః** ఆశ్రమాలకు చెందిన వారు, అధికారం లేదా యోగ్యత కలవారు. ఇక్కడ ఆశ్రమ శబ్దాన్ని సాధారణమైన అర్థంలో వాడారు కాబట్టి, వర్ణములకు చెందినవారు అని మరియు ఆ మార్గంలో ఉన్నవారు అని కూడా గ్రహించుకోవచ్చు. అట్టివారు **త్రివిధాః** మూడు ప్రకారాలుగా ఉన్నారు. ఏమిటా మూడు ప్రకారాలు? **హీన-మధ్యమ-ఉత్కృష్ట దృష్టయః** బుద్ధికి గ్రహించగల సమర్థత అతి తక్కువగా ఉన్నవారు, మధ్యమంగా ఉన్నవారు, ఉత్తమంగా ఉన్నవారు అని అభిప్రాయం. **తదర్థమ్** వీరి కొరకు అంటే మంద-మధ్యమ బుద్ధి సామర్థ్యం కలవారికి మాత్రమే **ఇయమ్ ఉపాసనా ఉపదిష్టా** ఈ ఉపాసనలు మరియు కర్మలు ఉపదేశించబడినాయి. అంతేకాని, ఆత్మకు ద్వితీయమైనది లేదని నిశ్చితమైన అభిప్రాయం కల ఉత్తమ బుద్ధి కలవారికి కాదు. దయాళువైన వేదము **అనుకంపయా** కరుణతో మంచి మార్గంలో ఉన్న, ఈ ఉత్తమమైన గ్రహణ సామర్థ్యం కలవారు ఏవిధంగా ఏకత్వ దృష్టిని పొందుతారో అని జాలిపడి వారిని ఉద్దేశిస్తూ 'ఏది మనసుచేత ఆలోచింపబడలేదో, ఏది మనసును వ్యాపించి ఉంటుందో, అదియే బ్రహ్మమని నీవు తెలుసుకో. ఈ ఉపాసించబడేది (బ్రహ్మము) కాదు' ['యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్. తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే' (కే.ఉ. 1-6]; 'అది నీవే అయి ఉన్నావు' ['తత్త్వమసి' (ఛా.ఉ. 6-8-7)]; 'ఈ సకలమూ ఆత్మయే' ['ఆత్మైవేదం సర్వం' (ఛా.ఉ. 7-25-2)] వంటి శ్రుతి వాక్యాలను ప్రకటించింది.

శాస్త్రంచేత మరియు నిరూపణ చేయబడినందున అద్వయమైన ఆత్మ దర్శనమే యదార్థ దర్శనం. దానికి బాహ్యంగా వేరుగా ఉన్నదంతా మిథ్యాదర్శనమే. దీనితో పాటు, రాగ-ద్వేషాది దోషాలతో కూడినవి అయినందున, ద్వైతుల దర్శనాలు కూడా మిథ్యాదర్శనాలే. అది ఎలాగ?

**స్వసిద్ధాన్తవ్యవస్థాసు ద్వైతినో నిశ్చితా దృఢమ్ |**
**పరస్పరం విరుధ్యన్తే తైరయం న విరుధ్యతే || || మాం.గౌ.కా. 3-17 ||**

ద్వైతులు వారి వారి సిద్ధాంత వ్యవస్థలయందు దృఢమైన నిశ్చయం కలిగినవారై (వారిలో వారు) పరస్పరం విభేదించు కొంటుంటారు. కాని ఇది (ఈ అద్వయ పరమాత్మ దర్శనం) వారితో విభేదించదు.

**శంకరుల భాష్యము**

స్వసిద్ధాంతవ్యవస్థాసు స్వసిద్ధాంతరచనానియమేషు కపిలకణాదబుద్ధార్హతాదిదృష్ట్యనుసారిణో ద్వైతినో నిశ్చితాః, ఏవమేవైష పరమార్థో నాన్యథేతి, తత్ర తత్రానురక్తాః ప్రతిపక్షం చాత్మనః పశ్యంతస్తం ద్విషంత ఇత్యేవం రాగద్వేషోపేతాః స్వసిద్ధాంతదర్శననిమిత్తమేవ పరస్పరం అన్యోన్యం విరుధ్యంతే . తైరన్యోన్యవిరోధిభిరస్మదీయోఽయం వైదికః సర్వానన్యత్వాదాత్మైకత్వదర్శనపక్షో న విరుధ్యతే, యథా స్వహస్తపాదాదిభిః . ఏవం రాగద్వేషాదిదోషానాస్పదత్వాదాత్మైకత్వబుద్ధిరేవ సమ్యగ్దర్శనమిత్యభిప్రాయః ..

కేన హేతునా తైర్న విరుధ్యత ఇత్యుచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**స్వసిద్ధాంత వ్యవస్థాసు** కపిలుడు-కణాదుడు-బుద్ధుడు-అర్హతుడు (అంటే సాంఖ్యులు, న్యాయ-వైశేషికులు, బౌద్ధులు, జైనులు) మొదలైన వారి సిద్ధాంతాన్ని అనుసరించే **ద్వైతినః** ద్వైతులు వారు నమ్మిన స్వంత సిద్ధాంతాల నిర్మాణం నియమాల పట్ల **నిశ్చితాః** స్థిరమైన అభిప్రాయం కలిగి, 'ఈ సిద్ధాంతమే యదార్థము కాని వేరొకటి కాదు' అంటూ ఆయా సిద్ధాంతాల పట్ల **దృఢా** గట్టి పట్టుదల కలవారై, అందుకు వేరైన అభిప్రాయం కలవారిని చూడగానే ద్వేషిస్తారు. ఈ విధంగా వారు రాగద్వేషాలతో నిండిన వారైనందున, వారి వారి స్వంత సిద్ధాంతదర్శనాల కారణంగా **పరస్పరమ్** వారిలో వారు **విరుధ్యన్తే** విభేదించుకొంటారు. **తైః** వారు పరస్పరం విభేదించుకొన్నా కూడా, **అయమ్** వేదాన్ని ప్రమాణంగా స్వీకరించే వారమైన మాతో, సకలమైన జగత్తూ, ఒక్కటే అయిన ఆత్మకు భిన్నంగా లేదని దర్శించే మాతో (అద్వైతవాదులమైన మాతో మాత్రం) **న విరుధ్యతే** విభేదించరు. ఇది ఎలాగంటే, తన చేతులు కాళ్ళు తానే అని భావిస్తున్నట్లుగా. ఆ విధంగా, రాగద్వేషాది దోషాలకు ఆశ్రయమివ్వని ఆత్మ ఒక్కటే అనే అద్వైతబుద్ధియే, (అన్ని దర్శనాలలోకెల్లా ఉత్తమమైన) యదార్థమైన దర్శనం అని అభిప్రాయం.

ఏ కారణం చేత వారు (ద్వైతులు) అద్వయ దర్శనంతో విభేదించరో తర్వాత శ్లోకంలో చెప్తున్నారు.

**అద్వైతం పరమార్థో హి ద్వైతం తద్భేద ఉచ్యతే |**
**తేషాముభయథా ద్వైతం తేనాయం న విరుధ్యతే || || మాం.గౌ.కా. 3-18 ||**

అద్వైతమే పరమోన్నతమైన సత్యం. ద్వైతం దాని యొక్క కార్యమని (శ్రుతులు) అంటున్నాయి. (కాని ద్వైతులకు మాత్రం) వారికి రెండు విధాలా ద్వైతమే. వారితో ఇది (ఈ అద్వయ దర్శనం) విభేదించదు.

**శంకరుల భాష్యము**

అద్వైతం పరమార్థః, హి యస్మాత్ ద్వైతం నానాత్వం తస్యాద్వైతస్య భేదః తద్భేదః, తస్య కార్యమిత్యర్థః, 'ఏకమేవాద్వితీయం' (ఛా. ఉ. 6 . 2 . 1) 'తత్తేజోఽసృజత' (ఛా. ఉ. 6 . 2 . 3) ఇతి శ్రుతేః ; ఉపపత్తేశ్చ, స్వచిత్తస్పందనాభావే సమాధౌ మూర్ఛాయాం సుషుప్తౌ వా అభావాత్ . అతః తద్భేద ఉచ్యతే ద్వైతం . ద్వైతినాం తు తేషాం పరమార్థతోఽపరమార్థతశ్చ ఉభయథాపి ద్వైతమేవ ; యది చ తేషాం భ్రాంతానాం ద్వైతదృష్టిః అస్మాకమద్వైతదృష్టిరభ్రాంతానాం , తేనాయం హేతునా అస్మత్పక్షో న విరుధ్యతే తైః, 'ఇంద్రో మాయాభిః' (బృ. ఉ. 2 . 5 . 19) 'న తు తద్ద్వితీయమస్తి' (బృ. ఉ. 4 . 3 . 23) ఇతి శ్రుతేః . యథా మత్తగజారూఢః ఉన్మత్తం భూమిష్ఠం 'ప్రతిగజారూఢోఽహం గజం వాహయ మాం ప్రతి' ఇతి బ్రువాణమపి తం ప్రతి న వాహయత్యవిరోధబుద్ధ్యా, తద్వత్ . తతః పరమార్థతో బ్రహ్మవిదాత్మైవ ద్వైతినాం . తేనాయం హేతునా అస్మత్పక్షో న విరుధ్యతే తైః ..

ద్వైతమద్వైతభేద ఇత్యుక్తే ద్వైతమప్యద్వైతవత్పరమార్థసదితి స్యాత్కస్యచిదాశంకేత్యత ఆహ —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**అద్వైతమ్ పరమార్థః** అద్వైతదర్శనమే పరమ యదార్థమైనది **హి** ఎందువల్ల నంటే **ద్వైతమ్** అంటే అనేకత్వం అనేది **తత్ భేదః** అద్వైతం యొక్క పరిణామం మాత్రమే అని '(ఈ అన్నింటికన్నా ముందుగా ఉన్నది) ఒక్కటే. రెండవదనదే లేదు' ['ఏకమేవాద్వితీయం' (ఛా.ఉ. 6-2-1)]; 'అది తేజస్సును సృజించింది' ['తత్తేజోఽసృజత' (ఛా.ఉ. 6-2-3)] అని శ్రుతి వాక్యాలు **ఉచ్యతే** చెప్తున్నాయి. మరియు, సమాధిలో కాని, మూర్ఛలో కాని, సుషుప్తి అవస్థలో కాని ఎటువంటి భావమూ లేకపోవడమనేది అంటే చిత్తం స్పందించనందుచేత ద్వైతం లేకపోవడం అనేది నిరూపితమౌతోంది కూడా. అందుచేత అద్వైతదర్శనం యొక్క కార్యము లేదా పరిణామమే ద్వైతమని అంటున్నారు. కాని, **తేషామ్** వారిలో అంటే ద్వైతులలో **ఉభయథా** రెండు విధాలుగా కూడా అంటే పరమార్థ దృష్టిలోనూ మరియు సాధారణ (లౌకికి) దృష్టిలోనూ కూడా **ద్వైతమ్** నానాత్వమే ఉన్నది. వారిలో భ్రాంతి వలన ద్వైత దృష్టి ఉంటే, భ్రాంతిలేని మాకు అద్వయ దృష్టి ఉన్నది. **తేన** ఈ కారణం చేతనే వారు (ద్వైతులు) **అయమ్** మా అద్వైతపక్షం వారితో **న విరుధ్యతే** విభేదించరు. 'ప్రభువు తన మాయచే (అనేకంగా దర్శించబడుతున్నాడు)' ['ఇంద్రో మాయాభిః' (బృ.ఉ. 2-5-19)]; 'కాని దానికి రెండవది లేదు' ['న తు తద్ద్వితీయమస్తి' (బృ.ఉ. 4-3-23)] అని శ్రుతి ఈ అభిప్రాయాన్నే తెలియచేస్తున్నాయి. మదించిన ఏనుగును ఎక్కియున్నవాడు నేలపై ఉన్న పిచ్చివానిని చూసి 'నేను కూడా నీకు ఎదురుగా ఏనుగును ఎక్కి ఉన్నాను. నీ వాహనంతో నన్ను ఎదుర్కోను' అని అనడు. ఎందుకంటే, నేలపై ఉన్నవాని పట్ల ఏనుగును ఎక్కి ఉన్నవానికి ఎటువంటి ద్వేషభావమూ ఉండదు కాబట్టి. అలాగే, యదార్థానికి బ్రహ్మవేత్త ద్వైతుల ఆత్మయే అయి ఉంటాడు కాబట్టి, **తేన** ఆ కారణం చేత **అయమ్** మా ఈ అద్వయదృష్టికి **న విరుధ్యతే** వారితో విరోధం లేదు.

'ద్వైతం అద్వైతం యొక్క పరిణామమే అని చెప్పడం చేత, ద్వైతం కూడా అద్వైతం లాగా యదార్థమైన సత్యమే అవుతోంది కదా!' అని ఎవరికైనా సందేహం కలిగేటట్లైతే దానికి సమాధానాన్ని తర్వాత శ్లోకంలో ఇలా చెప్తున్నారు.

**మాయయా భిద్యతే హ్యేతన్నాన్యథాజం కథఞ్చన |**
**తత్త్వతో భిద్యమానే హి మర్త్యతామమృతం వ్రజేత్ ||** **|| మాం.గౌ.కా. 3-19 ||**

పుట్టుకలేని (ఆత్మ) మాయవల్ల పరిణమిస్తోనట్లు అనిపిస్తోందే కాని మరో విధంగా ఎప్పుడూ కాదు. పరిణామమే యదార్థమైతే, మరణరహితమైనదానికి కూడా మరణం సంభవం కావల్సి ఉంటుంది.

**శంకరుల భాష్యము**

యత్పరమార్థసదద్వైతం , మాయయా భిద్యతే హ్యేతత్ తైమిరికానేకచంద్రవత్ రజ్జుః సర్పధారాదిభిర్భేదైరివ ; న పరమార్థతః, నిరవయవత్వాదాత్మనః . సావయవం హ్యవయవాన్యథాత్వేన భిద్యతే, యథా మృత్ ఘటాదిభేదైః . తస్మాన్నిరవయవమజం నాన్యథా కథంచన, కేనచిదపి ప్రకారేణ న భిద్యత ఇత్యభిప్రాయః . తత్త్వతో భిద్యమానం హి

అమృతమజమద్వయం స్వభావతః సత్ మర్త్యతాం వ్రజేత్ , యథా అగ్నిః శీతతాం . తచ్చానిష్టం స్వభావవైపరీత్యగమనం , సర్వప్రమాణవిరోధాత్ . అజమద్వయమాత్మతత్త్వం మాయయైవ భిద్యతే, న పరమార్థతః . తస్మాన్న పరమార్థసద్ద్వైతం ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

పరమోన్నత సత్యమైన అద్వైత స్థితి **మాయయా హి** నిశ్చయంగా మాయచేతనే, తిమిరత్వమనే కంటిదోషం ఉన్న వానికి అనేక చంద్రులు కనిపించినట్లు, త్రాడు నందు పాము లేదా నీటి చార అనే భేద దృష్టి కలిగినట్లు, **భిద్యతే** పరిణామాన్ని లేదా భిన్నత్వాన్ని పొందుతుంది. కాని, దానియందు అవయవవిభాగాలేవీ లేనందువల్ల, ఆ పరిణామమనేది యదార్ధం కాదు. ఎందుకంటే, అవయవ విభాగాలున్నది మాత్రమే ఆ అవయవాలలోని మార్పులచేత, మట్టినుండి కుండ మొదలైనవి ఏర్పడినట్లుగా, భిన్నంగా రూపాంతరం చెందుతుంది కాబట్టి. అందువలన, విభాగ రహితమైన **అజమ్** పుట్టుకలేని ఆత్మ **కథంచన** ఏ ప్రకారంగా కూడా **అన్యథా** వేరుగా **న భిద్యత** భిన్నత్వాన్ని పొందదు అని అభిప్రాయం. **తత్త్వతః** నిజానికి **భిద్యమానే** భిన్నత్వమే **హి** నిశ్చయమైనట్లైతే, స్వభావ రీత్యా జనన-మరణ రహితమైన అద్వయస్థితి **మర్త్యతామ్ వ్రజేత్** నాశనాన్ని పొందే స్థితి ఉత్పన్నమౌతుంది. అంటే, అగ్ని తన స్వభావానికి వ్యతిరేకమైన చల్లదనాన్ని సంతరించుకున్నట్లుగా, సకల ప్రమాణాలకు విరుద్ధమైన అభీష్టదాయకం కాని స్థితి కలుగుతుంది. కాబట్టి, పుట్టుకలేని అద్వయమైన ఆత్మతత్త్వం కేవలం మాయచేతనే భిన్నమైనదిగా కనిపిస్తుందే కాని, అది యదార్థం కాదు. అందుచేత, ద్వైతం అన్నది పరమోన్నతమైన సత్యం కానేకాదు.

**అజాతస్యైవ భావస్య జాతిమిచ్ఛన్తి వాదినః |**
**అజాతో హ్యమృతో భావో మర్త్యతాం కథమేష్యతి || || మాం.గౌ.కా. 3-20 ||**

కొందరు పుట్టుకసేది లేని స్థితికి (ఆత్మభావనకు) పుట్టుకను ప్రతిపాదిస్తున్నారు. జనన-మరణాదులు లేని స్థితికి మృతత్వం (అది లేకుండా పోవడం) ఎలా సంభవిస్తుంది?

**శంకరుల భాష్యము**

యే తు పునః కేచిదుపనిషద్వ్యాఖ్యాతారో బ్రహ్మవాదినో వావదూకాః అజాతస్యైవ ఆత్మతత్త్వస్యామృతస్య స్వభావతో జాతిం ఉత్పత్తిం ఇచ్ఛంతి పరమార్థత ఏవ, తేషాం జాతం చేత్ , తదేవ మర్త్యతామేష్యత్యవశ్యం . స చ అజాతో హ్యమృతో భావః స్వభావతః సన్నాత్మా కథం మర్త్యతామేష్యతి ? న కథంచన మర్త్యత్వం స్వభావవైపరీత్యమేష్యతీత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**వాదినః** వాదించడమే పనిగా పెట్టుకొని ఉపనిషత్తులను వ్యాఖ్యానించే మరి కొందరు బ్రహ్మవాదులైతే (భేదాభేద వాదులు), **అజాతస్యైవ** పుట్టుకేలేని **భావస్య** ఆత్మతత్త్వానికి, అమృతత్వమే స్వభావమైన దానికి **జాతిమ్** పుట్టుక అన్నది పరమ సత్యమే అని **ఇచ్ఛన్తి** అభిలషిస్తున్నారు. వారి ప్రకారం పుట్టుక ఉండేటట్లైతే, అది అవశ్యంగా మృతత్వంగా పరిణమించి తీరుతుంది. **అజాతః అమృతః** జనన-మరణాలు లేని, **భావః** ఉనికియే స్వభావంగా కలిగిన

తత్త్వం, **మర్త్యతామ్** మృతిని **కథమ్ ఏష్యతి** ఎలా పొందుతుంది? అంటే తన స్వభావానికి భిన్నమైన మృతత్వాన్ని ఏ విధంగానూ పొందదు అని అభిప్రాయం.

**న భవత్యమృతం మర్త్యం న మర్త్యమమృతం తథా |**
**ప్రకృతేరన్యథాభావో న కథఞ్చిద్భవిష్యతి || || మాం.గౌ.కా. 3-21 ||**

అమృతత్వానికి మరణం ఉండదు. అలాగే మరణాన్ని పొందేది ఏదీ అమృతం కాదు. స్వభావానికి విరుద్ధంగా ఏదీ ఏ విధంగానూ సంభవించదు.

**<u>శంకరుల భాష్యము</u>**

యస్మాన్న భవతి అమృతం మర్త్యం లోకే నాపి మర్త్యమమృతం తథా, తతః ప్రకృతేః స్వభావస్య అన్యథాభావః స్వతః ప్రచ్యుతిః న కథంచిద్భవిష్యతి, అగ్నేరివౌష్ణ్యస్య ..

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

ఎలాగైతే లోకంలో, **అమృతమ్** అమృతత్వానికి **మర్త్యం** మరణించడం అన్నది **న భవతి** లేదో, **తథా** అలాగే **మర్త్యమ్** మరణించే స్వభావం కలదానికి **అమృతమ్** అమృతత్వమూ **న భవతి** ఉండదు. అందుచేత, **ప్రకృతేః** అగ్నికి ఉష్ణత్వం స్వభావమైనట్లుగా, **అన్యథా భావః** స్వభావానికి వ్యతిరేకమైన పరిణామం **కథఞ్చిత్** ఏ ప్రకారంగానైనాగానీ **న భవిష్యతి** సంభవమే కాదు.

**స్వభావేనామృతో యస్య భావో గచ్ఛతి మర్త్యతామ్ |**
**కృతకేనామృతస్తస్య కథం స్థాస్యతి నిశ్చలః || || మాం.గౌ.కా. 3-22 ||**

అమృతమే స్వభావంగాల గలది మృతి చెందుతుందనే భావన చేసేవారికి, ఆ అమృతత్వం కలది (శాశ్వతంగా) ఎలా నిశ్చలంగా ఉంటుంది?

**<u>శంకరుల భాష్యము</u>**

యస్య పునర్వాదినః స్వభావేన అమృతో భావః మర్త్యతాం గచ్ఛతి పరమార్థతో జాయతే, తస్య ప్రాగుత్పత్తేః స భావః స్వభావతోఽమృత ఇతి ప్రతిజ్ఞా మృషైవ . కథం తర్హి ? కృతకేనామృతః తస్య స్వభావః . కృతకేనామృతః స కథం స్థాస్యతి నిశ్చలః ? అమృతస్వభావతయా న కథంచిత్స్థాస్యతి . ఆత్మజాతివాదినః సర్వథా అజం నామ నాస్త్యేవ . సర్వమేతన్మర్త్యం ; అతః అనిర్మోక్షప్రసంగ ఇత్యభిప్రాయః ..

నన్వజాతివాదినః సృష్టిప్రతిపాదికా శ్రుతిర్న సంగచ్ఛతే . బాఢం ; విద్యతే సృష్టిప్రతిపాదికా శ్రుతిః ; సా త్వన్యపరా, 'ఉపాయః సోఽవతారయ' (మా. కా. 3 . 15) ఇత్యవోచామ . ఇదానీముక్తేఽపి పరిహారే పునశ్చోద్యపరిహారౌ వివక్షితార్థం ప్రతి సృష్టిశ్రుత్యక్షరాణామానులోమ్యవిరోధశంకామాత్రపరిహారార్థౌ .

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**స్వభావేన అమృతో భావః** అమృతమే స్వభావంగా గల తత్త్వం **మర్త్యతామ్ గచ్ఛతి** మృతత్వాన్ని పొందుతోంది నిజానికి పుడుతోంది అని, ఆ తత్త్వమే సృష్టికి పూర్వం అమృతత్వమే స్వభావంగా కలదై ఉంటుంది అని **యస్య** ఎవరి ప్రతిపాదన ఉన్నదో అది అర్థంలేనిది. ఏ కారణం చేత? **కృతకేన అమృతః** కార్యంగా పరిణమించే అమృతత్వం **తస్య** అటువంటి ప్రతిపాదన చేసిన వానికి, **కథమ్ స్థాస్యతి నిశ్చలః?** పరిణామ రహితమైనది ఎలా అవుతుంది? (వాని దృష్టిలో) అమృతం పరిణామశీలమైనదే కాబట్టి, అని స్థిరంగా పరిణామరహితమైనట్టిది ఎన్నటికీ కానేరదు. అంటే, ఆత్మకు పుట్టుక ఉన్నది అని వాదించే (భేదాభేద వాదులకు) ఎల్లప్పుడూ అజం అనేదే (పుట్టుక లేకపోవడం అనేది) లేదు. సకలమూ నశించేదే అవుతుంది. అందుచేత, (అలాంటి వారి దృష్టిలో) మోక్షం అన్నదే లేదు అని అభిప్రాయం.

**సందేహం** : అయితే, ఆత్మ జనించదు అనే అభిప్రాయం కలిగిన వారికి సృష్టిని ప్రతిపాదించే శ్రుతి వాక్యాలు ప్రమాణం లేనివిగా అనిపిస్తున్నాయా?

**సమాధానం** : సృష్టిని ప్రతిపాదించే శ్రుతి వాక్యాలు ఉన్నమాట వాస్తవమే. అయితే, అవి చెప్పిన ఉద్దేశ్యం వేరు అని 'ఉపాయః సోఽవతారాయ' (మాం.గౌ.కా. 3-15) అనే శ్లోకంలో ముందుగానే చెప్పి ఉన్నాము. ఇలా సందేహానికి సమాధానం చెప్పియున్నప్పటికీ, మరింత వివరంగా ఈ సందేహాన్ని తొలగించడానికి, సృష్టి గురించి చెప్పిన శ్రుతి వాక్యాలు ప్రస్తుతం విచారణ చేస్తున్న విషయాన్ని సమర్థిస్తున్నాయా లేదా తిరస్కరిస్తున్నాయా అనే సంశయాన్ని తొలిగించేందుకు మాత్రమే, తర్వాత ప్రస్తావన చేయబడుతోంది.

**భూతతోఽభూతతో వాపి సృజ్యమానే సమా శ్రుతిః |**
**నిశ్చితం యుక్తియుక్తం చ యత్తద్భవతి నేతరత్ || || మాం.గౌ.కా. 3-23 ||**

సృజించబడిన భూతములయందు గాని, మాయచేత సృజించబడిన వస్తువిషయాలయందు గాని శ్రుతి సమానత్వాన్నే ప్రదర్శిస్తుంది. ఏదైతే శ్రుతిచేతనూ మరియు యుక్తిచేత కూడా నిర్ణయించబడిందో అదియే యదార్థంగా ఉన్నట్టిది కాని, ఇతరమేదీ ఉనికి కలది కాదు.

## శంకరుల భాష్యము

భూతతః పరమార్థతః సృజ్యమానే వస్తుని, అభూతతః మాయయా వా మాయావినేవ సృజ్యమానే వస్తుని సమా తుల్యా సృష్టిశ్రుతిః . నను గౌణముఖ్యయోర్ముఖ్యే శబ్దార్థప్రతిపత్తిర్యుక్తా ; న, అన్యథాసృష్టేరప్రసిద్ధత్వాన్నిష్ప్రయోజనత్వాచ్చ ఇత్యవోచామ . అవిద్యాసృష్టివిషయైవ సర్వా గౌణీ ముఖ్యా చ సృష్టిః, న పరమార్థతః, 'సబాహ్యాభ్యంతరో హ్యజః' (ము. ఉ. 2 . 1 . 2) ఇతి శ్రుతేః . తస్మాత్ శ్రుత్యా నిశ్చితం యత్ ఏకమేవాద్వితీయమజమమృతమితి, యుక్తియుక్తం చ యుక్త్యా చ సంపన్నం , తదేవేత్యవోచామ పూర్వైర్గ్రంథైః ; తదేవ శ్రుత్యర్థో భవతి, నేతరత్కదాచిదపి క్వచిదపి ..

కథం శ్రుతినిశ్చయ ఇత్యాహ —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**భూతతః** సృజించబడిన వస్తువులయందు, **అభూతతః** ఇంద్రజాలికుని వలె మాయచేత కల్పించబడిన వస్తువుల యందు **వా అపి** కాని **శ్రుతిః** శ్రుతికి **సమా** సమమైన ఒకే విధమైన అభిప్రాయం ఉంటుంది. (అంటే, రెండునూ అసత్యములే దానిలో ఒకటి సత్యం మరొకటి అసత్యం అనే భేద దృష్టి లేదు).

**సందేహం** : శబ్దానికి గౌణార్థం, ముఖ్యార్థం అనే రెండు అర్థాలలో ముఖ్యార్థాన్ని గ్రహించడం సమంజసం కదా!

**సమాధానం** : కాదు. ఎందుకంటే, సృష్టి ఏవిధంగానైననూ ప్రసిద్ధమైనది కాదు, ప్రయోజనకారి కాదు అని మేము మొదటినుండీ చెప్తూనే ఉన్నాం. ముఖ్యార్థంలో కానీ మరియు గౌణార్థంలో కాని, సృష్టి ఏదైనా అవిద్యచే కల్పించబడిన విషయమే కాని యదార్థం కాదు అని 'బాహ్యాంతరాలతో కలిసి పుట్టుకనేది లేనిది' ['సబాహ్యాభ్యంతరో హ్యజః' (ము.ఉ. 2-1-2)] శ్రుతి చెప్పింది. అందువలన, శ్రుతిచేత 'అది ఒక్కటే రెండవది లేదు, పుట్టుక-వినాశం లేనిది' అని **నిశ్చితమ్** నిశ్చయించబడి **యుక్తియుక్తమ్ చ** మరియు హేతుబద్ధంగా కూడా **యః** ఏతత్త్వమైతే నిరూపణ చేయబడినదో **తత్** అదియే **భవతి** ఉనికి కలది **న ఇతరత్** ఇతరమేదీ ఉనికి కలది కాదు అన్నదే శ్రుతి అభిప్రాయం. ఈ విషయాన్నే ఇంతవరకు శ్లోకాలలో చెప్పాము.

శ్రుతి ఏ ప్రకారంగా నిశ్చయించి చెప్పిందో, తర్వాత శ్లోకంలో చెప్తున్నారు.

**నేహ నానేతి చామ్నాయాదిన్ద్రో మాయాభిరిత్యపి |**
**అజాయమానో బహుధా జాయతే మాయయా తు సః || || మాం.గౌ.కా. 3-24 ||**

ఇక్కడ నానాత్వం లేదు అని, మాయ చేత ప్రభువు (వివిధ రూపాలుగా పరిణమిస్తున్నాడు) అని, మరింకా పుట్టుక లేని ఆ తత్త్వమే మాయచేత వివిధ రూపాలుగా పుడుతోంది (అని శ్రుతి ప్రకటిస్తోంది).

**శంకరుల భాష్యము**

యది హి భూతత ఏవ సృష్టిః స్యాత్ , తతః సత్యమేవ నానావస్త్వితి తదభావప్రదర్శనార్థ ఆమ్నాయో న స్యాత్ ; అస్తి చ 'నేహ నానాస్తి కించన' (క. ఉ. 2 . 1 . 11) ఇత్యామ్నాయో ద్వైతభావప్రతిషేధార్థః ; తస్మాదాత్మైకత్వప్రతిపత్త్యర్థా కల్పితా సృష్టిరభూతైవ ప్రాణసంవాదవత్ . 'ఇంద్రో మాయాభిః' (బృ. ఉ. 2 . 5 . 19) ఇత్యభూతార్థప్రతిపాదకేన మాయాశబ్దేన వ్యపదేశాత్ . నను ప్రజ్ఞావచనో మాయాశబ్దః ; సత్యం , ఇంద్రియప్రజ్ఞాయా అవిద్యామయత్వేన మాయాత్వాభ్యుపగమాదదోషః . మాయాభిః ఇంద్రియప్రజ్ఞాభిరవిద్యారూపాభిరిత్యర్థః . 'అజాయమానో బహుధా విజాయతే' (తై. ఆ. 3 . 13) ఇతి శ్రుతేః . తస్మాత్ జాయతే మాయయా తు సః ; తు —శబ్దోఽవధారణార్థః మాయయైవేతి . న హ్యజాయమానత్వం బహుధాజన్మ చ ఏకత్ర సంభవతి, అగ్నావివ శైత్యమౌష్ణ్యం చ . ఫలవత్త్వాచ్చాత్మైకత్వదర్శనమేవ శ్రుతినిశ్చితోఽర్థః, 'తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః' (ఈ. ఉ. 7) ఇత్యాదిమంత్రవర్ణాత్ 'మృత్యోః స మృత్యుమాప్నోతి' (క. ఉ. 2 . 4 . 10) ఇతి నిందితత్వాచ్చ సృష్ట్యాదిభేదదృష్టేః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

సృష్టి అన్నది యదార్థమే అయినట్లైతే, నానాత్వం అన్నది కూడా యదార్థమే కావాలి. అలాంటప్పుడు ఈ నానాత్వం అనేది లేదు అని చెప్పే శ్రుతివాక్యం ఉండేది కాదు. కాని, ఈ ద్వైత భావానికి

వ్యతిరేకంగా 'ఇక్కడ నానాత్వం అన్నది ఏమాత్రం లేదు' ['నేహ నానాస్తి కిఞ్చన' (క.ఉ. 2-1-11)] అని శ్రుతి ప్రకటించింది. కాబట్టి, ఆత్మ యొక్క ఏకత్వాన్ని ప్రతిపాదించే ఉద్దేశ్యంతోనే, ప్రాణాదుల సంవాదరూపంలో సృష్టి క్రమం కల్పించబడింది. 'మాయచేత పరమేశ్వరుడు (అనేక రూపాలు కలవాడుగా)' ['ఇంద్రో మాయాభిః' (బృ.ఉ. 2-5-19)] అనే శ్రుతి వాక్యంలో 'మాయ' శబ్దాన్ని ప్రయోగించడం ద్వారా సృష్టియొక్క అసత్యత్వాన్ని శ్రుతి బోధిస్తోంది.

**సందేహం** : మాయ అనే శబ్దం ప్రజ్ఞను తెలియచేస్తోంది (అనుకోవచ్చు) కదా!

**సమాధానం** : నిజమే. అవిద్య వల్ల కలిగే ఇంద్రియపాటవం (పటుత్వం లేదా ప్రజ్ఞ) అన్నది కూడా ఒక విధమైన మాయే కాబట్టి, అలా అనడంలో దోషం ఏమీ లేదు. కాబట్టి, **మాయాభిః** అంటే అవిద్యారూపమైన ఇంద్రియసామర్థ్యాల వల్ల అని అర్థం. **అజాయమానో బహుధా** 'పుట్టుక లేనిది బహువిధాలుగా పరిణమిస్తోంది' ['అజాయమానో బహుధా విజాయతే' (తై.ఆ. 3-13)] అని శ్రుతి వాక్యం. అందువలన, **సః** ఆ ఆత్మ తత్త్వం **జాయతే మాయయా తు** కేవలం మాయచేతనే (వివిధ రూపాలను) పొందినదిగా అనిపిస్తోంది. 'తు' శబ్దాన్ని కేవలం మాయవల్లనే అనే అర్థంలో తీసుకోవాలి. ఎందుకంటే, పుట్టుక లేకపోవడం మరియు వివిధ రూపాలుగా జన్మించడం అన్నది, అగ్నికి ఉష్ణత్వం మరియు చల్లదనం ఉండనట్లుగా, ఒకే తత్వంలో సంభవం కాదు. మరియు ఆత్మయొక్క ఏకత్వ దర్శనమే పొందబోయే ఫలితమని శ్రుతుల నిశ్చితమైన అభిప్రాయంగా 'ఏకత్వాన్నే దర్శించే అక్కడ మోహమేది, శోకమేది,' ['తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః' (ఈ.ఉ. 7)] అని మంత్రోపనిషత్తులో బోధనచేసి, 'అతడు మరణం నుండి మరణాన్ని పొందుతుంటాడు ' ['మృత్యోః స మృత్యుమాప్నోతి' (క.ఉ. 2-4-10)] అని జగత్తు యొక్క భిన్నత్వాన్ని దర్శించే అజ్ఞానాన్ని నిందించారు.

**సమ్భూతేరపవాదాచ్చ సమ్భవః ప్రతిషిధ్యతే |**
**కో న్వేనం జనయేదితి కారణం ప్రతిషిధ్యతే ||** **|| మాం.గౌ.కా. 3-25 ||**

సంభూతిని (హిరణ్యగర్భత్వాన్ని) నిరాకరించడం ద్వారా సంభవించడమనేదే త్రోసిపుచ్చబడుతోంది. ఈ జీవునిని ఎవరు పుట్టిస్తున్నారనే కారణమే నిషేధించబడుతోంది.

**శంకరుల భాష్యము**

'అంధం తమః ప్రవిశంతి యే సంభూతిముపాసతే' (ఈ.ఉ. 12) ఇతి సంభూతేరుపాస్యత్వాపవాదాత్సంభవః ప్రతిషిధ్యతే ; న హి పరమార్థసద్భూతాయాం సంభూతౌ తదపవాద ఉపపద్యతే . నను వినాశేన సంభూతేః సముచ్చయవిధానార్థః సంభూత్యపవాదః, యథా 'అంధం తమః ప్రవిశంతి యేఽవిద్యాముపాసతే' (ఈ.ఉ. 9) ఇతి . సత్యమేవ, దేవతాదర్శనస్య సంభూతివిషయస్య వినాశశబ్దవాచ్యస్య చ కర్మణః సముచ్చయవిధానార్థః సంభూత్యపవాదః ; తథాపి వినాశాఖ్యస్య కర్మణః స్వాభావికాజ్ఞానప్రవృత్తిరూపస్య మృత్యోరతితరణార్థత్వవత్ దేవతాదర్శనకర్మసముచ్చయస్య పురుషసంస్కారార్థస్య కర్మఫలరాగప్రవృత్తిరూపస్య సాధ్యసాధనైషణాద్వయలక్షణస్య మృత్యోరతితరణార్థత్వం . ఏవం హ్యేషణాద్వయరూపాన్మృత్యోరశుద్ధేర్వియుక్తః పురుషః సంస్కృతః స్యాత్ . అతో మృత్యోరతితరణార్థా దేవతాదర్శనకర్మసముచ్చయలక్షణా హ్యవిద్యా . ఏవమేవ ఏషణాద్వయలక్షణావిద్యాయా మృత్యోరతితీర్ణస్య విరక్తస్యోపనిషచ్ఛాస్త్రార్థాలోచనపరస్య నాంతరీయికా పరమాత్మైకత్వవిద్యోత్పత్తిరితి పూర్వభావినీమవిద్యామపేక్ష్య పశ్చాద్భావినీ బ్రహ్మవిద్యా అమృతత్వసాధనా ఏకేన పురుషేణ సంబధ్యమానా అవిద్యయా సముచ్చీయత ఇత్యుచ్యతే . అతః

అన్యార్థత్వాదమృతత్వసాధనం బ్రహ్మవిద్యామపేక్ష్య, నిందార్థ ఏవ భవతి సంభూత్యపవాదః యద్యప్యశుద్ధివియోగహేతుః అతన్నిష్ఠత్వాత్ . అత ఏవ సంభూతేరపవాదాత్సంభూతేరాపేక్షికమేవ సత్త్వమితి పరమార్థసదాత్మైకత్వమపేక్ష్య అమృతాఖ్యః సంభవః ప్రతిషిధ్యతే . ఏవం మాయానిర్మితస్యైవ జీవస్య అవిద్యయా ప్రత్యుపస్థాపితస్య అవిద్యానాశే స్వభావరూపత్వాత్పరమార్థతః కో న్వేనం జనయేత్ ? న హి రజ్జ్వామవిద్యాధ్యారోపితం సర్పం పునర్వివేకతో నష్టం జనయేత్కశ్చిత్ ; తథా న కశ్చిదేనం జనయేదితి . కో న్విత్యాక్షేపార్థత్వాత్కారణం ప్రతిషిధ్యతే . అవిద్యోద్భూతస్య నష్టస్య జనయితృ కారణం న కించిదస్తీత్యభిప్రాయః ; 'నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్' (క. ఉ. 1 . 2 . 18) ఇతి శ్రుతేః ..

## <u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>

'సంభూతిని ఉపాసించేవారు మరింత కటిక చీకటిని ప్రవేశిస్తారు' ['అంధం తమః ప్రవిశంతి యే సంభూతిముపాసతే' (ఈ.ఉ. 12)] అని **సంభూతేః అపవాదాత్** హిరణ్యగర్భోపాసనను తిరస్కరించడం ద్వారా **సంభవః ప్రతిషిధ్యతే** సృష్టిని అంటే సమస్త జగత్తు యొక్క సంభవతనే (పుట్టడాన్నే) త్రోసిపుచ్చుతున్నారు. సంభూతి అనగా హిరణ్యగర్భత్వమే కనుక యదార్థ సత్యమైతే దానిని నిరాకరించడం కుదరనే కుదరదు.

**<u>సందేహం</u>** : కర్మలతో హిరణ్యగర్భోపాసనను అనుసంధానించే విధానం సందర్భంలో, 'అంధం తమః ప్రవిశంతి యేఽవిద్యాముపాసతే' (ఈ.ఉ. 9) అని సంభూతిని నిరసిస్తున్నాం కదా!

**<u>సమాధానం</u>** : దేవతాదర్శన విషయమైన సంభూతి ఉపాసనను, వినాశ శబ్దంతో సూచించబడే కర్మలతో జోడించే సందర్భంలో సంభూతిని నిరాకరించడం నిజమే. అయినా కూడా, స్వాభావికంగా అజ్ఞాన ప్రవృత్తి రూపములైన వినాశమని పిలువబడే కేవల కర్మలు మృత్యువును (తమో గుణ రూపమైన మృత్యువును మాత్రమే) అధిగమించడమే ప్రయోజనంగా కలవి. పురుషుడిని సంస్కరించడం ద్వారా కర్మఫలమందలి రాగమనే ప్రవృత్తి కలిగి, సాధ్య-సాధనాలు (సాధ్యమనగా ఇహలోక, పరలోకాలను పొందాలనే కోరిక. అందుకు సంతానం, కర్మ, ఉపాసనలు అనేవి అందుకు ఉపకరించే సాధనాలు) అనే జంట లక్షణాలతో కూడిన మృత్యువును అధిగమించడం, కర్మలతో కూడిన దేవతా ఉపాసనల ప్రయోజనం. ఈ విధంగా (కర్మలు-ఉపాసనలను కలిపి ఆచరించడం ద్వారా), ఈ జంట కోరికల రూపంలోగల మృత్యువు అనబడే మాలిన్యం నుండి పురుషుడు సంస్కరింపబడతాడు. అందుచేత, మృత్యువును అధిగమించడమే ప్రయోజనం కలిగిన కర్మలతో కలిసిన దేవతా ఉపాసనలు కూడా కేవలం అవిద్య మాత్రమే. ఈ ప్రకారంగా, (సాధ్య-సాధనలు అనబడే) జంట కోరికల రూపమైన అవిద్యచేత మృత్యువునుండి తరించినవాడు, విరక్తుడై, ఉపనిషత్తు శాస్త్రం యొక్క అభిప్రాయాన్ని తెలుసుకోగోరినవాని అంతరంగంలో పరమాత్మ యొక్క ఏకత్వ జ్ఞానం తప్పక పొటమరిస్తుంది. ఒకే పురుషునికి సంబంధించి, అంతకు ముందు కర్మలవల్ల (మృత్యువునుండి తరించడమనే) భావన కలిగిన తరువాత ఈ బ్రహ్మవిద్య అనబడే అమృతత్వానికి దారితీసే సాధనకూడా అవిద్యయే కనుక ఆ రెండింటి సముచ్చయాన్ని (కలిసి ఆచరించడాన్ని) ఇలా చెప్పారు. అమృతత్వాన్ని సాధించే ఏ ఇతర సాధనాలైనా బ్రహ్మజ్ఞానంతో పోలిస్తే నిరాకరించబడేవే అవుతాయి కాబట్టి, సంభూతి కూడా (అంటే హిరణ్యగర్భత్వం కూడా) చిత్తమాలిన్యాన్ని తొలగించుకొనేందుకు ఉపకరించేదే అయినా కూడా, పరమాత్మ స్థితి కాదు కనుక, నిరాకరింపవలసినదే. అందుచేతనే, సంభూతి ఉపాసనను నిరాకరించడమంటే, పరమార్థ సత్యమైన ఆత్మ ఏకత్వంతో పోలిస్తే, అది కేవల సాపేక్షికమైన 'సత్' విషయమే కాబట్టి, అమృతమని పిలువబడే సంభూతి అనగా హిరణ్యగర్భతత్త్వం నిరాకరింపబడింది. ఈ విధంగా మాయచేత నిర్మితమైన జీవుడు, కేవలం అవిద్య చేతనే ఉనికిని కలిగిన వాడై, ఆ అవిద్య నశించి, తన స్వభావ స్వరూపమైన పరమార్థత్వంతో నిలిచి

యుండడం వల్ల, 'అతనిని ఎవరు మాత్రం జనింప చేయగలరు?' ['కో న్వేనం జనయేత్?' (బృ.ఉ. 3-4-28-7)]. అజ్ఞానం చేత రజ్జువునందు అధ్యారోపితం చేయబడిన సర్పం, వివేకం చేత నశించగా, ఎవరూ దానిని పుట్టించలేరు. అలాగే, **కః ను ఏనమ్ జనయేత్** అతనిని ఎవరూ జనింపచేయలేరు. 'కః ను' అని ఆక్షేపణార్థంలో చెప్పడం, (జనింపచేయడానికి) కారణాన్ని నిషేధిస్తుంది. అంటే, అవిద్య వల్ల ఉనికి కలిగినది నశించగా, దానిని పుట్టించేందుకు **కారణమ్ ప్రతిషిధ్యతే** కారణమేదీ లేదని అభిప్రాయం. ఇదే అభిప్రాయాన్ని 'దేనినుండీ అది ఉత్పన్నం కాదు, దాని నుండి మరేదీ సంభవించదు' ['నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్' (క.ఉ. 1-2-18)] అని శ్రుతి ప్రకటిస్తోంది.

**స ఏష నేతి నేతీతి వ్యాఖ్యాతం నిహ్నుతే యతః |**
**సర్వమగ్రాహ్యభావేన హేతునాజం ప్రకాశతే || || మాం.గౌ.కా. 3-26 ||**

(బ్రహ్మము) గ్రహించబడేది కానందుచేత, వ్యాఖ్యానించ బడిన ఈ సర్వమునూ (సకల సాధనలనూ కూడా) ఇది కాదు ఇది కాదు అని వాటన్నింటినీ త్రోసిపుచ్చినప్పుడు, ఆ పుట్టుకలేని (బ్రహ్మతత్త్వం) తనంతతానుగా ప్రకాశిస్తుంది.

## శంకరుల భాష్యము

సర్వవిశేషప్రతిషేధేన 'అథాత ఆదేశో నేతి నేతి' (బృ. ఉ. 2 . 3 . 6) ఇతి ప్రతిపాదితస్యాత్మనో దుర్బోధత్వం మన్యమానా శ్రుతిః పునః పునరుపాయాంతరత్వేన తస్యైవ ప్రతిపిపాదయిషయా యద్యద్వ్యాఖ్యాతం తత్సర్వం నిహ్నుతే . గ్రాహ్యం జనిమద్బుద్ధివిషయమపలపత్యర్థాత్ 'స ఏష నేతి నేతి' (బృ. ఉ. 3 . 9 . 26), (బృ. ఉ. 4 . 2 . 4), (బృ. ఉ. 4 . 4 . 22), (బృ. ఉ. 4 . 5 . 15) ఇత్యాత్మనోఽదృశ్యతాం దర్శయంతీ శ్రుతిః . ఉపాయస్యోపేయనిష్ఠతామజానత ఉపాయత్వేన వ్యాఖ్యాతస్య ఉపేయవద్గ్రాహ్యతా మా భూదితి అగ్రాహ్యభావేన హేతునా కారణేన నిహ్నుత ఇత్యర్థః . తతశ్చైవముపాయస్యోపేయనిష్ఠతామేవ జానత ఉపేయస్య చ నిత్యైకరూపత్వమితి తస్య సబాహ్యాభ్యంతరమజమాత్మతత్త్వం ప్రకాశతే స్వయమేవ ..

ఏవం హి శ్రుతివాక్యశతైః సబాహ్యాభ్యంతరమజమాత్మతత్త్వమద్వయం న తతోఽన్యదస్తీతి నిశ్చితమేతత్ . యుక్త్యా చాధునైతదేవ పునర్నిర్ధార్యత ఇత్యాహ —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

ఆత్మ యొక్క యదార్థతత్వాన్ని బోధించడం కష్టసాధ్యమని శ్రుతి భావించినదై, **యతః** ఏ ఆత్మ తత్త్వం గురించైతే శ్రుతి వేరు వేరు విధాలుగా ప్రతిపాదనలు చేసి మరలా మరలా తానే **వ్యాఖ్యాతమ్** వ్యాఖ్యానించిందో **సర్వమ్** వాటన్నింటిన్నింటినీ **నిహ్నుతే** త్రోసిపుచ్చుతోంది. అంటే, ఆ యా సకల సాధనా విశేషణాలన్నింటినీ నిరాకరిస్తూ 'ఇక ఇప్పుడు ఇది కాదు ఇది కాదు అన్నదే ఉపదేశం' ['అథాత ఆదేశో నేతి నేతి' (బృ.ఉ. 2-3-6)] అని ప్రతిపాదించింది. ఇంద్రియాలచే గ్రహించబడేదేదీ, పుట్టేదేదీ, బుద్ధికి విషయమైనదేదీ యదార్థసత్యం కాదు. అంటే, 'ఇది కాదు ఇది కాదు అంటూ ఈ వివేకించబడేది' ['స ఏష నేతి నేతి' (బృ.ఉ. 3-9-26), (బృ.ఉ. 4-2-4), (బృ.ఉ. 4-4-22), (బృ.ఉ. 4-5-15)] అని ఆత్మ దృశ్యంలాగా దర్శింపబడేది కాదని శ్రుతి నిర్దేశిస్తోంది. (దర్శనీయమైన వస్తువులు కూడా యదార్థమైనవే అయితే, అదర్శనీయమైన బ్రహ్మము పరమ సత్యం కాబోదు. కాబట్టి, బ్రహ్మము

యొక్క యదార్థతయే ద్వైతం యొక్క అసత్యత్వాన్ని చెప్తోంది – స్వామి గంభీరానంద). ఏదైనా ఒక విషయాన్ని సులభంగా గ్రహించడం కొరకు ఉపాయాన్ని ఊహించి, ఆ ఉపాయం ద్వారా అసలు విషయాన్ని ప్రతిపాదించినప్పుడు, వ్యాఖ్యానించబడిన ఉపాయాన్నే అసలు విషయంగా గ్రహించడం సరికాదు. **అగ్రాహ్యాభావేన** అంటే అలా ఉపాయాన్నే అసలు విషయంగా పొరపాటు పడకూడదనే **హేతునా** కారణం చేత **నిహ్నుతే** ఆ ఉపాయాన్ని యదార్థం కాదని త్రోసిపుచ్చుతున్నారు. [బ్రహ్మకు మూర్త-అమూర్తములు అనే రెండు రూపాలున్నాయనే ఉపాయం ద్వారా బ్రహ్మయొక్క యదార్థ సత్యాన్ని నిరూపిస్తారు. కాని, అజ్ఞానులు ఈ రూపాలే యదార్థమైన సత్యమని భ్రమపడతారు. అలాంటి పొరబాటు భావన పడకూడదని ఇక్కడ హెచ్చరిస్తూ, ఆ రూప విశేషణాలను త్రోసిపుచ్చుతున్నారు]. అందుచేత, ఆ విధంగా, ఉపేయమును ప్రతిపాదించడం ఉపాయము యొక్క ప్రయోజనమని, అలా ప్రతిపాదించబడిన ఉపేయమే శాశ్వతమైన ఏకత్వమని, తెలుసుకొన్న వానికి, అదియే **అజమ్** లోపల మరియు బయట కూడా వ్యాపించి యున్న ఆత్మతత్త్వమే **ప్రకాశతే** తనంత తానుగా ప్రకటనమౌతుంది.

ఈ విధంగా, పుట్టుక అనేది లేకుండా, లోపల మరియు బయట అనే తేడా లేకుండా నిండియున్న ఆత్మతత్త్వమే అద్వయస్థితి అని, దానికి అన్యంగా మరొకటి ఏదీ లేదనే నిశ్చయమైన అభిప్రాయాన్ని ప్రకటించే శ్రుతివాక్యాలు వందలకొలది ఉన్నాయి. ఇప్పుడు ఇదే అభిప్రాయాన్ని హేతుబద్ధంగా కూడా మరొకమారు నిర్ధారణ చేయడం కోసం ఇలా అంటున్నారు.

**సతో హి మాయయా జన్మ యుజ్యతే న తు తత్త్వతః |**
**తత్త్వతో జాయతే యస్య జాతం తస్య హి జాయతే ||** **|| మాం.గౌ.కా. 3-27 ||**

సిద్ధమై ఉన్నదానికి పుట్టుక అనేది మాయచేత సంక్రమిస్తుందే కాని యదార్థంగా కాదు. పుట్టుకే యదార్థమనుకొంటే, అప్పటికే పుట్టిఉన్నదే పుడుతోందని అర్థం.

**శంకరుల భాష్యము**

తత్రైతత్స్యాత్ సదా అగ్రాహ్యమేవ చేదసదేవాత్మతత్త్వమితి ; తన్న, కార్యగ్రహణాత్ . యథా సతో మాయావినః మాయయా జన్మ కార్యం , ఏవం జగతో జన్మ కార్యం గృహ్యమాణం మాయావినమివ పరమార్థసంతమాత్మానం జగజ్జన్మ మాయాస్పదమేవ గమయతి . యస్మాత్ సతో హి విద్యమానాత్కారణాత్ మాయానిర్మితస్య హస్త్యాదికార్యస్యేవ జగజ్జన్మ యుజ్యతే, నాసతః కారణాత్ . న తు తత్త్వత ఏవ ఆత్మనో జన్మ యుజ్యతే . అథవా, సతః విద్యమానస్య వస్తునో రజ్జ్వాదేః సర్పాదివత్ మాయయా జన్మ యుజ్యతే న తు తత్త్వతో యథా, తథా అగ్రాహ్యస్యాపి సత ఏవాత్మనో రజ్జుసర్పవజ్జగద్రూపేణ మాయయా జన్మ యుజ్యతే . న తు తత్త్వత ఏవాజస్యాత్మనో జన్మ . యస్య పునః పరమార్థసదజమాత్మతత్త్వం జగద్రూపేణ జాయతే వాదినః, న హి తస్య అజం జాయత ఇతి శక్యం వక్తుం , విరోధాత్ . తతః తస్యార్థాజ్జాతం జాయత ఇత్యాపన్నం . తతశ్చానవస్థాపాతాజ్జాయమానత్వం న . తస్మాదజమేకమేవాత్మతత్త్వమితి సిద్ధం ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**సందేహం** : అలా అయినట్లైతే, ఎప్పటికీ గ్రహించబడలేనిదైనందున, ఆత్మతత్త్వం అసత్యమే అవుతోంది కదా!

**సమాధానం** : అలా కాదు. ఎందుకంటే, దాని యొక్క కార్యం (ఆత్మ తత్త్వం యొక్క కార్యమైన జగత్తు) తెలియబడుతోంది కనుక. మాయచేత కల్పించబడిన వస్తువులు కనబడుతుండగా వాటిని కల్పన చేసే ఇంద్రజాలికుడు ఉన్నాడనే సత్యం నిరూపితమౌతున్నట్లే, కనిపించే జగత్తు పుట్టడానికి కారణమైన ఆత్మ అన్నది పరమార్థ సత్యంగా తెలియబడుతోంది. అంటే, జగత్తు యొక్క పుట్టుక కూడా మాయవంటిదే అని గమనించాలి. ఎలాగైతే, ఏనుగు మొదలైనవి ఇంద్రజాలం కారణంగా కల్పితమైనట్లుగానే, జగత్తు యొక్క పుట్టుకకు కారణం లేకపోవడం అన్నది లేదు (అంటే, జగత్తు కల్పనకు కారణమైనది ఉండి తీరాలి). యదార్థంగా ఆత్మకు పుట్టుకను జోడించడం కుదరదు. లేదంటే, త్రాడునందు భ్రమచేత పాము వంటివి నిజమైనవిగా ఆరోపితమౌతున్నాయే కాని యదార్థంగా కానట్లే, గ్రహింపబడలేనిది అయినప్పటికీ, **సతః హి** యదార్థ సత్యమైన ఆత్మయందు, త్రాడునందు పాము లాగా జగత్తు రూపంలో **మాయయా** మాయచేత **జన్మ యుజ్యతే** పుట్టుక అన్నది జోడించబడుతోందే కాని, పుట్టుకలేని ఆత్మకు **న తు తత్త్వతః** యదార్థంగా జగత్తు రూపంగా జననం అన్నదైతే లేదు. ఎవరైతే, పరమార్థ సత్యంగా పుట్టుకలేని ఆత్మతత్త్వానికి జగత్తు రూపంగా జననం ఉన్నది అని వాదిస్తారో, వారికి కూడా పుట్టుకలేనిదానికి జననాన్ని ఆపాదించడం కుదరని పని. ఎందుకంటే, ఆ వాదనలోని విరుద్ధత స్పష్టంగా కనిపిస్తోంది కాబట్టి. అందుచేత, వారి వాదనలో సిద్ధమై ఉన్న (అప్పటికే పుట్టి ఉన్న) ఆత్మ నుండే జగత్తు పుడుతోందని ప్రాప్తిస్తోంది. కాని ఇది కూడా, ఒకదాని నుండి మరొకటి పుట్టడమనే అంతం లేని శృంఖలత్వాన్ని ప్రతిపాదించడం చేత, సరియైనది కాదు. అందువలన, ఆత్మతత్త్వం యొక్క అజత్వం, ఏకత్వం నిరూపితమౌతున్నది.

**అసతో మాయయా జన్మ తత్త్వతో నైవ యుజ్యతే |**
**వన్ధ్యాపుత్రో న తత్త్వేన మాయయా వాపి జాయతే || || మాం.గౌ.కా. 3-28 ||**

అసత్తునకు యదార్థంగాగాని మాయచేత గాని జనించడం ఉండదు. గొడ్రాలికి నిజంగా గాని, మాయవలన కాని, పుత్రుడు కలగడం ఉండదు కదా!

**శంకరుల భాష్యము**

అసద్వాదినాం అసతో భావస్య మాయయా తత్త్వతో వా న కథంచన జన్మ యుజ్యతే, అదృష్టత్వాత్ . న హి వంధ్యాపుత్రో మాయయా తత్త్వతో వా జాయతే . తస్మాదత్రాసద్వాదో దూరత ఏవానుపపన్న ఇత్యర్థః ..

కథం పునః సతో మాయయైవ జన్మేత్యుచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

(పరమాత్మతో సహా) సకలమూ అసత్యమే (శూన్యమే) అని వాదించే వారికి, **అసతః** ఆ ఉనికియే లేనిది **మాయయా తత్త్వతః** మాయచేతగాని లేదా యదార్థంగాగాని ఏవిధంగానో **జన్మ న యుజ్యతే** జనించడం అనేది సంభవంకాదు. ఎందుకంటే అటువంటిది లోకంలో అనుభవంలో లేదు కాబట్టి. **వంధ్యాపుత్రః** గొడ్రాలికి సంతానం అనేది **తత్త్వేన మాయయా వా అపి** యదార్థంగాగాని లేదా మాయవల్లగాని **న జాయతే** కలుగదు. కాబట్టి ఇక్కడ ఈ సందర్భంలో శూన్యవాదానికి తావులేదని అభిప్రాయం.

మరి అలాగైతే, కేవలం మాయ ద్వారా మాత్రం సద్వస్తువు (పరమాత్మ జగత్తుగా) ఎలా జన్మిస్తోందో చెప్తున్నారు.

**యథా స్వప్నే ద్వయాభాసం స్పన్దతే మాయయా మనః |**
**తథా జాగ్రద్ద్వయాభాసం స్పన్దతే మాయయా మనః ||** **|| మాం.గౌ.కా. 3-29 ||**

ఎలాగైతే స్వప్నంలో మనసు మాయవలన తెలియబడేది-తెలుసుకొనేవాడు అనే రెండు ప్రకాశాలుగా స్పందిస్తుందో, అలాగే జాగ్రదవస్థలో కూడా మనసు మాయవలన అదే ద్వైతభావాన్ని పొందుతోంది.

**శంకరుల భాష్యము**

యథా రజ్జ్వాం వికల్పితః సర్పో రజ్జురూపేణావేక్ష్యమాణః సన్ , ఏవం మనః పరమాత్మవిజ్ఞప్త్యాత్మరూపేణావేక్ష్యమాణం సత్ గ్రాహ్యగ్రాహకరూపేణ ద్వయాభాసం స్పందతే స్వప్నే మాయయా, రజ్జ్వామివ సర్పః ; తథా తద్వదేవ జాగ్రత్ జాగరితే స్పందతే మాయయా మనః, స్పందత ఇవేత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**యథా** ఎలాగైతే, త్రాడు ఆకారం కారణంగా త్రాడు స్థానంలో కల్పితమైన పాము ఉన్నట్లుగా చూడబడుతోందో, అదేవిధంగా ఆత్మస్వరూపం కారణంగా పరమాత్మ విజ్ఞాన స్థానంలో కల్పితమైన మనసు ఉనికి కలదానిగా తెలియడం ద్వారా, **స్వప్నే** స్వప్నకాలంలో **మాయయా** మాయవలన **ద్వయాభాసమ్** గ్రహించబడేది-గ్రహించేది అనే రెండు వేర్వేరు చేతనలుగా **మనః** మనసు **స్పన్దతే** స్పందిస్తోంది. (అంటే, స్వప్నంలో దృశ్యాన్ని చూచేదీ మనసే, ఆ చూడబడే దృశ్యమూ మనసే. ఒకే మనసు స్వప్నంలో ఇటువంటి రెండు వేర్వేరు విషయాలుగా పరిణామం చెందుతోంది). త్రాడునందు పాము లాగా (అంటే అధిష్ఠానమైన త్రాడు మరియు దానియందు కల్పితమైన పాము రెండూ కూడా త్రాడే అయినట్లుగా) అని అర్థం. అందుచేత, ఆ విధంగానే (స్వప్నంలో ఎలాగైతే మనసు చూచేదిగానూ-చూడబడేదిగానూ రెండుగా కనిపిస్తున్నట్లుగా) **జాగ్రత్** జాగ్రదవస్థలో కూడా **మాయయా** మాయ కారణంగా **మనః** మనసు **ద్వయాభాసమ్** రెండు రకాలుగా (గ్రహించబడే విషయాలు-గ్రహించేది అనే రెండు రకాలుగా) **స్పన్దతే** స్పందిస్తోంది అని అభిప్రాయం. (అంటే, నిజానికి మేల్కొన్న స్థితిలో తాను మరియు తనకు అనుభవానికి వచ్చే జగత్తు అని రెండుగా కనబడేదంతా తానే అనేదే యదార్థ సత్యం అని గ్రహించాలి).

**అద్వయం చ ద్వయాభాసం మనః స్వప్నే న సంశయః |**
**అద్వయం చ ద్వయాభాసం తథా జాగ్రన్న సంశయః ||** **|| మాం.గౌ.కా. 3-30 ||**

స్వప్నంలో అద్వయమైన మనసు రెండుగా ప్రకటనం కావడంలో సందేహం ఏమీ లేదు. అలాగే జాగ్రదవస్థలో కూడా అద్వయమైన మనస్సు రెండుగా ప్రకాశించడంలో సందేహం ఏమీ లేదు.

**శంకరుల భాష్యము**

రజ్జురూపేణ సర్ప ఇవ పరమార్థత ఆత్మరూపేణ అద్వయం సత్ ద్వయాభాసం మనః స్వప్నే, న సంశయః . న హి స్వప్నే హస్త్యాది గ్రాహ్యం తద్గ్రాహకం వా చక్షురాది, ద్వయం విజ్ఞానవ్యతిరేకేణాస్తి ; జాగ్రదపి తథైవేత్యర్థః ; పరమార్థసద్విజ్ఞానమాత్రావిశేషాత్ ..

రజ్జుసర్పవద్వికల్పనారూపం ద్వైతరూపేణ మన ఏవేత్యుక్తం . తత్ర కిం ప్రమాణమితి, అన్వయవ్యతిరేకలక్షణమనుమానమాహ . కథం ?

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

త్రాడు రూపంలోని పాము వలె, యదార్థసత్యమైన ఆత్మరూపంగా **అద్వయమ్** అద్వయమైన **మనః** మనసు **స్వప్నే** స్వప్నావస్థలో **ద్వయాభాసమ్** రెండుగా (గ్రహించేది-గ్రహించబడేదిగా) కనిపించడంలో **న సంశయః** సందేహం ఏమీ లేదు. ఎందుకంటే, స్వప్నావస్థలో, ఏనుగుల వంటి గ్రహించబడే విషయాలను కన్నులు మొదలైనవి గ్రహించడవంటి ద్వైతం, చేతనకు (ఎఱుకకు) వ్యతిరేకంగా ఉండే అవకాశం లేదు కాబట్టి. కేవలం ఎఱుకయే (తెలియబడేది-తెలుసుకొనేది అనే ద్వైత భావానికి అతీతమైన తెలివిడియే (ఎఱుకయే) పరమార్థమైన సత్యంగా ఎటువంటి విశేషణాలు లేనిదై ఉన్నది కాబట్టి, **జాగ్రత్** జాగ్రదవస్థలో కూడా **తథా** అలాగే ఉంటుంది అని అభిప్రాయం.

కేవలం మనసే, త్రాడునందు పాములాగా, ద్వైతరూపమైన ప్రపంచాన్ని కల్పిస్తోందని చెప్పారు. దానికి ప్రమాణం ఏది అన్న ప్రశ్నకు, అన్వయ-వ్యతిరేక లక్షణాలు కలిగిన అనుమాన ప్రమాణాన్ని చెప్తున్నారు. ఎలా?

**మనోదృశ్యమిదం ద్వైతం యత్కిఞ్చిత్సచరాచరమ్ |**
**మనసో హ్యమనీభావే ద్వైతం నైవోపలభ్యతే || || మాం.గౌ.కా. 3-31 ||**

(జాగ్రదవస్థలోని) ఈ కదిలే-కదలని భేద ప్రపంచమంతా (ద్వైతం అంతా) మనసు యొక్క దృశ్యమే. మనసు అమనస్కత్వాన్ని (అమనీభావాన్ని) పొందితే, భేద ప్రపంచం (ద్వైతం) అనుభవానికి రాదు.

**శంకరుల భాష్యము**

తేన హి మనసా వికల్ప్యమానేన దృశ్యం మనోదృశ్యం ఇదం ద్వైతం సర్వం మన ఇతి ప్రతిజ్ఞా, తద్భావే భావాత్ తదభావే చాభావాత్ . మనసో హి అమనీభావే నిరుద్ధే వివేకదర్శనాభ్యాసవైరాగ్యాభ్యాం రజ్జ్వామివ సర్పే లయం గతే వా సుషుప్తే ద్వైతం నైవోపలభ్యత ఇతి అభావాత్సిద్ధం ద్వైతస్యాసత్త్వమిత్యర్థః ..

కథం పునరయమమనీభావ ఇత్యుచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**ఇదమ్ ద్వైతమ్** భిన్నత్వాలు కలిగినదిగా **యత్ కిఞ్చిత్ చరాచరమ్** ఈ కదిలేవి-కదలని వాటితో కూడిన ప్రపంచం ఏదైతే కలదో అది **మనోదృశ్యమ్** ఈ మనసు చేతనే కల్పించబడిన దృశ్యమే అని ప్రతిపాదిస్తున్నారు. అది ఉంటే ఉంటుంది, లేకుంటే ఉండదు. (మనసు అనేది ఉంటే ప్రపంచం ఉంటుంది, మనసు లేకుంటే ప్రపంచం లేకుండా పోతుంది). **హి** ఎందుకంటే, **మనసః అమనీభావే** మనసు మనసు కాకుండా పోతే (అంటే మనసు తన కల్పనాది వ్యవహారాలలో నిమగ్నంకాకుండా ఉన్నప్పుడు), వివేకంతో దర్శించడాన్ని అభ్యాసం చేయడం, వైరాగ్యం కలగడం వంటి వాటివలన, పాము భావన త్రాడునందు కలిసిపోయినట్లుగా, సుషుప్తిలో ద్వైతం కనిపించకుండా పోయినట్లుగా, మనసు తన ప్రవృత్తినుండి నిలువరించబడి, ఎటువంటి భావనా లేని స్థితిని పొందటం చేత, **ద్వైతమ్** భిన్నత్వం కలిగిన ప్రపంచానికి యొక్క **న ఉపలభ్యతే** ఉనికి ఉండదు కాబట్టి అది అసత్ అని అభిప్రాయం. (ఆ అమనస్క స్థితిలో ప్రపంచం అనుభవానికి రాదు కాబట్టి, భిన్నత్వాదులతో నిండిన ప్రపంచానికి ఉనికి ఉండదు).

మరి అయితే, ఈ అమనీభావం ఎలా కలుగుతుందో చెప్తున్నారు.

**ఆత్మసత్యానుబోధేన న సఙ్కల్పయతే యదా |**
**అమనస్తాం తదా యాతి గ్రాహ్యాభావే తదగ్రహం || || మాం.గౌ.కా. 3-32 ||**

(శాస్త్రం చేత మరియు గురువుచేత) బోధించబడిన మనసు ఎప్పుడైతే సంకల్పించదో అప్పుడు అది అమనీభావాన్ని పొందుతుంది. గ్రహించబడేది లేనప్పుడు గ్రహించడమన్నది కూడా ఉండదు.

**శంకరుల భాష్యము**

ఆత్మైవ సత్యమాత్మసత్యం , మృత్తికావత్ , 'వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం' (ఛా. ఉ. 6 . 1 . 4) ఇతి శ్రుతేః . తస్య శాస్త్రాచార్యోపదేశమన్వవబోధ ఆత్మసత్యానుబోధః . తేన సంకల్ప్యాభావాత్తన్న సంకల్పయతే దాహ్యాభావే జ్వలనమివాగ్నేః యదా యస్మిన్కాలే, తదా తస్మిన్కాలే అమనస్తాం అమనోభావం యాతి ; గ్రాహ్యాభావే తత్ మనః అగ్రహం గ్రహణవికల్పనావర్జితమిత్యర్థః ..

యద్యసదిదం ద్వైతం , కేన సమంజసమాత్మతత్త్వం విబుధ్యత ఇతి, ఉచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

'అన్ని పరిణామాలకు వాక్కే ఆధారం, అది కేవలం పేరు మాత్రమే. మట్టి అనేది ఒక్కటే సత్యం' ['వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం' (ఛా.ఉ. 6-1-4)] అనే శ్రుతి వాక్యాన్ని బట్టి, మట్టియే సత్యం (దాని వికారాలు సత్యం కావు) అన్నట్లుగా ఆత్మయే సత్యమని భావించడమే **ఆత్మసత్యమ్.** ఆ విధంగా శాస్త్రం, గురువు వివరంగా బోధించబడగా దానిని అనుభవానికి తెచ్చుకోవడమే **ఆత్మసత్యానుబోధ**. అటువంటి ఆత్మసత్యానుబోధ చేత, **యదా** ఎప్పుడైతే **న సంకల్పయతే** దహించబడే పదార్థాలు లేనప్పుడు అగ్నికి జ్వలించడమన్నది లేనట్లుగా, (మనసునందు) సంకల్పించడమనేది ఉండదో, **తదా** అప్పుడు ఆ సమయంలో **అమనస్తామ్** అమనీభావాన్ని (మనసు లేని స్థితిని) **యాతి** పొందుతుంది. **గ్రాహ్య అభావే** గ్రహించబడేది లేనందువల్ల

**తత్** ఆ మనసు **అగ్రహమ్** గ్రహించడమనే ఉద్దేశ్యాన్ని విడిచిపెడుతుంది అని అభిప్రాయం. (ఆత్మకు భిన్నంగా మరొకటి రెండవది లేదని, ఆత్మయే తాననే జ్ఞానాన్ని శాస్త్రంనుండి గురువు నుండి చక్కగా గ్రహించి అనుభవానికి తెచ్చుకొన్న సాధకుని మనసు సంకల్పరహిత స్థితిని పొందుతుంది. అంటే ఆ మనసులో ఎటువంటి ఆలోచనలు ఉండవు. అదే అమనీభావం. అటువంటి స్థితిలో గ్రహించేందుకు వేరొకటన్నది లేనప్పుడు, గ్రహించడమనేదే ఉండదు). ఈ కనిపించే ద్వైత ప్రపంచం అసత్తే అయినట్లైతే, ఆత్మతత్త్వం తెలియబడటమనేది ఎలా సమంజసమౌతుంది అనే సందేహానికి సమాధానాన్ని ఇలా చెప్తున్నారు. (తెలియబడేది లేనందుచేత, తెలియుట అనేది ఉండదు అని అన్నారు కదా. మరి, ఆత్మతత్త్వం తెలియబడుతుంది అనడం ఎలా సమంజసమౌతుంది? అన్న సందేహానికి సమాధానం చెప్తున్నారు).

**అకల్పకమజం జ్ఞానం జ్ఞేయాభిన్నం ప్రచక్షతే |**
**బ్రహ్మ జ్ఞేయమజం నిత్యమజేనాజం విబుధ్యతే || || మాం.గౌ.కా. 3-33 ||**

కల్పన, పుట్టుక లేని జ్ఞానం జ్ఞేయానికి (తెలియబడే దానికి) భిన్నమైనది కాదని వారంటారు. పుట్టుకనేదే లేని శాశ్వతమైన జ్ఞేయమే (తెలియబడేదే) బ్రహ్మము. పుట్టుక లేని ఆత్మ, పుట్టుకనేది లేని జ్ఞానబ్రహ్మంగా తెలియబడుతుంది,

**<u>శంకరుల భాష్యము</u>**

అకల్పకం సర్వకల్పనావర్జితం , అత ఏవ అజం జ్ఞానం జ్ఞప్తిమాత్రం జ్ఞేయేన పరమార్థసతా బ్రహ్మణా అభిన్నం ప్రచక్షతే కథయంతి బ్రహ్మవిదః . 'న హి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతే' (బృ. ఉ. 4 . 3 . 30) అగ్న్యుష్ణవత్ , 'విజ్ఞానమానందం బ్రహ్మ' (బృ. ఉ. 3 . 9 . 28) 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' (తై. ఉ. 2 . 1 . 1) ఇత్యాదిశ్రుతిభ్యః . తస్యైవ విశేషణం — బ్రహ్మ జ్ఞేయం యస్య, స్వస్థం తదిదం బ్రహ్మ జ్ఞేయం ఔష్ణ్యస్యేవాగ్నివదభిన్నం , తేన ఆత్మస్వరూపేణ అజేన జ్ఞానేన అజం జ్ఞేయమాత్మతత్త్వం స్వయమేవ విబుధ్యతే అవగచ్ఛతి . నిత్యప్రకాశస్వరూప ఇవ సవితా నిత్యవిజ్ఞానైకరసఘనత్వాన్న జ్ఞానాంతరమపేక్షత ఇత్యర్థః ..

ఆత్మసత్యానుబోధేన సంకల్పమకుర్వత్ బాహ్యవిషయాభావే నిరింధనాగ్నివత్ప్రశాంతం సత్ నిగృహీతం నిరుద్ధం మనో భవతీత్యుక్తం . ఏవం చ మనసో హ్యమనీభావే ద్వైతాభావశ్చోక్తః.

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

**అకల్పకమ్** ఏ విధమైన కల్పనలూ లేనిదైనందు చేత **అజమ్** పుట్టుక అనేది లేని **జ్ఞానమ్** కేవల జ్ఞానం **జ్ఞేయాత్** పరమార్థ సత్యమైన బ్రహ్మమునకు **అభిన్నమ్** వేరుకానిది అని **ప్రచక్షతే** బ్రహ్మవేత్తలు చెప్తున్నారు. అగ్ని ఉంటే ఉష్ణత్వం అనేది లేకపోయే ప్రసక్తే లేనట్లుగా, 'తెలుసుకొనేవాని యొక్క తెలివిడికి (ఎఱుకకు) నశించమన్నది ఉండదు' ['న హి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతే' (బృ.ఉ. 4-3-30)]; 'విజ్ఞానం, ఆనందం, బ్రహ్మ' ['విజ్ఞానమానందం బ్రహ్మ' (బృ.ఉ. 3-9-28)]; 'సత్యం, జ్ఞానం, అనంతం బ్రహ్మ' ['సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' (తై.ఉ. 2-1-1)] అని శ్రుతి వాక్యాలు ఈ అభిప్రాయాన్నే సమర్థిస్తున్నాయి. 'బ్రహ్మ జ్ఞేయం' అన్నది ఆ జ్ఞానం యొక్క విశేషణమే. అంటే, అగ్ని అనగా ఉష్ణం తప్ప మరేమీ కానట్లుగా, బ్రహ్మమే అయినట్టిది మరియు బ్రహ్మము తప్ప

మరేమీ కానిది ఆ జ్ఞానం అని అర్థం. **అజేన** అటువంటి పుట్టుకలేని ఆత్మస్వరూపం చేత, జ్ఞానం చేత **అజమ్** తెలియబడే ఆత్మతత్త్వం, తనంతతానుగా **విబుధ్యతే** తెలుపుడు చేసుకొంటుంది (ఎఱుక పరచుకొంటుంది). అనగా, శాశ్వతంగా ప్రకాశిస్తున్న సూర్యునిలాగా, సర్వత్రా ఒకే రసంతో నిండిన శాశ్వతమైన విజ్ఞానమైనందుచేత, ఆ జ్ఞాన బ్రహ్మ (తనను తాను ఎఱుకపరుచుకోవడానికి) ఇతర జ్ఞానాలపై ఆధారపడదని అభిప్రాయం.

ఆత్మయొక్క యదార్థత్వం అనుభవానికిరాగా, బాహ్యవిషయాలసేవి లేనికారణంగా, ఇంధనం లేని అగ్ని చల్లారినట్లు, మనసు సంకల్పరహితమై బహిర్ముఖత్వాన్ని పొందకుండా, తనలో తాను లయమై ప్రశాంతంగా ఉంటుంది అని చెప్పారు. ఈ విధంగా మనసు అమనీభావాన్ని పొందగా, ద్వైతం అన్నది లేకుండా పోతుంది అని కూడా చెప్పారు.

**నిగృహీతస్య మనసో నిర్వికల్పస్య ధీమతః |**
**ప్రచారః స తు విజ్ఞేయః సుషుప్తేఽన్యో న తత్సమః || || మాం.గౌ.కా. 3-34 ||**

బాహ్యవిషయ గ్రహణం లేని, సంకల్ప రహితమైన, వివేకవంతమైన మనసు యొక్క స్థితిని గమనించాలి. సుషుప్తిలో అనుభవానికి వచ్చే మనసు యొక్క స్థితి వేరు. (సుషుప్తిలోని స్థితి) దీనికి సమమైనది కాదు.

## శంకరుల భాష్యము

తస్యైవం నిగృహీతస్య నిరుద్ధస్య మనసః నిర్వికల్పస్య సర్వకల్పనావర్జితస్య ధీమతః వివేకవతః ప్రచరణం ప్రచారో యః, స తు ప్రచారః విశేషేణ జ్ఞేయో విజ్ఞేయో యోగిభిః . నను సర్వప్రత్యయాభావే యాదృశః సుషుప్తిస్థస్య మనసః ప్రచారః, తాదృశ ఏవ నిరుద్ధస్యాపి, ప్రత్యయాభావావిశేషాత్ ; కిం తత్ర విజ్ఞేయమితి . అత్రోచ్యతే — నైవం , యస్మాత్సుషుప్తే అన్యః ప్రచారోఽవిద్యామోహతమోగ్రస్తస్య అంతర్లీనానేకానర్థప్రవృత్తిబీజవాసనావతో మనసః ఆత్మసత్యానుబోధహుతాశవిప్లుష్టావిద్యాద్యనర్థప్రవృత్తిబీజస్య నిరుద్ధస్య అన్య ఏవ ప్రశాంతసర్వక్లేశరజసః స్వతంత్రః ప్రచారః . అతో న తత్సమః . తస్మాద్యుక్తః స విజ్ఞాతుమిత్యభిప్రాయః ..

ప్రచారభేదే హేతుమాహ —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

ఈ విధంగా **నిగృహీతస్య** బాహ్యవిషయ గ్రహణం లేని **నిరుద్ధస్య** నియంత్రించబడిన **నిర్వికల్పస్య** ఎటువంటి సంకల్పాలు లేనిదై **ధీమతః** వివేకవంతమైనదైన **మనసః** మనసు యొక్క స్థితి ఏదైతే ఉన్నదో **స తు ప్రచారః** ఆ స్థితి యోగులచే **విజ్ఞేయః** ప్రత్యేకంగా గమనించ తగినది.

**సందేహం :** మరి సుషుప్తి అవస్థలో కూడా ఇతర విషయాలేవీ లేని మనసు, ఈ నియంత్రించబడిన స్థితిలో ప్రవర్తిస్తున్నట్లుగానే, ప్రవర్తిస్తోంది కదా! అలాంటప్పుడు, నియంత్రితమైన మనసు యొక్క స్థితిని ప్రత్యేకంగా గమనించాలని ఎందుకు అంటున్నారు?

ఈ సందేహానికి ఇలా సమాధానం చెప్తున్నారు. అలా కాదు. ఎందుకంటే, సుషుప్తి దశలో మనసు యొక్క స్థితి వేరు కాబట్టి. అప్పుడు (ఆ సుషుప్తి దశలో) అవిద్య కారణంగా చీకటి కమ్మినదై, అంతర్లీనంగా అనేక

కారణబీజ వాసనలనే మలినాలతో మనసు కూడి ఉంటుంది. ఇక్కడ, ఈ నియంత్రితమైన మనసునందు ఆత్మ యొక్క యదార్థత్వం అనుభవంలోకిరాగా అవిద్య కారణంగా ఏర్పడిన వాసనా రూపమైన మాలిన్యాలన్నీ పూర్తిగా దహించి పోయినందున, అటువంటి సకలదోషములన్నింటి నుండి స్వేచ్ఛను పొంది ప్రశాంతమైన మనసు యొక్క స్థితి **సుషుప్తే** పైన చెప్పిన సుషుప్తిలోని మనసు యొక్క స్థితికి **అన్యః** భిన్నమైనది. కాబట్టి **న తత్ సమః** ఆ సుషుప్తిలోని మనసు యొక్క స్థితి ఇప్పుడు చెప్పిన నియంత్రితమైన మనసు యొక్క స్థితికి సమానం కాదు. అందుచేత, ఈ ప్రత్యేకమైన మనసు యొక్క స్థితి గమనించదగినది అని అభిప్రాయం.

మనసు యొక్క స్థితిలోని ఈ తేడాకు కారణాన్ని ఆచార్యులు ఇలా చెప్తున్నారు.

**లీయతే హి సుషుప్తే (సుషుప్తౌ) తన్నిగృహీతం న లీయతే |**
**తదేవ నిర్భయం బ్రహ్మ జ్ఞానాలోకం సమన్తతః || || మాం.గౌ.కా. 3-35 ||**

సుషుప్తిలో (మనసు ఎటువంటి ప్రత్యేకతలు లేని బీజభావంలో) లయమౌతుంది. కాని, (వివేకంతో ఆ బీజభావాన్ని) తొలగించినప్పుడు అది (ఆ మనసు) లయం కాకుండానే ఉంటుంది. అదియే అంతటా సమంగా వ్యాపించియున్న నిర్భయమైన బ్రహ్మ చైతన్యం.

## శంకరుల భాష్యము

లీయతే సుషుప్తౌ హి యస్మాత్సర్వాభిరవిద్యాదిప్రత్యయబీజవాసనాభిః సహ తమోరూపం అవిశేషరూపం బీజభావమాపద్యతే తద్వివేకవిజ్ఞానపూర్వకం నిగృహీతం నిరుద్ధం సత్ న లీయతే తమోబీజభావం నాపద్యతే . తస్మాద్యుక్తః ప్రచారభేదః సుషుప్తస్య సమాహితస్య మనసః . యదా గ్రాహ్యగ్రాహకావిద్యాకృతమలద్వయవర్జితం , తదా పరమద్వయం బ్రహ్మైవ తత్సంవృత్తమిత్యతః తదేవ నిర్భయం , ద్వైతగ్రహణస్య భయనిమిత్తస్యాభావాత్ . శాంతమభయం బ్రహ్మ యద్విద్వాన్న బిభేతి కుతశ్చన . తదేవ విశేష్యతే — జ్ఞప్తిర్జ్ఞానం ఆత్మస్వభావచైతన్యం , తదేవ జ్ఞానమాలోకః ప్రకాశో యస్య, తద్బ్రహ్మ జ్ఞానాలోకం విజ్ఞానైకరసఘనమిత్యర్థః . సమంతతః సమంతాత్ ; సర్వతో వ్యోమవన్నైరంతర్యేణ వ్యాపకమిత్యర్థః ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**సుషుప్తే** సుషుప్తి అవస్థలో **తత్** ఏ మనసునందైతే, సకలమైన అవిద్యాది ప్రవృత్తులు మరియు బీజరూప వాసనలతో సహా తమోరూపంగా ఉన్నాయో, అది ఆ మనసు **లీయతే హి** ఎటువంటి ప్రత్యేకతలు లేని బీజభావాన్ని పొంది లయమౌతుంది. కాని, ఆ మనసు **నిగృహీతమ్** వివేకంతో కూడిన విజ్ఞానం వల్ల నియంత్రించబడినప్పుడు **న లీయతే** తమస్సుతో కూడిన బీజభావాన్ని పొందదు. అందుచేత, సుషుప్తిలోని మనసు యొక్క స్థితికి నియంత్రితమైన మనసు యొక్క స్థితికి భేదాన్ని (గత శ్లోకంలో) చెప్పారు. ఎప్పుడైతే, అజ్ఞానం చేత కలిగిన గ్రహించేది-గ్రహించబడేది అనే దోష ద్వయం నిర్మూలనమౌతుందో, అప్పుడు అది సర్వాతీతమైన అద్వయమైన బ్రహ్మమే అయిపోతుంది. ఇలా అయినందుచేత, భయానికి కారణమైన రెండవదాన్ని గ్రహించడమనేది లేనందువల్ల, **తదేవ** అదియే **నిర్భయమ్** భయరహిత స్థితి. శాంతము, భయరహితమైన బ్రహ్మమును అనుభవాత్మకంగా తెలుసుకొన్నవాడు 'దేని వలననూ భీతి చెందడు' ['న బిభేతి కుతశ్చన' (తై.ఉ. 2-9-1)]. దానినే మరింతగా వివరించి చెప్తున్నారు. 'జ్ఞానమ్' అనగా జ్ఞప్తి, ఆత్మ స్వభావమైన చైతన్యం. ఏది జ్ఞానమే

ప్రకాశంగా గలదో అదియే 'జ్ఞానమాలోకః'. **జ్ఞానాలోకమ్** ఆ జ్ఞాన ప్రకాశమే అయిన బ్రహ్మయే, అనగా విశిష్టమైన జ్ఞానం ఒక్కదానితో మాత్రమే నిండియున్న రాశి అని అభిప్రాయం. **సమన్తతః** సమానంగా, ఆకాశం వలె ఎటువంటి తేడా లేకుండా అన్నింటా ఒకేవిధంగా వ్యాపించి యున్నదని అభిప్రాయం.

**అజమనిద్రమస్వప్నమనామకమరూపకమ్ |**
**సకృద్విభాతం సర్వజ్ఞం నోపచారః కథఞ్చన ||** **|| మాం.గౌ.కా. 3-36 ||**

(బ్రహ్మతత్వానికి) పుట్టుక లేదు, అజ్ఞానం లేదు, స్వప్నం లేదు, నామం లేదు, రూపం లేదు. నిత్యప్రకాశం, సర్వమును ఎఱుక కలిగి ఉండటమే స్వభావం కలిగి, ఏ మాత్రం కర్తవ్యం అనేది (బ్రహ్మమునకు) లేదు.

## శంకరుల భాష్యము

జన్మనిమిత్తాభావాత్సబాహ్యాభ్యంతరం అజం ; అవిద్యానిమిత్తం హి జన్మ రజ్జుసర్పవదిత్యవోచామ . సా చావిద్యా ఆత్మసత్యానుబోధేన నిరుద్ధా యతః, అతః అజం , అత ఏవ అనిద్రం అవిద్యాలక్షణానాదిర్మాయానిద్రాస్వాపాత్ప్రబుద్ధం అద్వయస్వరూపేణాత్మనా ; అతః అస్వప్నం . అప్రబోధకృతే హ్యస్య నామరూపే ; ప్రబోధాచ్చ తే రజ్జుసర్పవద్వినష్టే . న నామ్నాభిధీయతే బ్రహ్మ, రూప్యతే వా న కేనచిత్ప్రకారేణ ఇతి అనామకం అరూపకం చ తత్ , 'యతో వాచో నివర్తంతే' (తై. ఉ. 2 . 4 . 1) ఇత్యాదిశ్రుతేః . కించ, సకృద్విభాతం సదైవ విభాతం సదా భారూపం , అగ్రహణాన్యథాగ్రహణావిర్భావతిరోభావవర్జితత్వాత్ . గ్రహణాగ్రహణే హి రాత్ర్యహనీ ; తమశ్చావిద్యాలక్షణం సదా అప్రభాతత్వే కారణం ; తదభావాన్నిత్యచైతన్యభారూపత్వాచ్చ యుక్తం సకృద్విభాతమితి . అత ఏవ సర్వం చ తత్ జ్ఞప్తిస్వరూపం చేతి సర్వజ్ఞం . నేహ బ్రహ్మణ్యేవంవిధే ఉపచరణముపచారః కర్తవ్యః, యథా అన్యేషామాత్మస్వరూపవ్యతిరేకేణ సమాధానాద్యుపచారః . నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావత్వాద్బ్రహ్మణః కథంచన న కథంచిదపి కర్తవ్యసంభవః అవిద్యానాశే ఇత్యర్థః ..

అనామకత్వాద్యుక్తార్థసిద్ధయే హేతుమాహ —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

జన్మించడానికి కారణమేదీ లేకపోవడం చేత, బాహ్యంలోనూ అంతరంలోనూ తానే ఉన్న బ్రహ్మ **అజమ్** పుట్టినది కాదు. త్రాడు లోని పాము లాగా, అజ్ఞానం కారణంగానే జన్మ కలుగుతుందని చెప్పి ఉన్నాము కదా. ఆత్మయొక్క సత్యత్వం అనుభవానికి వచ్చినందువల్ల ఆ అజ్ఞానం నిర్మూలనమైన కారణంగా, అది పుట్టుక లేనిది. ఆ కారణంగానే, **అనిద్రమ్** నిదురించనిది. నిద్ర అనగా అవిద్యా లక్షణమైన మొదలన్నది లేని మాయయే. స్వప్నం నుండి తన అద్వయస్వరూపమైన ఆత్మయందు (ప్రబోధించబడటం చేత) మేల్కొల్పబడటం చేత, అది **అస్వప్నమ్** స్వప్నం కానిది. మేల్కొల్పబడనందునే (అప్రబోధ స్థితిలోనే) దానికి నామరూపాలు ప్రాప్తిస్తున్నాయి. ప్రబోధించబడగానే (మేల్కొల్పబడగానే) ఆ నామ రూపాలు, త్రాడు నందలి పాములాగా, నశిస్తాయి. అలా బ్రహ్మమును ఏ నామంతోగాని, రూపంతోగాని, ఏ విధంగానూ సూచించడం కుదరనందున అది **అనామకమ్ అరూపకమ్ చ**. 'దేని నుండి వాక్కులు వెనుతిరుగతాయో' ['యతో వాచో నివర్తంతే' (తై.ఉ. 2-4-1)] వంటి శ్రుతి వాక్యాలు కూడా ఈ అభిప్రాయాన్నే వెల్లడిస్తున్నాయి. మరింకా, అది (ఆ బ్రహ్మ) **సకృద్విభాతమ్** ఎల్లప్పుడూ

ప్రకాశించేదే. అంటే గ్రహించకపోవడం వల్ల ఆవిర్భవించడం, తప్పుగా గ్రహించడం చేత తిరోభవించడమనేది దానియందు ఉండదు. {వ్యక్తిలో తనను తాను గుర్తించపోవడం అనే అగ్రహణం వల్ల, ఆత్మ లేదని భావించడం అనే తిరోభావం కలుగుతోంది. తన దేహాన్నే ఆత్మ అని తప్పుగా గ్రహించడం అనే అన్యథా గ్రహణం వల్ల, ఆత్మయే దేహంగా ఆవిర్భవిస్తోంది. ఈ రెండు విధాలైన దోషాలు బ్రహ్మము నందు ఉండవని అభిప్రాయం}. (బ్రహ్మమును) గ్రహించడం, గ్రహించకపోవడం అనేది, సూర్యుడు ఉన్న పగలు, సూర్యుడు లేని రాత్రుల వంటిదే. {అవబోధకు ముందు అజ్ఞానం ఆ తరువాత జ్ఞానం కలగడం నిజమే. కాని, అవి బ్రహ్మమునకు సంబంధించినవి కావు. జనులు సూర్యుడు ఉదయిస్తున్నాడు, అస్తమిస్తున్నాడని అనుకొంటూ పగలు-రాత్రులను సూర్యునికి ఆపాదిస్తారు. కాని, నిజానికి పగలు-రాత్రి అన్నది సూర్యునికి లేదు. అలాగే, బ్రహ్మమునకు అజ్ఞానమూ లేదు జ్ఞానమూ లేదు. అది ఎల్లప్పుడూ కేవల ప్రకాశం మాత్రమే – స్వామి గంభీరానంద}. ఎప్పుడైనా, అవిద్యా లక్షణమైన చీకటే ప్రకాశించక పోవడానికి కారణం. నిత్య చైతన్య ప్రకాశ రూపం వల్ల ఆ చీకటి తొలగిపోవడాన్నే **సకృత్ విభాతమ్** అని అంటారు. అందువలననే, **సర్వజ్ఞమ్** అది సర్వమూ మరియు జ్ఞప్తి స్వరూపమని అన్నారు. ఈ విధముగా ఉన్న బ్రహ్మతత్త్వమునందు **ఉపచారః** కర్తవ్యం, అంటే ఇతరులకు (హఠ యోగులవంటి వారికి) తమ ఆత్మ స్వరూపానికి భిన్నంగా సమాధి మొదలైన కర్తవ్యాలు ఉన్నట్లుగా **న కథఞ్చన** ఏ మాత్రమూ ఉండవు. అంటే నిత్య-శుద్ధ-బుద్ధ-ముక్త స్వభావమైన బ్రహ్మము నందు అవిద్య పూర్తిగా నశించిన కారణంగా ఏ కొద్దిమాత్రమైనా చేయతగిన కర్తవ్యాలు ఉండడం సంభవం కానే కాదు అని అభిప్రాయం.

పైన చెప్పిన అనామకత్వాదులు సిద్ధించేందుకు గల కారణాలు క్రింది శ్లోకంలో చెప్తున్నారు.

**సర్వాభిలాపవిగతః సర్వచిన్తాసముత్థితః |**
**సుప్రశాన్తః సకృజ్జ్యోతిః సమాధిరచలోఽభయః || || మాం.గౌ.కా. 3-37 ||**

సకల జ్ఞానేంద్రియాలను విడిచి పెట్టినది, సకల అంతఃకరణ వృత్తులను అధిగమించినది. అది పూర్ణమైన శాంతి, శాశ్వతమైన ప్రకాశం, సమాధి స్థితి, నిశ్చలత, భయరహిత స్థితి.

## శంకరుల భాష్యము

అభిలప్యతే అనేనేతి అభిలాపః వాక్కరణం సర్వప్రకారస్యాభిధానస్య, తస్మాద్విగతః ; వాగత్రోపలక్షణార్థా, సర్వబాహ్యకరణవర్జిత ఇత్యేతత్ . తథా, సర్వచింతాసముత్థితః, చింత్యతే అనయేతి చింతా బుద్ధిః, తస్యాః సముత్థితః, అంతఃకరణవివర్జిత ఇత్యర్థః, 'అప్రాణో హ్యమనాః శుభ్రః అక్షరాత్పరతః పరః' (ము. ఉ. 2 . 1 . 2) ఇత్యాదిశ్రుతేః . యస్మాత్సర్వవిషయవర్జితః, అతః సుప్రశాంతః . సకృజ్జ్యోతిః సదైవ జ్యోతిః ఆత్మచైతన్యస్వరూపేణ . సమాధిః సమాధినిమిత్తప్రజ్ఞావగమ్యత్వాత్ ; సమాధీయతే అస్మిన్నితి వా సమాధిః . అచలః అవిక్రియః . అత ఏవ అభయః విక్రియాభావాత్ ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**అభిలాపవిగతః** అభిలాపమనగా మాట్లాడటం, అంటే వాగింద్రియంచేత అన్ని రకాలైన సంభాషణలు చేయడం. అటువంటి సంభాషించడం అన్నది లేకపోవడం **అభిలాపవిగతః**. ఇక్కడ వాగింద్రియాన్ని సకల

బాహ్యేంద్రియాలకు సూచనగా చెప్తున్నారు. అంటే సకల బాహ్యేంద్రియ వృత్తులనుండి విడివడినది అని (భావించాలి). అదే విధంగా, **సర్వచిన్తాసముత్థితః** విషయాల గురించి ఆలోచించేది అనగా బుద్ధి, ఆ బుద్ధిని అధిగమించినది. అంటే, అంతఃకరణానికి అతీతమైనది అని, 'ప్రాణం కానిది, మనసు కానిది, శుద్ధమైనది, నశించేదాని కన్నా అతీతమైనది' ['అప్రాణో హ్యమనాః శుభ్రః అక్షరాత్పరతః పరః' (ము.ఉ. 2-1-2)] వంటి శ్రుతివాక్యాలు నిర్ధారిస్తున్నాయి. దేని యందు, సకల విషయాలు లేకుండా పోతాయో అది **సుప్రశాన్తః** పూర్ణమైన శాంతం. అదియే **సకృజ్జ్యోతిః** ఆత్మ చైతన్య స్వరూపమైన శాశ్వతమైన వెలుగు. అది **సమాధిః** సమాధి స్థితిలో కలిగే ప్రజ్ఞ చేత అనుభవానికి వచ్చేది. లేదా, సమాధి స్థితి యందు విషయమైనది కాబట్టి దానిని సమాధిః అన్నారు. **అచలః** మార్పుచెందనిది. అలా మార్పు అనేది లేకపోవడం చేత అది **అభయః** ఆ స్థితి యందు భయమనేది ఉండదు.

**గ్రహో న తత్ర నోత్సర్గశ్చిన్తా యత్ర న విద్యతే |**
**ఆత్మసంస్థం తదా జ్ఞానమజాతి సమతాం గతమ్ || || మాం.గౌ.కా. 3-38 ||**

అక్కడ గ్రహించడమూ లేదు విడిచిపెట్టడమూ లేదు. ఎప్పుడు మనోవృత్తి ఉండదో, అప్పుడు జ్ఞానం ఆత్మయందే స్థితిని కలిగి, పుట్టుక అన్నది లేకుండా ఒకే విధంగా సమంగా వ్యాప్తమై ఉంటుంది.

**శంకరుల భాష్యము**

యస్మాద్బ్రహ్మైవ 'సమాధిరచలోఽభయః' ఇత్యుక్తం, అతః న తత్ర తస్మిన్బ్రహ్మణి గ్రహః గ్రహణముపాదానం , న ఉత్సర్గః ఉత్సర్జనం హానం వా విద్యతే . యత్ర హి విక్రియా తద్విషయత్వం వా, తత్ర హానోపాదానే స్యాతాం ; న తద్ద్వయమిహ బ్రహ్మణి సంభవతి, వికారహేతోరన్యస్యాభావాన్నిరవయవత్వాచ్చ ; అతో న తత్ర హానోపాదానే సంభవతః . చింతా యత్ర న విద్యతే, సర్వప్రకారైవ చింతా న సంభవతి యత్ర అమనస్త్వాత్ , కుతస్తత్ర హానోపాదానే ఇత్యర్థః . యదైవ ఆత్మసత్యానుబోధో జాతః, తదైవ ఆత్మసంస్థం విషయాభావాదగ్న్యుష్ణవదాత్మన్యేవ స్థితం జ్ఞానం , అజాతి జాతివర్జితం , సమతాం గతం పరం సామ్యమాపన్నం భవతి . యదాదౌ ప్రతిజ్ఞాతం 'అతో వక్ష్యామ్యకార్పణ్యమజాతి సమతాం గతం' (మా. కా. 3 . 2) ఇతి, ఇదం తదుపపత్తితః శాస్త్రతశ్చోక్తముపసంహ్రియతే — అజాతి సమతాం గతమితి . ఏతస్మాదాత్మసత్యానుబోధాత్కార్పణ్యవిషయమన్యత్ , 'యో వా ఏతదక్షరం గార్గ్యవిదిత్వాస్మాల్లోకాత్ప్రైతి స కృపణః' (బృ. ఉ. 3 . 8 . 10) ఇతి శ్రుతేః . ప్రాప్యైతత్సర్వః కృతకృత్యో బ్రాహ్మణో భవతీత్యభిప్రాయః ..

యద్యపీదమిత్థం పరమార్థతత్త్వం ,

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

బ్రహ్మమునకు సమాధి-అచలం-అభయం అనే లక్షణాలను చెప్పడం చేత, **తత్ర** అక్కడ బ్రహ్మమునందు **గ్రహః** గ్రహించడం లేదా పొందటమనేది **ఉత్సర్గః** విడిచి పెట్టడం లేదా కోల్పోవడమనేది **న విద్యతే** సంభవం కాదు. ఎక్కడైతే పరిణామం లేదా దానికి సంబంధించిన విషయం కాని ఉంటుందో అక్కడ పొందటం-కోల్పోవడమనేది ఉంటుంది. పరిణామానికి కారణమైన ఇతరమనేది ఏదీ లేనందు చేత, అవయవ విభాగమేదీ

లేనందు చేత, బ్రహ్మము నందు ఈ రెండూ సంభవం కావు. అందుచేత, అక్కడ (బ్రహ్మమునందు) పొందటం-కోల్పోవడమనేవి సంభవం కావు. **చిన్తా యత్ర న విద్యతే** అక్కడ సకల విధాలైన ఆలోచనలు కూడా సంభవించవు. అంటే, మనసు అమనస్కమైన చోట, పొందటం-కోల్పోవడమనేది ఎలా సంభవమౌతుంది? అని అభిప్రాయం. ఎప్పుడైతే ఆత్మ యదార్థ సత్యత్వం ఉత్పన్నమౌతుందో, అప్పుడే **జ్ఞానమ్** జ్ఞానము **ఆత్మసంస్థమ్** విషయాలు లేకుండా పోయినందున, అగ్ని యందలి ఉష్ణం లాగా, కేవలం ఆత్మయందే స్థితిని కలిగి, **అజాతి** పుట్టుకనేది లేకుండా **సమతామ్ గతమ్** పరమమైన సమానత్వాన్ని అంటే సజాతీయత్వాన్ని పొంది ఉంటుంది.

ఈ అద్వైత ప్రకరణం ప్రారంభంలో 'అందుచేత, అపరిమితమైన, పుట్టుకలేని, సమత్వత్వం కల బ్రహ్మమును గురించి బోధిస్తాను' ['అతో వక్ష్యామ్యకార్పణ్యమజాతి సమతాం గతమ్' (మా.కా. 3-2)] అని ప్రమాణం చేసిన దానిని శాస్త్రం సహాయంతో హేతుబద్ధంగా నిరూపణ చేసి, 'అజాతి సమతామ్ గతమ్' అంటూ ఆచార్యులు ఇక్కడ ముగిస్తున్నారు. ఆత్మ సత్యత్వ జ్ఞానం తప్ప మిగిలిన విషయమంతా కార్పణ్య విషయమే (దుఃఖదాయకమే) అని 'ఓ గార్గి, ఈ అవినాశిత్వాన్ని తెలుసుకోకుండా ఈ లోకాన్ని విడిచిపెట్టిన వాడు దుఃఖియే' ['యో వా ఏతదక్షరం గార్గ్యవిదిత్వాస్మాల్లోకాత్ప్రైతి స కృపణః' (బృ.ఉ. 3-8-10)] అని శ్రుతి కూడా చెప్తోంది. దీనిని తెలుసుకొన్నవాడు సకల అభీష్టములను సిద్ధింపచేసుకొన్న బ్రహ్మజ్ఞాని అవుతాడు అని అభిప్రాయం.

పరమార్థ తత్త్వం ఇలాంటిదని తెలుసుకొన్నప్పటికీనీ,

**అస్పర్శయోగో వై నామ దుర్దర్శః సర్వయోగిణామ్ |**
**యోగినో బిభ్యతి హ్యస్మాదభయే భయదర్శినః ||** **|| మాం.గౌ.కా. 3-39 ||**

అస్పర్శయోగంగా ప్రసిద్ధమైన ఇది సకల యోగులకు కష్టసాధ్యమైనట్టిదే. భయాన్ని దర్శించే యోగులు, ఏది అభయమో, దానిని గురించి భయపడతారు.

**శంకరుల భాష్యము**

అస్పర్శయోగో నామ అయం సర్వసంబంధాఖ్యస్పర్శవర్జితత్వాత్ అస్పర్శయోగో నామ వై స్మర్యతే ప్రసిద్ధ ఉపనిషత్సు . దుఃఖేన దృశ్యత ఇతి దుర్దర్శః సర్వయోగిణాం వేదాంతవిజ్ఞానరహితానాం ; ఆత్మసత్యానుబోధాయాసలభ్య ఏవేత్యర్థః . యోగినః బిభ్యతి హి అస్మాత్సర్వభయవర్జితాదపి ఆత్మనాశరూపమిమం యోగం మన్యమానా భయం కుర్వంతి, అభయే అస్మిన్ భయదర్శినః భయనిమిత్తాత్మనాశదర్శనశీలాః అవివేకినః ఇత్యర్థః ..

యేషాం పునర్బ్రహ్మస్వరూపవ్యతిరేకేణ రజ్జుసర్పవత్కల్పితమేవ మన ఇంద్రియాది చ న పరమార్థతో విద్యతే, తేషాం బ్రహ్మస్వరూపాణామభయం మోక్షాఖ్యా చ అక్షయా శాంతిః స్వభావత ఏవ సిద్ధా, నాన్యాయత్తా, 'నోపచారః కథంచన' (మా. కా. 3 . 36) ఇత్యుక్తేః ; యే త్వతోఽన్యే యోగినో మార్గగా హీనమధ్యమదృష్టయో మనోఽన్యదాత్మవ్యతిరిక్తమాత్మసంబంధి పశ్యంతి, తేషామాత్మసత్యానుబోధరహితానాం

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**అస్పర్శయోగో నామ వై** సకల సంబంధాలతో సంపర్కాన్ని విడిచిపెట్టినందున అస్పర్శయోగమని ప్రధాన ఉపనిషత్తులలో ప్రస్తావించబడిన ఈ యోగం **సర్వయోగిణామ్** వేదాంత విజ్ఞానం లేని యోగులందరిచే **దుర్దర్శః**

దర్శించేందుకు కష్టసాధ్యమైనది. అంటే, కేవలం ఆత్మ యొక్క యదార్థత్వాన్ని ప్రయత్నంతో గ్రహించడం వల్ల మాత్రమే సాధ్యపడుతుంది అని అర్థం. **హి** ఎందుకంటే, సకల భయాలు లేనిదైనప్పటికినీ ఈ యోగం తమ అస్తిత్వాన్ని నశింపచేసేదని తలచే వారికి భయాన్ని కలగచేస్తుంది. **అస్మాత్ అభయే** ఈ భయరహితమైన దానియందు **భయదర్శినః** భయం కారణంగా ఆత్మయొక్క నాశనాన్ని దర్శించే అవివేకులైన **యోగినః** యోగులు **బిభ్యతి** భయాన్ని పొందుతారు అని అభిప్రాయం.

ఎవరైతే, బ్రహ్మ స్వరూపానికి భిన్నంగా కనబడే మనసు మరియు ఇంద్రియాలు త్రాడునందలి పాము వలె కల్పితమైనవేనని, యదార్థమైనవి కావని దర్శిస్తారో, బ్రహ్మమే స్వరూపంగా గల అట్టివారికి మోక్షమనబడే అభయత్వం, అక్షయమైన శాంతి స్వభావ సిద్ధమే అవుతుంది కాని మరొక దానిపై ఆధారపడదు. ఈ విషయాన్నే 'ఏ మాత్రం కర్తవ్యత అనేది (బ్రహ్మమునకు) లేదు' ['నోపచారః కథంచన' (మా.గౌ.కా. 3-36)] అని ముందటి శ్లోకంలో చెప్పాము. కాని, ఇతర యోగులు అంటే ఇంకా యోగ మార్గం మధ్యలోనే ఉన్నవారు, అల్పదృష్టి-మధ్యమ దృష్టి కలవారు, మనసనేది ఆత్మతో సంబంధం కలదే అయినా భిన్నమైనదిగా దర్శించేవారు, అంటే ఆత్మయొక్క యదార్థ సత్యాన్ని తెలియని వారు, (ఈ భయరహిత స్థితిని పొందలేరు). ఎందుకంటే,

**మనసో నిగ్రహాయత్తమభయం సర్వయోగినామ్ |**
**దుఃఖక్షయః ప్రబోధశ్చాప్యక్షయా శాన్తిరేవ చ || || మాం.గౌ.కా. 3-40 ||**

సకల యోగులయందు, అభయం-దుఃఖ నాశనం- ఆత్మజ్ఞానం-అక్షయమైన శాంతి అన్నవి కేవలం నియంత్రించబడిన మనసు నిమిత్తంగానే సిద్ధిస్తాయి.

**శంకరుల భాష్యము**

మనసో నిగ్రహాయత్తమభయం సర్వేషాం యోగినాం . కించ, దుఃఖక్షయోఽపి . న హ్యాత్మసంబంధిని మనసి ప్రచలితే దుఃఖక్షయోఽస్త్యవివేకినాం . కించ, ఆత్మప్రబోధోఽపి మనోనిగ్రహాయత్త ఏవ . తథా, అక్షయాపి మోక్షాఖ్యా శాంతిస్తేషాం మనోనిగ్రహాయత్తైవ ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**సర్వయోగినామ్** సకల యోగులయందు **నిగ్రహాయత్తమ్ మనసః** నియంత్రితమైన మనసు వల్లనే **అభయమ్** భయరహిత స్థితి (కలుగుతుంది). మరింకా, **దుఃఖక్షయః** దుఃఖం నివారితమౌతుంది కూడా. అవివేకులలో, ఆత్మతో సంబంధం కలిగిన మనసు యొక్క కదలికల వల్ల దుఃఖం నశించడమనేది కలగదు. మరింకా, **ప్రబోధః చ** ఆత్మజ్ఞానం కూడా నియంత్రించబడిన మనసు వల్లనే సంభవమౌతుంది. ఆ విధంగా **అక్షయా శాంతిః ఏవ చ** మోక్షమనబడే శాశ్వతమైన శాంతి కూడా వారిలో మనోనిగ్రహం వల్ల మాత్రమే కలుగుతుంది.

**ఉత్సేక ఉదధేర్యద్వత్కుశాగ్రేణైకబిన్దునా |**
**మనసో నిగ్రహస్తద్వద్భవేదపరిఖేదతః || || మాం.గౌ.కా. 3-41 ||**

గడ్డిపరక అగ్రభాగంతో సముద్రం నుండి ఒక్కొక్క నీటి బిందువునూ (పట్టుదలతో) తోడినట్లుగా, మనసును నిగ్రహించినట్లైతే, దుఃఖం సమసిపోతుంది.

**శంకరుల భాష్యము**

మనోనిగ్రహోఽపి తేషాం ఉదధేః కుశాగ్రేణ ఏకబిందునా ఉత్సేచనేన శోషణవ్యవసాయవత్ వ్యవసాయవతామనవసన్నాంతఃకరణానామనిర్వేదాత్ అపరిఖేదతః భవతీత్యర్థః ..

కిమపరిఖిన్న వ్యవసాయమాత్రమేవ మనోనిగ్రహే ఉపాయః ? నేత్యుచ్యతే ;

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**ఉదధేః** సముద్రం నుండి **యద్వత్** ఎలాగైతే **కుశాగ్రేణ** గడ్డిపరక కొనతో **ఏకబిందునా** ఒక్కొక్క నీటిబిందువును **ఉత్సేకః** తోడేందుకు చేసే ప్రయత్నం ఉన్నదో, **తద్వత్** అదేవిధంగా మనసునుండి విషయాలను ఒక్కొక్కదాన్ని **అపరిఖేదతః** ఎటువంటి నిరాశకు లోనుకాకుండా వేరుచేసే ప్రయత్నం వల్ల **మనసః** మనను కూడా **నిగ్రహః భవేత్** నియంత్రితమౌతుంది అని అభిప్రాయం. (ఒక్కొక్క బిందువును తోడి సముద్రాన్ని ఎండించాలనే ప్రయత్నంతో మనసులోని విషయాలను ఒక్కొక్కదాన్ని వేరుచేయడాన్ని పోలుస్తున్నారు. అటువంటి కఠినమైన ప్రయత్నం చేయాలంటే ఎంత పట్టుదలతో ఉండాలో చెపుతూ, ఏ మాత్రం నిరాశకు లోనయినా అతని ప్రయత్నం వృధాయే అవుతుంది అని హెచ్చరిస్తున్నారు. దీనికి దృష్టాంతంగా ఒక పక్షి కథను చెప్తారు. ఒక పక్షి సముద్రతీరంలో పెట్టిన గ్రుడ్లు సముద్రంలో కలిసిపోతాయి. అపుడది, సముద్రంలోని నీటిని తోడివేసి తన గ్రుడ్లను ఎలాగైనా తిరిగి పొందాలనే లక్ష్యంతో గరిక కొనతో నీటిని తోడటం ప్రారంభిస్తుంది. ఆ పక్షి ప్రయత్నాన్ని గమనించి గరుత్మంతుడు దానికి సహకరించగా, సముద్రుడు తానే ఆ గ్రుడ్లను తెచ్చి ఇస్తాడు. అంటే, లక్ష్యం ఎంత కఠినమైనదైనా, ప్రయత్నాన్ని నిరాశపొందకుండా కొనసాగిస్తే, దైవబలం కూడా సహకరించి ఆ ప్రయత్నాన్ని సఫలం చేస్తుందని ఈ ఉదంతాన్ని గౌడపాదాచార్యులు ప్రస్తావించారు).

కేవలం నిరాశ లేని పట్టుదల మాత్రమే మనోనిగ్రహం సాధించడానికి ఉపాయమా? అంటే కాదని అంటూ ఇలా చెప్తున్నారు.

**ఉపాయేన నిగృహ్ణీయాద్విక్షిప్తం కామభోగయోః |**
**సుప్రసన్నం లయే చైవ యథా కామో లయస్తథా || || మాం.గౌ.కా. 3-42 ||**

కోరికలు-భోగాలలో విస్తారమైయున్న మనసును తగిన ఉపాయంతో నియంత్రించాలి. (మనసును) నిద్రలో లయించి ప్రసన్నమై ఉన్నప్పుడు కూడా (నియంత్రించాలి). కోరిక ఎలాంటిదో, లయం (అంటే బీజరూపంగా ఉన్న కోరిక) కూడా అలాంటిదే.

**శంకరుల భాష్యము**

అపరిఖిన్నవ్యవసాయవాన్సన్ , వక్ష్యమాణేనోపాయేన కామభోగవిషయేషు విక్షిప్తం మనో నిగృహ్ణీయాత్ నిరుంధ్యాదాత్మన్యేవేత్యర్థః . కించ, లీయతేఽస్మిన్నితి సుషుప్తో లయః ; తస్మిన్ లయే చ సుప్రసన్నం ఆయాసవర్జితమపీత్యేతత్

, నిగృహ్ణీయాదిత్యనువర్తతే . సుప్రసన్నం చేత్కస్మాన్నిగృహ్యేత ఇతి, ఉచ్యతే ; యస్మాత్ యథా కామః అనర్థహేతుః, తథా లయోఽపి ; అతః కామవిషయస్య మనసో నిగ్రహవల్లయాదపి నిరోద్ధవ్యత్వమిత్యర్థః..

కః స ఉపాయ ఇతి, ఉచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

నిరాశ చెందని పట్టుదల కలవాడై, చెప్పబోయే **ఉపాయేన** ఉపాయంతో **కామభోగయోః** కోరికలు-భోగాలనే విషయాలలో **విక్షిప్తమ్** విస్తరించియున్న మనసును ఆత్మయందు కేంద్రీకృతం చేయడం ద్వారా **నిగృహ్ణీయాత్** నియంత్రించాలి అని అభిప్రాయం. మరింకా, లయం అంటే నిద్రయందు కలసిపోవడమే. అటువంటి **సుప్రసన్నమ్** ఎటువంటి ప్రయత్నమనేది లేని **లయే చ ఏవ** లయస్థితిలో కూడా మనసును 'నిగృహ్ణీయాత్' నియంత్రించాలి అని అనుసంధానించుకోవాలి. సుప్రసన్నం అయినదాన్ని, ఇంకా ఎందుకు నియంత్రించాలి అనేదాన్ని చెప్తున్నారు. ఎందువల్లనంటే, **యథా కామః** కోరిక లాగా **తథా లయః** లయం కూడా దుఃఖానికి కారణం కాబట్టి. అందుచేత, కోరిక స్థితిలో మనసును నిగ్రహించినట్లుగానే, లయస్థితిలో కూడా నియంత్రించాలి అని అభిప్రాయం.

ఆ ఉపాయం ఏమిటో చెప్తున్నారు.

**దుఃఖం సర్వమనుస్మృత్య కామభోగాన్నివర్తయేత్ |**
**అజం సర్వమనుస్మృత్య జాతం నైవ తు పశ్యతి || || మాం.గౌ.కా. 3-43 ||**

సకలమూ దుఃఖమని నిరంతరం గుర్తుచేసుకొంటూ కోరికలు-భోగాలనుండి వెనుతిరగాలి. సర్వమూ పుట్టుకలేనిదని నిరంతరం స్మరించినవాడు పుట్టుకనేదాన్ని దర్శించడు.

**శంకరుల భాష్యము**

సర్వం ద్వైతమవిద్యావిజృంభితం దుఃఖమేవ ఇత్యనుస్మృత్య కామభోగాత్ కామనిమిత్తో భోగః ఇచ్ఛావిషయః తస్మాత్ విప్రసృతం మనో నివర్తయేత్ వైరాగ్యభావనయేత్యర్థః . అజం బ్రహ్మ సర్వం ఇత్యేతచ్ఛాస్త్రాచార్యోపదేశతః అనుస్మృత్య తద్విపరీతం ద్వైతజాతం నైవ తు పశ్యతి అభావాత్ ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**సర్వమ్** అవిద్యచేత విజృంభించిన సకల ద్వైత ప్రపంచమూ **దుఃఖమ్** దుఃఖమే అని **అనుస్మృత్య** నిరంతరం స్మరించి, **కామభోగాత్** కోరికలకు కారణమైన భోగములందలి ఆసక్తినుండి మనసును వైరాగ్యభావనతో **నివర్తయేత్** వెనుకకు మరల్చాలి. **సర్వమ్** సకలమూ **అజమ్** పుట్టుకలేని బ్రహ్మమనే శాస్త్ర, ఆచార్య ఉపదేశాలను **అనుస్మృత్య** నిరంతరం స్మరణచేసి దానికి భిన్నమైన ద్వైత భావననేది లేనందుచేత **జాతమ్** పుట్టుక అన్నదాన్ని **న ఏవ తు పశ్యతి** ఏ మాత్రమైనా దర్శించడు.

**లయే సమ్బోధయేచ్చిత్తం విక్షిప్తం శమయేత్పునః |**

**సకషాయం విజానీయాత్సమప్రాప్తం న చాలయేత్ || || మాం.గౌ.కా. 3-44 ||**

(బీజరూపమైన కోరికలు-భోగాలతో) సుషుప్తియందు లీనమైన మనసును మేల్కొలిపి తిరిగి సమాధాన పరచాలి. (ఆ మనసు) రాగాదులతో కలుషితమైనదిగా గమనించుకోవాలి. సామ్యస్థితి ప్రాప్తమైన మీదట దానిని (విషయాసక్తితో) కదలించరాదు.

**శంకరుల భాష్యము**

ఏవమనేన జ్ఞానాభ్యాసవైరాగ్యద్వయోపాయేన లయే సుషుప్తే లీనం సంబోధయేత్ మనః ఆత్మవివేకదర్శనేన యోజయేత్ . చిత్తం మన ఇత్యనర్థాంతరం . విక్షిప్తం చ కామభోగేషు శమయేత్పునః . ఏవం పునః పునరభ్యాసతో లయాత్సంబోధితం విషయేభ్యశ్చ వ్యావర్తితం , నాపి సామ్యాపన్నమంతరాలావస్థం సకషాయం సరాగం బీజసంయుక్తం మన ఇతి విజానీయాత్ . తతోఽపి యత్నతః సామ్యమాపాదయేత్ . యదా తు సమప్రాప్తం భవతి, సమప్రాప్త్యభిముఖీభవతీత్యర్థః ; తతః తత్ న చాలయేత్ , విషయాభిముఖం న కుర్యాదిత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఆవిధంగా పలుమార్లు జ్ఞానాభ్యాసం మరియు వైరాగ్యం అనే రెండు ఉపాయాల చేత **లయే** నిద్రలో లయమైన **చిత్తమ్** మనసును **సంబోధయేత్** మేల్కొల్పి ఆత్మవివేకదర్శనంతో అనుసంధానించాలి. చిత్తం అనగా మనసనే గ్రహించాలి. **విక్షిప్తమ్** (ఆ మనసునుందు బీజరూపంగా) కోరికలు-భోగాలు విస్తరిస్తుండగా **శమయేత్ పునః** తిరిగి సమాధాన పరచాలి. ఇలా మరలా మరలా అభ్యాసం చేయగా, లయం నుండి మేల్కొన్న మనసు విషయాలనుండి వెనుతిరుగుతంది. అయినా కూడా **సకషాయమ్** రాగాది బీజములతో కూడిన మనసు సామ్యస్థితి కాని మధ్యమస్థితిని పొంది ఉంటుందని **విజానీయాత్** గమనించాలి. అయినప్పటికీ, (పట్టుదలతో) ప్రయత్నంచేసి సామ్యస్థితిని పొందాలి. **సమమ్ ప్రాప్తమ్** సామ్యస్థితి కలిగిన మీదట, అంటే ఎప్పుడైతే సామ్యస్థితిని పొందేందుకు సుముఖత ఏర్పడుతుందో అప్పుడు అని అభిప్రాయం. దానిని (ఆ మనసును) **న చాలయేత్** చలించేలా చేయరాదు, అంటే విషయాల వైపు పోనీయరాదు అని అభిప్రాయం.

**నాస్వాదయేత్సుఖం తత్ర నిఃసంగః ప్రజ్ఞయా భవేత్ |**

**నిశ్చలం నిశ్చరచ్చిత్తమేకీకుర్యాత్ప్రయత్నతః || || మాం.గౌ.కా. 3-45 ||**

సుఖాన్ని ఆస్వాదించకుండా ఉంటే, అప్పడు సంగరహితమైన ప్రజ్ఞగా అవుతాడు. ప్రయత్నం చేత చిత్తాన్ని నిశ్చలంగా, అటూ ఇటూ కదలకుండా ఏకాగ్రం చేయాలి.

**శంకరుల భాష్యము**

సమాధిత్సతో యోగినో యత్సుఖం జాయతే, తత్ నాస్వాదయేత్ తత్ర న రజ్యేతేత్యర్థః . కథం తర్హి ? నిఃసంగః నిఃస్పృహః ప్రజ్ఞయా వివేకబుద్ధ్యా యదుపలభ్యతే సుఖం , తదవిద్యాపరికల్పితం మృషైవేతి విభావయేత్ ; తతోఽపి

సుఖరాగాన్నిగృహ్ణీయాదిత్యర్థః . యదా పునః సుఖరాగాన్నివృత్తం నిశ్చలస్వభావం సత్ నిశ్చరత్ బహిర్నిర్గచ్ఛద్భవతి చిత్తం , తతస్తతో నియమ్య ఉక్తోపాయేన ఆత్మన్యేవ ఏకీకుర్యాత్ ప్రయత్నతః . చిత్స్వరూపసత్తామాత్రమేవాపాదయేదిత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

యోగులకు సమాధి యందు **సుఖమ్** ఏ సుఖమైతే ఉత్పన్నమౌతుందో దానిని **న ఆస్వాదయేత్** ఆస్వాదించరాదు, అంటే **తత్ర** ఆ సుఖమునందు ప్రీతిని పొందరాదు. మరి ఎలా ఉండాలి? **నిఃసంగః** ఆ సుఖం కలుగుతున్నదనే స్పృహ లేకుండా **ప్రజ్ఞయా** వివేకబుద్ధితో, అది అవిద్యచేత కల్పితమైనదని మిథ్యామాత్రమేనని **భవేత్** భావించాలి. అంటే, అక్కడ కూడా సుఖం పట్ల రాగాన్ని నియంత్రించుకోవాలి అని అర్థం. ఎప్పుడు తిరిగి సుఖం పట్ల రాగమనేది నియంత్రితమౌతుందో అపుడు మనసు **నిశ్చలః** నిశ్చలమౌతుంది. ఆవిధంగా పైన చెప్పిన ఉపాయాలచేత **ప్రయత్నతః** ప్రయత్నం చేసి మనసును ఆత్మయందే **ఏకీకుర్యాత్** ఏకాగ్రంచేసి నియంత్రించగా, **చిత్తమ్** మనసు **నిశ్చరః** బాహ్యంలోకి పోవడమనేది ఉండదు. అంటే, కేవలం చిత్ (చేతన) మాత్రమే స్వరూపంగాగల సత్ (ఉనికి) అనుభవమౌతుంది అని అభిప్రాయం.

**యదా న లీయతే చిత్తం న చ విక్షిప్యతే పునః |**
**అనిఙ్గనమనాభాసం నిష్పన్నం బ్రహ్మ తత్తదా || || మాం.గౌ.కా. 3-46 ||**

ఎప్పుడైతే మనసు సుషుప్తియందు లీనంకాదో మరియు తిరిగి బాహ్యవిషయాలవైపు మరలదో, అప్పుడు గాలిలేని ప్రదేశంలో కదలని దీపంలాగా, విషయాలను ప్రకాశింప చేయకుండా, కేవలం బ్రహ్మగానే పరిణమిస్తుంది.

**శంకరుల భాష్యము**

యథోక్తేనోపాయేన నిగృహీతం చిత్తం యదా సుషుప్తే న లీయతే, న చ పునర్విషయేషు విక్షిప్యతే ; అనింగనం అచలం నివాతప్రదీపకల్పం , అనాభాసం న కేనచిత్కల్పితేన విషయభావేనావభాసతే ఇతి ; యదా ఏవంలక్షణం చిత్తం , తదా నిష్పన్నం బ్రహ్మ ; బ్రహ్మస్వరూపేణ నిష్పన్నం చిత్తం భవతీత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఈ చెప్పబడిన ఉపాయాలచేత నియంత్రించబడిన **చిత్తమ్** మనసు, **యదా** ఎప్పుడు సుషుప్తిలో **న లీయతే** లయం కాదో **చ** మరియు **పునః** తిరిగి న **విక్షిప్యతే** బాహ్యవిషయాలయందు విస్తరించదో, **తదా** అప్పుడు **అనింగనమ్** గాలి లేని ప్రదేశంలో కదలని దీపంలాగా, **అనాభాసమ్** ఏ మాత్రంకూడా కల్పితమైన విషయభావనలను ప్రకాశింపచేయని **తత్** ఆ మనసు **బ్రహ్మ** బ్రహ్మగా **నిష్పన్నమ్** సిద్ధిస్తుంది. అంటే, మనసు బ్రహ్మస్వరూపంగా సిద్ధిస్తుంది లేదా పరిణమిస్తుంది అని అభిప్రాయం.

**స్వస్థం శాన్తం సనిర్వాణమకథ్యం సుఖముత్తమమ్ |**

**అజమజేన జ్ఞేయేన సర్వజ్ఞం పరిచక్షతే || || మాం.గౌ.కా. 3-47 ||**

తన ఆత్మయందే స్థితి కలిగి, శాంతమైన, ప్రవృత్తి రహితమైన, చెప్పను శక్యం కాని, పుట్టుక లేని, నిరతిశయమైన సుఖం పుట్టుకలేని బ్రహ్మమునకు అభిన్నమైనందున అదియే సర్వజ్ఞమని (బ్రహ్మవేత్తలు) అంటారు.

**శంకరుల భాష్యము**

యథోక్తం పరమార్థసుఖమాత్మసత్యానుబోధలక్షణం స్వస్థం స్వాత్మని స్థితం ; శాంతం సర్వానర్థోపశమరూపం ; సనిర్వాణం , నిర్వృతిర్నిర్వాణం కైవల్యం , సహ నిర్వాణేన వర్తతే ; తచ్చ అకథ్యం న శక్యతే కథయితుం , అత్యంతాసాధారణవిషయత్వాత్ ; సుఖముత్తమం నిరతిశయం హి తద్యోగిప్రత్యక్షమేవ ; న జాతమితి అజం , యథా విషయవిషయం ; అజేన అనుత్పన్నేన జ్ఞేయేన అవ్యతిరిక్తం సత్ స్వేన సర్వజ్ఞరూపేణ సర్వజ్ఞం బ్రహ్మైవ సుఖం పరిచక్షతే కథయంతి బ్రహ్మవిదః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఆ విధంగా చెప్పబడిన, ఆత్మయొక్క యదార్థ సత్యాన్ని తెలియపరిచే లక్షణం కలిగిన పరమోన్నతమైన సుఖం **స్వస్థమ్** తన ఆత్మయందే ఉన్నది. అది **శాంతమ్** సకలదోషములు ఉపశమించిన రూపం కలది. **సనిర్వాణమ్** ఎటువంటి ప్రవృత్తి లేనిది నిర్వాణం అంటే కేవలం అదియే తప్ప మరొకటి లేని కైవల్యం. అటువంటి నిర్వాణ స్థితి కలది 'సనిర్వాణమ్'. అందువల్ల, **అకథ్యమ్** అంటే అత్యంత అసాధారణమైన విషయం కాబట్టి చెప్పను వీలుకానిది కూడా. **సుఖముత్తమమ్** నిరతిశయమైన (అంతకు మించినది లేని) సుఖం. అదియే యోగికి ప్రత్యక్షంగా అనుభవానికి వచ్చేది. **అజమ్** అనగా ఇంద్రియాలకు అనుభవానికి వచ్చే విషయాల వంటి విషయం కానిది. **అజేన** పుట్టుకలేని బ్రహ్మమునకు అభిన్నమే అయినదిగా **జ్ఞేయేన** తెలియబడటం చేత, ఆ తన సుఖమే సర్వమును తెలిసిన **సర్వజ్ఞమ్** బ్రహ్మమే అని బ్రహ్మవేత్తలు **పరిచక్షతే** చెప్తారు.

**న కశ్చిజ్జాయతే జీవః సమ్భవోఽస్య న విద్యతే |**

**ఏతత్తదుత్తమం సత్యం యత్ర కిఞ్చిన్న జాయతే || || మాం.గౌ.కా. 3-48 ||**

జీవుడు ఏనాడూ పుట్టిన వాడు కాదు. పుట్టుకనేది లేదు. దానినుండి (పరబ్రహ్మము నుండి) ఏదీ పుట్టడం లేదన్నదే ఉత్తమమైన సత్యం.

**శంకరుల భాష్యము**

సర్వోఽప్యయం మనోనిగ్రహాదిః మృల్లోహాదివత్సృష్టిరుపాసనా చ ఉక్తా పరమార్థస్వరూపప్రతిపత్త్యుపాయత్వేన, న పరమార్థసత్యేతి . పరమార్థసత్యం తు న కశ్చిజ్జాయతే జీవః కర్తా భోక్తా చ నోత్పద్యతే కేనచిదపి ప్రకారేణ . అతః స్వభావతః అజస్య అస్య ఏకస్యాత్మనః సంభవః కారణం న విద్యతే నాస్తి . యస్మాన్న విద్యతేఽస్య కారణం , తస్మాన్న కశ్చిజ్జాయతే జీవ

ఇత్యేతత్ . పూర్వేషూపాయత్వేనోక్తానాం సత్యానాం ఏతత్ ఉత్తమం సత్యం యస్మిన్సత్యస్వరూపే బ్రహ్మణి అణుమాత్రమపి కించిన్న జాయతే ఇతి ..

.. ఇతి తృతీయమద్వైతప్రకరణం సంపూర్ణమ్ ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

మనోనిగ్రహం మొదలైన సకల అభిప్రాయాలన్నీ, మట్టి-బంగారం నుండి ఉత్పన్నమై పరిణమించిన రూపాల వంటివే. అవి ఆత్మ యొక్క యదార్ధ స్వరూపస్థితిని నిరూపించడానికి ఉపాయాలుగా చెప్పబడినవే కాని, యదార్ధ సత్యములు కావు. యదార్ధ సత్యం ఏమిటంటే, **జీవః** కర్త మరియు భోక్త అయినట్టి జీవుడు **న కశ్చిత్ జాయతే** ఏవిధంగా కూడా పుట్టడం అనేది లేదు. అట్టి పుట్టుకలేకపోవడమే స్వభావంగా కలిగిన **అస్య** ఒక్కటే అయిన ఆత్మ యొక్క **సంభవః** పుట్టుకకు కారణం **న విద్యతే** లేనేలేదు. దేని పుట్టుకకు కారణమనేది లేదో దానినుండి ఏవిధంగానూ జీవుడు పుట్టడం అనేది లేదు అని అర్ధం. పూర్వం చెప్పిన సాధన ఉపాయాలతో పోలిస్తే **ఏతత్ ఉత్తమమ్ సత్యమ్** ఇదియే ఉత్తమమైన సత్యం. **యత్ర** ఏ సత్య స్వరూపమైన దాని నుండి **కిఞ్చిత్** అణుమాత్రమైనా **న జాయతే** పుట్టుట లేదో అదియే బ్రహ్మము అన్నది ఆ ఉత్తమమైన సత్యం.

.. తృతీయ అధ్యాయమైన అద్వైత ప్రకరణానికి వ్యాఖ్యానం సమాప్తం ..

# చతుర్థ అధ్యాయం

# అలాతశాన్తి ప్రకరణం

## శంకరుల భాష్యము

ఓంకారనిర్ణయద్వారేణ ఆగమతః ప్రతిజ్ఞాతస్యాద్వైతస్య బాహ్యవిషయభేదవైతథ్యాచ్చ సిద్ధస్య పునరద్వైతే శాస్త్రయుక్తిభ్యాం సాక్షాన్నిర్ధారితస్య ఏతదుత్తమం సత్యమిత్యుపసంహారః కృతోఽన్తే . తస్యైతస్యాగమార్థస్య అద్వైతదర్శనస్య ప్రతిపక్షభూతా ద్వైతినో వైనాశికాశ్చ . తేషాం చాన్యోన్యవిరోధాద్రాగద్వేషాదిక్లేశాస్పదం దర్శనమితి మిథ్యాదర్శనత్వం సూచితం , క్లేశానాస్పదత్వాత్సమ్యగ్దర్శన మిత్యద్వైతదర్శనస్తుతయే . తదిహ విస్తరేణాన్యోన్యవిరుద్ధతయా అసమ్యగ్దర్శనత్వం ప్రదర్శ్య తత్ప్రతిషేధేనాద్వైతదర్శనసిద్ధిరుపసంహర్తవ్యా ఆవీతన్యాయేనేత్యలాతశాంతి ప్రకరణమారభ్యతే . తత్రాద్వైతదర్శనసంప్రదాయకర్తురద్వైతస్వరూపేణైవ నమస్కారార్థోఽయమాద్యశ్లోకః . ఆచార్యపూజా హి అభిప్రేతార్థసిద్ధ్యర్థేష్యతే శాస్త్రారంభే .

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

ఆగమ ప్రకరణంలో ఓంకారాన్ని నిర్ధారణచేసే క్రమంలో ప్రతిపాదించిన అద్వైత స్థితిని, వైతథ్య ప్రకరణంలో బాహ్యంలోని విషయభేదాలను త్రోసిపుచ్చిన మీదట సిద్ధింపచేసి, తిరిగి అద్వైత ప్రకరణంలో శాస్త్రం చెప్పిన ఉపాయాలతో దానియొక్క సాక్షాత్తు అనుభవాన్ని నిరూపణ చేసి, చివరకు అద్వైతమే ఉత్తమమైనదనే సత్యంతో ఉపసంహారం చేశారు. అటువంటి, వేదముల అభిప్రాయమే అయిన, అద్వైత దర్శనానికి భిన్నమైనటువంటివి ద్వైత వాదాలు మరియు శూన్యవాదాలు. ఆయా వాదాలు ఒకదానితో మరొకటి పరస్పర విరుద్ధమైనవి కావడం చేతను, రాగద్వేషాదులతో కూడిన దర్శనాలైనందున అవన్నీ మిథ్యాదర్శనాలని సూచన చేస్తూ, దుఃఖాశ్రయత్వం లేనందుచేత అద్వైత దర్శనమే సమగ్రదర్శనమని కీర్తించారు. ఇక ఇక్కడ ఆయా దర్శనాలలోని పరస్పర వైరుధ్యాన్ని విస్తృతంగా వివరిస్తూ వాటి అసమగ్రతను నిరూపణ చేసి త్రోసిపుచ్చిన తరువాత, అద్వైత సిద్ధాంతాన్ని నిరూపించి గ్రంథాన్ని ఉపసంహరించేందుకై, ఆవీతన్యాయంగా ఈ అలాతశాంతి ప్రకరణాన్ని ప్రారంభిస్తున్నారు. {ఆవీతన్యాయం అంటే, వ్యతిరేకధోరణిలో ఒక సత్యాన్ని బోధించటం. అనాత్మను నిరాకరించడం ద్వారా ఆత్మను చూపటం. అన్వయ వ్యతిరేకాలలో వ్యతిరేక విధానమిది. శాస్త్రంలో మిగతా వాదాలన్నీ ఒకదానితో ఒకటి పేచీపడి అన్నీ తేలిపోతే చివరకు మిగిలేది తమ వాదమేనని సిద్ధాంతీకరించారు అద్వైతులు. ఇది విధి ముఖంగా చెప్పకుండానే ఫలించిన సత్యం కనుక దీనిని ఆవీతన్యాయమని వారు వర్ణిస్తారు – బ్రహ్మశ్రీ యల్లంరాజు శ్రీనివాసరావు}.

అద్వైత సంప్రదాయాన్ని ప్రబోధం చేసిన ఆచార్యులను కూడా అద్వయ స్వరూపంగానే భావన చేసి వారికి నమస్కరిస్తూ ఈ మొదటి శ్లోకాన్ని ఇక్కడ చెప్తున్నారు. అభిలషించిన విషయం ప్రాప్తించాలనే ఉద్దేశ్యంతో ఇక్కడ శాస్త్రాన్ని ప్రారంభించే ముందు ఆచార్యులను ప్రార్థిస్తున్నారు.

**జ్ఞానేనాకాశకల్పేన ధర్మాన్యో గగనోపమాన్ |**

**జ్ఞేయాభిన్నేన సమ్బుద్ధస్తం వందే ద్విపదాం వరమ్ ||                || మాం.గౌ.కా. 4-1 ||**

గగన సదృశమైన జ్ఞానంతో, ఆకాశం వంటి (అనంతమైన) జీవులను, 'అవి తెలియబడేవి' అనే భేద దృష్టి లేకుండా, ఎవరు తెలుసుకొంటున్నారో, అట్టి మానవ శ్రేష్ఠులకు (ఆచార్యునికి) నమస్కారము.

**శంకరుల భాష్యము**

ఆకాశేన ఈషదసమాప్తమాకాశకల్పమాకాశతుల్యమిత్యేతత్ . తేన ఆకాశకల్పేన జ్ఞానేన . కిం ? ధర్మానాత్మనః . కింవిశిష్టాన్ ? గగనోపమాన్ గగనముపమా యేషాం తే గగనోపమాః, తానాత్మనో ధర్మాన్ . జ్ఞానస్యైవ పునర్విశేషణం — జ్ఞేయైర్ధర్మైరాత్మభిరభిన్నం అగ్న్యుష్ణవత్ సవితృప్రకాశవచ్చ యత్ జ్ఞానం , తేన జ్ఞేయాభిన్నేన జ్ఞానేన ఆకాశకల్పేన జ్ఞేయాత్మస్వరూపావ్యతిరిక్తేన, గగనోపమాంధర్మాన్యః సంబుద్ధః సంబుద్ధవాన్నిత్యమేవ ఈశ్వరో యో నారాయణాఖ్యః, తం వందే అభివాదయే . ద్విపదాం వరం ద్విపదోపలక్షితానాం పురుషాణాం వరం ప్రధానం , పురుషోత్తమమిత్యభిప్రాయః . ఉపదేష్టృనమస్కారముఖేన జ్ఞానజ్ఞేయజ్ఞాతృభేదరహితం పరమార్థతత్త్వదర్శనమిహ ప్రకరణే ప్రతిపిపాదయిషితం ప్రతిపక్షప్రతిషేధద్వారేణ ప్రతిజ్ఞాతం భవతి ..

అధునా అద్వైతదర్శనయోగస్య నమస్కారః తత్స్తుతయే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

'ఆకాశకల్పమ్' అంటే ఆకాశానితో పోలిస్తే స్వల్పమైన తేడా కలది. అటువంటి **ఆకాశకల్పేన** ఆకాశానికి దరిదాపు సమానమైన **జ్ఞానేన** జ్ఞానము చేత. ఏమిటి? **ధర్మాన్** జీవులను. ఎలాంటివి? **గగనోపమాన్** ఏవైతే ఆకాశంతో పోల్చదగినవో అవి 'గగనోపమాః'. అంటే ఆకాశం యొక్క అనంతత్వంతో పోలిక కలిగిన జీవులను. ఇక్కడ జ్ఞానం యొక్క మరొక ప్రత్యేకత చెప్తున్నారు. అదేమంటే, అగ్ని-ఉష్ణంలాగా, సూర్యుడు-ప్రకాశంలాగా, తెలియబడేవి తెలుసుకొనేవానికి భిన్నమైనవి కావనే జ్ఞానం ఏది కలదో అలాంటి జ్ఞానంతో. తెలియబడే జీవులు తన ఆత్మ స్వరూపానికి భిన్నం కావనే జ్ఞానం ఆకాశంతో సామ్యత్వాన్ని కలిగి, ఆకాశంతో పోల్చదగిన జీవులను **సంబుద్ధః** శాశ్వతమైనవిగా తెలుసుకొంటున్నాడో, అతడే నారాయణుడనబడే ఈశ్వరుడు. అతనికి **వందే** అభివాదము. **ద్విపదామ్ వరమ్** రెండు పాదాలు కలిగిన మానవులలో శ్రేష్ఠుడు, అంటే పురుషోత్తముడు అని అభిప్రాయం. ఉపదేశికునికి నమస్కరించడం అనే మిషతో జ్ఞాన-జ్ఞేయ-జ్ఞాతృ అనే తేడా లేని పరమార్థ తత్వాన్ని, అందుకు భిన్నమైన వాదనలు తిరస్కరించడం ద్వారా, ప్రతిపాదించి నిరూపించడమే ఈ ప్రకరణం యొక్క ఉద్దేశ్యమని సూచన చేస్తున్నారు.

ఇక, అద్వైతదర్శనయోగాన్ని ప్రస్తుతిస్తూ ఇలా నమస్కరిస్తున్నారు.

**అస్పర్శయోగో వై నామ సర్వసత్త్వసుఖో హితః |**
**అవివాదోఽవిరుద్ధశ్చ దేశితస్తం నమామ్యహమ్ ||** **|| మాం.గౌ.కా. 4-2 ||**

సకల ప్రాణులకు సుఖాన్ని, శ్రేయస్సును కలిగించేది, వివాదాలకు-వైరుధ్యాలకు తావులేనిది, శ్రుతి విధించిన అస్పర్శ (సంగ రహితం) అనే పేరు కలిగిన యోగమునకు నేను నమస్కరిస్తున్నాను.

**శంకరుల భాష్యము**

స్పర్శనం స్పర్శః సంబంధో న విద్యతే యస్యయోగస్య కేనచిత్కదాచిదపి, సః అస్పర్శయోగః బ్రహ్మస్వభావ ఏవ వై నామేతి ; బ్రహ్మవిదామస్పర్శయోగ ఇత్యేవం ప్రసిద్ధ ఇత్యర్థః . స చ సర్వసత్త్వసుఖో భవతి . కశ్చిదత్యంతసుఖసాధనవిశిష్టోఽపి దుఃఖస్వరూపః, యథా తపః . అయం తు న తథా . కిం తర్హి ? సర్వసత్త్వానాం సుఖః . తథా ఇహ భవతి కశ్చిద్విషయోపభోగః సుఖో న హితః ; అయం తు సుఖో హితశ్చ, నిత్యమప్రచలితస్వభావత్వాత్ . కిం చ అవివాదః, విరుద్ధం వదనం వివాదః పక్షప్రతిపక్షపరిగ్రహేణ యస్మిన్న విద్యతే సః అవివాదః . కస్మాత్ ? యతః అవిరుద్ధశ్చ ; య ఈదృశో యోగః దేశితః ఉపదిష్టః శాస్త్రేణ, తం నమామ్యహం ప్రణమామీత్యర్థః ..

ద్వైతినః ... తైరేవం విరుద్ధవదనేన అన్యోన్యపక్షప్రతిషేధం కుర్వద్భిః కిం ఖ్యాపితం భవతీతి, ఉచ్యతే — కథం ద్వైతినః పరస్పరం విరుధ్యంత ఇతి, ఉచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఏ యోగంలో అయితే స్పర్శ అనగా సంబంధం ఎప్పుడూ గాని ఏమాత్రంగాని ఉండదో అదియే **అస్పర్శయోగః**. అది బ్రహ్మ స్వభావమే అయినందున **వై నామ** అలాగే పిలవబడుతుంది. అంటే బ్రహ్మవేత్తలలో అస్పర్శయోగంగా ప్రసిద్ధమైనది ఇదియే అని అభిప్రాయం. అదియే **సర్వసత్త్వ సుఖః** సకల ప్రాణుల సుఖం కూడా అవుతుంది. తపస్సు వంటి యోగం, అత్యంత సుఖాన్ని సాధించేదయినప్పటికీ, దుఃఖస్వరూపమే. కాని, ఇది అలాంటిది కాదు. ఎలాంటిది? సకల ప్రాణులకునూ సుఖమే అయినట్టిది. అలాగే, ఈ లోకంలో ఏదైనా విషయభోగం సుఖాన్నిచ్చేదే అయినా శ్రేయోదాయకమైనది కాదు. కాని, ఈ యోగమైతే శాశ్వతంగా అచంచల స్వభావం కలది కావడం చేత, సుఖాన్ని మరియు హితాన్ని కూడా చేకూరుస్తుంది. మరింకా ఏమిటంటే, **అవివాదః** స్వపక్షం-ప్రతిపక్షం అనే విరుద్ధమైన వాదనలు ఉంటే అది వివాదం. దేనియందైతే అటువంటి వివాదం లేదో అది 'అవివాదః'. ఎందువలన? **అవిరుద్ధః చ** వైరుధ్యత లేనందుచేత కూడా. **దేశితః** శాస్త్రంచేత ఉపదేశించబడిన **తమ్** ఇలాంటి యోగమునకు **నమామి అహమ్** నేను ప్రణమిల్లుతున్నాను అని అభిప్రాయం.

వారు (ద్వైతులు) ఈ విధమైన వైరుధ్యం కల వాదనలతో ఒకరితో మరొకరు విభేదించినందు వలన దేనిని నిరూపిస్తున్నారో చెప్తున్నారు. అసలు ద్వైతులయందు పరస్పరం విభేదం ఎందుకు కలుగుతోందో తర్వాత శ్లోకంలో చెప్తున్నారు.

**భూతస్య జాతిమిచ్ఛన్తి వాదినః కేచిదేవ హి |**

**అభూతస్యాపరే ధీరా వివదన్తః పరస్పరమ్ ||** **|| మాం.గౌ.కా. 4-3 ||**

కొందరు ఉనికి కలదానికి పుట్టుక ఉన్నదని ప్రతిపాదిస్తున్నారు. మరికొందరు వివేకవంతులు ఉనికి లేనిదానికి (పుట్టుకను ప్రతిపాదిస్తూ) పరస్పరం విరుద్ధమైన వాదనలు చేస్తున్నారు.

**శంకరుల భాష్యము**

భూతస్య విద్యమానస్య వస్తునః జాతిం ఉత్పత్తిం ఇచ్ఛంతి వాదినః కేచిదేవ హి సాంఖ్యాః ; న సర్వ ఏవ ద్వైతినః . యస్మాత్ అభూతస్య అవిద్యమానస్య అపరే వైశేషికా నైయాయికాశ్చ ధీరాః ధీమంతః, ప్రాజ్ఞాభిమానిన ఇత్యర్థః . వివదంతః విరుద్ధం వదంతో హి అన్యోన్యమిచ్ఛంతి జేతుమిత్యభిప్రాయః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**కేచిత్ ఏవ హి వాదినః** కొంతమంది సాంఖ్యులు మాత్రం **భూతస్య** తెలియదగిన వస్తువునకు (సిద్ధంగా ఉన్న బ్రహ్మమునకు) **జాతిమ్** పుట్టుకను **ఇచ్ఛంతి** ప్రతిపాదిస్తున్నారు. ద్వైతులు అందరూ ఈ విధంగా అనడం లేదు (వారిలో కొందరు సాంఖ్యులు మాత్రమే ఇలా భావిస్తున్నారు). ఎందుకంటే, **అపరే** మరికొందరు అంటే వైశేషికులు మరియు నైయాయికులు **ధీరాః** తెలివిగలవారు, తమ ప్రజ్ఞపట్ల గర్వం కలవారు **వివదంతః** వ్యతిరేకంగా వాదించే వారు **అభూతస్య** ఉనికిలేని దానికి, తెలియదగని దానికి పుట్టుకను ప్రతిపాదిస్తున్నారు. అంటే **పరస్పరమ్** ఒకరిపై మరొకరు నెగ్గాలని కోరుకొంటున్నారు అని అభిప్రాయం.

**భూతం న జాయతే కిఞ్చిదభూతం నైవ జాయతే |**

**వివదన్తోఽద్వయా హ్యేవమజాతిం ఖ్యాపయన్తి తే ||** **|| మాం.గౌ.కా. 4-4 ||**

ఉనికి కలిగి సిద్ధమై ఉన్నదానికి పుట్టుకనేది ఏమాత్రం లేదు. ఉనికియే లేనిదానికి అసలు పుట్టుకే లేదు. ఈ విధంగా విరుద్ధమైన వాదనలు చేస్తూ, పుట్టుకనేదే లేదని నిరూపణ చేసేవారంతా, నిజానికి అద్వైతులే.

**శంకరుల భాష్యము**

భూతం విద్యమానం వస్తు న జాయతే కించిద్విద్యమానత్వాదేవ ఆత్మవత్ ఇత్యేవం వదన్ అసద్వాదీ సాంఖ్యపక్షం ప్రతిషేధతి సజ్జన్మ . తథా అభూతం అవిద్యమానం అవిద్యమానత్వాన్నైవ జాయతే శశవిషాణవత్ ఇత్యేవం వదన్సాంఖ్యోఽపి అసద్వాదిపక్షమసజ్జన్మ ప్రతిషేధతి . వివదంతః విరుద్ధం వదంతః అద్వయాః అద్వైతినో హ్యేతే అన్యోన్యస్య పక్షౌ సదసతోర్జన్మనీ ప్రతిషేధంతః అజాతిం అనుత్పత్తిమర్థాత్ఖ్యాపయంతి ప్రకాశయంతి తే ..

<u>**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**</u>

**భూతమ్** (ఉనికి కలిగి) తెలియదగిన వస్తువు (అంటే కార్యం అనేది) **కిఞ్చిత్** ఏదైనా సరే **న జాయతే** పుట్టదు. ఎందుకంటే, అది ఆత్మలాగా ఉనికి కలిగి తెలియదగినది కాబట్టి. ఈ విధంగా కార్యం అనేది ఏదైనా సరే పుట్టదు అని వాదించే అసద్వాదులు, కారణంలోనే కార్యం ఉండి పుడుతోంది అని భావించే సాంఖ్యపక్షం వారిని వ్యతిరేకిస్తారు. అదే విధంగా, **అభూతమ్** ఉనికి లేని అంటే కుందేటి కొమ్ములాగా అసలే లేనిదానికి (అంటే అసలు కార్యమే కాని దానికి) **న ఏవ జాయతే** పుట్టుక అనేదే ఉండదు అని వాదిస్తూ సాంఖ్యులు కూడా అసత్ అనే దానికి పుట్టుక సంభవమౌతుంది అని వాదించే అసద్వాది పక్షం వారితో విభేదిస్తున్నారు. **వివదంతః** విరుద్ధమైన వాదనలు చేసే వీరంతా ఒకరి వాదాన్ని మరొకరు వ్యతిరేకిస్తూ సత్ (ఉనికి కలదానికి) మరియు అసత్ (ఉనికి లేని దానికి) పుట్టుకను తిరస్కరిస్తున్నందున **అజాతిమ్** పుట్టుకనేది లేదనేదాన్ని అంటే **అద్వయాః హి ఏవ** అద్వయత్వాన్నే **ఖ్యాపయంతి** వారు ప్రకటిస్తున్నారు. (వస్తువు ఏదైనా అది 'సత్' కానీ లేదా 'అసత్' కానీ కావాలి. 'సత్' యొక్క పుట్టుకను వైశేషికులు మరియు నైయాయికులు వ్యతిరేకిస్తే, 'అసత్' యొక్క పుట్టుకను సాంఖ్యులు వ్యతిరేకిస్తున్నారు. అంటే, మొత్తం మీద 'సత్' యొక్క 'అసత్' యొక్క పుట్టుక అనేది వ్యతిరేకించబడుతోంది కనుక, వారందరూ కలిసి చెప్పేది ఏమంటే అసలు పుట్టుక అనేది లేదనే అద్వైతాన్నే ప్రకటనం చేస్తున్నారు).

**ఖ్యాప్యమానామజాతిం తైరనుమోదామహే వయమ్ |**
**వివదామో న తైః సార్ధమవివాదం నిబోధత ||** **|| మాం.గౌ.కా. 4-5 ||**

పుట్టుక అనేది లేదని వారు ప్రకటించిన దాన్ని మేము అంగీకరిస్తున్నాం. మాకు వారితో వివాదం లేదు. ఇందులో (మేము బోధించే అద్వైత దర్శనంలో) వివాదమనేది లేదని అర్థం చేసుకోండి.

<u>**శంకరుల భాష్యము**</u>

తైరేవం ఖ్యాప్యమానామజాతిం ఏవమస్తు ఇతి అనుమోదామహే కేవలం , న తైః సార్ధం వివదామః పక్షప్రతిపక్షపరిగ్రహేణ ; యథా తే అన్యోన్యమిత్యభిప్రాయః . అతః తం అవివాదం వివాదరహితం పరమార్థదర్శనమనుజ్ఞాతమస్మాభిః నిబోధత హే శిష్యాః ..

<u>**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**</u>

**తైః** వారు ఆవిధంగా **ఖ్యాప్యమానామ్ అజాతిమ్** పుట్టుక అనేదే లేదు అని ప్రకటించిన దాన్ని 'అలాగే కానిండు' అని **వయమ్** మేము (అద్వైతవాదులమైన మేము) **అనుమోదామహే** అంగీకరిస్తున్నాము. **తైః సార్ధమ్** ఒక పక్షం దానికి భిన్నమైన పక్షం అనే తేడా లేకుండా అంటే వారిలో వారు వాదులాడుకున్నట్లు కాకుండా **న వివదామః** మేము వివాదించడం లేదు. అందుచేత, ఓ శిష్యులారా! మాచే బోధించబడిన పరమార్థ దర్శనం **అవివాదమ్** వివాదరహితమైనదని **నిబోధత** గ్రహించండి.

**అజాతస్యైవ ధర్మస్య జాతిమిచ్ఛన్తి వాదినః |**
**అజాతో హ్యమృతో ధర్మో మర్త్యతాం కథమేష్యతి ||** **|| మాం.గౌ.కా. 4-6 ||**

పుట్టుకనే ధర్మమే లేనిదానికి పుట్టుకను కొందరు ప్రతిపాదిస్తున్నారు. జనన-మరణాది ధర్మాలే లేని దానికి మృతత్వం (అది లేకుండా పోవడం) ఎలా సంభవిస్తుంది?

**శంకరుల భాష్యము**

సదసద్వాదినః సర్వే . అయం తు పురస్తాత్కృతభాష్యః శ్లోకః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

వాదులాడే వారందరూ, సత్-అసత్ వాదులెవరైనా కానీ (పుట్టుక అనే ధర్మమే లేని దానికి పుట్టుకను ఆపాదిస్తున్నారు. జనన-మరణ ధర్మాలే లేనిదానికి మృతి ఎలా కలుగుతుంది?). ఈ శ్లోకానికి భాష్యాన్ని గతంలో మాం.గౌ.కా. 3-20 క్రింద చెప్పియున్నారు. (దానినే ఇక్కడ గ్రహించాలని అభిప్రాయం).

**న భవత్యమృతం మర్త్యం న మర్త్యమమృతం తథా |**
**ప్రకృతేరన్యథాభావో న కథఞ్చిద్భవిష్యతి ||** **|| మాం.గౌ.కా. 4-7 ||**

అమృతత్వానికి మరణం ఉండదు. అలాగే మరణాన్ని పొందేది ఏదీ అమృతం కాదు. స్వభావానికి వేరుగా ఏదీ ఏ విధంగానూ సంభవించదు.

**స్వభావేనామృతో యస్య ధర్మో గచ్ఛతి మర్త్యతాత్ |**
**కృతకేనామృతస్తస్య కథం స్థాస్యతి నిశ్చలః ||** **|| మాం.గౌ.కా. 4-8 ||**

అమృతత్త్వమే ధర్మంగా గలది మృతి చెందుతుందనే భావన చేసేవారికి, ఆ అమృతత్వం ఎలా నిశ్చలంగా (శాశ్వతంగా) ఉంటుంది?

**శంకరుల భాష్యము**

ఉక్తార్థానాం శ్లోకానామిహోపన్యాసః పరవాదిపక్షాణామన్యోన్యవిరోధఖ్యాపితా నుత్పత్త్యామోదనప్రదర్శనార్థః ..
యస్మాల్లౌకిక్యపి ప్రకృతిర్న విపర్యేతి, కాసావిత్యాహ —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఇతర సిద్ధాంతాలలో గల పరస్పర వైరుధ్యాలచేత నిరూపితమైన పుట్టుకనేది లేదనే విషయాన్ని సమర్థించేందుకు, గతంలో వ్యాఖ్యానించబడిన మాం.గౌ.కా. 3-21, 3-22 శ్లోకాలనే తిరిగి చెప్తున్నారు.

సాధారణంగా లోకంలో కూడా స్వభావమన్నది మారేది కాదు. (ఇక పరమార్థతత్త్వాన్ని గురించి వేరే చెప్పాలా!). అసలు ఈ స్వభావం అన్నది ఏమిటో తర్వాత శ్లోకంలో చెప్తున్నారు.

**సాంసిద్ధికీ స్వాభావికీ సహజా అకృతా చ యా |**

**ప్రకృతిః సేతి విజ్ఞేయా స్వభావం న జహాతి యా || || మాం.గౌ.కా. 4-9 ||**

ఏది స్వభావమో అది సిద్ధమై ఉన్నట్టిదే. సహజంగా ఉండేదీ, తయారు చేయబడనిదీ, విడిచి పెట్టబడేది కానిది స్వభావం. అదియే ప్రకృతి అని గుర్తింబడేది.

**<u>శంకరుల భాష్యము</u>**

సమ్యక్సిద్ధిః సంసిద్ధిః, తత్ర భవా సాంసిద్ధికీ ; యథా యోగినాం సిద్ధానామణిమాద్యైశ్వర్యప్రాప్తిః ప్రకృతిః, సా భూతభవిష్యత్కాలయోరపి యోగినాం న విపర్యేతి . తథైవ సా . స్వాభావికీ ద్రవ్యస్వభావత ఏవ సిద్ధా, యథా అగ్న్యాదీనాముష్ణప్రకాశాదిలక్షణా . సాపి న కాలాంతరే వ్యభిచరతి దేశాంతరే వా, తథా సహజా ఆత్మనా సహైవ జాతా, యథా పక్ష్యాదీనామాకాశగమనాదిలక్షణా . అన్యాపి యా కాచిత్ అకృతా కేనచిన్న కృతా, యథా అపాం నిమ్నదేశగమనాదిలక్షణా . అన్యాపి యా కాచిత్స్వభావం న జహాతి, సా సర్వా ప్రకృతిరితి విజ్ఞేయా లోకే . మిథ్యాకల్పితేషు లౌకికేష్వపి వస్తుషు ప్రకృతిర్నాన్యథా భవతి ; కిముత అజస్వభావేషు పరమార్థవస్తుషు ?

కింవిషయా పునః సా ప్రకృతిః, యస్యా అన్యథాభావో వాదిభిః కల్ప్యతే ? కల్పనాయాం వా కో దోష ఇత్యాహ

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

'సంసిద్ధి' అనగా చక్కగా సిద్ధించి (పొంది) ఉన్నట్టిది. దాని వలన కలిగే ఫలితాన్నే **సాంసిద్ధికీ** అంటారు. ఎలాగైతే యోగులలో సిద్ధులలో కలిగే అణిమాది ఐశ్వర్యాలనబడే సిద్ధులు, భూత భవిష్యత్తు కాలాలలో కూడా ఆ యోగులకు లేకుండా పోవో, అలాగే **స్వాభావికీ** ద్రవ్యానికి ద్రవ్యస్వభావం అన్నది కూడా, అగ్ని వంటి వాటిలో ఉష్ణత్వం, ప్రకాశం వంటి లక్షణాలు సిద్ధంగానే ఉన్నట్లుగా, సిద్ధమయ్యే ఉంటుంది. అది కూడా కాలాంతరంలోగాని, దేశాంతరంలోగాని మార్పుచెందేది కాదు. ఆవిధంగా **యా సహజా** పక్షులకు ఆకాశంలో ఎగరటం అనేది ఎలా సహజమైన లక్షణమో, అలాగే తనతో పాటుగానే పుట్టినది. ఏదైనా ఇతరమైన వాటిలో కూడా **అకృతా** నీరు పల్లంవైపు పారటం వంటి (ఈ స్వభావమన్నది), ఏ ప్రయత్నం లేకుండానే ఉన్నట్టిదే. ఏదైనా ఇతరమైన వాటిలో కూడా, **యా స్వభావమ్** ఈ స్వభావం ఏదైతే ఉన్నదో అది **న జహాతి** వదలిపోదు. **సా ప్రకృతి ఇతి** అది సకలమూ ప్రకృతి అని **విజ్ఞేయా** లోకంలో గుర్తింపబడుతోంది. సాధారణంగా లోకంలో కూడా మిథ్యచేత కల్పితములైన వస్తువులే వాటి స్వభావంలో మార్పును పొందకపోతూంటే, ఇక పరమార్థ తత్త్వం యొక్క స్వభావమైన పుట్టుక లేకుండుట అనే దాని గురించి చెప్పేదేముంది? (పుట్టుక లేకపోవడం అన్న ఆ పరమార్థ తత్త్వం యొక్క స్వభావం మార్పులేనిదే అని అర్థం). కాబట్టి, ప్రకృతి అంటే అమృతత్వమే లక్షణంగా గలది తప్ప మరేమీ కాదని అభిప్రాయం.

మరైతే, ఇతర సిద్ధాంతవాదులచే మార్పులు కల్పించబడే ఆ ప్రకృతి నిజానికి ఎలాంటిది? లేదా, అలా దాని యందు (ఆ ప్రకృతియందు) మార్పులను భావించడంలో ఏం దోషమున్నది? అనే సందేహాలకు సమాధానం చెప్తున్నారు.

**జరామరణనిర్ముక్తాః సర్వే ధర్మాః స్వభావతః |**

**జరామరణమిచ్ఛన్తశ్చ్యవన్తే తన్మనీషయా || || మాం.గౌ.కా. 4-10 ||**

సకల జీవులు స్వభావసిద్ధంగా జరామరణ ధర్మాలు లేనివారైనప్పటికీ, పుట్టుకను-మరణాన్ని కల్పించుకొంటూ ఆ చింతనతో తమ స్వభావం నుండి దూరమౌతున్నారు.

**శంకరుల భాష్యము**

జరామరణనిర్ముక్తాః జరామరణాదిసర్వవిక్రియావర్జితా ఇత్యర్థః . కే ? సర్వే ధర్మాః సర్వే ఆత్మాన ఇత్యేతత్ . స్వభావతః ప్రకృతిత ఏవ . అత ఏవంస్వభావాః సంతో ధర్మా జరామరణమిచ్ఛంత ఇవేచ్ఛంతః రజ్జ్వామివ సర్పమాత్మని కల్పయంతః చ్యవంతే, స్వభావతశ్చలంతీత్యర్థః . తన్మనీషయా జరామరణచింతయా తద్భావభావితత్వదోషేణేత్యర్థః ..

కథం సజ్జాతివాదిభిః సాంఖ్యైరనుపపన్నముచ్యతే ఇతి, ఆహ వైశేషికః —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**జరామరణ నిర్ముక్తాః అంటే** పుట్టుక-చావు మొదలైన సకల పరిణామాలు లేనివి అని అర్థం. ఏమిటవి? **సర్వే ధర్మాః** సమస్తమైన ఆత్మ స్వరూపాలన్నీ **స్వభావతః** స్వభావసిద్ధంగా ప్రకృతియే. అలా స్వతసిద్ధంగా జర-మరణం వంటి ధర్మాలు లేనివే అయినా, **జరామరణమ్** పుట్టుక-చావు **ఇచ్ఛంతః** కలవిగా ఊహించుకొంటూ, భావన చేస్తూ, త్రాడును చూసి పాము అని భ్రమచెందినట్లుగా, **తత్ మనీషయా** ఆ జరామరణ చింతన వల్లనే, అంటే అటువంటి ఆలోచనలో మునిగిపోవడమనే దోషం వల్లనే, **చ్యవంతే** తమ స్వభావం నుండి కదలిపోతున్నారు అని అభిప్రాయం.

'సత్' అనేదానికి పుట్టుక ఉన్నది అని సాంఖ్యులు ఏ విధమైన అహేతుకమైన వాదన చేస్తున్నారో, దాని గురించి వైశేషికులు ఇలా అంటున్నారు.

**కారణం యస్య వై కార్యం కారణం తస్య జాయతే |**

**జాయమానం కథమజం భిన్నం నిత్యం కథం చ తత్ || || మాం.గౌ.కా. 4-11 ||**

ఎవరికి (ఏ సాంఖ్యవాదులకు) కారణమే కార్యమో, ఆ కారణం పుట్టేదియే. (కారణానికి) పుట్టుకనేది ఉన్నప్పుడు అది పుట్టుకలేనిది ఎలా అవుతుంది? వివిధంగా పరిణమించే అది నిత్యమైనది ఎలా అవుతుంది?

**శంకరుల భాష్యము**

కారణం మృద్వదుపాదానలక్షణం యస్య వాదినః వై కార్యం , కారణమేవ కార్యాకారేణ పరిణమతే యస్య వాదిన ఇత్యర్థః . తస్య అజమేవ సత్ ప్రధానాది కారణం మహదాదికార్యరూపేణ జాయత ఇత్యర్థః . మహదాద్యాకారేణ చేజ్జాయమానం ప్రధానం , కథమజముచ్యతే తైః ? విప్రతిషిద్ధం చేదం — జాయతే అజం చేతి . నిత్యం చ తైరుచ్యతే . ప్రధానం భిన్నం విదీర్ణం ;

స్ఫుటితమేకదేశేన సత్ కథం నిత్యం భవేదిత్యర్థః . న హి సావయవం ఘటాది ఏకదేశేన స్ఫుటనధర్మి నిత్యం దృష్టం లోకే ఇత్యర్థః . విదీర్ణం చ స్యాదేకదేశేనాజం నిత్యం చేత్యేతత్ విప్రతిషిద్ధం తైరభిధీయత ఇత్యభిప్రాయః ..

ఉక్తస్యైవార్థస్య స్పష్టీకరణార్థమాహ —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**కారణమ్** మట్టిలాగా ఉపాదాన లక్షణం కలది **వై కార్యమ్** కార్యమేనని **యస్య** ఎవరైతే వాదిస్తారో వారు అంటే కారణమే కార్యరూపంగా పరిణమిస్తుందని వాదించే వారు అని అభిప్రాయం. **తస్య** వారి అభిప్రాయంలో **కారణమ్** ప్రధానం అనబడే కారణం, పుట్టుక లేనిదే అయినా, మహత్తు వంటి కార్యరూపంగా **జాయతే** పుడుతున్నది. మహత్తు మొదలైన రూపాలుగా పుట్టే ప్రధానం, పుట్టుకలేనిదని వారు ఎలా అంటారు? ఇందులో పుట్టుక కలది పుట్టనిది అనే వైరుధ్యం కలుగుతోంది. మరింకా **భిన్నమ్** వివిధ రూపాలుగా విచ్ఛిన్నతను పొందే ప్రధానాన్ని **నిత్యమ్ చ** అని కూడా వారంటారు. ఒకటిగా కూర్చబడి ఉన్నది నిత్యం ఎలా అవుతుంది అని అభిప్రాయం. వివిధ భాగాలను కలిపి ఒకటిగా కూర్చబడిన కుండ మొదలైనవి లోకం దృష్టిలో శాశ్వతమైనవి కానట్లుగానే (ప్రధానం కూడా శాశ్వతమైనది కాదు) అని అభిప్రాయం. పుట్టుకనేది లేని నిర్మాణం లేదా సంఘాతం విచ్చినం కాబోయేది అయినప్పుడు దానిని శాశ్వతం అని వారు (సాంఖ్యవాదులు) చెప్పడం విరుద్ధమైనది అని (వైశేషికుల) అభిప్రాయం.

ఈ అభిప్రాయాన్ని మరింత స్పష్టంగా ఇలా చెప్తున్నారు.

**కారణాద్యద్యనన్యత్వమతః కార్యమజం తవ |**
**జాయమానాద్ధి వై కార్యాత్కారణం తే కథం ధ్రువం || || మాం.గౌ.కా. 4-12 ||**

ఒకవేళ కారణంతో (కార్యానికి) తేడాలేకపోతే, మీ వాదనలోని కార్యం పుట్టుకలేనిది అవుతోంది. (ఇంకా) జనించే కార్యానికి తేడాలేని మీ కారణం శాశ్వతం ఎలా అవుతుంది?.

## శంకరుల భాష్యము

కారణాత్ అజాత్ కార్యస్య యది అనన్యత్వమిష్టం త్వయా, తతః కార్యమప్యజమితి ప్రాప్తం . ఇదం చాన్యద్విప్రతిషిద్ధం కార్యమజం చేతి తవ . కించాన్యత్ , కార్యకారణయోరనన్యత్వే జాయమానాద్ధి వై కార్యాత్ కారణం అనన్యన్నిత్యం ధ్రువం చ తే కథం భవేత్ ? న హి కుక్కుట్యా ఏకదేశః పచ్యతే, ఏకదేశః ప్రసవాయ కల్ప్యతే ..

కించాన్యత్ ,

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**కారణాత్** అంటే కారణం నుండి జనించే కార్యానికి (ఆ కారణంతో) **అనన్యత్వమ్** భేదం లేకపోవడమే **యది** ఒకవేళ **తవ** మీ యొక్క అభిప్రాయమైతే, **అతః** అప్పుడు **కార్యమ్** ఆ కార్యం కూడా **అజమ్** జనించడం లేదని ప్రాప్తిస్తోంది. (కారణం నుండి పుడుతోన్న ) కార్యం జనించడం లేదు అనే వైరుధ్యం, మీ ఈ వాదన వల్ల ఏర్పడుతోంది.

మరో వైరుధ్యం కూడా ఉంది. కార్యకారణాలు రెండింటికీ తేడాలేకపోవడం చేత, కార్యంతో కారణానికి తేడాలేకపోయినట్లైతే, **తే** మీరు చెప్పే **కార్యాత్ జాయమానాత్** జనించే కార్యంతో తేడాలేని **కారణమ్** కారణం **ధ్రువమ్** నిత్యమైనది **కథమ్** ఎలా అవుతుంది? కోడిపెట్టలో ఒక భాగాన్ని ఉడికించి, మరోభాగాన్ని గ్రుడ్డులను పెట్టేందుకు ఉపయోగించడం అనేది వీలుకాదు కదా!

మరి ఇంకొక విషయం ఏమంటే,

**అజాద్వై జాయతే యస్య దృష్టాన్తస్తస్య నాస్తి వై |**
**జాతాచ్చ జాయమానస్య న వ్యవస్థా ప్రసజ్యతే ||** **|| మాం.గౌ.కా. 4-13 ||**

**పుట్టుకలేని కారణం నుండి కార్యం పుడుతుందని చెప్పడానికి ఉదాహరణయే లేదు. పుట్టేదానినుండే పుట్టుక కలుతుంది అని అన్నట్లైతే అది అవ్యవస్థకు (అనిశ్చయ స్థితికి) దారి తీస్తుంది.**

**శంకరుల భాష్యము**

యత్ అజాత్ అనుత్పన్నాద్వస్తునః జాయతే యస్య వాదినః కార్యం , దృష్టాంతః తస్య నాస్తి వై ; దృష్టాంతాభావే అర్థాదజాన్న కించిజ్జాయతే ఇతి సిద్ధం భవతీత్యర్థః . యదా పునః జాతాత్ జాయమానస్య వస్తునః అభ్యుపగమః, తదపి అన్యస్మాజ్జాతాత్తదప్యన్యస్మాదితి న వ్యవస్థా ప్రసజ్యతే . అనవస్థా స్యాదిత్యర్థః ..

'యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్' (బృ. ఉ. 4 . 5 . 15) ఇతి పరమార్థతో ద్వైతాభావః శ్రుత్యోక్తః ; తమాశ్రిత్యాహ —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఏ **అజాత్ వై** పుట్టుకలేని వస్తువునుండియే **జాయతే** కార్యం పుడుతోందని **యస్య** ఏదైతే వాదిస్తున్నారో (ఏ సాంఖ్యులైతే వాదిస్తున్నారో) **తస్య** ఆ వాదనకు సరిపడే **దృష్టాంతః** ఉదాహరణ **నాస్తి వై** లేనేలేదు. ఉదాహరణ లేకపోవడమంటే, పుట్టుకలేని దాని నుండి ఏదీ పుట్టదు అని నిరూపితమైనట్లే భావించవలసి ఉంటుంది అని అభిప్రాయం. అలా అయినప్పుడు, **చ** తిరిగి **జాయమానస్య** పుట్టుక కలది **జాతాత్** పుట్టుక కలదానినుండే పుడుతుంది అని వాదిస్తే, అప్పుడు కూడా ఆ పుట్టుక కలది మరొక పుట్టుక కలదానినుండి, అది ఇంకొక పుట్టుక కలదాని నుండి, ఇలా ఎప్పటికీ తేలని **న వ్యవస్థా ప్రసజ్యతే** అవ్యవస్థ ఏర్పడుతుంది.

కాని, 'ఎప్పుడైతే అట్టివానికి, సర్వమూ ఆత్మగా అనుభవమౌతుందో (అప్పుడు తెలియదగింది ఏమిటి, దేని ద్వారా తెలుసుకొంటాడు)' ['యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్' (బృ.ఉ. 4-5-15)] అని శ్రుతి ద్వైతం యొక్క అభావమే పరమార్థమైన సత్యం అని చెప్తోంది. దీనిని ఆధారం చేసుకొని ఇలా అంటున్నారు.

**హేతోరాదిః ఫలం యేషామాదిర్హేతుః ఫలస్య చ |**
**హేతోః ఫలస్య చానాదిః కథం తైరుపవర్ణ్యతే ||** **|| మాం.గౌ.కా. 4-14 ||**

హేతువునకు ప్రారంభం ఫలమనీ, ఫలానికి ప్రారంభం హేతువనీ ఎవరైతే వాదిస్తున్నారో వారు హేతువునకు ఫలానికి ప్రారంభమే లేదని ఎలా వర్ణిస్తారు?

**శంకరుల భాష్యము**

హేతోః ధర్మాదేః ఆదిః కారణం దేహాదిసంఘాతః ఫలం యేషాం వాదినాం ; తథా ఆదిః కారణం హేతుర్ధర్మాదిః ఫలస్య చ దేహాదిసంఘాతస్య ; ఏవం హేతుఫలయోరితరేతరకార్యకారణత్వేన ఆదిమత్త్వం బ్రువద్భిః ఏవం హేతోః ఫలస్య చ అనాదిత్వం కథం తైరుపవర్ణ్యతే విప్రతిషిద్ధమిత్యర్థః . న హి నిత్యస్య కూటస్థస్యాత్మనో హేతుఫలాత్మకతా సంభవతి ..

కథం తైర్విరుద్ధమభ్యుపగమ్యత ఇతి, ఉచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**హేతోః** ధర్మాధర్మములకు **ఆదిః** కారణం దేహాది సంఘాతమైన **ఫలమ్** కార్యం అని **యేషామ్** అని వాదించే వారు. అలాగే, **ఫలస్య చ** దేహాదిసంఘాతానికి కూడా **హేతుః** ధర్మాధర్మములు **ఆదిః** కారణం. {అంటే, ధర్మ-అధర్మాలు దేహం వల్ల కలుగుతున్నాయి మరియు ధర్మ-అధర్మాల వల్ల దేహం సంప్రాప్తమౌతోంది అని వారి వాదన – స్వామి గంభీరానంద}. ఈ విధంగా ఒకపక్క హేతువు, ఫలము ఒకదానికొకటి కార్య-కారణములవడం చేత, వాటికి ప్రారంభాన్ని చెబుతూ, **హేతోః ఫలస్య చ** హేతువునకూ మరియు ఫలమునకూ **అనాదిః** మొదలు లేదని **తై** వారే **కథమ్** ఎలా **ఉపవర్ణ్యతే** వర్ణిస్తారు. అంటే విరుద్ధంగా వాదిస్తున్నారని అభిప్రాయం. నిత్యమైన, కూటస్థమైన ఆత్మయందు హేతువు, ఫలమనేవి సంభవమే కావు.

ఎందువల్ల వారి వాదన విరుద్ధమైనదో క్రింది శ్లోకంలో చెప్తున్నారు.

**హేతోరాదిః ఫలం యేషామాదిర్హేతుః ఫలస్య చ |**

**తథా జన్మ భవేత్తేషాం పుత్రాజ్జన్మ పితుర్యథా || || మాం.గౌ.కా. 4-15 ||**

హేతువునకు ప్రారంభం ఫలమనీ, ఫలానికి ప్రారంభం హేతువనీ ఎవరైతే వాదిస్తున్నారో వారి వాదన జన్మ విషయంలో పుత్రుని నుండి తండ్రి జన్మిస్తాడని చెప్పినట్లుగా ఉన్నది.

**శంకరుల భాష్యము**

హేతుజన్యాదేవ ఫలాత్ హేతోర్జన్మాభ్యుపగచ్ఛతాం తేషామీదృశో విరోధ ఉక్తో భవతి, యథా పుత్రాజ్జన్మ పితుః ..

యథోక్తో విరోధో న యుక్తోఽభ్యుపగంతుమితి చేన్మన్యసే, సంభవే ఉత్పత్తౌ హేతుఫలయోః క్రమః ఏషితవ్యః అన్వేష్టవ్యః త్వయా —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

కారణం కార్యంనుండి కలుగుతోంది అంటూ కారణానికి పుట్టుకను భావించేవారు, పుత్రునినుండి తండ్రి జన్మిస్తాడని చెప్పినట్లు, (లోకంలో అనుభవంలో లేని) విపరీతమైన విషయాన్ని చెప్పినవారౌతున్నారు.

పైన చెప్పినట్లుగా కారణ-కార్యాలలో ఒకదానినుండి మరొకటి ఉత్పన్నమౌతున్నాయనే విపరీత ధోరణి సమంజసమైనది కాదని నీవు భావించేటట్లైతే, నీవు ఇలా అభిప్రాయపడాల్సి ఉంటుంది.

**సంభవే హేతుఫలయోరేషితవ్యః క్రమస్త్వయా |**

**యుగపత్సమ్భవే యస్మాదసమ్బన్ధో విషాణవత్ || || మాం.గౌ.కా. 4-16 ||**

ఒక క్రమంలో హేతువు-ఫలం సంభవిస్తాయనే అభిప్రాయపడాలి. రెండూ ఒకేసారి సంభవమైతే, ఆవుయొక్క రెండు కొమ్ముల లాగా, వాటిమధ్య సంబంధమనేదే ఉండదు.

**శంకరుల భాష్యము**

హేతుః పూర్వం పశ్చాత్ఫలం చేతి . ఇతశ్చ యుగపత్సంభవే యస్మాద్ధేతుఫలయోః కార్యకారణత్వేన అసంబంధః, యథా యుగపత్సంభవతోః సవ్యేతరగోవిషాణయోః ..

కథమసంబంధ ఇత్యాహ —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**హేతు-ఫలయోః** కారణం మరియు కార్యం అనే రెండూ **క్రమః** ఒక క్రమంలో అంటే ముందు కారణం తరువాత కార్యం అన్నట్లుగా **సంభవే** జన్మిస్తాయనే అంటే సంభవమౌతాయనే **త్వయా** నీవు **ఏషితవ్యః** భావించి తీరాలి. ఎందుకంటే **యుగపత్ సంభవే** రెండూ ఒకేమారు జన్మిస్తే, **విషాణవత్** ఒకేసారి పుట్టిన ఆవుయొక్క రెండు కొమ్ముల వలె **అసంబంధః** ఒకదానితో మరొకటి సంబంధం లేనివే అవుతాయి.

ఎలా సంబంధం లేనివో చెప్తున్నారు.

**ఫలాదుత్పద్యమానః సన్న తే హేతుః ప్రసిధ్యతి |**

**అప్రసిద్ధః కథం హేతుః ఫలముత్పాదయిష్యతి || || మాం.గౌ.కా. 4-17 ||**

కార్యం నుండి కారణం ఉత్పన్నమౌతోందన్న వారి వాదనలోని కారణానికి కారణ లక్షణం లేకుండాపోతుంది. కారణ లక్షణమే లేని కారణం ఫలాన్ని ఎలా ఇస్తుంది?

**శంకరుల భాష్యము**

జన్యాత్స్వతోఽలబ్ధాత్మకాత్ ఫలాత్ ఉత్పద్యమానః సన్ శశవిషాణాదేరివాసతో న హేతుః ప్రసిధ్యతి జన్మ న లభతే . అలబ్ధాత్మకః అప్రసిద్ధః సన్ శశవిషాణాదికల్పః తవ స కథం ఫలముత్పాదయిష్యతి ? న హి ఇతరేతరాపేక్షసిద్ధ్యోః శశవిషాణకల్పయోః కార్యకారణభావేన సంబంధః క్వచిద్దృష్టః అన్యథా వేత్యభిప్రాయః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఇంకనూ పుట్టవలసి యున్న **ఫలాత్ కార్యం నుండి ఉత్పద్యమానః సన్** ఉత్పన్నం కావలసియున్నందున **తే** వారి **హేతుః** కారణం **న ప్రసిధ్యతి** సిద్ధమై లేదు. అంటే వారు చెప్పే కారణం జన్మను ఇంకా పొందలేదు కాబట్టి, అది కుందేటి కొమ్ములాగా ఉనికి లేనిదే. **అప్రసిద్ధః** ఇంకనూ కుందేటి కొమ్ములాగా కల్పితమైనదేకాని నిజానికి ఉత్పన్నంకానిదైన, మీరు చెప్పే **హేతుః** కారణం **ఫలమ్** ఫలాన్ని **కథమ్** ఎలా

**ఉత్పాదయిష్యతి** ఉత్పన్నంచేస్తుంది? ఉనికిలోకి రావాలంటేనే ఒకదానిపై మరొకటి పరస్పరం ఆధారపడిన కారణ-కార్య భావాల మధ్య సంబంధం అనేది, కల్పితమైన కుందేటి కొమ్ములాగా, ఎక్కడైననూ ఏవిధంగానూ చూడలేము అని అభిప్రాయం. {కారణం కార్యం నుండి పుడుతోంది అని వాదించినట్లైతే, ఇంకనూ పుట్టని ఆ కారణం నుండి కార్యం పుట్టడం సాధ్యమే కాదు. అలాగే, కారణం నుండి కార్యం పుడుతోంది అని అన్నప్పుడు, ఇంకా పుట్టని కార్యం నుండి కారణం పుట్టడం అసంభవం. అందుచేత, కారణ-కార్యాలు ఒకదాని నుండి మరొకటి పుడతాయనే పరస్పర సంబంధం ఏదైతే ప్రతిపాదన చేయబడుతోందో ఆ వాదన సరైనది కాదు అని ఇక్కడ నిరూపించి తిరస్కరిస్తున్నారు}.

**యది హేతోః ఫలాత్సిద్ధిః ఫలసిద్ధిశ్చ హేతుతః |**
**కతరత్పూర్వనిష్పన్నం యస్య సిద్ధిరపేక్షయా || || మాం.గౌ.కా. 4-18 ||**

కారణం కార్యం నుండి సిద్ధిస్తోంది మరియు కార్యం కారణం నుండి సిద్ధిస్తోంది అనేటట్లైతే, రెండింటిలో దేనికన్నా ముందు ఏది సిద్ధిస్తోంది?

**శంకరుల భాష్యము**

అసంబంధతాదోషేణాపాకృతేఽపి హేతుఫలయోః కార్యకారణభావే, యది హేతుఫలయోరన్యోన్యసిద్ధిరభ్యుపగమ్యత ఏవ త్వయా, కతరత్పూర్వనిష్పన్నం హేతుఫలయోః ? యస్య పశ్చాద్భావినః సిద్ధిః స్యాత్పూర్వసిద్ధాపేక్షయా, తద్బ్రూహీత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

కార్య-కారణ భావాల మధ్య సంబంధం లేకపోవడమనే దోషాన్ని పక్కనపెట్టినా కూడా, **యది** ఒకవేళ **హేతోః ఫలాత్ సిద్ధిః** కార్యం నుండి కారణం పుడుతోంది **చ** మరియు **ఫలసిద్ధిః హేతుతః** కార్యం కారణం పుడుతోందని, అంటే ఒకదాని నుండి మరొకటి పరస్పరం ఉత్పన్నమౌతున్నాయని మీరు చెప్పే కారణ-కార్యాలు రెండింటిలో ఏది ముందుగా ఉత్పన్నమౌతోంది? **కతరత్ పూర్వ నిష్పన్నమ్** ఏది ముందు ఉత్పన్నమైనదో **అపేక్షయా** దానితో పోలిస్తే **యస్య సిద్ధిః** ఏది తర్వాత ఉత్పన్నమవుతోందో చెప్పండి అని అభిప్రాయం.

**అశక్తిరపరిజ్ఞానం క్రమకోపోఽథ వా పునః |**
**ఏవం హి సర్వథా బుద్ధైరజాతిః పరిదీపితా || || మాం.గౌ.కా. 4-19 ||**

(ఈ సందిగ్ధతను తేల్చి చెప్పలేని) అశక్తత అజ్ఞానం వల్ల లేదా సరియైన క్రమాన్ని గ్రహించడంలో దోషంవల్ల (కలుగుతోంది). ఆ విధంగా, పండితులం అనుకొనే వారు (పరస్పరం వాదులాడుతూ) జన్మలేకపోవడాన్నే ప్రముఖంగా తేల్చిచెపుతున్నారు.

**శంకరుల భాష్యము**

అథ ఏతన్న శక్యతే వక్తుమితి మన్యసే, సేయమశక్తిః అపరిజ్ఞానం తత్త్వావివేకః, మూఢతేత్యర్థః . అథ వా, యోఽయం త్వయోక్తః క్రమః హేతోః ఫలస్య సిద్ధిః ఫలాచ్చ హేతోః సిద్ధిరితి ఇతరేతరానంతర్యలక్షణః, తస్య కోపః విపర్యాసోఽన్యథాభావః

స్యాదిత్యభిప్రాయః . ఏవం హేతుఫలయోః కార్యకారణభావానుపపత్తేః అజాతిః సర్వస్యానుత్పత్తిః పరిదీపితా ప్రకాశితా అన్యోన్యపక్షదోషం బ్రువద్భిర్వాదిభిః బుద్ధైః పండితైరిత్యర్థః ..

ననుహేతుఫలయోః కార్యకారణభావ ఇత్యస్మాభిరుక్తం శబ్దమాత్రమాశ్రిత్య చ్ఛలమిదం త్వయోక్తం — 'పుత్రాజ్జన్మ పితుర్యథా' (మా. కా. 4 . 15) 'విషాణవచ్చాసంబంధః' (మా. కా. 4 . 16) ఇత్యాది . న హ్యస్మాభిః అసిద్ధాద్ధేతోః ఫలసిద్ధిః, అసిద్ధాద్వా ఫలాద్ధేతుసిద్ధిరభ్యుపగతా . కిం తర్హి ? బీజాంకురవత్కార్యకారణభావోఽభ్యుపగమ్యత ఇతి . అత్రోచ్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

అలాంటప్పుడు, **అశక్తిః** దీనికి సమాధానం చెప్పలేమని భావించడమనే అశక్తత **అపరిజ్ఞానమ్** తత్త్వాన్ని గురించిన వివేకం లేకపోవడం వల్ల, అంటే అజ్ఞానం వల్ల కలుగుతుంది అని అభిప్రాయం. **అథ వా పునః** మరి లేకుంటే, మీరు చెప్పిన కారణం నుండి కార్యం సిద్ధించడం మరియు కార్యం నుండి కారణం సిద్ధించడం అనే ఒకదానిపై మరొకటి ఆధారపడటం ఏదైతే ఉన్నదో అది **క్రమకోపః** ఆ భావనను వ్యతిరేకించే మరొక భావన ఉండటం వల్లనైనా కావచ్చు. (ఏది ముందు ఏది తర్వాత అన్నదాన్ని తేల్చి చెప్పలేకపోవడానికి మీ అసమర్థతైనా కారణం కావచ్చు లేదా దీనికి భిన్నమైన మరొక వాదనం ఉండటం కూడా కారణం కావచ్చు). **ఏవమ్** ఈ విధంగా, హేతువుకు-ఫలానికి కార్యకారణ భావాన్ని ఆపాదించడం కుదరనందువల్ల **అజాతిః** అన్నింటా పుట్టుకనేది లేకపోవడమే **బుద్ధైః** పండితులైనవారిచే, పరస్పర వాదనలలోని దోషాలను ఎత్తిచూపేవారిచే **పరిదీపితా** ప్రకటింపబడుతోంది అని అభిప్రాయం.

**సందేహం** : హేతువు-ఫలములేనివి కారణ-కార్యభావం కలిగినవని మేము చెప్పినదానిలో కేవలం పదాలను మాత్రమే పట్టుకొని తికమకచేసి, 'పుత్రుడినుండి తండ్రి జన్మించినట్లు' ['పుత్రాజ్జన్మ పితుర్యథా' (మా.గౌ.కా. 4-15), 'ఆవు కొమ్ములలాగా సంబంధం లేనివి' ['విషాణవచ్చాసంబంధః' (మా.గౌ.కా. 4-16)] అంటూ మీరు ఏదేదో చెబుతున్నారు. అప్పటికే సిద్ధమైలేని హేతువునుండి ఫలం కలుగుతుందని కాని, అప్పటికే సిద్ధమైలేని కార్యంనుండి హేతువు కలుగుతోందని కాని, చెప్పడం మా అభిప్రాయం కాదు. మేము ఏమని చెప్పాం? బీజం-అంకురం లాగా కారణకార్యభావాన్ని గ్రహించాలన్నదే మా అభిప్రాయం.

అలాగైతే, దీనికి సమాధానం ఇలా చెప్తున్నారు.

**బీజాఙ్కురాఖ్యో దృష్టాన్తః సదా సాధ్యసమో హి సః |**
**న హి సాధ్యసమో హేతుః సిద్ధౌ సాధ్యస్య యుజ్యతే || || మాం.గౌ.కా. 4-20 ||**

బీజం-అంకురం అనే ఉదాహరణ ఎప్పుడూ సాధించతగిన ఉన్నతమైన లక్ష్యంతో సమానమైనదే. సాధించతగినదానితో సమానమైన హేతువును, ఆ సిద్ధికి ఉపకరించే సాధనంగా భావించడం సరికాదు.

## శంకరుల భాష్యము

బీజాంకురాఖ్యో దృష్టాంతో యః, స సాధ్యేన సమః తుల్యో మమేత్యభిప్రాయః . నను ప్రత్యక్షః కార్యకారణభావో బీజాంకురయోరనాదిః ; న, పూర్వస్య పూర్వస్య అపరభావాదాదిమత్త్వాభ్యుపగమాత్ . యథా ఇదానీముత్పన్నోఽపరోఽఙ్కురో

బీజాదాదిమాన్ బీజం చాపరమన్యస్మాదంకురాదితి క్రమేణోత్పన్నత్వాదాదిమత్ . ఏవం పూర్వః పూర్వోఽఙ్కురో బీజం చ పూర్వం పూర్వమాదిమదేవేతి ప్రత్యేకం సర్వస్య బీజాంకురజాతస్యాదిమత్త్వాత్కస్యచిదప్యనాదిత్వానుపపత్తిః . ఏవం హేతుఫలయోః . అథ బీజాంకురసంతతేరనాదిమత్త్వమితి చేత్ ; న, ఏకత్వానుపపత్తేః ; న హి బీజాంకురవ్యతిరేకేణ బీజాంకురసంతతిర్నామైకా అభ్యుపగమ్యతే హేతుఫలసంతతిర్వా తదనాదిత్వవాదిభిః . తస్మాత్సూక్తం 'హేతోః ఫలస్య చానాదిః కథం తైరుపవర్ణ్యతే' ఇతి . తథా చ అన్యదప్యనుపపత్తేర్న చ్ఛలమిత్యభిప్రాయః . న చ లోకే సాధ్యసమో హేతుః సాధ్యస్య సిద్ధౌ సిద్ధినిమిత్తం యుజ్యతే ప్రయుజ్యతే ప్రమాణకుశలైరిత్యర్థః . హేతురితి దృష్టాంతోఽత్రాభిప్రేతః, గమకత్వాత్ ; ప్రకృతో హి దృష్టాంతః, న హేతురితి ..

కథం బుద్ధైరజాతిః పరిదీపితేతి, ఆహ —

## ౘంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

బీజం-అంకురం అనే దృష్టాంతం ఏదైతే ఉన్నదో అది సాధించతగిన ఉన్నత లక్ష్యంతో (పరమాత్మ లక్షణంతో) సమానమైనదని మా అభిప్రాయం.

**సందేహం** : అయితే, బీజం-అంకురాల మధ్యగల కార్యకారణ సంబంధానికి ప్రారంభమనేది లేదని ప్రత్యక్షంగా కనిపించడం లేదా?

**సమాధానం** : కాదు. ఎందుకంటే, ముందు ఉన్నవి తరువాత వచ్చిన వాటివలెనే ఉంటున్నాయి కనుక. ఎలాగంటే, ఇప్పుడు విత్తునుండి మొలకెత్తిన ఈ అంకురానికి ప్రారంభం ఉన్నట్లుగానే, వేరొక అంకురం నుండి పుట్టిన మరో బీజానికి కూడా ప్రారంభం ఉంటోంది. ఇలా ఒక క్రమంలో పుట్టేవి ప్రారంభం ఉన్నట్టివే. ఈ విధంగా, అంకురానికి పూర్వం బీజం, ఆ బీజానికి పూర్వం అంకురం ఉండటం చేత, బీజం-అంకురాలకు ప్రారంభం అనేది ఉంటోంది. సకలమైన బీజ-అంకుర శ్రేణులలోని ప్రతి ఒక్క శ్రేణికి పుట్టుకనేది ఉండటం చేత వాటికి ఆది అనేది ఉంటూండగా, వాటికి అనాదిత్వాన్ని చెప్పడం ఏమాత్రం కుదరదు. అదే విధంగా, హేతు-ఫలాలకు కూడా (అనాదిత్వాన్ని చెప్పడం సాధ్యం కాదు).

**సందేహం** : అయితే, బీజ-అంకురాల శ్రేణికి (బీజ-అంకురాల వరుసలకు) అనాదిత్వం ఉన్నది అనవచ్చు కదా!

**సమాధానం** : కాదు, ఎందుకంటే (బీజము వేరు అంకురం వేరు కాబట్టి బీజానికి-అంకురానికి) ఏకత్వాన్ని చెప్పడం కుదరదు కాబట్టి. బీజానికి అంకురానికి భిన్నంగా బీజాంకురసమూహమనేది ఒక్కటే అని గాని లేదా హేతుఫలసమూహం అంతా కలిపి ఒక్కటే అని గాని అనాదిత్వాన్ని వాదించేవారు చెప్పడంలేదు. అందుచేతనే, 'హేతోః ఫలస్య చానాదిః కథం తైరుపవర్ణ్యతే' (మాం.గౌ.కా. 4-14) అని మాచేత చెప్పబడిన మాట సరియైనదే. మరియు ఆ విధంగా, మీరు చెప్పిన మరొక వాదన (బీజ-అంకురాలలోని కార్యకారణభావానికి మొదలు అన్నది లేదనే వాదన) కూడా నిరూపణకానందుచేత, ఇందులో తికమక ఏమీ లేదని అభిప్రాయం. (బీజము మరియు అంకురం మధ్య పరస్పర కారణకార్య సంబంధం ఉండటాన్ని చూస్తూనే ఉన్నాం. ఈ కారణకార్య సంబంధానికి తొలి అనేది లేదుకదా అనేది కదా అన్నది ఇక్కడ లేవనెత్తబడిన సందేహం. బీజ-అంకురాలు రెండూ ఉన్నప్పుడు మాత్రమే వాటి మధ్య కారణకార్య సంబంధం కలుగుతోందే కాని, అవి లేనప్పుడు కారణకార్య సంబంధానికి ఉనికియే ఉండదు కదా అని సమాధానం చెప్తున్నారు. అలాగే, బీజం-అంకురం రెండూ ఒకే వస్తువుగా భావిస్తే, అప్పుడు దానికి ప్రారంభం అన్నది చెప్పలేం కదా అనే సందేహానికి సమాధానంగా, రెండు విభిన్నమైన వస్తువులను ఒక్కటిగా భావించడం కుదరదు అని సమాధానం చెప్తున్నారు).

లోకంలో కూడా, **సాధ్యసమో హేతుః** సాధించి పొందవలసియున్న దానితో సమానమైన హేతువును, **సిద్ధౌ సాధ్యస్య** ఆ సాధ్యాన్ని సిద్ధింపచేయడానికి ఉపకరించే ఒక సాధనంగా, **న యుజ్యతే** తెలిపైన వారెవ్వరూ ఆలోచించరు అని అభిప్రాయం. ఇక్కడ హేతువు అన్న పదానికి అర్థం దృష్టాంతం అని గమనించాలి. ఎందుకంటే ఇక్కడ హేతువు దృష్టాంతం లాగా లక్ష్యాన్ని సిద్ధింప చేస్తోంది కాబట్టి. ప్రస్తుతం దృష్టాంతం గురించే చర్చ కాని, హేతువును గురించి కాదు.

మరి పండితులు (పండితులమని తమకు తాము భావించే వారు) పుట్టుకలేకుండటాన్ని ఎలా వివరిస్తున్నారో చెప్తున్నారు.

**పూర్వాపరాపరిజ్ఞానమజాతేః పరిదీపకమ్ |**

**జాయమానాద్ధి వై ధర్మాత్కథం పూర్వం న గృహ్యతే || || మాం.గౌ.కా. 4-21 ||**

పూర్వాపరాలు తెలియకపోవడమనే అజ్ఞానమే పుట్టుకలేకపోవడాన్ని తెలియజేస్తోంది. పుట్టడమనే ధర్మం కలదాని యొక్క పూర్వత్వం తెలియకుండా ఎలా ఉంటుంది?

**శంకరుల భాష్యము**

యదేతత్ హేతుఫలయోః పూర్వాపరాపరిజ్ఞానం , తచ్చైతత్ అజాతేః పరిదీపకం అవబోధకమిత్యర్థః . జాయమానో హి చేద్ధర్మో గృహ్యతే, కథం తస్మాత్పూర్వం కారణం న గృహ్యతే ? అవశ్యం హి జాయమానస్య గ్రహీత్రా తజ్జనకం గ్రహీతవ్యం , జన్యజనకయోః సంబంధస్యానపేతత్వాత్ ; తస్మాదజాతిపరిదీపకం తదిత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఈ హేతుఫలాల యొక్క అంటే కారణ-కార్యాల యొక్క **పూర్వా అపరా** పూర్వాపరాలు (ముందు వెనుకలు) **అపరిజ్ఞానమ్** తెలియకపోవడమనే అజ్ఞానం ఏదైతే ఉన్నదో, అదియే **అజాతేః** పుట్టుకలేకపోవడమనేదాన్ని **పరిదీపకమ్** సూచిస్తోంది లేదా తెలియజేస్తోంది. **జాయమానాత్ ధర్మాత్ హి వై** పుట్టుట అనే ధర్మం కలవే అయితే **పూర్వమ్** వాటి ముందు ఏమి కలదో **కథమ్ న గృహ్యతే** తెలియబడకుండా ఎలా ఉంటుంది? తప్పనిసరిగా పుట్టేదాని యొక్క పుట్టుకను తెలిసిన వానికి, అది దేనినుండి పుట్టిందో తప్పకుండా తెలిసే ఉండాలి. జన్య-జనక సంబంధం అనేది త్రోసిపుచ్చేది కాదు. అందుచేత, అవి పుట్టడం లేదన్నది చక్కగా సూచించబడుతోంది అని అభిప్రాయం.

**స్వతో వా పరతో వాపి న కిఞ్చిద్వస్తు జాయతే |**

**సదసత్సదసద్వాపి న కిఞ్చిద్వస్తు జాయతే || || మాం.గౌ.కా. 4-22 ||**

తనంత తానుగా గాని, వేరే విధంగా గాని ఏ వస్తువూ పుట్టడం లేదు. సద్వస్తువైనా, అసద్వస్తువైనా లేదా సదసద్వస్తువు ఏదైనా కూడా పుట్టడం లేదు.

## శంకరుల భాష్యము

ఇతశ్చ న జాయతే కించిత్ యజ్జాయమానం వస్తు స్వతః పరతః ఉభయతో వా సత్ అసత్ సదసద్వా న జాయతే, న తస్య కేనచిదపి ప్రకారేణ జన్మ సంభవతి . న తావత్స్వయమేవాపరినిష్పన్నాత్స్వతః స్వరూపాత్స్వయమేవ జాయతే, యథా ఘటస్తస్మాదేవ ఘటాత్ . నాపి పరతః అన్యస్మాదన్యః, యథా ఘటాత్పటః . తథా నోభయతః, విరోధాత్ , యథా ఘటపటాభ్యాం ఘటః పటో వా న జాయతే . నను మృదో ఘటో జాయతే పితుశ్చ పుత్రః ; సత్యం , అస్తి జాయత ఇతి ప్రత్యయః శబ్దశ్చ మూఢానాం . తావేవ తు శబ్దప్రత్యయౌ వివేకిభిః పరీక్ష్యేతే — కిం సత్యమేవ తౌ, ఉత మృషా ఇతి ; యావతా పరీక్ష్యమాణే శబ్దప్రత్యయవిషయం వస్తు ఘటపుత్రాదిలక్షణం శబ్దమాత్రమేవ తత్ , 'వాచారంభణం' (ఛా. ఉ. 6 . 4 . 4) ఇతి శ్రుతేః . సచ్చేత్ న జాయతే, సత్త్వాత్ , మృత్పిత్రాదివత్ . యద్యసత్ , తథాపి న జాయతే, అసత్త్వాదేవ, శశవిషాణాదివత్ . అథ సదసత్ , తథాపి న జాయతే విరుద్ధస్యైకస్యాసంభవాత్ . అతో న కించిద్వస్తు జాయత ఇతి సిద్ధం . యేషాం పునర్జనిరేవ జాయత ఇతి క్రియాకారకఫలైకత్వమభ్యుపగమ్యతే క్షణికత్వం చ వస్తునః, తే దూరత ఏవ న్యాయాపేతాః . ఇదమిత్థమిత్యవధారణక్షణాంతరానవస్థానాత్ , అననుభూతస్య స్మృత్యనుపపత్తేశ్చ ..

కించ, హేతుఫలయోరనాదిత్వమభ్యుపగచ్ఛతా త్వయా బలాద్ధేతుఫలయోరజన్మైవాభ్యుపగతం స్యాత్ . కథం ?

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

ఈ కారణంగానే, పుడుతున్నట్లుగా కనిపించే వస్తువు ఏదీ తనకు తానుగా గాని, వేరే దాని వల్ల గాని, లేదా రెండు విధాలుగా కూడా పుట్టడం లేదు. లేదా, సద్వస్తువైనా గాని, అసద్వస్తువైనా గాని, సదసద్వస్తువు ఏదైనా గాని ఏ విధంగా కూడా జన్మించడం సంభవం కాదు. కుండ నుండి మరో కుండ ఉత్పన్నం కానట్లే, స్వయంగా తాను పుట్టనంత వరకు, తన స్వస్వరూపం నుండి తాను పుట్టదు. కుండ నుండి వస్త్రం ఉత్పన్నం కానట్లుగానే, ఇంకొకదాని నుండి మరొకటి పుట్టదు. అలాగే, కుండ మరియు వస్త్రం నుండి కుండ లేదా వస్త్రం పుట్టనట్లే, స్వయంగా మరియు మరోదాని వల్ల కూడా, పుట్టడం అనేది లేదు. అంటే, స్వయంగాగాని మరియు వేరేదాని నుండిగాని, రెండు విధాలుగా గాని పుట్టడం కుదరదు. ఎందుకంటే, ఆ పుట్టుకలలో వ్యత్యాసం ఉన్నది కాబట్టి.

**సందేహం** : అయితే, మట్టినుండి కుండ పుట్టడం లేదా? తండ్రి వలన కుమారుడు జన్మించడం లేదా?

**సమాధానం** : నిజమే. ఉండుట, పుట్టుట అనేవి అజ్ఞానులు వాడే పదాలు. ఆ శబ్దాలనైతే వివేకవంతులు ఇవి సత్యమా లేక కల్పనా అని పరీక్షచేస్తారు. కుండ, పుత్రుడు వంటి లక్షణాలు కలిగిన ఆ శబ్దవిశేషాలను పరీక్షించి చూసి, అవి కేవలం శబ్దాలు మాత్రమే అని 'వాచారంభణం' (ఛాం.ఉ. 6-4-4) అనే శ్రుతి వాక్యాల ద్వారా గ్రహిస్తారు. మట్టి, తండ్రి లాగా ఎప్పుడూ ఉనికి కలిగి ఉండే 'సత్' అయితే పుట్టదు. అసత్ అయితే, అది కూడా పుట్టదు. ఎందుకంటే, కుందేటి కొమ్ములాగా అది లేనిదే కాబట్టి. ఇక సదసత్. అది కూడా పుట్టదు. ఎందుకంటే, ఒక్కటే అనే దానియందు వైరుధ్యం సంభవం కాదు కాబట్టి. అందువల్ల, ఏ వస్తువైనా పుట్టడం లేదు అని నిరూపణ అవుతోంది.

ఎవరైతే (ఏ బౌద్ధులైతే), 'పుట్టుట అనే క్రియయే పుడతోంది' అని అంటూ క్రియ-కారకం-ఫలాల ఏకత్వాన్ని బోధిస్తారో మరియు వస్తువుకు క్షణికత్వాన్ని చెప్తారో, వారు న్యాయానికి దూరమై పోయిన వారే. వారి దృష్టిలో, ఇది ఇలాంటిది అని నిర్ధారించే ఆ క్షణంలో తప్ప మరుక్షణంలో ఆ వస్తువు అలా ఉండనందు చేత, అనుభవానికి రాని ఆ వస్తువు యొక్క స్మృతి కలిగే అవకాశమే లేదు. (కాబట్టి, బౌద్ధుల సిద్ధాంతం హేతుబద్ధమైనది కాదని అభిప్రాయం).

ఇంకా ఏమంటే, హేతు-ఫలాలకు అనాదిత్వం నిశ్చయించబడగా, హేతు-ఫలాలకు జన్మలేదనడాన్ని కూడా మీరు తప్పనిసరిగా అంగీకరించవలసియే ఉంటుంది. ఏ విధంగా?

**హేతుర్న జాయతేఽనాదేః ఫలం చాపి స్వభావతః |**
**ఆదిర్న విద్యతే యస్య తస్య హ్యాదిర్న విద్యతే || || మాం.గౌ.కా. 4-23 ||**

ఆదిలేని దానినుండి (ఫలం నుండి) హేతువు పుట్టడం లేదు మరియు స్వభావం రీత్యా ఫలం కూడా (ఆదిలేని హేతువు నుండి పుట్టడం లేదు). దేనికి ప్రారంభం అనేది లేదో దాని యొక్క మొదలు తెలియబడదు.

**శంకరుల భాష్యము**

అనాదేః ఆదిరహితాత్ఫలాత్ హేతుః న జాయతే . న హ్యనుత్పన్నాదనాదేః ఫలాద్ధేతోర్జన్మేష్యతే త్వయా, ఫలం చాపి ఆదిరహితాదనాదేర్హేతోరజాత్స్వభావత ఏవ నిర్నిమిత్తం జాయత ఇతి నాభ్యుపగమ్యతే . తస్మాదనాదిత్వమభ్యుపగచ్ఛతా త్వయా హేతుఫలయోరజన్మైవాభ్యుపగమ్యతే . యస్మాత్ ఆదిః కారణం న విద్యతే యస్య లోకే, తస్య హ్యాదిః పూర్వోక్తా జాతిర్న విద్యతే . కారణవత ఏవ హ్యాదిరభ్యుపగమ్యతే, న అకారణవతః ..

ఉక్తస్యైవార్థస్య దృఢీకరణచికీర్షయా పునరాక్షిపతి —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**అనాదేః** ఆది అనేది లేని ఫలం నుండి **హేతుః** కారణం **న జాయతే** ఉత్పన్నం కాదు. కాబట్టి, ఉత్పన్నం కాని అంటే మొదలనేదే లేని ఫలం నుండి కారణం పుడుతుందని కూడా మీరు (ద్వైతులు) అంగీకరించినట్లే. **ఫలమ్ చ అపి** మరియు ఫలం కూడా మొదలనేదే లేని కారణంనుండి **స్వభావతః** సహజంగానే అంటే ఏ నిమిత్తం లేకుండానే పుడుతోంది అనడం కూడా (మీకు ఇష్టంలేకపోయినా అంగీకరించినట్లే అవుతోంది). అందువలన, మీరు అభిప్రాయపడే అనాదిత్వం వలన కారణ-కార్యాలు పుట్టకపోవడమనేది మీరు అంగీకరించినట్లే అవుతోంది. ఎందువల్లనంటే, లోకంలో సాధారణంగా **యస్య** దేనికి **ఆదిః** కారణం అన్నది **న విద్యతే** లేదో **తస్య** దానికి **ఆది** హి ముందు చెప్పిన పుట్టుక అన్నదే **న విద్యతే** లేదని తెలుస్తోంది. అంటే, కారణమున్నదానికే మొదలు అన్నది తెలియబడుతోంది కాని, కారణం లేని దానికి కాదు.

చెప్పిన అభిప్రాయాన్ని ధృఢపరచడం కోసం తర్వాత శ్లోకంలో మరో అభ్యంతారాన్ని లేవనెత్తుతున్నారు.

**ప్రజ్ఞప్తేః సనిమిత్తత్వమన్యథా ద్వయనాశతః |**
**సఙ్క్లేశస్యోపలబ్ధేశ్చ పరతన్త్రాస్తితా మతా || || మాం.గౌ.కా. 4-24 ||**

జ్ఞానానికి (అది దేని గురించిన జ్ఞానం అనే) ఒక నిమిత్తం ఉండాలి. లేకుంటే (అనుభవానికి వస్తున్న) రెండవది అనేదే ఉండదు. దుఃఖం కలుగుతోంది అంటే (ఆ దుఃఖానికి కారణమైన) వేరొకటి ఉన్నదనే అర్థం కదా!

**<u>శంకరుల భాష్యము</u>**

ప్రజ్ఞానం ప్రజ్ఞప్తిః శబ్దాదిప్రతీతిః, తస్యాః సనిమిత్తత్వం , నిమిత్తం కారణం విషయ ఇత్యేతత్ ; సనిమిత్తత్వం సవిషయత్వం స్వాత్మవ్యతిరిక్తవిషయతేత్యేతత్ , ప్రతిజానీమహే . న హి నిర్విషయా ప్రజ్ఞప్తిః శబ్దాదిప్రతీతిః స్యాత్ , తస్యాః సనిమిత్తత్వాత్ . అన్యథా నిర్విషయత్వే శబ్దస్పర్శనీలపీతలోహితాదిప్రత్యయవైచిత్ర్యస్య ద్వయస్య నాశతః నాశోఽభావః ప్రసజ్యేతేత్యర్థః . న చ ప్రత్యయవైచిత్ర్యస్య ద్వయస్యాభావోఽస్తి, ప్రత్యక్షత్వాత్ . అతః ప్రత్యయవైచిత్ర్యస్య ద్వయస్య దర్శనాత్ , పరేషాం తంత్రం పరతంత్రమిత్యన్యశాస్త్రం , తస్య పరతంత్రస్య పరతంత్రాశ్రయస్య బాహ్యార్థస్య ప్రజ్ఞానవ్యతిరిక్తస్య అస్తితా మతా అభిప్రేతా . న హి ప్రజ్ఞప్తేః ప్రకాశమాత్రస్వరూపాయా నీలపీతాదిబాహ్యాలంబనవైచిత్ర్యమంతరేణ స్వభావభేదేనైతద్వైచిత్ర్యం సంభవతి . స్ఫటికస్యేవ నీలాద్యుపాధ్యాశ్రయైర్వినా వైచిత్ర్యం న ఘటత ఇత్యభిప్రాయః . ఇతశ్చ పరతంత్రాశ్రయస్య బాహ్యార్థస్య జ్ఞానవ్యతిరిక్తస్యాస్తితా . సంక్లేశనం సంక్లేశః, దుఃఖమిత్యర్థః . ఉపలభ్యతే హి అగ్నిదాహాదినిమిత్తం దుఃఖం . యద్యగ్న్యాదిబాహ్యం దాహాదినిమిత్తం విజ్ఞానవ్యతిరిక్తం న స్యాత్ , తతో దాహాదిదుఃఖం నోపలభ్యేత . ఉపలభ్యతే తు . అతః తేన మన్యామహే అస్తి బాహ్యోఽర్థ ఇతి . న హి విజ్ఞానమాత్రే సంక్లేశో యుక్తః, అన్యత్రాదర్శనాదిత్యభిప్రాయః ..

అత్రోచ్యతే —

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

(ఇతర సిద్ధాంతాలవారు ఏమని వాదిస్తున్నారో చెప్తున్నారు). **ప్రజ్ఞప్తిః** శబ్దం వంటి ప్రసిద్ధమైన జ్ఞానాల వంటి వాటికి **సనిమిత్తత్వమ్** - కారణమైన విషయాన్ని 'నిమిత్తమ్' అంటారు. అటువంటి కారణ విషయం కలిగి ఉండటమే 'సనిమిత్తత్వమ్'. అంటే తనకు భిన్నంగా ఉన్న విషయం కారణంగా జ్ఞానం కలుగుతోందని మేము ప్రతిపాదిస్తున్నాం. ఎందుకంటే, విషయం అనేదే లేనప్పుడు వాటికి సంబంధించిన శబ్దాదుల వంటి జ్ఞానం ఉండదు కాబట్టి. అందుచేత ప్రజ్ఞప్తి కారణంతో కూడినదే అయి ఉండాలి. అలా కాకుండా, విషయం లేకపోవడమంటే, శబ్దము-స్పర్శ-నలుపు-పసుపు-ఎరుపు అనే వేర్వేరు విచిత్రాలతో కూడిన **ద్వయనాశతః** ద్వయత్వం నశించిగా, అభావం అంటే ఏమీ లేకుపోవడమనే స్థితి ఉత్పన్నమౌతుంది. కాని, అనేకత్వం కలిగిన వైచిత్రితో కూడా ద్వైతం అనేది, కంటికి ఎదురుగా కనిపిస్తోండగా, అది లేకపోవడం అనేది లేదు. అందుచేత, అనేకంగా వైచిత్రితో ద్వైతం కనపడుతుండటం చేత, **పరతంత్రమ్** అంటే ఇతరులచే చెప్పబడే సిద్ధాంతాలు, ఆ పరతంత్రాన్ని ఆధారం చేసుకొని ప్రజ్ఞానానికి భిన్నంగా దానికి భాహ్యమైన విషయాలకు **అస్తితా** అస్తిత్వం ఉన్నది అని **మతా** అభిప్రాయపడుతున్నాయి. ప్రకాశమే స్వరూపంగా కలిగిన ప్రజ్ఞప్తిలో, దాని స్వభావానికి భిన్నమైన నలుపు-పసుపు వంటి బాహ్య విషయాలపై ఆధారపడిన వైచిత్ర్యం అనేది ఉండటం సంభవించదు. ఎలాగైతే స్ఫటికంలో నీలం వంటి ఉపాధుల ఆధారం లేకుండా వైవిధ్యం అనేది సంభవించదో అలాగా అని అభిప్రాయం. ఇందువలన కూడా, జ్ఞానానికి భిన్నంగా ఇతర ఉపాధులపై ఆధారపడిన బాహ్య విషయాలకు అస్తిత్వం చెప్పబడుతోంది. **చ** మరియు **సంక్లేశస్య** – **సంక్లేశనమ్** అంటే సంక్లేశం అనగా దుఃఖము లేదా బాధ అని అర్థం. నిప్పు కాలడం వల్ల దుఃఖం లేదా బాధ **ఉపలభ్యేత్** కలుగుతోంది. జ్ఞానానికి భిన్నమైన, బాహ్యంలోని అగ్ని కాలడం అనేది లేకపోయినప్పుడు, కాలడం వల్ల

కలిగే దుఃఖం ఉండదు. కాని దుఃఖం అయితే కలుగుతోంది. అందువలన, విజ్ఞానానికి వేరుగా బాహ్యంలో విషయాలనేవి ఉన్నాయని మేము అంగీకరిస్తున్నాం. ఎందుకంటే, విజ్ఞానంలో దుఃఖమనేది మిళితమై ఉండదు కాబట్టి, వేరుగా ఉంటుందని అభిప్రాయం.

దీనికి ఈ క్రింది శ్లోకంలో ఇలా సమాధానం ఇస్తున్నారు.

**ప్రజ్ఞప్తేః సనిమిత్తత్వమిష్యతే యుక్తిదర్శనాత్ |**
**నిమిత్తస్యానిమిత్తత్వమిష్యతే భూతదర్శనాత్ || || మాం.గౌ.కా. 4-25 ||**

ప్రజ్ఞప్తి కారణాన్ని కోరుతుంది అనేది హేతుబద్ధమైన ఆలోచన. కాని, మూల కారణానికి కారణం లేకపోవడమే అభిలషణీయం అన్నది యదార్థమైన సత్యం.

**<u>శంకరుల భాష్యము</u>**

బాఢమేవం ప్రజ్ఞప్తేః సనిమిత్తత్వం ద్వయసంక్లేశోపలబ్ధియుక్తిదర్శనాదిష్యతే త్వయా . స్థిరీభవ తావత్త్వం యుక్తిదర్శనం వస్తునస్తథాత్వాభ్యుపగమే కారణమిత్యత్ర . బ్రూహి కిం తత ఇతి . ఉచ్యతే — నిమిత్తస్య ప్రజ్ఞప్త్యాలంబనాభిమతస్య తవ ఘటాదేరనిమిత్తత్వమనాలంబనత్వం వైచిత్ర్యాహేతుత్వమిష్యతేఽస్మాభిః . కథం ? భూతదర్శనాత్ పరమార్థదర్శనాదిత్యేతత్ . న హి ఘటో యథాభూతమృద్రూపదర్శనే సతి తద్వ్యతిరేకేణాస్తి, యథా అశ్వాన్మహిషః, పటో వా తంతువ్యతిరేకేణ తంతవశ్చాంశువ్యతిరేకేణ ఇత్యేవముత్తరోత్తరభూతదర్శన ఆ శబ్దప్రత్యయనిరోధాన్నైవ నిమిత్తముపలభామహే ఇత్యర్థః . అథ వా, అభూతదర్శనాద్బాహ్యార్థస్య అనిమిత్తత్వమిష్యతే రజ్జ్వాదావివ సర్పాదేరిత్యర్థః . భ్రాంతిదర్శనవిషయత్వాచ్చ నిమిత్తస్యానిమిత్తత్వం భవేత్ ; తదభావే అభానాత్ . న హి సుషుప్తసమాహితముక్తానాం భ్రాంతిదర్శనాభావే ఆత్మవ్యతిరిక్తో బాహ్యోఽర్థ ఉపలభ్యతే . న హ్యున్మత్తావగతం వస్త్వనున్మత్తైరపి తథాభూతం గమ్యతే . ఏతేన ద్వయదర్శనం సంక్లేశోపలబ్ధిశ్చ ప్రత్యుక్తా ..

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

ఆ విధంగా **ప్రజ్ఞప్తేః సనిమిత్తత్వమ్** జ్ఞానం కారణంతో కూడినదై **ఇష్యతే** ఉండాలి అని మీచే చెప్పబడే దుఃఖం కలగటానికి కారణం కనబడుతోంది అనే ద్వైతభావన నిజమే. అలా అనుభవానికి వస్తువు కారణమౌతోంది అని యుక్తిగా చేసే విచారణకే మీరు స్థిరంగా కట్టుబడి ఉండండి.

**<u>సందేహం</u>** : అయితే ఏమిటి? చెప్పండి.

**<u>సమాధానం</u>** : చెప్తున్నాం. ప్రజ్ఞప్తికి ఆధారంగా (ఘటాదుల రూపంలో) కారణం ఒకటి ఉంటుందనేది మీ వాదన అయితే, ఆ ఘటాదులు అసలు కారణమే కావని, (ప్రజ్ఞప్తి యొక్క) వైవిధ్యానికి అవి ఆలంబనం కానే కావని మేమంటున్నాం.

**<u>సందేహం</u>** : ఎందుకని?

**<u>సమాధానం</u>** : **భూతదర్శనాత్** యదార్థమైన సత్యాన్ని దర్శించడం చేత **నిమిత్తస్య అనిమిత్తత్వమ్ ఇష్యతే** కారణానికి కారణం లేకపోవడాన్నే భావించాలి అని చెప్తున్నాం. ఎందుకంటే, ఘటం అన్నది యదార్థంగా మట్టియే అని తెలిసినప్పుడు, గుఱ్ఱం ఎద్దుకు భిన్నమై ఉన్నట్లుగా, మట్టికి భిన్నమైన ఘటమన్నది ఉండదు కదా! లేదా,

వస్త్రం దాని దారాలకు భిన్నంకానట్లుగా, ఆ దారాలు ప్రత్తికి భిన్నం కానట్లుగా. ఆ విధంగా వాటి ముందటి ముందటి కారణాలను శోధిస్తూ పోతే, అంతిమంగా ఇక ఎటువంటి శబ్ద ప్రత్యయాలతో సూచింపబడలేని యదార్థతత్త్వమైన మూలకారణాన్ని తెలిసి కొన్నాము కాబట్టి (ఘటాదులు అసలు కారణమే కావని అంటున్నాం) అని అభిప్రాయం.

లేదంటే, ఇలాకూడా వ్యాఖ్యానించవచ్చు. 'అభూతదర్శనాత్' అంటే త్రాడు నందు పామును చూసినట్లుగా, ఉనికి లేని బాహ్యమైన విషయం ప్రజ్ఞప్తికి కారణం కాజాలదు. ఎందుకంటే అది భ్రాంతిచే దర్శించబడేదే కాని యదార్థమైన దర్శనం కానందుచేత, **నిమిత్తస్య అనిమిత్తత్వమ్ ఇష్యతే** కారణం అనుకొనబడేది కారణమే కాకుండా పోతుంది. భ్రాంతి తొలగిపోగానే అది ప్రకాశించకుండా పోతుంది. సుషుప్తిలో, ఏకాగ్రచిత్తం కలిగిన జీవన్ముక్తునిలో ఆత్మకు వ్యతిరేకమైన బాహ్య విషయమున్నదనే భ్రాంతి కలగదు కదా! పిచ్చివానికి అనుభవానికి వచ్చే విషయాలు, పిచ్చిలేని వారికి అనుభవానికిరావు కదా! ఈ ప్రకారంగా ద్వైతదర్శనాన్ని మరియు దుఃఖానుభవాన్ని నిరాకరించి చెప్తున్నాం.

**చిత్తం న సంస్పృశత్యర్థం నార్థాభాసం తథైవ చ |**
**అభూతో హి యతశ్చార్థో నార్థాభాసస్తతః పృథక్ || || మాం.గౌ.కా. 4-26 ||**

చైతన్యానికి విషయాలతో సంపర్కం లేదు. అలాగే విషయాభాసతో కూడా (సంపర్కం) లేదు. ఎందుకంటే విషయానికే ఉనికి లేదు మరియు ఆ విషయం ఉన్నట్టుగా అనిపించే ఆభాస చైతన్యానికి అది వేరైనది కాదు కాబట్టి.

**శంకరుల భాష్యము**

యస్మాన్నాస్తి బాహ్యం నిమిత్తం , అతః చిత్తం న స్పృశత్యర్థం బాహ్యాలంబనవిషయం , నాప్యర్థాభాసం , చిత్తత్వాత్ , స్వప్నచిత్తవత్ . అభూతో హి జాగరితేఽపి స్వప్నార్థవదేవ బాహ్యః శబ్దాద్యర్థో యతః ఉక్తహేతుత్వాచ్చ . నాప్యర్థాభాసశ్చిత్తాత్పృథక్ . చిత్తమేవ హి ఘటాద్యర్థవదవభాసతే యథా స్వప్నే ..

నను విపర్యాసస్తర్హి అసతి ఘటాదౌ ఘటాద్యాభాసతా చిత్తస్య ; తథా చ సతి అవిపర్యాసః క్వచిద్వక్తవ్య ఇతి ; అత్రోచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

బాహ్యంలో నిమిత్తమనేది లేకపోవడంచేత, **చిత్తమ్** చైతన్యం **అర్థమ్** బాహ్యంలో ఆధారభూతమైన విషయాన్ని **న స్పృశతి** స్పృశించడం అనేది ఉండదు. **తథా ఏవ** అదేవిధంగా **న చ అర్థాభాసమ్** విషయాభాసంతో కూడా (చైతన్యానికి సంపర్కం అన్నది లేదు). ఎందుకంటే ఆ విషయాభాస, స్వప్నంలోని చైతన్యం లాగ, చైతన్యం తప్పమరేమీ కాదు కాబట్టి. **హి** ఎందుకంటే **యతః** ముందు చెప్పిన కారణంగా, స్వప్నావస్థలో వలెనే, జాగ్రదవస్థలో కూడా **అర్థాః** శబ్దాది విషయాలు (జ్ఞానానికి) బాహ్యమైనవే కాబట్టి అవన్నీ కూడా **అభూతః** ఉనికి లేనివే. **తతః అర్థాభాసః** ఇక విషయాభాస కూడా చైతన్యానికి **న పృథక్** వేరైనది కాదు. ఎందుకంటే, స్వప్నంలో లాగానే, ఘటాది విషయాలుగా ప్రకాశించేది చైతన్యమే కాబట్టి.

{ఇక్కడ బౌద్ధుల సిద్ధాంతాన్ని చర్చిస్తున్నాం. ఆనందగిరి 'చిత్తం అంటే స్ఫురణ, ఆత్మ ప్రకాశనం, వెలుగు' అని వివరించారు. తెలియుట అంటే తెలియబడే వస్తువు యొక్క విషయాన్ని గ్రహించడం. కాని, చైతన్యం అంటే సూర్యుని వలె ప్రకాశమానమయ్యేది. దానికి వస్తువు అవసరం లేదు. మరింకా సూర్యుడిని మరియు ఆ సూర్యుని ప్రకాశాన్ని భిన్నమైనవిగా సాధారణ వ్యవహారాలలో గుర్తిస్తున్నప్పటికీ, యదార్థానికి అవి రెండూ ఒక్కటే. – స్వామి గంభీరానంద}.

<u>**సందేహం**</u> : అలా అయితే, ఘటాదులకు ఉనికియే లేనప్పుడు, ఆ ఉనికి లేని ఘటాదుల రూపంలో చైతన్యం భాసిస్తుంది అనడం విపరీతంగా లేదా! అది అలా ఉంచితే, ఎక్కడో ఒకచోట ఈ వైపరీత్యానికి ముగింపు పలకాల్సిన అవసరం ఉన్నది కదా!

దీనికి ఆచార్యులు తర్వాత శ్లోకంలో ఇలా బదులిస్తున్నారు.

**నిమిత్తం న సదా చిత్తం సంస్పృశత్యధ్వసు త్రిషు |**
**అనిమిత్తో విపర్యాసః కథం తస్య భవిష్యతి || || మాం.గౌ.కా. 4-27 ||**

మూడు కాలాలలో ఎల్లప్పుడూ చైతన్యానికి నిమిత్తంతో సంపర్కం అనేది లేదు. నిమిత్తమనేదే లేనప్పుడు ఇక దానికి వైపరీత్యమనేది ఎలా కలుగుతుంది?

### <u>శంకరుల భాష్యము</u>

నిమిత్తం విషయం అతీతానాగతవర్తమానాధ్వసు త్రిష్వపి సదా చిత్తం న సంస్పృశేదేవ హి . యది హి క్వచిత్సంస్పృశేత్ , సః అవిపర్యాసః పరమార్థ ఇత్యతస్తదపేక్షయా అసతి ఘటే ఘటాభాసతా విపర్యాసః స్యాత్ ; న తు తదస్తి కదాచిదపి చిత్తస్యార్థసంస్పర్శనం . తస్మాత్ అనిమిత్తః విపర్యాసః కథం తస్య చిత్తస్య భవిష్యతి ? న కథంచిద్విపర్యాసోఽస్తీత్యభిప్రాయః . అయమేవ హి స్వభావశ్చిత్తస్య, యదుత అసతి నిమిత్తే ఘటాదౌ తద్వదవభాసనం ..

'ప్రజ్ఞప్తేః సనిమిత్తత్వం' (మా. కా. 4 . 25) ఇత్యాది ఏతదంతం విజ్ఞానవాదినో బౌద్ధస్య వచనం బాహ్యార్థవాదిపక్షప్రతిషేధపరం ఆచార్యేణానుమోదితం . తదేవ హేతుం కృత్వా తత్పక్షప్రతిషేధాయ తదిదముచ్యతే — తస్మాదిత్యాది .

### <u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>

**అధ్వసు త్రిషు** భూత-భవిష్యత్తు-వర్తమాన కాలాలనే మూడు అవస్థలలోనూ **సదా చిత్తమ్** చైతన్యం ఎల్లప్పుడూ **నిమిత్తమ్** విషయానితో **న సంస్పృశతి** సంపర్కాన్ని నిశ్చయంగా పొందనే పొందదు. ఒకవేళ ఎప్పుడైనా విషయంతో చైతన్యం సంపర్కాన్ని పొందితే, అది యదార్థమైన సత్యమే అవుతుంది కాని వైపరీత్యమైతే కాదు. అందుచేత, అటువంటి స్థితితో పోల్చిచూస్తే, ఘటం లేకున్నా ఘటాభాస కలగడం వైపరీత్యం అవుతుంది. కాని, ఎన్నడు కూడా చైతన్యానికి విషయంతో సంపర్కమైతే లేనే లేదు. అందువలన **అనిమిత్తః విపర్యాసః** నిమిత్తం లేకపోవడమనే వైపరీత్యం **తస్య** ఆ చైతన్యానికి **కథమ్ భవిష్యతి** ఎలా కలుగుతుంది? అంటే ఏవిధంగానూ వైపరీత్యం అనేది లేదు అని అభిప్రాయం. ఘటాదుల యొక్క ఉనికి లేనప్పటికీ అవి ఉన్నట్లుగా అనిపించే ఆభాస ఏదైతే ఉన్నదో, అది చైతన్యం యొక్క స్వభావమేనని నిశ్చయమౌతోంది.

{భ్రాంతి విషయంలో 'అన్యథాఖ్యాతి' అంటే యదార్థమైన వస్తువును తప్పుగా గ్రహించడం. దీనిని విశ్వసించే వారు, భ్రాంతి ఉన్నది అని అంటే దాని యదార్థత వేరొకటి ఉండి ఉండాలి అని అంటారు. కాని, బౌద్ధులలోని విజ్ఞానవాదులు ఏమంటారంటే, భ్రాంతి మరియు ఆ భ్రాంతిలోని విషయాలన్నీ కూడా చైతన్య రూపాలే కాబట్టి, దోషం అనేది ఉన్నంత మాత్రం చేత, దానికి ముందు సత్యమైన జ్ఞానం ఉండితీరాలనేమీ లేదు అంటారు – స్వామి గంభీరానంద}.

'ప్రజ్ఞప్తేః సనిమిత్తత్వం' (మా.గౌ.కా. 4-25) అనే శ్లోకంతో మొదలుకొని ఇప్పటి ఈ శ్లోకం వరకూ చెప్పినవన్నీ బౌద్ధులలోని విజ్ఞానవాదుల వచనాలు. వీటిలో బాహ్యవిషయాలను సమర్థించే వాదనలను తిరస్కరించినంత మేరకు చేసిన వాదనలను గౌడపాదాచార్యుల వారు ఆమోదించారు. ఈ ఆమోదించిన వాదనలను ఆధారం చేసుకొనే, ఆ బౌద్ధ విజ్ఞానవాదుల సిద్ధాంతాన్ని త్రోసిపుచ్చేందుకు 'తస్మాత్ ..' అంటూ మొదలయ్యే తర్వాత శ్లోకాలను చెప్తున్నారు.

**తస్మాన్న జాయతే చిత్తం చిత్తదృశ్యం న జాయతే |**
**తస్య పశ్యన్తి యే జాతిం ఖే వై పశ్యన్తి తే పదం || || మాం.గౌ.కా. 4-28 ||**

అందువలన, చైతన్యం పుట్టేది కాదు. చైతన్యదృశ్యాలు జనించడం లేదు. ఎవరైతే వాటిని చూస్తున్నారో వారు ఆకాశంలో పక్షుల పదచ్ఛాయలను చూస్తున్నవారే.

**<u>శంకరుల భాష్యము</u>**

యస్మాదసత్యేవ ఘటాదౌ ఘటాద్యాభాసతా చిత్తస్య విజ్ఞానవాదినా అభ్యుపగతా, తదనుమోదితమస్మాభిరపి భూతదర్శనాత్ ; తస్మాత్తస్యాపి చిత్తస్య జాయమానావభాసతా అసత్యేవ జన్మని యుక్తా భవితుమితి అతో న జాయతే చిత్తం . యథా చిత్తదృశ్యం న జాయతే అతస్తస్య చిత్తస్య యే జాతిం పశ్యంతి విజ్ఞానవాదినః క్షణికత్వదుఃఖిత్వశూన్యత్వానాత్మత్వాది చ ; తేనైవ చిత్తేన చిత్తస్వరూపం ద్రష్టుమశక్యం పశ్యంతః ఖే వై పశ్యంతి తే పదం పక్ష్యాదీనాం . అత ఇతరేభ్యోఽపి ద్వైతిభ్యోఽత్యంతసాహసికా ఇత్యర్థః . యేఽపి శూన్యవాదినః పశ్యంత ఏవ సర్వశూన్యతాం స్వదర్శనస్యాపి శూన్యతాం ప్రతిజానతే, తే తతోఽపి సాహసికతరాః ఖం ముష్టినాపి జిఘృక్షంతి ..

ఉక్తైర్హేతుభిరజమేకం బ్రహ్మేతి సిద్ధం , యత్పునరాదౌ ప్రతిజ్ఞాతం , తత్ఫలోపసంహారార్థోఽయం శ్లోకః —

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

ఘటాదులు లేకున్ననూ చిత్తమే ఘటంగా ఆభాసిస్తోందని ఏదైతే బౌద్ధవిజ్ఞానవాదులు విశ్వసిస్తారో, దానిని యదార్థాన్ని దర్శించేవారమైన మేము కూడా ఆమోదిస్తాం. అందువలన, పుడుతోంది అనిపించే అవభాస అసత్తే అయినప్పటికీ దానితో కూడిన చిత్తం పుట్టుకలేనిదే అయినా పుడుతోంది అనిపించడం సమంజసమే అవుతోంది. **తస్మాత్** అందువలన, ఎలాగైతే **చిత్తదృశ్యమ్** చిత్తం చేత చూడబడేది **న జాయతే** పుట్టడం లేదో, అలాగే **చిత్తమ్** చిత్తం కూడా **న జాయతే** పుట్టడం లేదు. అటువంటి చిత్తం క్షణికమని, దుఃఖమనీ, శూన్యమనీ, అనాత్మయని భావిస్తూ కూడా **తస్య పశ్యంతి యే జాతిమ్** చిత్తం యొక్క ఏ పుట్టుకనైతే బౌద్ధవిజ్ఞానవాదులు దర్శిస్తున్నారో వారు, **తే ఖే పదమ్ పశ్యంతి** ఆకాశంలో పక్షుల పదచ్ఛాయలను చూస్తున్న వారే. అలా చిత్తంతో

చిత్తస్వరూపాన్ని దర్శించడమనేది సాధ్యంకాదు. అందుచేత, వారు ఇతర ద్వైతులకన్నా కూడా మించిన దుస్సాహసం చేసేవారే అవుతున్నారు అని అభిప్రాయం. వారిలో (ఈ బౌద్ధవిజ్ఞానవాదులలో) తమ సిద్ధాంతాలతో పాటు సమస్తమూ శూన్యమే అని దర్శించే శూన్యవాదులైతే, ఆకాశాన్ని తమ పిడికిటిలో బిగించాలనుకొనేటంత అత్యంత దుస్సాహసం చేస్తున్నవారే.

{సర్వత్రా శూన్యమే అనేది అనుభవం ద్వారా మాత్రమే నిరూపితమౌతుంది. కాని, ఆ అనుభవం ఎలా నశిస్తుంది? అనుభవం అనేది తనంత తానుగా నశించదు. ఎందుకంటే, అనుభవం మరియు అనుభవం లేకపోవడం ఒకేసారి జరిగేవి కావు. సంపూర్ణ శూన్యత్వం అని అనేటట్లైతే, అపుడు 'సర్వమూ శూన్యమే' అనే మీ అనుభవం కూడా లేకుండా పోవాలి కదా! – స్వామి గంభీరానంద}.

ఇలా హేతుబద్ధంగా బ్రహ్మమునకు పుట్టుకనేది లేదు, అది ఒక్కటే, అని నిర్ధారించి చెప్పడం పూర్తి అయింది. అయితే, చర్చకు ప్రారంభంలో ప్రతిపాదించిన విషయాన్ని ఫలవంతంగా ముగించేందుకు ఈ క్రింది శ్లోకాన్ని ఆచార్యులు చెప్తున్నారు.

**అజాతం జాయతే యస్మాదజాతిః ప్రకృతిస్తతః |**
**ప్రకృతేరన్యథాభావో న కథఞ్చిద్భవిష్యతి || || మాం.గౌ.కా. 4-29 ||**

పుట్టుకలేనిదే పుడుతోంది కాబట్టి, పుట్టుకలేక పోవడమే దాని స్వభావం. కనుక, స్వభావానికి వేరుగా పరిణామం అనేది ఏవిధంగానూ కలుగదు.

**శంకరుల భాష్యము**

అజాతం యచ్చిత్తం బ్రహ్మైవ జాయత ఇతి వాదిభిః పరికల్ప్యతే, తత్ అజాతం జాయతే యస్మాత్ అజాతిః ప్రకృతిః తస్య ; తతః తస్మాత్ అజాతరూపాయాః ప్రకృతేరన్యథాభావో జన్మ న కథంచిద్భవిష్యతి ..

అయం చాపర ఆత్మనః సంసారమోక్షయోః పరమార్థసద్భావవాదినాం దోష ఉచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**అజాతమ్** పుట్టుకలేని చిత్తమేదైతే కలదో అది బ్రహ్మమే, అదే పుడుతోంది అని కల్పించుకొని వాదిస్తున్నారు కాబట్టే, ఆ పుట్టుకలేనిది పుడుతోంది. **యస్మాత్** దేనికి **అజాతిః** పుట్టుకలేకపోవడం **ప్రకృతిః** స్వభావమో **తతః** ఆకారణంగా, **ప్రకృతేః అన్యథాభావః** ఆ పుట్టుక లేకపోవడమనే స్వభావానికి విరుద్ధంగా, దానినుండి పుట్టుకనేది **న కథం చిత్ భవిష్యతి** ఏవిధంగానూ కలగదు.

ఇక్కడ, ఆత్మకు సంసార మోక్షములు రెండూ యదార్థంగా ఉన్నవని చేసే వాదనలో (ఇంతకు ముందు వైతథ్యప్రకరణంలో సూచించబడిన దోషాలకు అదనంగా) మరో దోషాన్ని, ఈ క్రింది శ్లోకంలో, ప్రస్తావిస్తున్నారు.

**అనాదేరన్తవత్త్వం చ సంసారస్య న సేత్స్యతి |**

**అనన్తతా చాదిమతో మోక్షస్య న భవిష్యతి ||** **|| మాం.గౌ.కా. 4-30 ||**

ఆది (లేదా పుట్టుక లేని) సంసారానికి ముగింపు ఉండే అవకాశం లేదు. ప్రారంభం కలిగిన మోక్షానికి అనంతత్వం (ముగింపు లేకపోవడం) సంభవించదు.

**<u>శంకరుల భాష్యము</u>**

అనాదేః అతీతకోటిరహితస్య సంసారస్య అంతవత్త్వం సమాప్తిః న సేత్స్యతి యుక్తితః సిద్ధిం నోపయాస్యతి . న హ్యనాదిః సన్ అంతవాన్కశ్చిత్పదార్థో దృష్టో లోకే . బీజాంకురసంబంధనైరంతర్యవిచ్ఛేదో దృష్ట ఇతి చేత్ ; న, ఏకవస్త్వభావేనాపోదితత్వాత్ . తథా అనంతతాపి విజ్ఞానప్రాప్తికాలప్రభవస్య మోక్షస్య ఆదిమతో న భవిష్యతి, ఘటాదిష్వదర్శనాత్ . ఘటాదివినాశవదవస్తుత్వాదదోష ఇతి చేత్ , తథా చ మోక్షస్య పరమార్థసద్భావప్రతిజ్ఞాహానిః ;
అసత్త్వాదేవ శశవిషాణస్యేవ ఆదిమత్త్వాభావశ్చ ..

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

**అనాదేః** ప్రారంభమనే హద్దు లేనట్టి **సంసారస్య** ప్రపంచానికి **అంతవత్త్వం** ముగింపు **న సేత్స్యతి** ఉండటం అన్నది హేతువు రీత్యా సాధ్యపడదు. లోకంలో ప్రారంభం లేనిది అంతం కావడం కనిపించదు.

**<u>సందేహం</u>** : బీజానికి అంకురానికి మధ్యగల నిరంతర సంబంధానికి (ప్రారంభం అన్నది లేనప్పటికీ) విచ్ఛిన్నం కావడం చూస్తున్నాం కదా!

**<u>సమాధానం</u>** : కాదు. ఎందుకంటే, బీజాంకురాలసమూహమనేది ఒక వస్తువు కాదని (మా.గౌ.కా. 4-20 నందు) నిరూపించి చెప్పిఉన్నాము కాబట్టి.

అలాగే, జ్ఞానం కలిగిన కాలంలో పుట్టడం వలన **ఆదిమతః** ప్రారంభం కలిగిన **మోక్షస్య** మోక్షానికి **అనంతతా చ** అనంతత్త్వం కూడా **న భవిష్యతి** సిద్ధించదు. ఎందుకంటే, ప్రారంభం కలిగిన ఘటాదులలో ముగింపు అనేది కనబడుతోంది కాబట్టి.

**<u>సందేహం</u>** : ఘటాదుల నాశనం వల్ల కలిగే అభావం అనేది (అంటే అవి లేకపోవడమనే స్థితి) వస్తువు కాదు కదా! (అలాగే మోక్షం కూడా వస్తువు కాదు కాబట్టి దానికి ప్రారంభం ఉన్నాకూడా నాశనం అనేది లేకపోవచ్చు కదా!)

**<u>సమాధానం</u>** : అలాంటప్పుడు కూడా (మోక్షమన్నది లేదనే ఊహ కూడా), మోక్షమన్నది యదార్థ సత్యమేననే ప్రాథమికంగా చేసిన ప్రతిపాదనకు హాని కలిగిస్తుంది. కుందేటి కొమ్ము యదార్థంగా ఉన్నది కానందు వల్ల దానికి ప్రారంభం అనేది ఉండనట్లుగానే, మోక్షానికి కూడా ప్రారంభం అన్నది లేదు.

**ఆదావంతే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా |**

**వితథైః సదృశాః సంతోఽవితథా ఇవ లక్షితాః ||** **|| మాం.గౌ.కా. 4-31 ||**

ఆది అంతాలలో ఏది లేదో అలాగే అది వర్తమానంలో కూడా ఉండదు. అసత్ పదార్థంతో పోలిక కలిగియుండటంచేత, యదార్థములా అన్నట్లు కనిపిస్తున్నాయి.

**సప్రయోజనతా తేషాం స్వప్నే విప్రతిపద్యతే |**

**తస్మాదాద్యన్తవత్త్వేన మిథ్యైవ ఖలు తే స్మృతాః || || మాం.గౌ.కా. 4-32 ||**

వాటి ప్రయోజనత్వం స్వప్నంలో తిరగబడిపోతోంది. అందువల్ల, 'ఆది-అంతాలు కలవన్నీ భ్రాంతియే సుమా!' అని మహాత్ములు జ్ఞాపకం చేస్తున్నారు.

**శంకరుల భాష్యము**

వైతథ్యే కృతవ్యాఖ్యానౌ శ్లోకావిహ సంసారమోక్షాభావప్రసంగేన పఠితౌ ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

పై రెండు శ్లోకాలకు వైతథ్య ప్రకరణ వ్యాఖ్యానంలో, సంసార-మోక్షాల అభావాన్ని చర్చించే సందర్భంగా (మాం.గౌ.కా. 2-6; 2-7 శ్లోకాల క్రింద), చదువుకొన్నాము.

**సర్వే ధర్మా మృషా స్వప్నే కాయస్యాన్తర్నిదర్శనాత్ |**

**సంవృతేఽస్మిన్ప్రదేశే వై భూతానాం దర్శనం కుతః || || మాం.గౌ.కా. 4-33 ||**

స్వప్నంలో ధర్మాలన్నీ కూడా, దేహం లోపలివే కాబట్టి, మిథ్యయే. పరిమితమైన ఈ కొద్ది ప్రదేశంలో (అంటే ఈ దేహంలో) సకల భూతజాలాన్ని దర్శించడం ఎలా సాధ్యపడుతుంది?

**శంకరుల భాష్యము**

'నిమిత్తస్యానిమిత్తత్వమిష్యతే భూతదర్శనాత్' (మా. కా. 4 . 25) ఇత్యయమర్థః ప్రపంచ్యతే ఏతైః శ్లోకైః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

'యదార్థమైన సత్యాన్ని దర్శించడం చేత కారణానికి కారణం లేకుండాపోతుంది' 'నిమిత్తస్యానిమిత్తత్వమిష్యతే భూతదర్శనాత్' (మా.గౌ.కా. 4-25) అని ఇంతకు ముందు ప్రస్తావన చేసిన విషయాన్నే ఈ క్రింది 33 నుండి 37 శ్లోకాలలో ఇలా వివరిస్తున్నారు.

{ఈ విధంగా, ఈ శ్లోకం సకల ప్రపంచం యొక్క అసత్యత్వాన్నే నిరూపిస్తోంది. స్వప్నంలోని విషయాలు దేహంలోనివే అనే నిజం నుండి, స్వప్నం యొక్క మిథ్యాత్వం తెలుస్తున్నట్లైతే, ఇక విరాట్ దేహంలోపలి జాగ్రత్తుకు చెందిన విషయాలన్నీ కూడా మిథ్యయే అవుతాయి. ఇరుకైన ప్రదేశంలో ఇమడలేకపోవడం అనే కారణంగా స్వప్న విషయాలకు మిథ్యాత్వం చెప్పబడితే, జాగ్రత్తుకు చెందిన విషయాలకు కూడా మిథ్యాత్వం చెప్పాల్సి ఉంటుంది. ఎందుకంటే, సహజంగా దేశ-కాలాలతో కూడిన జాగ్రత్తుకు సంబంధించిన విషయాలు, దేశము-కాలము లేని బ్రహ్మమందు కనిపిస్తున్నాయి కాబట్టి. – ఆనందగిరి టీక}.

**న యుక్తం దర్శనం గత్వా కాలస్యానియమాద్గతౌ |**

**ప్రతిబుద్ధశ్చ వై సర్వస్తస్మిన్దేశే న విద్యతే || || మాం.గౌ.కా. 4-34 ||**

స్వప్న దృశ్యాలను వెళ్ళి చూస్తున్నాం అని అనడం యుక్తం కాదు. ఎందుకంటే, వెళ్లడానికి సమయం పట్టడం లేదు కాబట్టి. మేల్కొన్న వారెవ్వరూ స్వప్నప్రదేశంలోనే ఉండిపోవడం లేదు.

**శంకరుల భాష్యము**

జాగరితే గత్యాగమనకాలౌ నియతౌ, దేశః ప్రమాణతో యః, తస్య అనియమాత్ నియమస్యాభావాత్ స్వప్నే న దేశాంతరగమనమిత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

జాగ్రదవస్థలో వెళ్ళిరావడానికి సమయం పట్టడం, ఒక చోట నుండి మరొక చోటుకు మధ్య దూరం అనే దేశ, కాల కొలమానాలు ఏవైతే ఉన్నాయో, అలాంటి కొలమానాలు లేదా పరిమితులు స్వప్నంలో లేనందుచేత, స్వప్నంలో ఒక ప్రదేశం నుండి మరో ప్రదేశానికి వెళ్ళడం అనేది లేదు అని అభిప్రాయం.

**మిత్రాద్యైః సహ సంమన్త్ర్య సమ్బుద్ధో న ప్రపద్యతే |**

**గృహీతం చాపి యత్కిఞ్చిత్ప్రతిబుద్ధో న పశ్యతి || || మాం.గౌ.కా. 4-35 ||**

(స్వప్నంలో) మిత్రాదులతో కూడి చేసిన మంతనాలు మేల్కొన్న మీదట నిలబడటం లేదు. (స్వప్నంలో) స్వీకరించబడినది ఏదీ కూడా మేల్కొన్న మీదట కనబడటం లేదు.

**శంకరుల భాష్యము**

మిత్రాద్యైః సహ సంమంత్ర్య తదేవ మంత్రణం ప్రతిబుద్ధో న ప్రపద్యతే, గృహీతం చ యత్కించిద్ధిరణ్యాది న ప్రాప్నోతి ; తతశ్చ న దేశాంతరం గచ్ఛతి స్వప్నే ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**మిత్రాద్యైః సహ సంమంత్ర్య** మిత్రులు, బంధువులతో జరిపిన సంభాషణలు **సంబుద్ధో** మేల్కొన్న తరువాత **న ప్రపద్యతే** ఆమోదించబడటం లేదు. **గృహీతం చ యత్కించిత్** (స్వప్నంలో) తనచే స్వీకరించబడిన బంగారం మొదలైనవి మేల్కొన్న తరువాత **న ప్రాప్నోతి** తనవి కావడం లేదు. ఈ కారణం గానే, స్వప్నంలో వేరొక ప్రదేశానికి వెళ్ళడం కూడా లేదు.

{మరొక విధమైన అర్థం ఏమంటే, జ్ఞానికి బ్రహ్మము తప్ప మరొక చేతనత్వం ఏదీ ఉండదు. కాబట్టి, ఇతరులు భావించే అతని తినుట, త్రాగుట వంటి కర్మలు, అతనికి ఆ విధంగా భావనకు రావు. ఎందుకంటే 'నేను

ఏమియూ చేయడం లేదు' ['నైవ కించిత్ కరోమి' (భ.గీ. 5-8)] అని భగవద్గీతలో చెప్పిన భావనలోనే ఉంటాడు. – ఆనందగిరి టీక}.

**స్వప్నే చావస్తుకః కాయః పృథగన్యస్య దర్శనాత్ |**
**యథా కాయస్తథా సర్వం చిత్తదృశ్యమవస్తుకం || || మాం.గౌ.కా. 4-36 ||**

స్వప్నంలో అనుభవానికి వచ్చే దేహం యదార్థంకాదు. ఎందుకంటే, దానికి వేరుగా మరోదేహం కనిపిస్తూ ఉంది కాబట్టి. దేహం లాగానే చైతన్యానికి గోచరించే సర్వమూ యదార్థం కాదు.

**<u>శంకరుల భాష్యము</u>**

స్వప్నే చ అటంద్దృశ్యతే యః కాయః, సః అవస్తుకః తతోఽన్యస్య స్వాపదేశస్థస్య పృథక్కాయాంతరస్య దర్శనాత్ . యథా స్వప్నదృశ్యః కాయః అసన్ , తథా సర్వం చిత్తదృశ్యం అవస్తుకం జాగరితేఽపి చిత్తదృశ్యత్వాదిత్యర్థః . స్వప్నసమత్వాదసజ్జాగరితమపీతి ప్రకరణార్థః ..

ఇతశ్చ అసత్త్వం జాగ్రద్వస్తునః

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

**కాయః** ఏ దేహమైతే **స్వప్నే చ** స్వప్నంలో కూడా అనుభవానికి వస్తున్నదో అది **అవస్తుకః** యదార్థం కాదు. ఎందుకంటే, ఆ స్వప్నదేహానికి **పృథక్** వేరుగా మంచంమీద **అన్యస్య** మరోదేహం **దర్శనాత్** కనబడుతోంది కాబట్టి. **యథా** ఎలాగైతే స్వప్నంలో అనుభవానికి వచ్చిన **కాయః** దేహం యదార్థంగా లేదో, **తథా** అలాగే **సర్వమ్ చిత్తదృశ్యమ్** చైతన్యంచే దర్శించబడే సర్వమూ అంటే, జాగ్రత్తులో చైతన్యానికి అనుభవానికి వచ్చే విషయాలన్నీ కూడా **అవస్తుకమ్** యదార్థమైనవి కావు అని అభిప్రాయం. స్వప్నంతో సమానంగానే జాగ్రత్తు కూడా అసత్యమేనని ఈ ప్రకరణానికి తాత్పర్యము.

జాగ్రత్తులోని విషయాల అసత్యానికి ఇంకొక కారణం కూడా ఉన్నదని తర్వాత శ్లోకంలో చెప్తున్నారు.

**గ్రహణాజ్జాగరితవత్తద్ధేతుః స్వప్న ఇష్యతే |**
**తద్ధేతుత్వాత్తు తస్యైవ సజ్జాగరితమిష్యతే || || మాం.గౌ.కా. 4-37 ||**

జాగ్రత్తులో వలెనే స్వప్నంలో కూడా గ్రహించడం అనేది ఉన్నందున, జాగ్రత్తు దానికి (ఆ స్వప్నానికి) కారణమై ఉండాలి. ఆ కారణం చేతనే, స్వప్నాన్ని చూసేవానికి జాగ్రత్తు సత్యంగా కనబడుతోంది.

### శంకరుల భాష్యము

జాగరితవత్ జాగరితస్యేవ గ్రహణాత్ గ్రాహ్యగ్రాహకరూపేణ స్వప్నస్య, తజ్జాగరితం హేతుః అస్య స్వప్నస్య స స్వప్నః తద్ధేతుః జాగరితకార్యం ఇష్యతే . తద్ధేతుత్వాత్ జాగరితకార్యత్వాత్ తస్యైవ స్వప్నదృశ ఏవ సజ్జాగరితం , న త్వన్యేషాం ; యథా స్వప్న ఇత్యభిప్రాయః . యథా స్వప్నః స్వప్నదృశ ఏవ సన్ సాధారణవిద్యమానవస్తువదవభాసతే, తథా తత్కారణత్వాత్సాధారణవిద్యమానవస్తువదవభాసనం , న తు సాధారణం విద్యమానవస్తు స్వప్నవదేవేత్యభిప్రాయః ..

నను స్వప్నకారణత్వేఽపి జాగరితవస్తునో న స్వప్నవదవస్తుత్వం . అత్యంతచలో హి స్వప్నః జాగరితం తు స్థిరం లక్ష్యతే . సత్యమేవమవివేకినాం స్యాత్ . వివేకినాం తు న కస్యచిద్వస్తున ఉత్పాదః ప్రసిద్ధః . అతః

### శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**జాగరితవత్** జాగ్రత్తులో వలెనే **స్వప్నః** స్వప్నం కూడా **గ్రహణాత్** గ్రహించేది-గ్రహించబడేది అనే రూపం కలిగినదైనందువలన, **తత్ హేతుః** అటువంటి స్వప్నానికి ఆ జాగ్రత్తుయే కారణం **ఇష్యతే** అయి ఉండాలి. అంటే, జాగ్రత్తు యొక్క కార్యం స్వప్నం అయి ఉండాలి. **తత్ హేతుత్వాత్** ఆ కారణంగా, అంటే స్వప్నం జాగ్రత్తు యొక్క కార్యమైనందుచేత **తస్యైవ** ఆ స్వప్నాన్ని చూసిన వానికి మాత్రమే **సత్ జాగరితమ్ ఇష్యతే** జాగ్రత్తు సత్యం అవుతుంది కాని, ఇతరులకు కాదు. స్వప్నంలో వలెనే (జాగ్రత్తులో కూడా) అని అభిప్రాయం. (అంటే, ఎలాగైతే స్వప్నాన్ని చూస్తున్నంత వరకూ అది సత్యమనే గోచరిస్తోందో అలా జాగ్రత్తును చూస్తున్నంత వరకూ అది సత్యమనే గోచరిస్తుంది). ఎలాగైతే స్వప్నం ఆ స్వప్నాన్ని చూస్తున్న వానికి, అందరికీ సాధారణంగా తెలియబడే వస్తువు మాదిరిగానే గోచరిస్తోందో, అదే విధంగా ఆకారణంగానే జాగ్రత్తు కూడా (ఆ జాగ్రత్తును అనుభవిస్తున్న వానికి ఆ జాగ్రత్తులోని విషయాలు) అందరికీ సాధారణంగా తెలియబడే వస్తువుల మాదిరిగానే ప్రకాశిస్తున్నట్లు అనిపిస్తునా . అయితే, స్వప్నంలో లాగానే (స్వప్నం చూస్తున్నంత వరకు మాత్రమే ఆ స్వప్నదృష్టకు అవి తనతో పాటు అందరికీ అలాగే గోచరిస్తున్నాయనే భావన కలిగి, మేల్కొనిన పిదప వాటి మిథ్యాత్వం బోధపడినట్లుగా) జాగ్రత్తులో కూడా (జ్ఞానం కలుగనంత వరకు మాత్రమే వస్తుప్రపంచం అందరికీ సాధారణంగా అలాగే గోచరిస్తుందని అనిపిస్తుందే కాని) యదార్థానికి ఆ అనుభవం సాధారణమైనది కాదు, అంటే అందరికీ అదే అనుభవం కలగడం లేదు లేదా జాగ్రత్తులోని వస్తు ప్రపంచానికి కూడా ఉనికి అనేది లేదు అని అభిప్రాయం.

**<u>సందేహం</u>** : జాగ్రత్తులోని వస్తువిషయాలు, స్వప్నానికి కారణమైనప్పటికీ, అవి స్వప్న విషయాలవలె మిథ్య కాబోవు. ఎందుకంటే, స్వప్నం అనేది కదిలిపోయేది, జాగ్రత్తు స్థిరమైన లక్షణం కలది.

**<u>సమాధానం</u>** : అవివేకులకు ఇది నిజమే అనిపించవచ్చు. కాని, వివేకం కలవారైతే, ఏ వస్తువైనా ఉత్పన్నమౌతుంది అని అనుకోరు. అందువలన,

**ఉత్పాదస్యాప్రసిద్ధత్వాదజం సర్వముదాహృతమ్ |**
**న చ భూతాదభూతస్య సంభవోఽస్తి కథంచన || || మాం.గౌ.కా. 4-38 ||**

ఉత్పత్తి నిర్ధారణ కానందున, సకల వస్తు ప్రపంచమూ పుట్టుకలేనిదనే చెప్పబడింది. ఉన్నదానినుండి లేనిదాని పుట్టుక ఏవిధంగానూ సంభవం కాదు.

**శంకరుల భాష్యము**

అప్రసిద్ధత్వాత్ ఉత్పాదస్య ఆత్మైవ సర్వమితి అజం సర్వం ఉదాహృతం వేదాంతేషు 'సబాహ్యాభ్యంతరో హ్యజః' (ము. ఉ. 2 . 1 . 2) ఇతి . యదపి మన్యసే జాగరితాత్సతః అసన్స్వప్నో జాయత ఇతి, తదసత్ . న భూతాత్ విద్యమానాత్ అభూతస్య అసతః సంభవోఽస్తి లోకే . న హ్యసతః శశవిషాణాదేః సంభవో దృష్టః కథంచిదపి ..

నను ఉక్తం త్వయైవ స్వప్నో జాగరితకార్యమితి ; తత్కథముత్పాదోఽప్రసిద్ధ ఇతి ఉచ్యతే ? శృణు తత్ర యథా కార్యకారణభావోఽస్మాభిరభిప్రేత ఇతి .

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

సర్వమూ ఆత్మయే అని **అజమ్** పుట్టుక లేనిదని **ఉదాహృతమ్** ఉపనిషత్తులలో 'బయట లోపల నిండి పుట్టుక లేనిది' ['సబాహ్యాభ్యంతరో హ్యజః' (ము.ఉ. 2-1-2)] అని ప్రకటించారు. అయినా కూడా, సత్యమైన జాగ్రత్తునుండి అసత్యమైన స్వప్నం పుడుతోంది అని మీరు భావించేటట్లైతే, ఆ భావన అసత్యమే అవుతుంది. **భూతాత్** తెలియబడేదాని నుండి లేదా ఉనికి కలిగిన దానినుండి **అభూతస్య** తెలియబడనిది లేదా ఉనికి లేనిది **న సంభవః అస్తి** సంభవించడమనేది లోకంలో ఉండదు. కుందేటి కొమ్ము వంటి అసత్యం ఏవిధంగా కూడా సంభవించడమనేది కుదరనే కుదరదు.

**సందేహం** : స్వప్నం జాగ్రత్తు యొక్క కార్యమేనని మీరే చెప్పారు కదా! మరి, ఉత్పన్నం కావడమనేది నిర్ధారణ కాలేదని ఎలా అంటున్నారు?

**సమాధానం** : అక్కడ స్వప్న-జాగ్రత్తులకు కార్యకారణభావమంటే మా అభిప్రాయం ఏమిటో చెప్తున్నాం వినండి.

**అసజ్జాగరితే దృష్ట్వా స్వప్నే పశ్యతి తన్మయః |**
**అసత్స్వప్నేఽపి దృష్ట్వా చ ప్రతిబుద్ధో న పశ్యతి || || మాం.గౌ.కా. 4-39 ||**

జాగ్రత్తులో అసత్యమైన విషయాలను చూచి వాటియందు మోహంతో స్వప్నంలో కూడా చూస్తున్నాడు. స్వప్నంలో అసత్యమైన విషయాలను చూసినా కూడా, మేల్కొన్న తర్వాత చూడడం లేదు.

**శంకరుల భాష్యము**

అసత్ అవిద్యమానం రజ్జుసర్పవద్వికల్పితం వస్తు జాగరితే దృష్ట్వా తద్భావభావితస్తన్మయః స్వప్నేఽపి జాగరితవత్ గ్రాహ్యగ్రాహకరూపేణ వికల్పయన్పశ్యతి, తథా అసత్స్వప్నేఽపి దృష్ట్వా చ ప్రతిబుద్ధో న పశ్యతి అవికల్పయన్ , చ - శబ్దాత్ . తథా జాగరితేఽపి దృష్ట్వా స్వప్నే న పశ్యతి కదాచిదిత్యర్థః . తస్మాజ్జాగరితం స్వప్నహేతురిత్యుచ్యతే, న తు పరమార్థసదితి కృత్వా ..

పరమార్థతస్తు న కస్యచిత్కేనచిదపి ప్రకారేణ కార్యకారణభావ ఉపపద్యతే . కథం ?

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**అసత్** లేనిది అంటే త్రాడునందలి పాములాగా కల్పితమైన విషయాన్ని **జాగరితే దృష్ట్వా** జాగ్రదవస్థలో చూసి, **తత్ మయః** ఆ విషయంతో మమేకమైనవాడై **స్వప్నే** స్వప్నంలో కూడా, జాగ్రత్తులో లాగానే

గ్రహించేది-గ్రహించబడేది అనే వికల్పం కలిగినవాడై, **పశ్యతి** చూస్తాడు. **అసత్ స్వప్నే** స్వప్నంలోని లేనిదాన్ని అదేవిధంగా **దృష్ట్వా అపి** చూసినాకూడా, **ప్రతిబుద్ధః** మేల్కొన్న మీదట వికల్పం తొలగినవాడై **న పశ్యతి** (స్వప్నంలో చూసిన 'అసత్'ను జాగ్రత్తులో ) చూడడం లేదు. ఇక్కడ 'చ' శబ్దాన్ని ప్రయోగించడం చేత, ఒక్కొక్కప్పుడు జాగ్రత్తులో చూసినా కూడా స్వప్నంలో చూడడం లేదు అని గ్రహించాలి. అందువలన, జాగ్రత్తు స్వప్నానికి కారణం అని చెప్పబడిందే కాని, అది యదార్థమైన సత్యం అని చెప్పడం లేదు.

యదార్థంగానైతే, దేనికైనా దేనితోనైనా ఏ ప్రకారంగానూ కార్య-కారణభావం ఉండే అవకాశం లేదు. ఎలా?

**నాస్త్యసద్ధేతుకమసత్సదసద్ధేతుకం తథా |**
**సచ్చ సద్ధేతుకం నాస్తి సద్ధేతుకమసత్కుతః ||** **|| మాం.గౌ.కా. 4-40 ||**

'అసత్' కారణంగా గల 'అసత్' ఉండదు. అలాగే, 'అసత్' కారణంగా 'సత్' కూడా కలుగదు. మరింకా, 'సత్' కారణంగాగల 'సత్'యే ఉండనప్పుడు, ఇక 'సత్' కారణంగా 'అసత్' ఎలా ఉంటుంది?

**శంకరుల భాష్యము**

నాస్తి అసద్ధేతుకం అసత్ శశవిషాణాది హేతుః కారణం యస్య అసత ఏవ ఖపుష్పాదేః, తత్ అసద్ధేతుకం అసత్ న విద్యతే . తథా సదపి ఘటాదివస్తు అసద్ధేతుకం శశవిషాణాదికార్యం నాస్తి . తథా సచ్చ విద్యమానం ఘటాది వస్త్వంతరకార్యం నాస్తి . సత్కార్యం అసత్ కుత ఏవ సంభవతి ? న చాన్యః కార్యకారణభావః సంభవతి శక్యో వా కల్పయితుం . అతో వివేకినామసిద్ధ ఏవ కార్యకారణభావః కస్యచిదిత్యభిప్రాయః ..

పునరపి జాగ్రత్స్వప్నయోరసతోరపి కార్యకారణభావాశంకామపనయన్నాహ —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**న అస్తి అసత్ హేతుకమ్ అసత్** గగన పుష్పాదుల వంటి ఉనికి లేనివాటికి కుందేటికొమ్ము వంటి ఉనికి లేనివి కారణం కావు. అలా ఉనికి లేని దానికి మరొక ఉనికిలేనిది కారణం కాజాలదు. అలాగే, **అసత్ హేతుకమ్** కుందేటికొమ్ము వంటి ఉనికిలేని దాని కారణంగా **న అస్తి సత్** ఉనికి కల ఘటాది వస్తువిషయాలు ఉండవు. అలాగే, **సత్ హేతుకమ్** ఉనికి కల ఘటం వంటి ఒకవస్తువు కారణంగా **న అస్తి సత్** 'సత్'గా ఉనికి కలిగిన తెలియబడే మరొక ఘటం కలగటం లేదు. ఇక 'సత్' కారణంగా 'అసత్' అనేది ఏ విధంగా సంభవిస్తుంది? (అంటే ఏ విధంగానూ కార్యకారణం వస్తువిషయాల మధ్య కలగడం లేదని అభిప్రాయం). (ఈ చెప్పినవిధాలుగా తప్ప) వేరొక విధంగా కార్యకారణ భావం సంభవమౌతుందని చెప్పలేం లేదా ఊహించలేం. అందుచేత, కార్యకారణ భావం అన్నది ఏ మాత్రం లేదని వివేకం కలవారి నిశ్చితమైన అభిప్రాయం.

అయినా కూడా తిరిగి, జాగ్రత్తు-స్వప్నములు రెండూ అసత్తే అయినా, రెండింటి మధ్య కార్యకారణ సంబధం (లేదనే) విషయంలో ఏ మాత్రం అనుమానాన్ని కూడా లేకుండా చేయాలనే ఉద్దేశ్యంతో తర్వాత శ్లోకంలో ఇలా చెప్తున్నారు.

**విపర్యాసాద్యథా జాగ్రదచిన్త్యాన్భూతవత్స్పృశేత్ |**
**తథా స్వప్నే విపర్యాసాద్ధర్మాంస్తత్రైవ పశ్యతి || || మాం.గౌ.కా. 4-41 ||**

ఎలాగైతే జాగ్రత్తులో అవివేకం కారణంగా ఊహించనలవికాని విషయాలను కల్పించుకొంటున్నాడో, అలాగే స్వప్నంలో కూడా అవివేకంతో విషయాలను అక్కడ మాత్రమే చూస్తున్నాడు.

**శంకరుల భాష్యము**

విపర్యాసాత్ అవివేకతః యథా జాగ్రత్ జాగరితే అచింత్యాన్భావాన్ అశక్యచింతనాన్ రజ్జుసర్పాదీన్ భూతవత్ పరమార్థవత్ స్పృశేత్ ; స్పృశన్నివ వికల్పయేదిత్యర్థః, కశ్చిద్యథా, తథా స్వప్నే విపర్యాసాత్ హస్త్యాదీన్పశ్యన్నివ వికల్పయతి . తత్రైవ పశ్యతి, న తు జాగరితాదుత్పద్యమానానిత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**విపర్యాసాత్** అవివేకం వల్ల ఒకానొకడు **యథా జాగ్రత్** ఎలాగైతే జాగ్రత్తులో **అచింత్యాన్** ఊహించశక్యంగాని త్రాడు-పాము మొదలైన విషయాలను **భూతవత్** యదార్థమైనవిగా **స్పృశేత్** స్పృశిస్తున్నట్లుగా అంటే కల్పించుకొంటున్నాడో, **తథా స్వప్నే** అలాగే స్వప్నంలో **విపర్యాసాత్** అవివేకం వల్ల ఏనుగు మొదలైన **ధర్మాన్** విషయాలను చూస్తున్నవానివలె భ్రమపడుతున్నాడు. **తత్రైవ పశ్యతి** అక్కడ అంటే ఆయా విషయాలను స్వప్నంలో మాత్రమే చూస్తున్నాడు, అంటే ఆ విషయాలు జాగ్రదవస్థనుండి ఉత్పన్నమైనవి కాదని అభిప్రాయం.

**ఉపలమ్భాత్సమాచారాదస్తివస్తుత్వవాదినాం |**
**జాతిస్తు దేశితా బుద్ధైరజాతేస్త్రసతాం సదా || || మాం.గౌ.కా. 4-42 ||**

అనుభవానికి వచ్చిన దానిని బట్టి, ఆచారంగా వస్తున్న కర్మలను బట్టి వస్తువిషయాలు యదార్థమని నమ్మే వారిని, పుట్టుకలేకపోవడం పట్ల ఎప్పుడూ భయపడే వారిని ఉద్దేశిస్తూ మాత్రమే, వివేకులు పుట్టుకను ఉపదేశించారు.

**శంకరుల భాష్యము**

యాపి బుద్ధైః అద్వైతవాదిభిః జాతిః దేశితా ఉపదిష్టా, ఉపలంభనముపలంభః, తస్మాత్ ఉపలబ్ధేరిత్యర్థః . సమాచారాత్ వర్ణాశ్రమాదిధర్మసమాచరణాచ్చ తాభ్యాం హేతుభ్యాం అస్తివస్తుత్వవాదినాం అస్తి వస్తుభావ ఇత్యేవంవదనశీలానాం దృఢాగ్రహవతాం శ్రద్దధానాం మందవివేకినామర్థోపాయత్వేన సా దేశితా జాతిః తాం గృహ్ణంతు తావత్ . వేదాంతాభ్యాసినాం తు

స్వయమేవ అజాద్వయాత్మవిషయో వివేకో భవిష్యతీతి ; న తు పరమార్థబుద్ధ్యా . తే హి శ్రోత్రియాః స్థూలబుద్ధిత్వాత్ అజాతేః అజాతివస్తునః సదా త్రస్యంతి ఆత్మనాశం మన్యమానా అవివేకిన ఇత్యర్థః . 'ఉపాయః సోఽవతారాయ' (మా. కా. 3 . 15) ఇత్యుక్తం ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**ఉపలంభాత్** ఉపలంభము వలన అంటే అనుభవం కలుగుతోన్న కారణంగా అని అర్థం. **సమాచారాత్** వర్ణాశ్రమాది ధర్మాలను సరిగా ఆచరిస్తున్నందు వల్ల. ఆ రెండు కారణాల వల్ల **అస్తివస్తుత్వవాదినామ్** వస్తువిషయాలు యదార్థంగా ఉన్నవని దృఢంగా నమ్ముతూ, వాటియందు అత్యంత శ్రద్ధను కనబరచే మధ్యమస్థాయి వివేకులకు ఉపాయంగా యదార్థాన్ని తెలియపరచేందుకు **బుద్ధైః** అద్వైతవాదులైన జ్ఞానులు కూడా **జాతిః దేశితా** పుట్టుకనే ఉపదేశిస్తున్నారు. వారు యదార్థాన్ని గ్రహించేంతవరకు ఇలా సృష్టి ఉపదేశం జరుగుతుంది. **తు** అయితే ఉపనిషత్తులను అభ్యసించేవారిలో పుట్టుకలేని అద్వయ ఆత్మ విషయం గురించిన వివేకం తనంతతానుగా కలుగుతుందే కాని యదార్థ సత్యం అనే బుద్ధి వల్ల కలగడం లేదు. మందబుద్ధులు మరియు వైదిక కర్మలలో నిష్ఠత కలిగినవారు **అజాతేః** పుట్టుకలేకపోవడం అనేది తమను నశింపచేసేదని భావించే అవివేకులు **సదా** ఎల్లప్పుడూ **త్రసతాం** భయాన్ని పొందుతూనే ఉంటారు అని అభిప్రాయం. 'ఉపాయంగా (ఏకత్వాన్ని నిరూపణ చేసేందుకే) సృష్టి ప్రస్తావన' ['ఉపాయః సోఽవతారాయ' (మా.గౌ.కా. 3-15)] అని ముందే చెప్పియున్నాము.

**అజాతేస్త్రసతాం తేషాముపలమ్భాద్వియన్తి యే |**
**జాతిదోషా న సేత్స్యన్తి దోషోఽప్యల్పో భవిష్యతి ||** **|| మాం.గౌ.కా. 4-43 ||**

ఎవరైతే పుట్టుకలేకపోవడాన్ని గురించి భీతిల్లి యదార్థానికి దూరమౌతున్నారో వారు ద్వైతభావనలోనే ఉండి పోతున్నారు. అయితే, వారికి పుట్టుకను అంగీకరించడంవల్ల కలిగే దోషాలు ఫలితాన్నివ్వవు మరియు లెక్కకు రావు కూడా.

**శంకరుల భాష్యము**

యే చ ఏవముపలంభాత్సమాచారాచ్చ అజాతేః అజాతివస్తునః త్రసంతః అస్తి వస్త్వితి అద్వయాదాత్మనః, వియంతి విరుద్ధం యంతి ద్వైతం ప్రతిపద్యంత ఇత్యర్థః . తేషాం అజాతేః త్రసతాం శ్రద్దధానానాం సన్మార్గావలంబినాం జాతిదోషాః జాత్యుపలంభకృతా దోషాః న సేత్స్యంతి సిద్ధిం నోపయాస్యంతి, వివేకమార్గప్రవృత్తత్వాత్ . యద్యపి కశ్చిద్దోషః స్యాత్ , సోఽప్యల్ప ఏవ భవిష్యతి, సమ్యగ్దర్శనాప్రతిపత్తిహేతుక ఇత్యర్థః ..

నను ఉపలంభసమాచారయోః ప్రమాణత్వాదస్త్యేవ ద్వైతం వస్త్వితి ; న, ఉపలంభసమాచారయోర్వ్యభిచారాత్ . కథం వ్యభిచార ఇతి, ఉచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

మరి ఎవరైతే ఆ విధంగా, అనుభవాన్ని బట్టి మరియు వేదవిహితమైన కర్మకాండను ఆచరించడం చేత **ఉపలంభాత్** ద్వైతానుభవాన్ని పొందడంచేత పుట్టుకలేని అద్వయమైన ఆత్మ గురించి భీతి చెందటమనే

**వియంతి** వైరుధ్యాన్ని పొందుతున్నారో అని అభిప్రాయం. **అజాతేః త్రసతామ్** పుట్టుక లేకపోవడమనే దాని యందు భీతిని పొందినా **తేషామ్** కర్మలయందు శ్రద్ధకలిగి సన్మార్గాన్ని ఆచరించే అటువంటి వారియందు **జాతిదోషాః** పుట్టుక అనే అనుభవాన్ని స్వీకరించవల్ల కలిగే దోషములు **న సేత్స్యంతి** ఫలితాన్ని ఇవ్వవు ఎందుకంటే వారు వివేకంతో కూడిన మార్గంలోనే ప్రవర్తిస్తున్నారు కాబట్టి ఆ దోషములు వారికి ఇబ్బందిని కలుగచేయవు. సమగ్రమైన ఆత్మయొక్క యదార్ధ దర్శనం కలుగని కారణంగా **దోషః అపి** ఒకవేళ ఏదైనా దోషమున్నప్పటికినీ, **అల్పః భవిష్యతి** అది కూడా చాలా స్వల్పంగానే ఉంటుంది అని అభిప్రాయం.

**సందేహం** : అనుభవమూ మరియు కర్మలను చేయటం అనేవి వేదప్రమాణాలైనప్పుడు, ద్వైతంగా అనుభవానికి వచ్చే వస్తువిషయాలకు అస్తిత్వం ఉన్నట్లే కదా!

**సమాధానం** : కాదు. ఎందుకంటే, అనుభవమూ మరియు కర్మకాండలు సార్వజనీనములు కావు (అంటే అవి ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా అనుభవానికి వస్తున్నాయి). ఎందుకవి అలా సార్వజనీనములు కావో చెప్తున్నారు.

**ఉపలమ్భాత్సమాచారాన్మాయాహస్తీ యథోచ్యతే |**
**ఉపలమ్భాత్సమాచారాదస్తి వస్తు తథోచ్యతే || || మాం.గౌ.కా. 4-44 ||**

అనుభవం కావడం చేత, ప్రవర్తన చేత మాయాకల్పితమైన ఏనుగును యదార్ధమని ఎలాగైతే అంటున్నారో, అలాగే (యదార్ధం కాని) వస్తువిషయాన్ని కూడా అనుభవానికి వస్తుండటం చేతను, ప్రవర్తన చేతను యదార్ధమేనని అంటున్నారు.

**శంకరుల భాష్యము**

ఉపలభ్యతే హి మాయాహస్తీ హస్తీవ, హస్తినమివాత్ర సమాచరంతి బంధనారోహణాదిహస్తిసంబంధిభిర్ధర్మైః, హస్తీతి చోచ్యతే అసన్నపి యథా, తథైవ ఉపలంభాత్సమాచారాత్ ద్వైతం భేదరూపం అస్తి వస్తు ఇత్యుచ్యతే . తస్మాన్నోపలంభసమాచారౌ ద్వైతవస్తుసద్భావే హేతూ భవత ఇత్యభిప్రాయః ..

కిం పునః పరమార్థసద్వస్తు, యదాస్పదా జాత్యాద్యసద్బుద్ధయ ఇత్యాహ —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

(ఇంద్రజాలికుడు మాయచేత) కల్పించబడిన ఏనుగు కూడా నిజమైన ఏనుగు లాగానే అనుభవానికి రావడం చేత, ఏనుగును కట్టివేయడం, అధిరోహించడం వంటి ఏనుగుకు సంబంధించిన ప్రవర్తనల కారణంగా అక్కడ ఏనుగు ఉన్నట్లుగానే కనబడుతుండటం చేత, అది మాయయే అయినా కూడా దానిని ఏనుగు అని ఎలాగైతే అంటున్నారో, అలాగే అనుభవానికి రావడం చేత, ప్రవర్తన చేత భిన్నత్వమనే ద్వైత వస్తువిషయాలు ఉన్నాయని అంటున్నారు. అందుచేత, ద్వైత వస్తువు సత్యమని చెప్పడానికి అనుభవం-ప్రవర్తన అనేవి కారణాలు కానేరవు అని అభిప్రాయం.

మరైతే, జన్మ వంటి అసత్యమైన భావనలకు ఆశ్రమయైన యదార్ధ సత్యం ఏమైయుంటుంది? అనే సంశయానికి బదులుగా ఇలా చెప్తున్నారు.

**జాత్యాభాసం చలాభాసం వస్త్వాభాసం తథైవ చ |**

**అజాచలమవస్తుత్వం విజ్ఞానం శాంతమద్వయమ్ ||** **|| మాం.గౌ.కా. 4-45 ||**

పుట్టుకలేనిది పుడుతున్నట్లుగా, కదలనిది కదలుతోన్నట్లుగా, వస్తువు కానిది వస్తువులాగా భాసించేదే విజ్ఞానం. అదియే శాంతం, అట్టిది రెండవదేదీ లేదు.

**శంకరుల భాష్యము**

అజాతి సత్ జాతివదవభాసత ఇతి జాత్యాభాసం , తద్యథా దేవదత్తో జాయత ఇతి . చలాభాసం చలమివాభాసత ఇతి, యథా స ఏవ దేవదత్తో గచ్ఛతీతి . వస్త్వాభాసం వస్తు ద్రవ్యం ధర్మి, తద్వదవభాసత ఇతి వస్త్వాభాసం , యథా స ఏవ దేవదత్తో గౌరో దీర్ఘ ఇతి . జాయతే దేవదత్తః స్పందతే దీర్ఘో గౌర ఇత్యేవమవభాసతే . పరమార్థతస్తు అజమచలమవస్తుత్వమద్రవ్యం చ . కిం తదేవంప్రకారం ? విజ్ఞానం విజ్ఞప్తిః, జాత్యాదిరహితత్వాచ్ఛాంతం అత ఏవ అద్వయం చ తదిత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

'దేవదత్తుడు పుట్టాడు' అన్న రీతిలో, పుట్టుకలేనిదే అయినా పుట్టుక కలదిగా భాసించడమే **జాత్యాభాసమ్.** 'దేవదత్తుడు వెళ్ళాడు' అన్న రీతిగా, **చలాభాసమ్** కదలిక కలదానిలా భాసించడం. ద్రవ్య ధర్మాలు కలది వస్తువు. **వస్త్వాభాసమ్** అట్టి ధర్మాలు కలదానివలె భాసించడం. అంటే, 'దేవదత్తుడు చామనఛాయ కలిగి, పొడుగ్గా ఉన్నాడు' అని చెప్పినట్లుగా. **తథైవ చ** దేవదత్తుడు పుట్టాడు, కదిలాడు, పొడుగ్గా ఛాయమఛాయతో ఉన్నాడన్నట్లుగా భాసిస్తోంది. కాని, యదార్థానికి అది **అజాచలమవస్తుత్వమ్** పుట్టుక లేనిది, కదలనిది, వస్తుధర్మాలు లేనిది, ద్రవ్యం కూడా కానిది. అది ఏవిధమైనది? **విజ్ఞానమ్** అంటే ఎరుక. పుట్టుకనేది లేనిదైనందున అది **శాంతమ్** ఏకరసమైనది. ఏకరసమైనందు చేతనే **అద్వయం** రెండవది అనేది లేనిది కూడా అని అభిప్రాయం.

**ఏవం న జాయతే చిత్తమేవం ధర్మా అజాః స్మృతాః |**

**ఏవమేవ విజానంతో న పతన్తి విపర్యయే ||** **|| మాం.గౌ.కా. 4-46 ||**

ఈ విధంగా చిత్తమే పుట్టడం లేదు. అలాగే జీవులు కూడా పుట్టడం లేదని మహాత్ములు అంటున్నారు. ఇలా ఈవిధంగా తెలుసుకొన్నవారు వైపరీత్యంలో పతనాన్ని పొందరు.

**శంకరుల భాష్యము**

ఏవం యథోక్తేభ్యో హేతుభ్యః న జాయతే చిత్తం . ఏవం ధర్మాః ఆత్మానః అజాః స్మృతాః బ్రహ్మవిద్భిః . ధర్మా ఇతి బహువచనం దేహభేదానువిధాయిత్వాదద్వయస్యైవ ఉపచారతః . ఏవమేవ యథోక్తం విజ్ఞానం జాత్యాదిరహితమద్వయమాత్మతత్త్వం విజానంతః త్యక్తబాహ్యైషణాః పునర్న పతంతి అవిద్యాధ్వాంతసాగరే విపర్యయే ; 'తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః' (ఈ. ఉ. 7) ఇత్యాదిమంత్రవర్ణాత్ ..

యథోక్తం పరమార్థదర్శనం ప్రపంచయిష్యన్నాహ —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**ఏవమ్** ఈ చెప్పబడిన కారణంగా **చిత్తమ్ న జాయతే** చిత్తమనేది పుట్టడం లేదు. **ఏవమ్** అదేవిధంగా **ధర్మాః** జీవులు **అజాః** పుట్టుకలేనివారని **స్మృతాః** బ్రహ్మవేత్తలు అంటారు. అద్వయమైన ఆత్మ వేర్వేరు దేహములు కలదిగా అనిపిస్తున్నందున 'ధర్మా' అని బహువచనాన్ని ప్రయోగించారు. **ఏవమ్ ఏవ** ఆ విధంగానే **విజానంతః** పుట్టుకలేని అద్వయమైన ఆత్మతత్త్వ జ్ఞానాన్ని పొందినవాడు, బాహ్యంలోని విషయాల పట్ల కోరికలు త్యజించినవాడై **విపర్యయే** అవిద్యతో నిండిన మహాసాగరంలోకి తిరిగి **న పతంతి** పతనం కాడు. 'అంతటా ఏకత్వాన్ని దర్శించేవానికి ఇక మోహం ఎక్కడ, శోకం ఎక్కడ' ['తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః' (ఈ.ఉ. 7)] అని మంత్రోపనిషత్తు చెప్పినది ఇదే.

ఈ విధంగా చెప్పబడిన యదార్థ తత్త్వ దర్శనాన్ని విస్తృత పరచేందుకు తర్వాత శ్లోకంలో ఇలా అంటున్నారు.

**ఋజువక్రాదికాభాసమలాతస్పన్దితం యథా |**
**గ్రహణగ్రాహకాభాసం విజ్ఞానస్పన్దితం తథా ||** **|| మాం.గౌ.కా. 4-47 ||**

ఎలాగైతే కాగడా మంట నిటారుగా, వంకరగా పలురకాలుగా చలిస్తుందో, అలాగే విజ్ఞానం కూడా గ్రహించేదిగానూ (జీవ రూపంలోనూ), గ్రహించబడేదిగానూ (బాహ్య విషయ రూపాలలోనూ) పలు రకాలుగా భాసిస్తున్నట్లు అనిపిస్తుంది.

**శంకరుల భాష్యము**

యథా హి లోకే ఋజువక్రాదిప్రకారాభాసం అలాతస్పందితం ఉల్కాచలనం , తథా గ్రహణగ్రాహకాభాసం విషయివిషయాభాసమిత్యర్థః . కిం తత్ ? విజ్ఞానస్పందితం స్పందితమివ స్పందితమవిద్యయా . న హ్యచలస్య విజ్ఞానస్య స్పందనమస్తి, 'అజాచలం' (మా. కా. 4 . 45) ఇతి హ్యుక్తం ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**యథా** లోకంలో ఎలాగైతే **అలాతస్పందితమ్** కాగడా మంట యొక్క చలనం **ఋజువక్రాదికాభాసమ్** సూటిగానూ వంకరటింకరగానూ ప్రకాశిస్తోందో, **తథా** అలాగే **గ్రహణగ్రాహకాభాసమ్** విషయ (విషయాలు) విషయి (ఆ విషయాలను గ్రహించేది) అన్నట్లుగా భాసించేది అని అర్థం. ఏమిటది? **విజ్ఞానస్పందితమ్** అవిద్యకారణంగా కలిగే చైతన్య చలనం వల్ల. (అంటే విషయాలుగానూ, ఆ విషయాలను గ్రహించేదిగాను అనిపించే చైతన్యమే, అజ్ఞానం కారణంగా కదులుతోందా అన్నట్లు అనిపిస్తోంది). నిజానికి చలన రహితమైన విజ్ఞానానికి స్పందనమనేది ఉండదు అని 'అజాచలం' (మా.గౌ.కా. 4-45) లో ఇంతకు ముందు చెప్పి ఉన్నాం.

**అస్పన్దమానమలాతమనాభాసమజం యథా |**

**అస్పన్దమానం విజ్ఞానమనాభాసమజం తథా ||** **|| మాం.గౌ.కా. 4-48 ||**

చలనరహితమైన కాగడా ఎలాగైతే అనేక రూపాలుగా భాసించదో, పుట్టదో అలాగే, చలనరహితమైన విజ్ఞానం అనేకంగా భాసించదు, పుట్టదు.

**శంకరుల భాష్యము**

అస్పందమానం స్పందనవర్జితం తదేవ అలాతం ఋజ్వాద్యాకారేణాజాయమానం అనాభాసం అజం యథా, తథా అవిద్యయా స్పందమానం అవిద్యోపరమే అస్పందమానం జాత్యాద్యాకారేణ అనాభాసం అజం అచలం భవిష్యతీత్యర్థః ..

కిం చ,

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**యథా** ఎలాగైతే **అస్పందమానమ్** చలన రహితమైన **అలాతమ్** అదే కాగడా నిటారుగా-వంకరగా అనేక ఆకారాలుగా **అనాభాసమ్ అజమ్** ప్రకాశించదో, పుట్టదో **తథా** అదేవిధంగా అజ్ఞానం కారణంగా కదలికలు కలిగి అజ్ఞానం ఉపశమించిన మీదట చలన రహితమైన, ఆ విజ్ఞానం పుట్టుక మొదలైన రూప విశేషాలుగా ప్రకాశించదు, పుట్టదు, స్పందించదు అని అభిప్రాయం.

మరి ఏమంటే,

**అలాతే స్పన్దమానే వై నాభాసా అన్యతోభువః |**

**న తతోఽన్యత్ర నిఃస్పన్దాన్నాలాతం ప్రవిశన్తి తే ||** **|| మాం.గౌ.కా. 4-49 ||**

కదలుతోన్న కాగడలో రూప ప్రకాశాలు వేరెక్కడినుండో పుట్టేవి కావు. కాగడా కదలడం ఆగిపోగానే ఆ ప్రకాశాలు మరెక్కడికో వెళ్ళిపోవడం లేదు.

**శంకరుల భాష్యము**

తస్మిన్నేవ అలాతే స్పందమానే ఋజువక్రాద్యాభాసాః అలాతాదన్యతః కుతశ్చిదాగత్యాలాతే నైవ భవంతీతి నాన్యతోభువః . న చ తస్మాన్నిఃస్పందాదలాతాదన్యత్ర నిర్గతాః . న చ నిఃస్పందమలాతమేవ ప్రవిశంతి తే ..

కిం చ,

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

నిటారు-వంకర వంటి **ఆభాసా** విన్యాసాలుగా కనిపిస్తున్నవన్నీ **వై** నిజానికి దానిలోనివే అంటే **అలాతే స్పందమానే** కదలుతోన్న కాగడా లోనివే. **న అన్యతోభువః** అంటే కాగడాకు బాహ్యంగా ఎక్కడినుంచో అవి కాగడాలోనికి రావడం లేదని. **తతః నిఃస్పందాత్** కదలిక ఆగిపోగానే **న అన్యత్ర** వేరొక చోటికి పోవడమూ లేదు **న తే అలాతమ్ ప్రవిశంతి** కాగడాలో ప్రవేశించడమూ లేదు.

మరింకా,

**న నిర్గతా అలాతాత్తే ద్రవ్యత్వాభావయోగతః |**

**విజ్ఞానేఽపి తథైవ స్యురాభాసస్యావిశేషతః ||** **|| మాం.గౌ.కా. 4-50 ||**

(ఆ ఆభాసలను) ద్రవ్యమనేందుకు వీలులేనందుచేత, అవి కాగడా నుండి బయటకు వస్తాయనడం కుదరదు. విజ్ఞానం కూడా అలాంటిదే (ద్రవ్యమనేందుకు వీలులేనిదే) అయి ఉండాలి. ఎందుకంటే, ఆభాసకు ప్రత్యేకతను చెప్పలేం. (అంటే ఇది కాగడా ఆభాస, ఇది విజ్ఞానాభాస అని ప్రత్యేకించి చెప్పడం కుదరదు).

**శంకరుల భాష్యము**

న నిర్గతా అలాతాత్ తే ఆభాసాః గృహాదివ, ద్రవ్యత్వాభావయోగతః, ద్రవ్యస్య భావో ద్రవ్యత్వం , తదభావః ద్రవ్యత్వాభావః, ద్రవ్యత్వాభావయోగతః ద్రవ్యత్వాభావయుక్తేః వస్తుత్వాభావాదిత్యర్థః . వస్తునో హి ప్రవేశాది సంభవతి, నావస్తునః . విజ్ఞానేఽపి జాత్యాద్యాభాసాః తథైవ స్యుః, ఆభాసస్య అవిశేషతః తుల్యత్వాత్ ..

కథం తుల్యత్వమిత్యాహ —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**తే** అవి, ఆభాసలు **అలాతాత్** కాగడానుండి **న నిర్గతా** బయటకు వచ్చినవి కావు. ద్రవ్యం యొక్క స్వభావం ద్రవ్యత్వం, ఆ ద్రవ్య స్వభావం లేకపోవడం 'ద్రవ్యత్వాభావః'. **ద్రవ్యత్వాభావయోగతః** అంటే గృహాదుల లాగా ద్రవ్య స్వభావం లేని కారణంగా, వస్తుధర్మాలు లేని కారణంగా అని అర్థం. (అంటే ఆభాసలకు ద్రవ్య ధర్మాలు లేని కారణంగా అవి కాగడా నుండి బయటకు వచ్చాయని చెప్పడానికి వీలు లేదు). వస్తువులో అయితే ప్రవేశం మొదలైనవి సంభవమౌతాయి కాని, ఈ ఆభాసలు వస్తువులు కావు. **విజ్ఞానే అపి** విజ్ఞానంలో ఉన్నట్లు అనిపించే పుట్టుక మొదలైన ఆభాసలు కూడా **తథా ఏవ స్యుః** అలాంటివే అయి ఉండాలి. ఎందుకంటే ఆభాసలన్నీ సమానమైనవే, వాటిలో ప్రత్యేకతలేవీ ఉండవు కాబట్టి. (ఆభాస అంటే లేనిది ఉన్నట్లుగా కనిపించడమే. అది కాగడా కదలికలోనైనా కావచ్చు, విజ్ఞానంలో పుట్టుక వంటి విషయాలలోనైనా కావచ్చు. లేనిది ఉన్నట్లుగా కనిపించడంలో ఏతేడా లేదు).

ఆభాసలు అన్నీ ఎలా సమానమో తర్వాత శ్లోకంలో చెప్తున్నారు.

**విజ్ఞానే స్పన్దమానే వై నాభాసా అన్యతోభువః |**

**న తతోఽన్యత్ర నిఃస్పందాన్న విజ్ఞానం విశన్తి తే ||** **|| మాం.గౌ.కా. 4-51 ||**

విజ్ఞానంలో కదలిక వల్ల కలిగే ఆభాసలు వేరే ఎక్కడినుంచో కలగడం లేదు. కదలిక ఆగినప్పుడు ఆ ఆభాసలు ఎక్కడకో వెళ్ళడమూ లేదు, విజ్ఞానంలో ప్రవేశించడమూ లేదు.

**న నిర్గతాస్తే విజ్ఞానాద్ద్రవ్యత్వాభావయోగతః |**

**కార్యకారణతాభావాద్యతోఽచిన్త్యాః సదైవ తే ||** **|| మాం.గౌ.కా. 4-52 ||**

(ఆ ఆభాసలను) ద్రవ్యమనేందుకు వీలులేనందు చేత, అవి విజ్ఞానం నుండి బయటకు వస్తాయనడం కుదరదు. ఎందుకంటే, కార్య-కారణమనేది లేనందుచేత, ఎప్పటికీ వాటిని ఊహించడం వీలుకాదు.

## శంకరుల భాష్యము

అలాతేన సమానం సర్వం విజ్ఞానస్య ; సదా అచలత్వం తు విజ్ఞానస్య విశేషః . జాత్యాద్యాభాసా విజ్ఞానే అచలే కింకృతా ఇత్యాహ — కార్యకారణతాభావాత్ జన్యజనకత్వానుపపత్తేరభావరూపత్వాత్ అచింత్యాః తే యతః సదైవ . యథా అసత్సు ఋజ్వాద్యాభాసేషు ఋజ్వాదిబుద్ధిర్దృష్టా అలాతమాత్రే, తథా అసత్స్వేవ జాత్యాదిషు విజ్ఞానమాత్రే జాత్యాదిబుద్ధిర్మృషైవేతి సముదాయార్థః ..

అజమేకమాత్మతత్త్వమితి స్థితం . తత్ర యైరపి కార్యకారణభావః కల్ప్యతే, తేషాం

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

విజ్ఞానానికి అంతయూ కాగడాతో సమానమే. ఎప్పటికీ కదలిక లేకుండటయే విజ్ఞానం యొక్క ప్రత్యేకత. కదలికలు లేని విజ్ఞానంలో పుట్టుక వంటి ఆభాసలను ఏది కలిగిస్తోంది అన్నదానికి ఇలా చెప్తున్నారు. **యతః** ఎందుకంటే, **కార్యకారణతా అభావాత్** కార్య-కారణ భావం లేకపోవడం చేత పుట్టేది-పుట్టించేది అనే సంబంధమే సంభవం కాకపోవడం చేత, **తే** ఆ ఆభాసలు **సదా ఏవ** ఎప్పటికీ **అచింత్యాః** ఊహించనలవి కానివే కాబట్టి. ఎలాగైతే వాస్తవాలు కాని నిటారు-వంపుల వంటి ఆభాసలలో నిటారు మొదలైన భావనలు కాగడా ఉన్నందువల్లనే కలుగుతున్నాయో, అలాగే కేవలం విజ్ఞానం తప్ప యదార్థమే కాని పుట్టుక మొదలైన వాటిలో కలిగే పుట్టింది, కదిలింది వంటి భావనలన్నీ మిథ్యయే అని ఈ రెండూ శ్లోకాలకు కలిపి అర్థాన్ని చెప్తున్నారు.

ఆత్మతత్త్వానికి పుట్టుక లేదు, అది ఏకమే అని నిర్ధారణ జరిగింది. అక్కడ కూడా, అంటే ఆ ఆత్మతత్త్వమందు కూడా కార్య-కారణ భావాన్ని కల్పించే వారిని ఉద్దేశించి (ఆచార్యులు ఇలా చెప్తున్నారు).

**ద్రవ్యం ద్రవ్యస్య హేతుః స్యాదన్యదన్యస్య చైవ హి |**
**ద్రవ్యత్వమన్యభావో వా ధర్మాణాం నోపపద్యతే ||** **|| మాం.గౌ.కా. 4-53 ||**

ద్రవ్యానికి ద్రవ్యమే కారణమౌతుంది. వేరొకదానికి (ద్రవ్య స్వభావానికి భిన్నమైన ధర్మానికి) ఆ ఇతరమైన మరొకటియే (ధర్మమే) కారణం కాగలదు అని అంటే, ద్రవ్యత్వాన్ని గాని లేదా వేరే భావాన్నిగాని (ఆత్మకు) ధర్మాలుగా ప్రతిపాదించలేము.

**శంకరుల భాష్యము**

ద్రవ్యం ద్రవ్యస్యాన్యస్యాన్యత్ హేతుః కారణం స్యాత్ , న తు తస్యైవ తత్ . నాప్యద్రవ్యం కస్యచిత్కారణం స్వతంత్రం దృష్టం లోకే . న చ ద్రవ్యత్వం ధర్మాణాం ఆత్మనాం ఉపపద్యతే అన్యత్వం వా కుతశ్చిత్ , యేన అన్యస్య కారణత్వం కార్యత్వం వా ప్రతిపద్యేత . అతః అద్రవ్యత్వాదనన్యత్వాచ్చ న కస్యచిత్కార్యం కారణం వా ఆత్మేత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**ద్రవ్యమ్ దవ్యస్య** ద్రవ్యం ద్రవ్యానికి **హేతు స్యాత్** కారణం అయినట్లుగా, **అన్యత్ అన్యస్య చ** ఇతరానికి (ద్రవ్యానికి భిన్నమైన ధర్మానికి) వేరొకటి కూడా (ధర్మమే) **ఏవ హి** కారణమై ఉండవచ్చు కదా అంటే, కాదు ఒకదానికి అదే కారణం కాదు. లోకం దృష్టిలో ద్రవ్యం కానిది ఎప్పటికీ స్వతంత్రంగా కారణం కాజాలదు. (అంటే ద్రవ్య ధర్మాలు ఆ ద్రవ్యం లేనప్పుడు ఉండవు కాబట్టి, అవి స్వతంత్ర ప్రతిపత్తి కలిగినవి కావు). **ధర్మాణామ్ ఆత్మ** ధర్మాలలో **ద్రవ్యత్వమ్ అన్యభావః వా** ద్రవ్యత్వం కానిది ధర్మత్వం కానిది ఇంకోటేదైనా కాని ఉన్నదని **న ఉపపద్యతే** ఎప్పటికీ చెప్పలేం కూడా. అలా చెప్పినపుడే వేరొక దానికి కారణంగాగాని లేదా కార్యంగాగాని ఆత్మను ప్రతిపాదించగలుగుతాం. అందువలన, ఆత్మ ద్రవ్యమా కాదు మరియు వేరే ఎలాంటిదీ కాదు. అందుచేత, అది కార్యం కాని లేదా కారణం గాని అయ్యే అవకాశమే లేదు అని అభిప్రాయం.

**ఏవం న చిత్తజా ధర్మాశ్చిత్తం వాపి న ధర్మజమ్ |**
**ఏవం హేతుఫలాజాతిం ప్రవిశన్తి మనీషిణః || || మాం.గౌ.కా. 4-54 ||**

ఈ విధంగా చిత్తము నుండి ధర్మాలు (బాహ్య విషయాలు) పుట్టడం లేదు. లేదా, ధర్మాలనుండి (బాహ్యవిషయాల నుండి) చిత్తం కూడా ఉత్పన్నం కావడం లేదు. అందువల్ల, కారణ కార్యాలకు పుట్టుకనేది లేదని జ్ఞానులు తెలియచెప్తున్నారు.

**శంకరుల భాష్యము**

ఏవం యథోక్తేభ్యో హేతుభ్యః ఆత్మవిజ్ఞానస్వరూపమేవ చిత్తమితి, న చిత్తజాః బాహ్యధర్మాః, నాపి బాహ్యధర్మజం చిత్తం , విజ్ఞానస్వరూపాభాసమాత్రత్వాత్సర్వధర్మాణాం . ఏవం న హేతోః ఫలం జాయతే, నాపి ఫలాద్ధేతురితి హేతుఫలయోరజాతిం హేతుఫలాజాతిం ప్రవిశంతి అధ్యవస్యంతి . ఆత్మని హేతుఫలయోరభావమేవ ప్రతిపద్యంతే బ్రహ్మవిద ఇత్యర్థః ..

యే పునర్హేతుఫలయోరభినివిష్టాః, తేషాం కిం స్యాదితి, ఉచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**ఏవమ్** ఈ విధంగా, పైన చెప్పిన కారణల రీత్యా, ఆత్మవిజ్ఞాన స్వరూపమే చిత్తమని, **న చిత్తజాః ధర్మాః** బాహ్య విషయాలు చిత్తం నుండి పుట్టడం లేదని **వా అపి** మరి లేదా **న చిత్తమ్ ధర్మజమ్** చిత్తం కూడా బాహ్యవిషయాలనుండి జనించడం లేదని, సకల విషయాలూ విజ్ఞాన స్వరూపం యొక్క ఆభాసలు మాత్రమేనని తెలుస్తోంది. [ఇక్కడ చిత్తాన్ని అంటే పరబ్రహ్మగానే ఆనందగిరి భావిస్తున్నారు – స్వామి గంభీరానంద]. **ఏవమ్** అందుచేత, కారణం నుండి కార్యం పుట్టుక లేదని, కార్యం నుండి కారణం పుట్టుక లేదని, **హేతు ఫల అజాతిమ్** కార్య-

కారణాలు రెండింటికి పుట్టుకయే లేదనే భావనలోనే **మనీషిణః** విద్వాంసులు **ప్రవిశంతి** ప్రవేశించి స్థిరంగా నిలుస్తారు. అంటే, ఆత్మయందు కారణ-కార్య భావాల ప్రసక్తే లేదని బ్రహ్మవేత్తలు ప్రతిపాదిస్తున్నారు అని అభిప్రాయం.

కాని, కారణ-కార్య భావంలోనే అభినివేశం కలిగి వారి స్థితి ఎలా ఉంటుందో, తర్వాత శ్లోకంలో ఇలా చెప్తున్నారు.

**యావద్ధేతుఫలావేశస్తావద్ధేతుఫలోద్భవః |**
**క్షీణే హేతుఫలావేశే నాస్తి హేతుఫలోద్భవః ||** **|| మాం.గౌ.కా. 4-55 ||**

కారణ-కార్య భావనలో నిమగ్నమై ఉన్నంత వరకూ కారణ-కార్య రూపమైన జగత్తు గోచరిస్తుంది. కారణ-కార్య భావన క్షీణించగనే, కారణ-కార్య రూపమైన జగత్తు నశిస్తుంది.

**శంకరుల భాష్యము**

ధర్మాధర్మాఖ్యస్య హేతోః అహం కర్తా మమ ధర్మాధర్మౌ తత్ఫలం కాలాంతరే క్వచిత్ప్రాణినికాయే జాతో భోక్ష్యే ఇతి యావద్ధేతుఫలయోరావేశః హేతుఫలాగ్రహ ఆత్మన్యధ్యారోపణం , తచ్చిత్తతేత్యర్థః ; తావద్ధేతుఫలయోరుద్భవః ధర్మాధర్మయోస్తత్ఫలస్య చానుచ్ఛేదేన ప్రవృత్తిరిత్యర్థః . యదా పునర్మంత్రౌషధివీర్యేణేవ గ్రహావేశో యథోక్తాద్వైతదర్శనేన అవిద్యోద్భూతహేతుఫలావేశోపనీతో భవతి, తదా తస్మిన్క్షణే నాస్తి హేతుఫలోద్భవః ..

యది హేతుఫలోద్భవః, తదా కో దోష ఇతి, ఉచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

'పాప పుణ్యాలనే కారణాలకు కర్తను నేనే', 'ఆ పాప పుణ్యాలు నావి', 'వాటి ఫలాన్ని కాలాంతరంలో ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక ప్రాణి శరీరంలో పుట్టి అనుభవిస్తాను' అని ఎంతవరకైతే కారణ-కార్యాల పట్ల నిష్ఠతో, అవి ఆత్మ ధర్మాలుగా అధ్యారోపించుకోబడతాయో, అంతవరకు కూడా కారణ-కార్యాలు అంటే పాప-పుణ్యాలు ఎడతెరిపి లేకుండా పుడుతూనే ఉంటాయి. మంత్ర శక్తితో, ఔషధ బలంతో అనారోగ్యాన్ని తొలగించుకొన్నట్లుగా, ఎప్పుడైతే పైన చెప్పిన అద్వైత దర్శనం చేసి అజ్ఞానాన్ని పారద్రోలగా, కారణ-కార్య భావన ఉపశమనమౌతుందో, అప్పుడు ఆ క్షణంనుండి కారణ-కార్యములు ఉద్భవించవు.

ఒకవేళ కారణ-కార్యాలు ఉత్పన్నమైతే, అందులో ఏమి దోషం కలదో చెప్తున్నారు.

**యావద్ధేతుఫలావేశః సంసారస్తావదాయతః |**
**క్షీణే హేతుఫలావేశే సంసారం న ప్రపద్యతే ||** **|| మాం.గౌ.కా. 4-56 ||**

ఎంతవరకు కారణ-కార్య భావన ఉంటుందో, అంతవరకు సంసారం ఉంటూనే ఉంటుంది. కారణ-కార్య భావన నశించగానే సంసారం ఉనికి ఉండదు.

**శంకరుల భాష్యము**

యావత్ సమ్యగ్దర్శనేన హేతుఫలావేశః న నివర్తతే, అక్షీణః సంసారః తావత్ ఆయాతః దీర్ఘో భవతీత్యర్థః . క్షీణే పునః హేతుఫలావేశే సంసారం న ప్రపద్యతే, కారణాభావాత్ ..

నను అజాదాత్మనోఽన్యన్నాస్త్యేవ ; తత్కథం హేతుఫలయోః సంసారస్య చ ఉత్పత్తివినాశావుచ్యేతే త్వయా ? శృణు ;

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**యావత్** ఎంతవరకైతే **హేతుఫలావేశః** కారణ-కార్య భావన పరమార్థ దర్శనం చేత తొలగించబడదో, **తావత్** అంత వరకూ, **సంసారం** సంసారం నశించకుండా **ఆయాతః** కొనసాగుతూనే ఉంటుంది అని అర్థం. **హేతుఫలావేశే** కారణ-కార్యభావం **క్షీణే** నశించగానే, **సంసారమ్** సంసారం కొనసాగడానికి తగిన కారణం లేనందుచేత **న ప్రపద్యతే** ఉనికిని కోల్పోతుంది.

**సందేహం** : పుట్టుకలేని ఆత్మకు భిన్నంగా ఇంకొకటి ఏదీ లేనప్పుడు, మరి సంసారం యొక్క కారణ-కార్యాలు మరియు మీరు చెప్పే ఉత్పత్తి-వినాశాలు ఏవిధంగా కలుగుతున్నాయి?

**సమాధానం** : చెప్తున్నాం వినండి.

**సంవృత్యా జాయతే సర్వం శాశ్వతం నాస్తి తేన వై |**
**సద్భావేన హ్యజం సర్వముచ్ఛేదస్తేన నాస్తి వై || || మాం.గౌ.కా. 4-57 ||**

సకలమూ అజ్ఞానవల్లనే పుడుతున్నది. అందుచేత (ఈ జగత్తు) శాశ్వతంగా ఉండేది కాదన్నది నిశ్చయం. యదార్థ దృష్టిలో ఈ జగత్తు సర్వమూ పుట్టడం లేదు కాబట్టి అది నశించడం లేదన్నది నిశ్చయం.

**శంకరుల భాష్యము**

సంవృత్యా సంవరణం సంవృతిః అవిద్యావిషయో లౌకికవ్యవహారః ; తయా సంవృత్యా జాయతే సర్వం . తేన అవిద్యావిషయే శాశ్వతం నిత్యం నాస్తి వై . అతః ఉత్పత్తివినాశలక్షణః సంసారః ఆయత ఇత్యుచ్యతే . పరమార్థసద్భావేన తు అజం సర్వం ఆత్మైవ యస్మాత్ ; అతో జాత్యభావాత్ ఉచ్ఛేదః తేన నాస్తి వై కస్యచిద్ధేతుఫలాదేరిత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

'సంవృతిః' అంటే అజ్ఞానం వల్ల లౌకికవ్యవహారంగా గోచరం కావడం. **సంవృత్యా** అట్టి సంవృతి చేత కప్పబడిన కారణంగా **సర్వమ్ జాయతే** జగత్తు సకలమూ పుడుతోంది (అంటే అజ్ఞానం వల్లనే ఈ సర్వప్రపంచమూ పుడుతున్నట్లుగా అనిపిస్తోంది). **తేన** ఈ అజ్ఞానానికి విషయంగా గోచరించే ఈ ప్రపంచము **శాశ్వతమ్ నాస్తి వై** నిశ్చయంగా నిత్యమైనది కాదు. అందువలన, ఉత్పత్తి-వినాశనాలు లక్షణంగా కలిగిన ఈ సంసారాన్ని వ్యాప్తమైనట్టిదిగా చెప్తారు. **సద్భావేన** పరమార్థ దృష్టిలోనైతే **సర్వమ్ అజమ్** సకల జగత్తూ పుట్టుకలేని ఆత్మయే అయినందువలన, పుట్టుకనేది లేని కారణంగా **తేన** దానికి అంటే కారణ-కార్యరూపమైన ఈ సకల జగత్తుకు **ఉచ్ఛేదః నాస్తి వై** ఎప్పటికీ నశించడం అనేది లేదు అని అభిప్రాయం.

**ధర్మా య ఇతి జాయన్తే జాయన్తే తే న తత్త్వతః |**
**జన్మ మాయోపమం తేషాం సా చ మాయా న విద్యతే ||** **|| మాం.గౌ.కా. 4-58 ||**

ఏ విషయాలైతే పుడుతున్నాయో అవి నిజానికి పుట్టడం లేదు. వాటియందు జన్మ అనేది మాయతో పోలినట్టిది. ఆ మాయ కూడా తెలియబడేది కాదు.

**<u>శంకరుల భాష్యము</u>**

యేఽప్యాత్మానోఽన్యే చ ధర్మా జాయంత ఇతి కల్ప్యంతే, తే ఇతి ఏవంప్రకారా యథోక్తా సంవృతిర్నిర్దిశ్యత ఇతి సంవృత్యైవ ధర్మా జాయంతే . న తే తత్త్వతః పరమార్థతః జాయంతే . యత్పునస్తత్సంవృత్యా జన్మ తేషాం ధర్మాణాం యథోక్తానాం యథా మాయయా జన్మ తథా తత్ మాయోపమం ప్రత్యేతవ్యం . మాయా నామ వస్తు తర్హి ; నైవం , సా చ మాయా న విద్యతే . మాయేత్యవిద్యమానస్యాఖ్యేత్యభిప్రాయః ..

కథం మాయోపమం తేషాం ధర్మాణాం జన్మేతి, ఆహ —

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

**యే ధర్మాః** ఆత్మకు భిన్నంగా ఏ విషయాలైతే **జాయన్తే** పుడుతున్నాయో, అంటే పుడుతున్నట్లుగా కల్పనచేస్తున్నారో, **తే** అవి అంటే ఆ విషయాలు, పైన చెప్పిన ప్రకారంగా, సంవృతిచేత అంటే అజ్ఞానదృష్టిచేత పుట్టినట్లు గోచరిస్తున్నాయే కాని అవి **తత్త్వతః** యదార్థంగా **న జాయన్తే** పుట్టడం లేదు. **తేషామ్** ఆ సంవృతి కారణంగా జన్మిస్తున్నట్లు చెప్పబడుతున్న ఆ విషయాల **జన్మ** పుట్టుక, మాయ ఎలాంటిదో జన్మ కూడా అలాంటిదే అన్నటుగా, **మాయోపమమ్** మాయతో పోలిక కలిగినదిగా తెలుసుకోవాలి.

**<u>సందేహం</u>** : అయితే, మాయ అనబడే తత్త్వం ఒకటి ఉన్నదా?

**<u>సమాధానం</u>** : లేదు. **సా చ మాయా** ఆ మాయ కూడా **న విద్యతే** లేదు. మాయ అనేది తెలియని దానికి పేరు అని అభిప్రాయం.

**<u>సందేహం</u>** : మరి, ఆ విషయాల పుట్టుక మాయతో పోలిక కలిగినట్టిది అని ఎలా చెప్తున్నారు.

**యథా మాయామయాద్బీజాజ్జాయతే తన్మయోఽఙ్కురః |**
**నాసౌ నిత్యో న చోచ్ఛేదీ తద్వద్ధర్మేషు యోజనా ||** **|| మాం.గౌ.కా. 4-59 ||**

ఎలాగైతే మాయ చేత కల్పితమైన బీజం నుండి మొలక పుట్టినట్లు భ్రమకలగడంలో శాశ్వతత్త్వమూ లేదు వినాశమూ లేదో, అదేవిధంగా వస్తువిషయాలు (కూడా శాశ్వతమైనవీ కావు, నశించేవీ కావని) యోచనచేయాలి.

**శంకరుల భాష్యము**

యథా మాయామయాత్ ఆమ్రాదిబీజాత్ జాయతే తన్మయః మాయామయః అంకురః, నాసావంకురో నిత్యః, న చ ఉచ్ఛేదీ వినాశీ వా . అభూతత్వాదేవ ధర్మేషు జన్మనాశాదియోజనా యుక్తిః, న తు పరమార్థతో ధర్మాణాం జన్మ నాశో వా యుజ్యత ఇత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**యథా** ఎలాగైతే **మాయామయాత్** మాయచేత కల్పితమైన మామిడి విత్తనం నుండి **తత్ మయః** ఆ మాయకారణంగా **అంకురః జాయతే** మొలక ఉత్పన్నమైనట్లుగా భ్రమకలిగినప్పుడు, మొలక అనేది నిజానికి ఉనికి లేనిదే అయినందున **అసౌ** అది, ఆ మొలక **న నిత్యః** శాశ్వతమైనదీ కాదో లేదా **న చ ఉచ్ఛేదీ** నశించేది కూడా కాదో, **తద్వత్** అదేవిధంగా, **ధర్మేషు** వస్తువిషయాలకు పుట్టుక-వినాశము వంటివి **యోజనా** ఊహించడం కుదరదు లేదా యదార్థసత్యంగా ఉనికి లేని వస్తువిషయాలకు పుట్టుక-వినాశనాలను జోడించరాదు అని అభిప్రాయం.

**నాజేషు సర్వధర్మేషు శాశ్వతాశాశ్వతాభిధా |**
**యత్ర వర్ణా న వర్తన్తే వివేకస్తత్ర నోచ్యతే || || మాం.గౌ.కా. 4- 60 ||**

పుట్టుకలేని సకల తత్త్వములకు శాశ్వతత్త్వాన్ని, అశాశ్వతత్త్వాన్ని ఆపాదించలేము. ఏ తత్త్వాన్ని శబ్దాలను ఉపయోగించి వివరించడం కుదరదో, ఆ తత్త్వాన్ని గురించి చెప్పడం వీలుకాదు.

**శంకరుల భాష్యము**

పరమార్థతస్త్వాత్మస్వజేషు నిత్యైకరసవిజ్ఞప్తిమాత్రసత్తాకేషు శాశ్వతః అశాశ్వతః ఇతి వా న అభిధా, నాభిధానం ప్రవర్తత ఇత్యర్థః . యత్ర యేషు వర్ణ్యంతే యైరర్థాః, తే వర్ణాః శబ్దా న వర్తంతే అభిధాతుం ప్రకాశయితుం న ప్రవర్తంత ఇత్యర్థః . ఇదమేవమితి వివేకః వివిక్తతా తత్ర నిత్యోఽనిత్య ఇతి నోచ్యతే, 'యతో వాచో నివర్తంతే' (తై. ఉ. 2 . 9 . 1) ఇతి శ్రుతేః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**అజేషు** పుట్టుకనేదే లేని పరమ సత్యమైన ఆత్మయందు, అంటే నిత్యము-ఏకరసము- కేవల విజ్ఞానమే ఉనికిగా గలిగిన దానిని **శాశ్వతః అశాశ్వతః** శాశ్వతమని గాని, అశాశ్వతమని గాని **న అభిధా** పేర్కొనడం వీలుకాదు అని అభిప్రాయం. **యత్ర వర్ణాః** ఏ శబ్దాలచే వస్తువిషయాలు వర్ణింపబడుతున్నాయో ఆ శబ్దాలు, **న వర్తంతే** ఆత్మను వర్ణించడం ప్రకటన చేయడంలో సమర్థములు కావు అని అభిప్రాయం. ఆత్మ గురించిన **వివేకః** వివేకం ఇంతమాత్రమే. **తత్ర** దాని గురించి నిత్యమని-అనిత్యమని **న ఉచ్యతే** చెప్పడం వీలుకాదు. దీనినే 'దేనినుండి వాక్కులు వెనుతిరుగతాయో' ['యతో వాచో నివర్తంతే' (తై.ఉ. 2-9-1)] అని శ్రుతి ప్రకటించింది.

**యథా స్వప్నే ద్వయాభాసం చిత్తం చలతి మాయయా |**

**తథా జాగ్రద్ద్వయాభాసం చిత్తం చలతి మాయయా ||** **|| మాం.గౌ.కా. 4- 61 ||**

ఎలాగైతే స్వప్నావస్థలో మాయచేత చిత్తం (తెలుకొనేది-తెలియబడేది అనే) ద్వైతభావంతో స్పందిస్తోందో, అలాగే జాగ్రదవస్థలోని చిత్తం మాయచేతనే స్పందిస్తుంది.

**అద్వయం చ ద్వయాభాసం చిత్తం స్వప్నే న సంశయః |**

**అద్వయం చ ద్వయాభాసం తథా జాగ్రన్న సంశయః ||** **|| మాం.గౌ.కా. 4- 62 ||**

స్వప్నంలోని చిత్తం అద్వయమైనప్పటికీ, (తెలుసుకొనేదీ-తెలియబడేదీ అనే) ద్వైతభావాన్ని పొందినట్లుగా అనిపిస్తుంది అనడంలో సందేహం లేదు. అలాగే, జాగ్రదవస్థలో కూడా అద్వయమైన ఆత్మ ద్వైతభావాన్ని పొందినట్లుగా అనిపిస్తుంది అనడంలో కూడా సందేహం లేదు.

**<u>శంకరుల భాష్యము</u>**

యత్పునర్వాగ్గోచరత్వం పరమార్థతః అద్వయస్య విజ్ఞానమాత్రస్య, తన్మనసః స్పందనమాత్రం , న పరమార్థతః ఇత్యుక్తార్థౌ శ్లోకౌ ..

ఇతశ్చ వాగ్గోచరస్యాభావో ద్వైతస్య —

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

యదార్థానికి అద్వయమైన కేవల విజ్ఞానానికి, తిరిగి వాక్కుకు గోచరించడం అనేది ఏదైతే ఉన్నదో, అది కేవలం మనసు యొక్క స్పందన మాత్రం చేతనే కలుగుతోంది కాని, పరమార్థంగా కాదు అని, ఈ రెండు శ్లోకాలకు అర్థాన్ని గతంలో (మా.గౌ.కా. 3-29, 30 నందు) చెప్పి ఉన్నాం. {మాం.గౌ.కా. 3-29, 30 శ్లోకాలలో ప్రస్తావించిన 'మనః' శబ్దానికి బదులు ఇక్కడ 'చిత్తమ్' అని చెప్తున్నారు. (అంటే చైతన్యం అని వేదాంతపరమైన అర్థాన్నే గ్రహించాలే కాని, బౌద్ధులు చెప్పే దానిని స్వీకరించరాదు). రాబోయే 4-64 నుండి 4-67 శ్లోకాలలో 'చిత్తమ్' అన్నదానికి సాధారణంగా అనుభవంలో ఉన్న చైతన్యమనే అర్థం.}

ఈ చెప్పబోయే కారణంగా కూడా, వాక్కుచే గోచరమయ్యే ద్వైతం అనేదానికి ఉనికి లేదు.

**స్వప్నదృక్ప్రచరన్స్వప్నే దిక్షు వై దశసు స్థితాన్ |**

**అండజాన్స్వేదజాన్వాపి జీవాన్పశ్యతి యాన్సదా ||** **|| మాం.గౌ.కా. 4- 63 ||**

స్వప్నవిహారం చేస్తూ ఆ స్వప్నంలో పది దిక్కులలోనూ ఉన్న అండజములు, స్వేదజముల వంటి ప్రాణులను కూడా సదా చూస్తుంటాడు.

**శంకరుల భాష్యము**

స్వప్నాన్పశ్యతీతి స్వప్నదృక్ ప్రచరన్ పర్యటన్స్వప్నే స్వప్నస్థానే దిక్షు వై దశసు స్థితాన్ వర్తమానాన్ జీవాన్ప్రాణినః అండజాన్స్వేదజాన్వా యాన్ సదా పశ్యతీతి ..

యద్యేవం , తతః కిం ? ఉచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**స్వప్నదృక్** అంటే స్వప్నాన్ని చూసేవాడు **స్వప్నే ప్రచరన్** స్వప్నంలో సంచరిస్తూ **దిక్షు వై దశసు స్థితాన్** పది దిక్కులలో ఉన్నటువంటి **అండజాన్ స్వేదజాన్** గ్రుడ్లనుండి పుట్టేవి, చెమటనుండి పుట్టేవి అయిన **జీవాన్ యాన్** ఏ జీవులనైతే **సదా పశ్యతి** ఎల్లప్పుడూ చూస్తూనే ఉంటాడో అని.

ఒకవేళ అలా అయితే, ఇంక ఏమిటి? అనే ప్రశ్నకు బదులిస్తున్నారు.

**స్వప్నదృక్చిత్తదృశ్యాస్తే న విద్యన్తే తతః పృథక్ |**
**తథా తద్దృశ్యమేవేదం స్వప్నదృక్చిత్తమిష్యతే ||** **|| మాం.గౌ.కా. 4- 64 ||**

స్వప్నాన్ని చూసేవాని యొక్క చిత్తానికి గోచరిస్తున ఆ విషయాలు దానికి (ఆ స్వప్నాన్ని చూసేవాని యొక్క చిత్తానికి) వేరుగా లేవు. అదేవిధంగా, స్వప్నాన్ని చూసేవానికి భిన్నంగా ఈ స్వప్నద్రష్టయొక్క చిత్తమనే ఈ దృశ్యం లేదు.

**శంకరుల భాష్యము**

స్వప్నదృశశ్చిత్తం స్వప్నదృక్చిత్తం , తేన దృశ్యాః తే జీవాః ; తతః తస్మాత్ స్వప్నదృక్చిత్తాత్ పృథక్ న విద్యంతే న సంతీత్యర్థః . చిత్తమేవ హ్యనేకజీవాదిభేదాకారేణ వికల్ప్యతే . తథా తదపి స్వప్నదృక్చిత్తమిదం తద్దృశ్యమేవ, తేన స్వప్నదృశా దృశ్యం తద్దృశ్యం . అతః స్వప్నదృగ్వ్యతిరేకేణ చిత్తం నామ నాస్తీత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**స్వప్నదృక్ చిత్తమ్** స్వప్నాన్ని చూసేవాని చిత్తమునకు **తే దృశ్యాః** అవి అంటే ఆ ప్రాణులు దృశ్యములు. **తతః** అందువలన, స్వప్నద్రష్ట యొక్క చిత్తానికి **పృథక్ న విద్యంతే** వేరుగా ఉనికిగలవి కావు. ఆ స్వప్నద్రష్ట యొక్క చిత్తమే అనేకవిధములైన ప్రాణులుగా వికల్పాన్ని పొందుతోంది. **తథా** అదేవిధంగా, **స్వప్నదృక్ చిత్తమ్** ఆ స్వప్నద్రష్ట యొక్క చిత్తం కూడా **తత్ దృశ్యమ్ ఏవ** ఆ స్వప్నద్రష్టకు దృశ్యమే. అందుచేత, స్వప్నద్రష్టకు భిన్నంగా చిత్తమనే పేరుగలది వేరేదీ లేదని అభిప్రాయం.

**చరఞ్జాగరితే జాగ్రద్దిక్షు వై దశసు స్థితాన్ |**

**అండజాన్స్వేదజాన్వాపి జీవాన్పశ్యతి యాన్సదా ||** **|| మాం.గౌ.కా. 4- 65 ||**

జాగ్రదవస్థలో విహారిస్తూ ఆ జాగ్రత్తులో పది దిక్కులలోనూ ఉన్న అండజములు, స్వేదజముల వంటి ఏ ప్రాణులనైతే సదా చూస్తుంటాడో,

**జాగ్రచ్చిత్తేక్షణీయాస్తే న విద్యన్తే తతః పృథక్ |**

**తథా తద్దృశ్యమేవేదం జాగ్రతశ్చిత్తమిష్యతే ||** **|| మాం.గౌ.కా. 4- 66 ||**

జాగ్రత్తును చూసేవాని యొక్క చిత్తానికి గోచరిస్తున ఆ ప్రాణులు దానికి (ఆ జాగ్రత్తును చూసేవాని యొక్క చిత్తానికి) వేరుగా లేవు. అదేవిధంగా, జాగ్రత్తును చూసేవానికి భిన్నంగా ఈ జాగ్రత్తుద్రష్టయొక్క చిత్తమనే ఈ దృశ్యం లేదు.

**<u>శంకరుల భాష్యము</u>**

జాగ్రతో దృశ్యా జీవాః తచ్చిత్తావ్యతిరిక్తాః, చిత్తేక్షణీయత్వాత్ , స్వప్న దృక్చిత్తేక్షణీయజీవవత్ . తచ్చ జీవేక్షణాత్మకం చిత్తం ద్రష్టురవ్యతిరిక్తం ద్రష్టృదృశ్యత్వాత్ స్వప్న చిత్తవత్ . ఉక్తార్థమన్యత్ ..

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

స్వప్నద్రష్ట యొక్క చిత్తం చేత చూడబడిన ప్రాణుల లాగా, జాగ్రత్తునందు దృశ్యములైన **తే** ఆ ప్రాణులు **జాగ్రత్ చిత్తే** జాగ్రదవస్థలోని చిత్తం చేత **ఈక్షణీయాః** చూడబడేవి కావడం చేత, **తతః** ఆ జాగ్రదవస్థలోని చిత్తానికి **పృథక్ న విద్యంతే** భిన్నములు కావు. **తథా** స్వప్నంలోని చిత్తం లాగానే, **తత్ దృశ్యమ్ ఏవ** అది (ఆ జాగ్రదవస్థలోని చిత్తం కూడా) జాగ్రద్రష్టకు దృశ్యమే అయినందువల్ల, మరి ఆ ప్రాణులను దర్శించే **జాగ్రతః చిత్తమ్** జాగ్రదవస్థలోని చిత్తం, ద్రష్టకు భిన్నమైనది కాకపోవడమే **ఇష్యతే** అభిలషణీయమైనది. శ్లోకములలో మిగతా భాగానికి ముందు చెప్పినట్లుగానే గ్రహించాలి.

**ఉభే హ్యన్యోన్యదృశ్యే తే కిం తదస్తీతి చోచ్యతే |**

**లక్షణాశూన్యముభయం తన్మతే నైవ గృహ్యతే ||** **|| మాం.గౌ.కా. 4- 67 ||**

రెండూ (అంటే ప్రాణులూ మరియు చిత్తమూ రెండూ) పరస్పరం ఒకదాన్ని మరొకటి చూస్తాయని నిశ్చయిస్తే, మరి వాటిలో అస్తిత్వం కలది ఏది? అని అంటే, రెండూ ఒకదానితో మరొకటి ముడిపడి స్వతంత్ర ప్రామాణ్యత లేనివే అయినందున, అలా (అస్తిత్వం కలవిగా) భావించడం కుదరదు.

## శంకరుల భాష్యము

జీవచిత్తే ఉభే చిత్తచైత్యే తే అన్యోన్యదృశ్యే ఇతరేతరగమ్యే . జీవాదివిషయాపేక్షం హి చిత్తం నామ భవతి . చిత్తాపేక్షం హి జీవాది దృశ్యం . అతస్తే అన్యోన్యదృశ్యే . తస్మాన్న కించిదస్తీతి చోచ్యతే చిత్తం వా చిత్తేక్షణీయం వా . కిం తదస్తీతి వివేకినోచ్యతే . న హి స్వప్నే హస్తీ హస్తిచిత్తం వా విద్యతే ; తథా ఇహాపి వివేకినామిత్యభిప్రాయః . కథం ? లక్షణాశూన్యం లక్ష్యతే అనయేతి లక్షణా ప్రమాణం ; ప్రమాణశూన్యముభయం చిత్తం చైత్యం ద్వయం యతః, తన్మతేనైవ తచ్చిత్తతయైవ తత్ గృహ్యతే . న హి ఘటమతిం ప్రత్యాఖ్యాయ ఘటో గృహ్యతే, నాపి ఘటం ప్రత్యాఖ్యాయ ఘటమతిః . న హి తత్ర ప్రమాణప్రమేయభేదః శక్యతే కల్పయితుమిత్యభిప్రాయః ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**ఉభే** చూడబడే ప్రాణులు మరియు చూసే చిత్తమూ అనే ఆ రెండూ **అన్యోన్యదృశ్యే** పరస్పరం ఒకదానిని మరొకటి పొందుతుంది (అనేటట్లైతే). ప్రాణాది విషయాలపట్ల ఆసక్తి కలదాన్నే చిత్తం అని అంటున్నాం. (అంటే, విషయాలు ఉంటేనే చిత్తం ఉన్నట్లు. విషయాలు లేకుంటే చిత్తానికి ఉనికియే లేదని అర్థం). చిత్తమనేది ఉంటేనే ప్రాణాది విషయాలు చూడబడటం అనేది కలుగుతోంది. (అంటే, చిత్తం ఉంటేనే ప్రాణాదులు విషయాలుగా గోచరిస్తున్నాయి. చిత్తం లేకపోతే విషయాలకు ఉనికి లేకుండా పోతుంది). ఆవిధంగా అవి ఒకదానికొకటి పరస్పర దృశ్యాలు. అందువలన, **కిమ్ తత్ అస్తి** చిత్తం అన్నది గాని చిత్తవిషయమన్నది కాని ఉన్నదా? **ఇతి** అని ప్రశ్నిస్తే, **తే** వివేకులైనవారు **న చ ఉచ్యతే** లేదనే చెప్తారు. స్వప్నంలోని ఏనుగు గాని లేదా ఏనుగు చూసే చిత్తం కాని (యదార్థానికి) లేనట్లే, ఇక్కడ కూడా (జాగ్రదవస్థలో కూడా) వివేకులు ఇలా (చిత్తంగాని, చిత్తవిషయాలుగాని లేవని) అభిప్రాయపడుతున్నారు. (రెండూ లేకపోవడం) ఎలా? **ఉభయమ్** చిత్తము మరియు చిత్తవిషయమనే రెండూ **లక్షణా శూన్యమ్** లక్షణము లేనివే. లక్షణా అనగా లక్ష్యించబడేది అంటే ప్రామాణికమైనదని అర్థం. అంటే, చిత్తము మరియు చిత్తవిషయమనే రెండింటికి కూడా ప్రామాణ్యం లేనందు వల్ల, కేవలం **తన్మతేన ఏవ** ఒక దానిని గురించి ఆలోచిస్తే రెండవది ఆ ఆలోచనలో ఇమిడి ఉన్నందు చేతనే **గృహ్యతే** గ్రహించబడుతోంది. ఎందువల్లనంటే, ఘటబుద్ధికి వేరుగా ఘటం తెలియబడటం లేదు, ఘటానికి భిన్నంగా ఘటబుద్ధి అనేది కలగడమూ లేదు. కాబట్టి, అక్కడ (చిత్తము-చిత్త దృశ్యం అన్న రెండింటిలో) ప్రమాణ-ప్రమేయాలనే భేధాన్ని చూపడం సాధ్యంకాదు అని అభిప్రాయం.

**యథా స్వప్నమయో జీవో జాయతే మ్రియతేఽపి చ |**
**తథా జీవా అమీ సర్వే భవన్తి న భవన్తి చ || || మాం.గౌ.కా. 4- 68 ||**

ఎలాగైతే స్వప్నంలోని జీవుడు జననాన్ని మరియు మరణాన్ని కూడా పొందుతున్నాడో, అలాగే (జాగ్రత్తులోని) ఈ సకల జీవులు కూడా ఉంటున్నారు, మరియు లేకుండాపోతున్నారు కూడా.

**యథా మాయామయో జీవో జాయతే మ్రియతేఽపి చ |**

**తథా జీవా అమీ సర్వే భవన్తి న భవన్తి చ ||** **|| మాం.గౌ.కా. 4- 69 ||**

ఎలాగైతే (ఇంద్రజాలికునిచేత) మాయచేత కల్పించబడిన జీవుడు పుడుతూ మరియు మరణిస్తూ ఉన్నాడో, అలాగే (జాగ్రత్తులోని) ఈ సకల జీవులు కూడా ఉంటున్నారు మరియు లేకుండాపోతున్నారు కూడా.

**యథా నిర్మితకో జీవో జాయతే మ్రియతేఽపి చ |**

**తథా జీవా అమీ సర్వే భవన్తి న భవన్తి చ ||** **|| మాం.గౌ.కా. 4- 70 ||**

ఎలాగైతే (మంత్రంచేత గాని, రసాయనాదుల చేతగాని) కృత్రిమంగా కల్పించబడిన జీవుడు పుడుతూ మరియు మరణిస్తూ ఉన్నాడో, అలాగే (జాగ్రత్తులోని) ఈ సకల జీవులు కూడా ఉంటున్నారు మరియు లేకుండాపోతున్నారు కూడా.

**శంకరుల భాష్యము**

మాయామయః మాయావినా యః కృతో నిర్మితకః మంత్రౌషధ్యాదిభిర్నిష్పాదితః . స్వప్నమాయానిర్మితకా అండజాదయో జీవా యథా జాయంతే మ్రియంతే చ, తథా మనుష్యాదిలక్షణా అవిద్యమానా ఏవ చిత్తవికల్పనామాత్రా ఇత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**మాయామయః** అంటే ఇంద్రజాలముతో కల్పించబడిన, **నిర్మితకః** మంత్రంచేత, రసాయనాదులచేత తయారుచేయబడిన **స్వప్నమాయా** స్వప్నస్థితిలో కనిపించే **జీవః** అండజాదులనుండి ఉద్భవించే ప్రాణి లేదా జీవుడు **యథా** ఎలాగైతే **జాయంతే మ్రియంతే చ** పుడుతున్నాడో మరియు మరణిస్తున్నాడో. **తథా** అదేవిధంగా మనుష్యాది లక్షణాలు కల ప్రాణులు, కేవలం చిత్తము యొక్క కల్పనలు మాత్రమే, అంటే యదార్థానికి లేనివే అని అభిప్రాయం.

**న కశ్చిజ్జాయతే జీవః సమ్భవోఽస్య న విద్యతే |**

**ఏతత్తదుత్తమం సత్యం యత్ర కిఞ్చిన్న జాయతే ||** **|| మాం.గౌ.కా. 4- 71 ||**

ఏ జీవునికైనా పుట్టుకనేది లేదు. అతని పుట్టుకకు కారణమైనది ఏదీ లేదు. దేనియందు ఏదీ పుట్టడం లేదో అదియే (అట్టి పరబ్రహ్మమే) అత్యుత్తమమైన సత్యం.

**శంకరుల భాష్యము**

వ్యవహారసత్యవిషయే జీవానాం జన్మమరణాదిః స్వప్నాదిజీవవదిత్యుక్తం . ఉత్తమం తు పరమార్థసత్యం న కశ్చిజ్జాయతే జీవ ఇతి . ఉక్తార్థమన్యత్ ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

వ్యావహారిక సత్య విషయంగా, స్వప్నంలోని జీవులతో పోల్చి, (జాగ్రదవస్థలో) జీవులకు జన్మ-మరణాదుల గురించి (మాం.గౌ.కా. 4-68, 69, 70 శ్లోకాలలో) ప్రస్తావించారు. కాని, **న కశ్చిత్ జాయతే జీవః** ఏ జీవుడూ జన్మించడం లేదనేదే, **తత్ ఏతత్ ఉత్తమమ్ సత్యమ్** అదియే ఉత్తమమైన పరమార్థమైన సత్యం. మిగిలిన శ్లోకం భాగం మాం.గౌ.కా 3-48లో వివరించినట్లుగానే స్వీకరించాలి.

**చిత్తస్పన్దితమేవేదం గ్రాహ్యగ్రాహకవద్ద్వయమ్ |**
**చిత్తం నిర్విషయం నిత్యమసంగం తేన కీర్తితమ్ ||** **|| మాం.గౌ.కా. 4- 72 ||**

విషయం-విషయి వంటి ఈ ద్వైతం చిత్తం యొక్క స్పందన మాత్రమే. చిత్తమైతే విషయం లేనిది. అందుచేత శాశ్వతమైనదని, సంగరహితమైనదని కీర్తించబడింది.

**శంకరుల భాష్యము**

సర్వం గ్రాహ్యగ్రాహకవచ్చిత్తస్పందితమేవ ద్వయం . చిత్తం పరమార్థత ఆత్మైవేతి నిర్విషయం . తేన నిర్విషయత్వేన నిత్యం అసంగం కీర్తితం . 'అసంగో హ్యయం పురుషః' (బృ. ఉ. 4 . 3 . 15) ఇతి శ్రుతేః . సవిషయస్య హి విషయే సంగః . నిర్విషయత్వాచ్చిత్తమసంగమిత్యర్థః ..

నను నిర్విషయత్వేన చేదసంగత్వం , చిత్తస్య న నిఃసంగతా భవతి, యస్మాత్ శాస్తా శాస్త్రం శిష్యశ్చేత్యేవమాదేర్విషయస్య విద్యమానత్వాత్ ; నైష దోషః . కస్మాత్ ?

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**గ్రాహ్యగ్రాహకవత్** విషయం-విషయి వంటి సమస్తమైన **ద్వయమ్** ద్వైతమూ **చిత్తస్పందితమ్** చిత్తం యొక్క స్పందన మాత్రమే. యదార్థంగా **చిత్తమ్** మనసు ఆత్మయే అవడంచేత **నిర్విషయమ్** విషయములేనిది. **తేన** ఆ కారణంగా, విషయం లేనిది కావడం చేత **నిత్యమ్** శాశ్వతమైనది, **అసంగం** వేరొకదానితో సంపర్కమే లేనిది అని **కీర్తితమ్** కీర్తించబడినది. 'ఈ పురుషుడు నిశ్చయంగా సంగరహితుడే' ['అసంగో హ్యయం పురుషః' (బృ.ఉ. 4-3-15)] అని శ్రుతి చెప్పింది. విషయాలు కలిగినది ఏదైనా విషయం సంపర్కం కలదే అవుతుంది. విషయాలు లేని చిత్తం సంపర్కము లేనిదే అని అభిప్రాయం.

**సందేహం :** విషయం లేకపోవడం చేత చిత్తానికి అసంగత్వం కలుగుతుందంటే, చిత్తం సంగం లేనిది కాజాలదు. ఎందుకంటే, బోధించేవాడు, శాస్త్రం, మరియు శిష్యుడు అనేటటువంటివి విషయాలు ఉంటూనే ఉన్నాయి కదా!

**సమాధానం :** అందులో తప్పేమీ లేదు.

ఎందువల్ల తప్పులేదో తర్వాత శ్లోకంలో చెప్తున్నారు.

**యోఽస్తి కల్పితసంవృత్యా పరమార్థేన నాస్త్యసౌ |**
**పరతన్త్రాభిసంవృత్యా స్యాన్నాస్తి పరమార్థతః || || మాం.గౌ.కా. 4- 73 ||**

ఏదైతే సంవృత్తి చేత (అజ్ఞానం వల్ల లౌకిక వ్యవహారంగా అనుభవానికి రావడం చేత) కల్పించబడి ఉనికిని కలిగి ఉన్నదో అది యదార్థంగా ఉన్నది కాదు. ఇతరములచేత కల్పితమైన ఈ సంవృత్తికి యదార్థంగా ఉనికియే లేదు.

**శంకరుల భాష్యము**

యః పదార్థః శాస్త్రాదిర్విద్యతే, స కల్పితసంవృత్యా . కల్పితా చ సా పరమార్థప్రతిపత్త్యుపాయత్వేన సంవృతిశ్చ సా తయా యోఽస్తి పరమార్థేన, నాస్త్యసౌ న విద్యతే . 'జ్ఞాతే ద్వైతం న విద్యతే' (మా. కా. 1 . 18) ఇత్యుక్తం . యశ్చ పరతంత్రాభిసంవృత్యా పరశాస్త్రవ్యవహారేణ స్యాత్పదార్థః, స పరమార్థతో నిరూప్యమాణో నాస్త్యేవ . తేన యుక్తముక్తం 'అసంగం తేన కీర్తితం' (మా. కా. 4 . 72) ఇతి ..

నను శాస్త్రాదీనాం సంవృతిత్వే అజ ఇతీయమపి కల్పనా సంవృతిః స్యాత్ . సత్యమేవం ;

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**యః** ఏ పదార్థమైతే శాస్త్రం ద్వారా తెలియబడుతుందో అది **సంవృత్యా కల్పితః** కల్పించబడిన సంవృత్తి. యదార్థమైన సత్యాన్ని పొందేందుకు ఉపాయంగా మాత్రమే ఈ (శాస్త్రం అనే) సంవృత్తి కల్పించబడింది. **అసౌ** అటువంటి సంవృత్తి కారణంగా ఉనికి కలిగినది ఏదీ **పరమార్థేన న అస్తి** యదార్థంగా ఉన్నట్టిది కాదు. దీనినే 'జ్ఞానం కలిగితే ద్వైతం ఉండదు' ['జ్ఞాతే ద్వైతం న విద్యతే' (మా.గౌ.కా. 1-18) అని గతంలో చెప్పే ఉన్నారు. మరి **పరతంత్రాభిసంవృత్యా** ఇతర శాస్త్రవ్యవహారముల కారణంగా కల్పించబడిన విషయం ఏదైతే ఉన్నదో అది **పరమార్థతః** యదార్థ సత్య దృష్టిలో **న అస్తి స్యాత్** ఉన్నట్టిది కాదు అని నిరూపించతగినదే. 'అందుచేత సంగరహితమైనదిగా కీర్తించబడింది' ['అసంగం తేన కీర్తితం' (మా.గౌ.కా. 4-72)] అని గత శ్లోకంలో యుక్తితో చెప్పారు.

**<u>సందేహం</u> :** శాస్త్రాదులయందు కూడా సంవృత్తిని (అజ్ఞానం కారణంగా కల్పితమైన అనుభవాలే అని) ఆపాదించినట్లైతే, ఆ శాస్త్రంలో చెప్పిన పుట్టుకలేనిది అన్న విషయం కూడా సంవృత్తియే కావచ్చు కదా!

**<u>సమాధానం</u> :** నిజమే.

**అజః కల్పితసంవృత్యా పరమార్థేన నాప్యజః |**
**పరతన్త్రాభినిష్పత్త్యా సంవృత్యా జాయతే తు సః || || మాం.గౌ.కా. 4- 74 ||**

ఇతర వాదనలలోని అజ్ఞానం చేత అది (ఆ పరమాత్మ) పుడుతోంది అని (ద్వైతులచే) కల్పనచేయబడటం చేత, అది పుట్టుకలేనిది అని (అద్వైతులు) కల్పించారే కాని, యదార్థానికి అది పుట్టుకలేనిది కూడా కాదు.

**శంకరుల భాష్యము**

శాస్త్రాదికల్పితసంవృత్యైవ అజ ఇత్యుచ్యతే . పరమార్థేన నాప్యజః, యస్మాత్ పరతంత్రాభినిష్పత్త్యా పరశాస్త్రసిద్ధిమపేక్ష్య యః అజ ఇత్యుక్తః, స సంవృత్యా జాయతే . అతః అజ ఇతీయమపి కల్పనా పరమార్థవిషయే నైవ క్రమత ఇత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**అజః** ఆత్మ పుట్టుకలేనిది అని చెప్పడం కూడా **కల్పితసంవృత్త్యా ఏవ** శాస్త్రాదులవంటి వాటి సహాయంతో చేయబడిన అజ్ఞానకల్పన మాత్రమే అని అంటున్నారు. **పరమార్థేన న అపి అజః** ఆత్మ యదార్థంగా పుట్టుకలేనిది కూడా కాదు. ఎందువల్లనంటే, **పరతంత్రాభినిష్పత్యా** ఏది పుట్టనిది అని చెప్పబడినదో అది పుడుతోంది అని **సంవృత్యా తు** ఇతర శాస్త్రవాదములలో (ద్వైతులచే) అజ్ఞానంతో **జాయతే** పుడుతున్నది అని కల్పన చేయబడింది కాబట్టి. అందువలన (ఆ వాదనను తిరస్కరించే క్రమంలో చెప్పబడిన) ఈ పుట్టుకలేనిది అనేది కూడా కల్పనయే కాని యదార్థం కాదు అని అభిప్రాయం.

**అభూతాభినివేశోఽస్తి ద్వయం తత్ర న విద్యతే |**
**ద్వయాభావం స బుద్ధ్వైవ నిర్నిమిత్తో న జాయతే || || మాం.గౌ.కా. 4- 75 ||**

అచట (ఆ ఆత్మ తత్త్వంలో) రెండవది ఏదీ లేదు. అయినా అసత్ విషయం పట్ల సాధారణ జనులకు అభినివేశం ఉంటోంది. జ్ఞానం కలిగిన మీదట ద్వైతభావం లేకుండా పోతుంది. కారణమన్నది లేనందుచేత జన్మించుట ఉండదు.

**శంకరుల భాష్యము**

యస్మాదసద్విషయః, తస్మాత్ అసత్యభూతే ద్వైతే అభినివేశోఽస్తి కేవలం . అభినివేశః ఆగ్రహమాత్రం . ద్వయం తత్ర న విద్యతే మిథ్యాభినివేశమాత్రం చ జన్మనః కారణం యస్మాత్ , తస్మాత్ ద్వయాభావం బుద్ధ్వా నిర్నిమిత్తః నివృత్తమిథ్యాద్వయాభినివేశః యః, సః న జాయతే ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

బాహ్యంలో విషయవస్తువనేది ఏదీ లేనందుచేత, **అభూతా** అసద్రూపమైన ద్వైతమునందు కేవలం **అభినివేశః అస్తి** మొండి పట్టుదల మాత్రమే ఉంటుంది. **తత్ర** అక్కడ **ద్వయమ్ న విద్యతే** రెండవది ఏదీ తెలియబడదు. కేవలం అసద్విషయం పట్ల భ్రాంతిని కలిగించే పట్టుదల మాత్రమే జన్మకు కారణం అవుతోంది అని, **ద్వయాభావమ్** ద్వైతమన్నది లేదని ఎవడైతే **బుద్ధ్వా** యదార్థాన్ని గ్రహించి **నిర్నిమిత్తః** ద్వైతభ్రాంతి పట్ల పట్టుదలను విడనాడుతాడో **సః ఏవ** అతడు మాత్రమే **న జాయతే** పుట్టడు.

**యదా న లభతే హేతూనుత్తమాధమమధ్యమాన్ |**

**తదా న జాయతే చిత్తం హేత్వభావే ఫలం కుతః ||** **|| మాం.గౌ.కా. 4- 76 ||**

ఉత్తమమైన, మధ్యమమైన, అల్పమైన కారణాలేవీ లేనప్పుడు చిత్తం పుట్టదు. కారణం లేకుండా కార్యం ఎక్కడుంది?

**శంకరుల భాష్యము**

జాత్యాశ్రమవిహితా ఆశీర్వర్జితైరనుష్ఠీయమానా ధర్మా దేవత్వాదిప్రాప్తిహేతవ ఉత్తమాః కేవలాశ్చ . ధర్మాః అధర్మవ్యామిశ్రామనుష్యత్వాదిప్రాప్త్యర్థా మధ్యమాః . తిర్యగాదిప్రాప్తినిమిత్తా అధర్మలక్షణాః ప్రవృత్తివిశేషాశ్చాధమాః . తానుత్తమమధ్యమాధమానవిద్యాపరికల్పితాన్ యదా ఏకమేవాద్వితీయమాత్మతత్త్వం సర్వకల్పనావర్జితం జానన్ న లభతే న పశ్యతి, యథా బాలైర్దృశ్యమానం గగనే మలం వివేకీ న పశ్యతి, తద్వత్ , తదా న జాయతే నోత్పద్యతే చిత్తం దేవాద్యాకారైః ఉత్తమాధమమధ్యమఫలరూపేణ . న హ్యసతి హేతౌ ఫలముత్పద్యతే బీజాద్యభావ ఇవ సస్యాది ..

హేత్వభావే చిత్తం నోత్పద్యత ఇతి హి ఉక్తం . సా పునరనుత్పత్తిశ్చిత్తస్య కీదృశీత్యుచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఫలాపేక్ష లేకుండా ఆచరించే ధర్మాలు, వివిధ జాతులకు మరియు వివిధ ఆశ్రమాలకు విహితమైన ధర్మాలు, దేవతాప్రాప్తికి కారణమయ్యేవి కేవలం ధర్మములు మాత్రమే అయినవి ఉత్తమమైన ధర్మాలు. అధర్మంతో కలగలిసిన ధర్మాలు మనుష్యత్వాదులుగా ప్రాప్తించే మధ్యరకం ధర్మాలు. అధర్మలక్షణం కలిగిన విశేష ప్రవృత్తి గలిగి, పశుపక్ష్యాది జన్మల ప్రాప్తికి కారణమయ్యేవి అధమమైన ధర్మాలు. మూర్ఖులకు ఆకాశం ధూళి దూసరమైనదిగా కనబడుతుండగా, వివేకి అలా దర్శించడో అలాగా,

**యదా** ఎప్పుడు ఆత్మతత్త్వం ఒక్కటిగా, రెండవదనేదీ ఏదీ లేనిదిగా, సకల కల్పనారహితమైనదిగా తెలియబడగా, ఉత్తమ-మధ్యమ-అధమమైన అవిద్యచే కల్పితమైన ధర్మాలను **న లభతే** దర్శించడో, **తదా** అప్పుడు **చిత్తం** ఉత్తమ-మధ్యమ-అధమ ఫలాలైన దేవ, మనుష్య, తిర్యక్ జన్మలను **న జాయతే** పొందదు. విత్తనం లేకుండా మొలక రానట్లే, **హేతు అభావే** కారణం లేకుండా **కుతః ఫలమ్** కార్యం ఎక్కడిది? అంటే ఉండదు అని అభిప్రాయం.

హేతువు లేని కారణంగా చిత్తానికి అజత్వాన్ని నిశ్చయంచేసి చెప్పారు కదా! మరి తిరిగి ఉత్పత్తిలేని ఆ చిత్తాన్ని గురించి ఎందుకు ప్రస్తావిస్తున్నారో చెప్తున్నారు.

**అనిమిత్తస్య చిత్తస్య యానుత్పత్తిః సమాద్వయా |**

**అజాతస్యైవ సర్వస్య చిత్తదృశ్యం హి తద్యతః ||** **|| మాం.గౌ.కా. 4- 77 ||**

కారణంలేనందున చిత్తం యొక్క పుట్టుకలేకపోవడం అనే స్థితి సమమైనదీ (విశేషములు లేనిదీ) అద్వయమైనదీ. సకలమూ (అంటే ఈ ద్వైతప్రపంచమూ మరియు దాని పుట్టుకా) అటువంటి (సమమైన మరియు అద్వయమైన) ఆత్మతత్త్వానికి దృశ్యమాన మైనది.

**శంకరుల భాష్యము**

పరమార్థదర్శనేన నిరస్తధర్మాధర్మాఖ్యోత్పత్తినిమిత్తస్య అనిమిత్తస్య చిత్తస్యేతి యా మోక్షాఖ్యా అనుత్పత్తిః, సా సర్వదా సర్వావస్థాసు సమా నిర్విశేషా అద్వయా చ ; పూర్వమపి అజాతస్యైవ అనుత్పన్నస్య చిత్తస్య సర్వస్యాద్వయస్యేత్యర్థః . యస్మాత్ప్రాగపి విజ్ఞానాత్ చిత్తం దృశ్యం తద్ద్వయం జన్మ చ, తస్మాదజాతస్య సర్వస్య సర్వదా చిత్తస్య సమా అద్వయైవ అనుత్పత్తిః న పునః కదాచిద్భవతి, కదాచిద్వా న భవతి . సర్వదా ఏకరూపైవేత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

యదార్థ సత్యాన్ని దర్శించిన మీదట, పాపపుణ్యాలనబడే ఉత్పత్తి కారణాలు తొలగిపోగా, **అనిమిత్తస్య చిత్తస్య** మోక్షమనబడే ఆ కారణమనేది లేని చిత్తము ఏది ఉన్నదో అది **అనుత్పత్తిః** పుట్టుకలేకుండానే ఉనికి కలిగి ఉన్నది. అది ఎల్లప్పుడూ సకల అవస్థలలోనూ **సమా** సమంగా అంటే ఎటువంటి విశేషాలు లేనిది **అద్వయా** అట్టి రెండవది ఏదీ లేనిది కూడా. సత్యదర్శనానికి పూర్వం కూడా **అజాతస్య ఏవ** పుట్టుకలేని ఆ చిత్తానికి **సర్వస్య** ఏదీ కూడా రెండవది కాదు అని అభిప్రాయం. ఎందువల్లనంటే, జ్ఞానం కలగటానికి ముందు కూడా ఆ ద్వైతము మరియు పుట్టుకలు చిత్తానికి దృశ్యములే కాబట్టి. అందువలన, పుట్టుకలేని మరియు ఎల్లప్పుడూ ఉనికి గల చిత్తము సమంగా ఎటువంటి విశేషాలు లేకుండా, అద్వయమైనట్టిది కనుక అసలు ఉత్పన్నతయే లేనప్పుడు, మరి ఒకప్పుడు పుడుతుందని కాని మరొకప్పుడు పుట్టలేదని గాని ఎలా చెప్తాం. అంటే, ఆత్మతత్త్వము ఎల్లప్పుడూ ఒకే స్థితిలో ఉనికి కలిగినదేనని అభిప్రాయం.

**బుద్ధ్వానిమిత్తతాం సత్యాం హేతుం పృథగనాప్నువన్ |**
**వీతశోకం తథా కామమభయం పదమశ్నుతే ||** **|| మాం.గౌ.కా. 4- 78 ||**

కారణంలేకపోవడమనే సత్యాన్ని తెలిసిన వాడు, మరొక హేతువును అంగీకరించడు. అతడు శోకాన్ని, అలాగే కోరికను, వీడినవాడై, అభయ స్థితిని పొందుతాడు.

**శంకరుల భాష్యము**

యథోక్తేన న్యాయేన జన్మనిమిత్తస్య ద్వయస్య అభావాదనిమిత్తతాం చ సత్యాం పరమార్థరూపాం బుద్ధ్వా హేతుం ధర్మాదికారణం దేవాదియోనిప్రాప్తయే పృథగనాప్నువన్ అనుపాదదానః త్యక్తబాహ్యైషణః సన్ కామశోకాదివర్జితం అవిద్యాదిరహితం అభయం పదం అశ్నుతే, పునర్న జాయత ఇత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

పైన చెప్పిన విధంగా జన్మకు మరియు ద్వైత స్థితికి **అనిమిత్తతామ్** కారణమన్నది లేకపోవడం చేత మరియు **సత్యామ్ బుద్ధ్వా** పరమసత్యం యొక్క యదార్థ స్వరూపాన్ని తెలుసుకొన్న మీదట, దేవ-మనుష్య-తిర్గక్ యోనులయందు పుట్టడానికి పాపపుణ్యములనే **పృథక్ హేతుమ్ అనాప్నువస్** ఇతర కారణాలు ఏమీ లేవని వాటిని స్వీకరించకుండా, బ్రహ్మమును పొందాలనే కోరికను కూడా వీడినవాడై, **వీత శోక తథా కామ** కామశోకములు లేని, అజ్ఞానరహితమైన **అభయమ్ పదమ్** భయరహిత స్థితిని **అశ్నుతే** పొందుతాడు. అంటే, తిరిగి జన్మించడు అని అభిప్రాయం.

**అభూతాభినివేశాద్ధి సదృశే తత్ప్రవర్తతే |**
**వస్త్వభావం స బుద్ధ్వైవ నిఃసఙ్గం వినివర్తతే || || మాం.గౌ.కా. 4- 79 ||**

అసద్విషయాల పట్ల వ్యామోహం కలవాడు నిశ్చయంగా అట్టి విషయాలయందే ప్రవర్తిస్తాడు. వస్తువిషయాలు యదార్థంగా లేనివే అనే జ్ఞానం కలిగిన మీదట, సంగరహితుడై ప్రవర్తిస్తాడు.

**శంకరుల భాష్యము**

యస్మాత్ అభూతాభినివేశాత్ అసతి ద్వయే ద్వయాస్తిత్వనిశ్చయః అభూతాభినివేశః, తస్మాత్ అవిద్యావ్యామోహరూపాద్ధి సదృశే తదనురూపే తత్ చిత్తం ప్రవర్తతే . తస్య ద్వయస్య వస్తునః అభావం యదా బుద్ధవాన్ , తదా తస్మాత్ నిఃసంగం నిరపేక్షం సత్ వినివర్తతే అభూతాభినివేశవిషయాత్ ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**అభూతాభినివేశాత్** అసత్యమైన ద్వైత విషయాలయందు, అంటే ద్వైతం అస్తిత్వాన్ని నిశ్చయంగా భావించేవాడు కాబట్టి, అవిద్య వల్ల కలిగే వ్యామోహ రూపములైన **సదృశే** అటువంటి వాటియందే **తత్ ప్రవర్తతే** వాని చిత్తం ప్రవర్తిస్తుంది. ఎప్పుడైతే, **వస్త్వభావమ్ ఏవ** ద్వైత విషయాలు యదార్థంగా లేనివే అని **బుద్ధ్వా సః** తెలుసుకొన్న అతడు **నిఃసంగమ్** అసత్యమైన ద్వైత విషయాల పట్ల ఆసక్తి లేనివాడై **వినివర్తతే** ప్రవర్తిస్తాడు.

**నివృత్తస్యాప్రవృత్తస్య నిశ్చలా హి తదా స్థితిః |**
**విషయః స హి బుద్ధానాం తత్సామ్యమజమద్వయమ్ || || మాం.గౌ.కా. 4-80 ||**

ద్వైత విషయాల పట్ల ఆసక్తి వీడినప్పుడు ఎటువంటి ప్రవృత్తి లేని నిశ్చల స్థితి కలుగుతుంది. అదియే జ్ఞానులు అనుభవించే సమ-అజ-అద్వయ స్థితి.

**శంకరుల భాష్యము**

నివృత్తస్య ద్వైతవిషయాత్ , విషయాంతరే చ అప్రవృత్తస్య అభావదర్శనేన చిత్తస్య నిశ్చలా చలనవర్జితా బ్రహ్మస్వరూపైవ తదా స్థితిః, యైషా బ్రహ్మస్వరూపా స్థితిః చిత్తస్య అద్వయవిజ్ఞానైకరసఘనలక్షణా . స హి యస్మాత్ విషయః గోచరః పరమార్థదర్శినాం బుద్ధానాం , తస్మాత్ తత్సామ్యం పరం నిర్విశేషమజమద్వయం చ ..

పునరపి కీదృశశ్చాసౌ బుద్ధానాం విషయ ఇత్యాహ —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ద్వైత విషయాలనుండి **నివృత్తస్య** వెనుదిరిగిన మరియు **అప్రవృత్తస్య** వేరే ఇతర విషయాలేవీ అనుభవానికి రానందున వాటి యందు తగుల్కొనని చిత్తము **నిశ్చలా** చలనమనేది లేని బ్రహ్మస్వరూపమే. **తదా స్థితిః** చిత్తము యొక్క ఆ స్థితియే **హి** నిశ్చయంగా రెండవది లేని, విజ్ఞానమనే సారమొక్కటే ప్రోగుపడిందా అన్నట్లు లక్షణం కలిగిన బ్రహ్మస్వరూప స్థితి. **బుద్ధానామ్** పరమార్థాన్ని దర్శించే వివేకులకు **స హి విషయః** జ్ఞానంగా గోచరించే విషయం నిశ్చయంగా అదియే. అందువలన, **తత్** అది **సామ్యం** ఎటువంటి విశిష్టతలు లేని సామాన్యత్వం, **అజమ్** జనించనిది మరియు **అద్వయమ్** అట్టిది మరొకటి లేనిది కూడా.

మరింకా, వివేకుల దృష్టిలో అది ఎలాంటిదో తర్వాత శ్లోకంలో చెప్తున్నారు.

**అజమనిద్రమస్వప్నం ప్రభాతం భవతి స్వయమ్ |**
**సకృద్విభాతో హ్యేవైష ధర్మో ధాతుస్వభావతః ||** **|| మాం.గౌ.కా. 4-81 ||**

(ఈ ఆత్మ తత్త్వం) పుట్టుక-నిద్ర-స్వప్న రహితమై స్వయంగా ప్రకాశిస్తుంది. స్వాభావికంగా ఎల్లప్పుడూ ప్రకాశించడమే దీనియొక్క (ఈ ఆత్మ తత్త్వం యొక్క) ధర్మం.

**శంకరుల భాష్యము**

స్వయమేవ తత్ ప్రభాతం భవతి న ఆదిత్యాద్యపేక్షం ; స్వయం జ్యోతిఃస్వభావమిత్యర్థః . సకృద్విభాతః సదైవ విభాత ఇత్యేతత్ . ఏషః ఏవంలక్షణః ఆత్మాఖ్యో ధర్మః ధాతుస్వభావతః వస్తుస్వభావత ఇత్యర్థః ..

ఏవం బహుశ ఉచ్యమానమపి పరమార్థతత్త్వం కస్మాల్లౌకికైర్న గృహ్యత ఇత్యుచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

అది **స్వయమ్** స్వయంగానే **అజమ్-అనిద్రమ్-అస్వప్నమ్** పుట్టుట-నిద్రించుట-స్వప్నించుట అనేవి లేనిదిగా **ప్రభాతం భవతి** ప్రకాశమానమైనది, సూర్యుని వల్ల ప్రకాశింపబడేది కాదు. తాను స్వయంగా జ్యోతి స్వభావం కలది అని అర్థం. **సకృద్విభాతః అది** ఎల్లప్పుడూ ప్రకాశిస్తూనే ఉంటుంది అని. **ఏషః** ఈవిధమైన లక్షణం కలిగిన ఆత్మ అనబడే **ధర్మః ధాతు స్వభావతః** తత్త్వం యొక్క స్వభావం.

పరమార్థతత్త్వాన్ని ఈ విధంగా చెప్పినప్పటికీ, లోకంలో జనులు ఎందుకు గ్రహించలేకున్నారో తర్వాత శ్లోకంలో చెప్తున్నారు.

**సుఖమావ్రియతే నిత్యం దుఃఖం వివ్రియతే సదా |**
**యస్య కస్య చ ధర్మస్య గ్రహేణ భగవానసౌ ||** **|| మాం.గౌ.కా. 4-82 ||**

నిత్యమూ ఏదో ఒక విషయం పట్ల ఆసక్తిని పట్టుకొని ఈ పరమాత్మ తేలికగా కప్పివేయబడుతున్నాడు. దుఃఖానికి పరదా ఎప్పుడూ తొలగించబడే ఉంటోంది.

**శంకరుల భాష్యము**

యస్మాత్ యస్య కస్యచిత్ ద్వయవస్తునో ధర్మస్య గ్రహేణ గ్రహణావేశేన మిథ్యాభినివిష్టతయా సుఖమావ్రియతే అనాయాసేన ఆచ్ఛాద్యత ఇత్యర్థః . ద్వయోపలబ్ధినిమిత్తం హి తత్రావరణం న యత్నాంతరమపేక్షతే . దుఃఖం చ వివ్రియతే ప్రకటీక్రియతే, పరమార్థజ్ఞానస్య దుర్లభత్వాత్ . భగవానసౌ ఆత్మాద్వయో దేవ ఇత్యర్థః . అతో వేదాంతైరాచార్యైశ్చ బహుశ ఉచ్యమానోఽపి నైవ జ్ఞాతుం శక్య ఇత్యర్థః, 'ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా' (క. ఉ. 1 . 2 . 7) ఇతి శ్రుతేః ..

అస్తి నాస్తీత్యాది సూక్ష్మవిషయా అపి పండితానాం గ్రహాః భగవతః పరమాత్మన ఆవరణా ఏవ ; కిముత మూఢజనానాం బుద్ధిలక్షణా ఇత్యేవమర్థం ప్రదర్శయన్నాహ —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఎందువల్లనంటే, **నిత్యమ్** ప్రతిదినమూ **యస్య కస్య** ఏదో ఒక ద్వైతవస్తువు పట్ల **ధర్మస్య గ్రహేణ** విషయాన్ని గ్రహించాలనే ఆసక్తి, గ్రహించాననే భ్రమ చేత (ఈ ఆత్మతత్త్వం) **సుఖమావ్రియతే** తేలికగా కప్పివేయబడుతోంది అని అభిప్రాయం. అక్కడ ద్వైతవిషయాన్ని పొందాలన్న అభిలాషయే ఆ (ఆత్మతత్త్వాన్ని) కప్పివేయడానికి కారణమౌతోంది కాని, వేరొకటి ఏదీ కారణం కాదు. **చ** మరియు **దుఃఖమ్ వివ్రియతే సదా** పరమార్థ జ్ఞానం కష్టసాధ్యమైనందుచేత ఎల్లప్పుడూ దుఃఖమే ప్రకటనమౌతుంది. **భగవాస్ అసౌ** అంటే అద్వయమైన ఆత్మయే పరమాత్మ అని అర్థం. అందుచేత, ఉపనిషత్తులచేత, ఆచార్యులచేత పలువిధాలుగా బోధించబడినప్పటికీ పరమాత్మను తెలుసుకొవడం సాధ్యము కాదు అనే అభిప్రాయాన్ని, శ్రుతి 'బోధించేవాడు ఆశ్చర్యం, దానిని పొందేవాడు నేర్పరి' ['ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా' (క.ఉ. 1-2-7) అని ప్రకటించింది.

పండితులచే గ్రహించబడే 'ఉన్నది', 'లేదు' అనే సూక్ష్మవిషయాలు కూడా పరమాత్మను మరుగుపరచేవే. ఇక మందబుద్ధులైన మూర్ఖజనుల గురించి చెప్పేది ఏముంది అనే అభిప్రాయాన్ని వ్యక్త పరిచేందుకు తర్వాత శ్లోకంలో ఇలా అంటున్నారు.

**అస్తి నాస్త్యస్తి నాస్తీతి నాస్తి నాస్తీతి వా పునః |**
**చలస్థిరోభయాభావైరావృణోత్యేవ బాలిశః ||** **|| మాం.గౌ.కా. 4-83 ||**

'ఉన్నది' అని, 'లేదు' అని, లేదా 'ఉన్నదీ-లేనిదీ' అని, మరలా 'లేదు-లేదు' అని ఆవిధంగా మూర్ఖుడు నిలకడలేకుండాను, నిలకడతోనూ, రెండు విధాలుగానూ, అసలు ఏవిధమైన భావన లేకుండానూ (యదార్థమైన ఆత్మతత్త్వాన్ని) దాచివేస్తున్నాడు.

## శంకరుల భాష్యము

అస్తీతి . అస్త్యాత్మేతి కశ్చిద్వాదీ ప్రతిపద్యతే . నాస్తీత్యపరో వైనాశికః . అస్తి నాస్తీత్యపరోఽర్ధవైనాశికః సదసద్వాదీ దిగ్వాసాః . నాస్తి నాస్తీత్యత్యంతశూన్యవాదీ . తత్రాస్తిభావశ్చలః, ఘటాద్యనిత్యవిలక్షణత్వాత్ . నాస్తిభావః స్థిరః, సదావిశేషత్వాత్ . ఉభయం చలస్థిరవిషయత్వాత్ సదసద్భావః . అభావోఽత్యంతాభావః . ప్రకారచతుష్టయస్యాపి తైరేతైశ్చలస్థిరోభయాభావైః సదసదాదివాదీ సర్వోఽపి భగవంతమావృణోత్యేవ బాలిశోఽవివేకీ . యద్యపి పండితో బాలిశ ఏవ పరమార్థతత్త్వానవబోధాత్ , కిము స్వభావమూఢో జన ఇత్యభిప్రాయః ..

కీదృక్పునః పరమార్థతత్త్వం , యదవబోధాదబాలిశః పండితో భవతీత్యాహ —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**అస్తి** ఆత్మ ఉన్నట్టిదే అని కొందరు (వైశేషికులు) ప్రతిపాదిస్తున్నారు. **న అస్తి** ఆత్మ అనేది లేదు అని ఇతరులు శూన్యవాదులు (క్షణిక విజ్ఞానవాదులు) అంటున్నారు. **అస్తి-న అస్తి** ఉన్నది-లేనిది అని రెండు విధాలుగా మరికొందరు అర్ధశూన్యవాదులు (జైనులు) అంటున్నారు. **న అస్తి-న అస్తి** లేదు-లేదు అని పరమశూన్యవాదులు అంటున్నారు. అక్కడ అస్తి భావం, ఘటాది అనిత్యవస్తువులకు భిన్నమైనందు చేత, పరిణామం చెందేది కాబట్టి, చలం. {కుండ వంటి చూడబడే వస్తువులు పరిణామం చెందేవి. ఆయా వస్తువులను చూసే ఆత్మ వాటికి భిన్నంగా ఉనికి గలదై, వాటిని వేర్వేరు విధాలుగా చూస్తుంది. అంటే, న్యాయ-వైశేషికుల ప్రకారం, ఒకే వస్తువిషయం వల్ల ఒక్కొక్కప్పుడు సంతోషాన్ని మరొక్కప్పుడు దుఃఖాన్ని పొందుతుంది. కాబట్టి అది చలం. − స్వామి గంభీరానంద}. న అస్తి అన్నభావం, ఏ విశేషమూ లేనిదైనందువల్ల, స్థిరమైనది (పరిణామం లేనిది). {బుద్ధికి భిన్నంగా దర్శించేవాడు లేడు అని కొందరు వాదిస్తారు. వారి దృష్టిలో ఏ విశేషమూ లేనిది అసలు లేనే లేదు కాబట్టి లేకపోవడం అన్నది స్థిరమైన భావం}. **ఉభయః** చల-స్థిర భావాలు రెండూ అంటే సత్-అసత్ భావాలు రెండూ కలది. {ఇది జైనుల అభిప్రాయం}. **అభావైః** అసలు ఏ భావమూ లేకపోవడం. చల-స్థిర-ఉభయ-అభావములనే ఈ నాలుగు విధాలుగానూ ఉనికి గలది, లేనిది వంటి ఈ ప్రతిపాదనలన్నింటితో కూడా **బాలిశః** అవివేకులు పరమాత్మను కప్పివేస్తున్నారు (పరమాత్మ యొక్క తత్త్వాన్ని గ్రహించలేకున్నారు). పరమార్థ తత్త్వాన్ని గ్రహించలేని వాడైన పండితుడు కూడా అవివేకియే అన్నప్పుడు, ఇక మూర్ఖ జనుల గురించి వేరే చెప్పవలెనా అని అభిప్రాయం.

మూర్ఖుడిని పండితునిగా చేయగల ఆ పరమాత్మ తత్త్వం యొక్క స్వభావం ఏమిటో తర్వాత శ్లోకంలో చెప్తున్నారు.

**కోట్యశ్చతస్ర ఏతాస్తు గ్రహైర్యాసాం సదావృతః |**
**భగవానాభిరస్పృష్టో యేన దృష్టః స సర్వదృక్ ||** **|| మాం.గౌ.కా. 4-84 ||**

ఈ నాలుగు వాదములేవైతే నిశ్చయంగా చేయబడుతున్నాయో వాటి చేత పరమసత్యం మరుగున పడుతోంది. వీటి వేటిచేత స్పృశించబడని పరమాత్మను ఎవడు దర్శిస్తాడో అతడే సర్వాన్ని దర్శించినవాడు.

**శంకరుల భాష్యము**

కోట్యః ప్రావాదుకశాస్త్రనిర్ణయాంతాః ఏతాః ఉక్తా అస్తి నాస్తీత్యాద్యాః చతస్రః, యాసాం కోటీనాం గ్రహైః గ్రహణైః ఉపలబ్ధినిశ్చయైః సదా సర్వదా ఆవృతః ఆచ్ఛాదితః తేషామేవ ప్రావాదుకానాం యః, స భగవాన్ ఆభిః అస్తి నాస్తీత్యాదికోటిభిః చతసృభిరపి అస్పృష్టః అస్త్యాదివికల్పనావర్జిత ఇత్యేతత్ . యేన మునినా దృష్టో జ్ఞాతః వేదాంతేష్వౌపనిషదః పురుషః, స సర్వదృక్ సర్వజ్ఞః ; పరమార్థపండిత ఇత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**కోట్యః** అంటే ఈ చెప్పబడిన అస్తి, నాస్తి, అస్తి-నాస్తి, నాస్తి నాస్తి అనే నాలుగు ప్రముఖమైన వాదాలచే అంతిమంగా నిశ్చయించబడినది అని అర్థం. **యాసామ్** ఆవిధంగా వాదించే వారు గ్రహైః గ్రహించి పొందిన (భ్రాంతితో నిండిన) నిర్ణయాలచేత ఈ ప్రముఖవాదులకు (ఆత్మతత్త్వం) **సదా ఆవృతః** ఎల్లప్పుడూ కప్పివేయబడి ఉంటుంది. అస్తి, నాస్తి వంటి ఈ నాలుగు వాద నిర్ణయాలచేత కూడా **భగవాన్ అభిః** ఆ పరమాత్మ తత్త్వం **అస్పృష్టః** స్పృశించబడదు అంటే అస్తి మొదలైన వికల్పాలకు లోనుకాదు. **యేన** ద్రష్టః ఏ మననశీలులైన వాడు ఉపనిషత్తులందు ప్రతిపాదించబడిన అట్టి ఉపనిషత్ పురుషుడిని దర్శిస్తాడో, **స సర్వదృక్** అతడు సర్వజ్ఞుడే. అంటే, అతడే యదార్థమైన పండితుడని అభిప్రాయం.

**ప్రాప్య సర్వజ్ఞతాం కృత్స్నాం బ్రాహ్మణ్యం పదమద్వయమ్ |**
**అనాపన్నాదిమధ్యాంతం కిమతః పరమీహతే ||** **|| మాం.గౌ.కా. 4-85 ||**

పూర్ణమైన సర్వజ్ఞత్వాన్ని పొందిన మీదట, ఆది-మధ్య-అంత రహితమైన, అద్వయ బ్రహ్మపదాన్ని సాధించిన మీదట, అంతకు మించి ఇక చేసే ప్రయత్నం ఏమిటి?

**శంకరుల భాష్యము**

ప్రాప్య ఏతాం యథోక్తాం కృత్స్నాం సమస్తాం సర్వజ్ఞతాం బ్రాహ్మణ్యం పదం 'స బ్రాహ్మణః' (బృ. ఉ. 3 . 8 . 10) 'ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య' (బృ. ఉ. 4 . 4 . 23) ఇతి శ్రుతేః . అనాపన్నాదిమధ్యాంతం ఆదిమధ్యాంతాః ఉత్పత్తిస్థితిలయాః అనాపన్నా అప్రాప్తా యస్య అద్వయస్య పదస్య న విద్యంతే, తత్ అనాపన్నాదిమధ్యాంతం బ్రాహ్మణ్యం పదం . తదేవ ప్రాప్య లబ్ధ్వా కిమతః పరమస్మాదాత్మలాభాదూర్ధ్వం ఈహతే చేష్టతే, నిష్ప్రయోజనమిత్యర్థః . 'నైవ తస్య కృతేనార్థః' (భ. గీ. 3 . 18) ఇత్యాదిస్మృతేః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఈ చెప్పిన విధంగా **కృత్స్నామ్** సంపూర్ణమైన **సర్వజ్ఞతామ్** సర్వజ్ఞత్వాన్ని, **బ్రాహ్మణ్యమ్ పదమ్** 'అతడు (పరిణామరహితమైన బ్రహ్మమును తెలిసికొని ఈ ప్రపంచాన్ని వీడినవాడు) బ్రాహ్మణుడు (బ్రహ్మమును ఎరిగినవాడు)' ['స బ్రాహ్మణః' (బృ.ఉ. 3-8-10)]; 'అదియే బ్రాహ్మణుని యొక్క శాశ్వతమైన మహిమ' ['ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య' (బృ.ఉ. 4-4-23)] అని శ్రుతులలో ప్రతిపాదించిన బ్రహ్మపదాన్ని **ప్రాప్య** పొందిన మీదట. **అద్వయమ్** రెండవది లేని అట్టి స్థితిలో **ఆదిమధ్యాంతాః** ఉత్పత్తి-స్థితి-లయాలనేవి **అనాపన్నా** ప్రాప్తించనందుచేత,

అటువంటి ఆదిమధ్యాంతాలు దరిచేరనిది బ్రహ్మపదం. అటువంటి స్థితిని పొందిన మీదట, పరమమైన ఆత్మను పొందుటకు మించిన **కిమ్ అతః ఈహతే** దేనికొరకు ప్రయత్నిస్తాడు? అంటే, 'అటువంటి ప్రయత్నం వల్ల ప్రయోజనం ఏమీ ఉండదు' ['నైవ తస్య కృతేనార్థః' (భ.గీ. 3-18)] అని స్మృతులు చెప్పినట్లుగా నిష్ప్రయోజనం అని అభిప్రాయం.

**విప్రాణాం వినయో హ్యేష శమః ప్రాకృత ఉచ్యతే |**
**దమః ప్రకృతిదాంతత్వాదేవం విద్వాఞ్శమం వ్రజేత్ || || మాం.గౌ.కా. 4-86 ||**

బ్రహ్మజ్ఞానులలోని ఈ వినయశీలతనే స్వభావసిద్ధమైన శమంగా చెప్తారు. అదియే వారిలో అప్రయత్నంగా కలిగే బాహ్యేంద్రియ నిగ్రహమని తెలుసుకొన్న వాడు మానసిక ప్రశాంతతలోనే స్థిరమై ఉంటాడు.

**<u>శంకరుల భాష్యము</u>**

విప్రాణాం బ్రాహ్మణానాం వినయః వినీతత్వం స్వాభావికం యదేతదాత్మస్వరూపేణావస్థానం . ఏష వినయః శమోఽప్యేష ఏవ ప్రాకృతః స్వాభావికః అకృతకః ఉచ్యతే . దమోఽప్యేష ఏవ ప్రకృతిదాంతత్వాత్ స్వభావత ఏవ చోపశాంతరూపత్వాద్బ్రహ్మణః . ఏవం యథోక్తం స్వభావోపశాంతం బ్రహ్మ విద్వాన్ శమం ఉపశాంతిం స్వాభావికీం బ్రహ్మస్వరూపాం వ్రజేత్ బ్రహ్మస్వరూపేణావతిష్ఠత ఇత్యర్థః ..

ఏవమన్యోన్యవిరుద్ధత్వాత్ సంసారకారణరాగద్వేషదోషాస్పదాని ప్రావాదుకానాం దర్శనాని . అతో మిథ్యాదర్శనాని తానీతి తద్యుక్తిభిరేవ దర్శయిత్వా చతుష్కోటివర్జితత్వాత్ రాగాదిదోషానాస్పదం స్వభావశాంతమద్వైతదర్శనమేవ సమ్యగ్దర్శనమిత్యుపసంహృతం . అథేదానీం స్వప్రక్రియాప్రదర్శనార్థ ఆరంభః —

**<u>శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము</u>**

ఆత్మస్వరూపంలోనే నిలిచిఉండటం చేత, **విప్రాణామ్** బ్రహ్మజ్ఞానులలో **వినయః** వినయశీలత అన్నది స్వభావసిద్ధంగా ఉంటుంది. **ఏషః** ఈ వినయత్వాన్నే **ప్రాకృతః శమః** స్వాభావికంగా అప్రయత్నంగా కలిగే మానసిక ప్రశాంతత అని **ఉచ్యతే** అంటారు. **ప్రకృతిదాంతత్వాత్** బ్రహ్మమునందు ఉపశాంతమనేది స్వభావసిద్ధం కాబట్టి, **దమః** బాహ్యేంద్రియ నిగ్రహం కూడా అలాంటిదే. **ఏవమ్ విద్వాన్** ఈ ప్రకారంగా ఉపశాంతమే స్వభావంగా గల బ్రహ్మమును తెలిసికొన్నవాడు **శమమ్** ఉపశాంతియే స్వభావంగాగల బ్రహ్మస్వరూపమందే **వ్రజేత్** బ్రహ్మస్వరూపస్థితిలో ఉంటాడు అని అభిప్రాయం.

ఈ విధంగా, ప్రధాన వాదుల సిద్ధాంతాలన్నీ కూడా, పరస్పర విరుద్ధమైన కారణంగా, రాగ-ద్వేషాది దోషాలకు ఆలవాలమై సంసారానికే దారితీస్తున్నాయి. కాబట్టి, ఏ తర్కంతో ఆ సిద్ధాంతాలను నిర్మించారో వాటితోనే వాటి మిథ్యాత్వాన్ని దర్శింపచేసి ఆ నాలుగు ప్రధాన సిద్ధాంతాలకు అతీతంగా, రాగాది దోష రహితమైన, శాంతమే స్వభావంగా కలిగిన అద్వైత సిద్ధాంతమే సమగ్రమైన దర్శనమని చెప్తూ ముగించారు. ఇక, యదార్థమైన సత్యాన్ని సాధించేందుకు తమ అద్వైత ప్రక్రియను గురించిన వివరణను ఇప్పుడు తర్వాత శ్లోకంతో ప్రారంభం చేస్తున్నారు.

**సవస్తు నోపలమ్భం చ ద్వయం లౌకికమిష్యతే |**
**అవస్తు నోపలమ్భం చ శుద్ధం లౌకికమిష్యతే || || మాం.గౌ.కా. 4-87 ||**

(జాగ్రదవస్థలో) వస్తువిషయాలు మరియు వాటి అనుభవం అనేవి రెండు ఉంటాయని సాధారణంగా లోకంలో అభిప్రాయం. (స్వప్నావస్థలో) వస్తువిషయాలు లేని కేవల అనుభవం శుద్ధమైనదని లోకంలో అభిప్రాయం.

**శంకరుల భాష్యము**

సవస్తు సంవృతిసతా వస్తునా సహ వర్తత ఇతి సవస్తు, తథా చ ఉపలబ్ధిరుపలంభః, తేన సహ వర్తత ఇతి నోపలంభం చ శాస్త్రాదిసర్వవ్యవహారాస్పదం గ్రాహ్యగ్రహణలక్షణం ద్వయం లోకాదనపేతం లౌకికం జాగరితమిత్యేతత్ . ఏవంలక్షణం జాగరితమిష్యతే వేదాంతేషు . అవస్తు సంవృతేరప్యభావాత్ . నోపలంభం వస్తువదుపలంభనముపలంభః అసత్యపి వస్తుని, తేన సహ వర్తత ఇతి నోపలంభం చ . శుద్ధం కేవలం ప్రవిభక్తం జాగరితాత్స్థూలాల్లౌకికం సర్వప్రాణిసాధారణత్వాత్ ఇష్యతే స్వప్న ఇత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**సవస్తు** అంటే అజ్ఞానం కారణంగా లేనిది ఉన్నట్లుగా అనిపించే వస్తువిషయాలతో కూడి ప్రవర్తించేది అని. **చ** మరియు అలాగే **స ఉపలంభమ్** అంటే ఆ వస్తువిషయాలకు సంబంధించిన అనుభవాలతో కూడి ప్రవర్తించేది అని. ఇదియే, శాస్త్రములు మొదలుగాగల సకల వ్యవహారాలకు ఆశ్రయమై **ద్వయమ్** గ్రహించబడేది-గ్రహించేది అనే ద్వైత లక్షణం, **లౌకికమ్** లోకంనుండి విడివడనిది అంటే అది లోకంలోని సాధారణమైన జాగ్రదవస్థ. ఈ విధమైనది జాగ్రదవస్థ అని ఉపనిషత్తుల అభిప్రాయం. **అవస్తు** అంటే అజ్ఞానం వల్ల కలిగే వస్తువిషయం లేకపోవడం. వస్తువు అసత్యం అయినా కూడా **స ఉపలంభమ్** అంటే ఆ వస్తువిషయాలు ఉన్నట్లుగా వాటితో అనుభవాన్ని పొందటం అన్నది **శుద్ధమ్** కేవలత్వమే (విషయాలు ఏవీ లేని కేవల అనుభవం మాత్రమే), ఇది స్థూలమైన జాగ్రదవస్థకు భిన్నమైన సూక్ష్మ స్థితి. **లౌకికమ్** సకల ప్రాణులకు ఇది సాధారణమైన స్వప్నానుభవమని **ఇష్యతే** (ఉపనిషత్తులచే) అంగీకరించబడినది అని అభిప్రాయం.

**అవస్త్వనుపలమ్భం చ లోకోత్తరమితి స్మృతమ్ |**
**జ్ఞానం జ్ఞేయం చ విజ్ఞేయం సదా బుద్ధైః ప్రకీర్తితమ్ || || మాం.గౌ.కా. 4-88 ||**

వస్తువిషయం లేకపోవడం మరియు అనుభవ జ్ఞానం లేకపోవడం లౌకికస్థాయికి అతీతమని స్మృతులు ప్రకటించాయి. తెలియుట అనే జ్ఞానం, తెలియబడేది అయిన జ్ఞేయం మరియు తురీయమైన విజ్ఞేయం అనేవి బ్రహ్మవేత్తలచే ప్రస్తుతించబడుతున్నాయి.

## శంకరుల భాష్యము

అవస్త్వనుపలంభం చ గ్రాహ్యగ్రహణవర్జితమిత్యేతత్ ; లోకోత్తరం , అత ఏవ లోకాతీతం . గ్రాహ్యగ్రహణవిషయో హి లోకః, తదభావాత్ సర్వప్రవృత్తిబీజం సుషుప్తమిత్యేతత్ . ఏవం స్మృతం సోపాయం పరమార్థతత్త్వం లౌకికం శుద్ధలౌకికం లోకోత్తరం చ క్రమేణ యేన జ్ఞానేన జ్ఞాయతే, తత్ జ్ఞానం జ్ఞేయం ఏతాన్యేవ త్రీణి, ఏతద్వ్యతిరేకేణ జ్ఞేయానుపపత్తేః . సర్వప్రావాదుకకల్పితవస్తునోఽత్రైవాంతర్భావాత్ ; విజ్ఞేయం యత్పరమార్థసత్యం తుర్యాఖ్యమద్వయమజమాత్మతత్త్వమిత్యర్థః ; సదా సర్వదైవ, తల్లౌకికాది విజ్ఞేయాంతం బుద్ధైః పరమార్థదర్శిభిర్బ్రహ్మవిద్భిః ప్రకీర్తితం ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

**అవస్తు అనుపలంభం చ** గ్రహించబడేది-గ్రహించడం అనే వ్యవహారం లేకపోవడం అన్నది లౌకిక అనుభవానికి అతీతమై స్థితి. గ్రహించబడేది-గ్రహణం అనేవి లోకంలోని విషయాలు. అవి లేని స్థితి సకలప్రవృత్తులకు విత్తువంటిది. అదియే సుషుప్తి అని విద్వాంసులచేత చెప్పబడింది. ఈ విధంగా ఉపాయంగా పరమార్థతత్త్వాన్ని (జాగ్రదవస్థలో) లౌకికమని, (స్వప్నావస్థలో) శుద్ధలౌకికమని, (సుషుప్తి అవస్థలో) లోకాతీతమని ఒక క్రమంలో ఏ జ్ఞానం చేత తెలియబడుతోందో, అదియే జ్ఞానం. ఈ మూడే జ్ఞేయములు (తెలియబడే విషయాలు). దీనిని భిన్నంగా ఇతర జ్ఞేయములు (తెలియబడే విషయాలు) ఉండవు. సకల తార్కికులచేత కల్పించబడే విషయాలన్నీ ఈ మూడు రకాలలోనివే. **విజ్ఞేయమ్** అంటే, తురీయని అనబడే అద్వయమైన, పుట్టుకలేని ఆత్మతత్త్వం అని అర్థం. ఆ లౌకిక అవస్థలనుండి విజ్ఞేయం వరకూ **సదా** సర్వమూ కూడా **బుద్ధైః** పరమసత్యాన్ని దర్శించిన బ్రహ్మవేత్తలచే **ప్రకీర్తితమ్** శ్లాఘించబడినది.

**జ్ఞానే చ త్రివిధే జ్ఞేయే క్రమేణ విదితే స్వయమ్ |**
**సర్వజ్ఞతా హి సర్వత్ర భవతీహ మహాధియః || || మాం.గౌ.కా. 4-89 ||**

జ్ఞానము కలిగిన మీదట ఈ మూడు విధాలైన జ్ఞేయములు క్రమంగా వాటంతట అవే తెలియబడతాయి. మహాబుద్ధిశాలియైనవాడు నిశ్చయంగా ఈ లోకంలోనే అన్నింటా సర్వజ్ఞత్వాన్ని కలిగిన వాడౌతాడు.

## శంకరుల భాష్యము

జ్ఞానే చ లౌకికాదివిషయే జ్ఞేయే చ లౌకికాదౌ త్రివిధే, పూర్వం లౌకికం స్థూలం ; తదభావేన పశ్చాచ్ఛుద్ధం లౌకికం , తదభావేన లోకోత్తరమిత్యేవం క్రమేణ స్థానత్రయాభావేన పరమార్థసత్యే తుర్యే అద్వయే అజే అభయే విదితే, స్వయమేవ ఆత్మస్వరూపమేవ సర్వజ్ఞతా సర్వశ్చాసౌ జ్ఞశ్చ సర్వజ్ఞః, తద్భావః సర్వజ్ఞతా ఇహ అస్మిన్ లోకే భవతి మహాధియః మహాబుద్ధేః . సర్వలోకాతిశయవస్తువిషయబుద్ధిత్వాదేవంవిదః సర్వత్ర సర్వదా భవతి . సకృద్విదితే స్వరూపే వ్యభిచారాభావాదిత్యర్థః . న హి పరమార్థవిదో జ్ఞానినః జ్ఞానోద్భవాభిభవౌ స్తః, యథా అన్యేషాం ప్రావాదుకానాం ..

లౌకికాదీనాం క్రమేణ జ్ఞేయత్వేన నిర్దేశాదస్తిత్వాశంకా పరమార్థతో మా భూదిత్యాహ —

<u>**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**</u>

**జ్ఞానే చ** మూడు అవస్థలకు సంబంధించిన జ్ఞానం కలిగిన మీదట **త్రివిధే జ్ఞేయే** అంటే మూడు విధాలైన లౌకికము-శుద్ధలౌకికము-లోకాతీతములు. ముందు (జాగ్రదవస్థకు చెందిన) స్థూలమైన లౌకికము, అది లయించగా తర్వాత కలిగే (స్వప్నావస్థకు చెందిన) శుద్ధలౌకికము, అది కూడా లయించగా (సుషుప్తి అవస్థకు చెందిన) లోకాతీతము అనే **క్రమేణ** వరుసలో మూడు అవస్థలూ లయించిన అద్వయమైన పుట్టుకలేని భయరహితమైన తురీయస్థితి తెలియబడగా, **స్వయమ్** తాను ఆత్మ స్వరూపమేనని గ్రహించిన **మహాధియః** బుద్ధిశాలికి **సర్వజ్ఞతా ఈ** సర్వము యొక్క జ్ఞత్వం కలిగిన వాడు సర్వజ్ఞుడు, అట్టి భావనయే 'సర్వజ్ఞతా' **సర్వత్ర** అంతటా **ఇహ** ఇక్కడ ఈ లోకంలోనే **భవతి** సిద్ధిస్తుంది. ఒక్కసారి స్వరూపం గురించిన పూర్ణజ్ఞానం కలిగిన మీదట ఆ భావననుండి తొలగిపోడు అని అభిప్రాయం. ఇతర వాదముల వారు చెప్తున్నట్లుగా, పరమార్థాన్ని గ్రహించిన జ్ఞానికి జ్ఞానవృద్ధికాని క్షీణత కాని ఉండనే ఉండవు.

లౌకిక-శుద్ధలౌకికి-లోకాతీత స్థితులను తెలియబడేవిగా సూచించడం చేత, అవి యదార్థమైనవని సాధారణ లౌకికులు పొరబడరాదని హెచ్చరిస్తూ, తర్వాత శ్లోకంలో ఇలా అంటున్నారు.

**హేయజ్ఞేయాప్యపాక్యాని విజ్ఞేయాన్యగ్రయాణతః |**
**తేషామన్యత్ర విజ్ఞేయాదుపలమ్భస్త్రిషు స్మృతః ||** **|| మాం.గౌ.కా. 4-90 ||**

ముందుగా విడువదగినవాటిని, తెలియదగిన దానిని, పొందదగిన వాటిని, ఫలించకుండా చేయదగినవాటిని (క్షుణ్ణంగా) తెలుసుకోవాలి. వాటిలో తెలియదగిన బ్రహ్మము తప్ప మిగిలిన మూడింటిని కల్పితమైనవిగా తెలుసుకోవాలన్నది సంప్రదాయం.

<u>**శంకరుల భాష్యము**</u>

హేయాని చ లౌకికాదీని త్రీణి జాగరితస్వప్నసుషుప్తాని ఆత్మన్యసత్త్వేన రజ్జ్వాం సర్పవద్ధాతవ్యానీత్యర్థః . జ్ఞేయమిహ చతుష్కోటివర్జితం పరమార్థతత్త్వం . ఆప్యాని ఆప్తవ్యాని త్యక్తబాహ్యైషణాత్రయేణ భిక్షుణా పాండిత్యబాల్యమౌనాఖ్యాని సాధనాని . పాక్యాని రాగద్వేషమోహాదయో దోషాః కషాయాఖ్యాని పక్తవ్యాని . సర్వాణ్యేతాని హేయజ్ఞేయాప్యపాక్యాని విజ్ఞేయాని భిక్షుణా ఉపాయత్వేనేత్యర్థః . అగ్రయాణతః ప్రథమతః . తేషాం హేయాదీనామన్యత్ర విజ్ఞేయాత్పరమార్థసత్యం విజ్ఞేయం బ్రహ్మైకం వర్జయిత్వా . ఉపలంభనముపలంభః అవిద్యాకల్పనామాత్రం . హేయాప్యపాక్యేషు త్రిష్వపి స్మృతో బ్రహ్మవిద్భిః న పరమార్థసత్యతా త్రయాణామిత్యర్థః ..

పరమార్థతస్తు,

<u>**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**</u>

సాధారణ జనులలో, త్రాడునందు పాములాగా ఆత్మయందు ఆరోపితమైన, జాగ్రత్తు, స్వప్న, సుషుప్తి అనే మూడు అవస్థలు **హేయాని** విడువదగినవి అని అభిప్రాయం. ఇక్కడ **జ్ఞేయమ్** అనగా మాం.గౌ.కా 4-

83 నందు ప్రస్తావించబడిన అస్తి-నాస్తి-అస్తినాస్తి-నాస్తినాస్తి అనే నాలుగు మిథ్యావాదాలకు అతీతమైన పరమార్థ తత్త్వం అని అర్థం. **ఆప్యాని** బాహ్యంలోని (పుత్రేషణ, విత్తేషణ, లోకేషణ) ఈషణాత్రయాలను త్యజించిన భిక్షుకుల యొక్క పాండిత్యం, బాల్యత్వం, మౌనశీలత అనబడే పొందదగిన సాధనాలు. **పాక్యాని** కషాయములనబడే రాగము-ద్వేషము-మోహము మొదలైన దోషములు ఫలించకుండా పక్వానికి రాకుండా చేసేవి. **ప్రథమతః** ముందుగా, ఈ చెప్పబడిన హేయ-జ్ఞేయ-ఆప్య-పాక్యాలు ఉపాయంతో తెలుసుకోవలసినవి. **తేషామ్** ఈ హేయాదులు నాలుగింటిలో **విజ్ఞేయాత్ అన్యత్ర** ఒక్క బ్రహ్మయే పరమార్థ సత్యమనే విషయాన్ని తప్ప మిగిలిన **త్రిషు** హేయ-ఆప్య-పాక్యములు మూడు కూడా **ఉపలంభః** అజ్ఞానం వల్ల కల్పితమైనవి మాత్రమేనని గ్రహించాలి అని **స్మృతః** బ్రహ్మవేత్తలు అంటారు. అంటే, హేయ-ఆప్య-పాక్యములు మూడు యదార్థమైన సత్యములు కావని అభిప్రాయం.

యదార్థంగానైతే,

**ప్రకృత్యాకాశవజ్జ్ఞేయాః సర్వే ధర్మా అనాదయః |**
**విద్యతే న హి నానాత్వం తేషాం క్వచన కిఞ్చన || || మాం.గౌ.కా. 4-91 ||**

సమస్త ప్రాణులు స్వాభావికంగా ఆకాశంలాగా తెలియబడేవే, నిత్యమైనవే. వాటిలో నానాత్వం (విభిన్నత్వం) అన్నది ఎక్కడ, ఏమాత్రం కూడా నిశ్చయంగా లేదు.

**శంకరుల భాష్యము**

ప్రకృత్యా స్వభావతః ఆకాశవత్ ఆకాశతుల్యాః సూక్ష్మనిరంజనసర్వగతత్వైః సర్వే ధర్మా ఆత్మానో జ్ఞేయా ముముక్షుభిః అనాదయః నిత్యాః . బహువచనకృతభేదాశంకాం నిరాకుర్వన్నాహ — క్వచన క్వచిదపి కించన కించిత్ అణుమాత్రమపి తేషాం న విద్యతే నానాత్వమితి ..

జ్ఞేయతాపి ధర్మాణాం సంవృత్త్యైవ, న పరమార్థత ఇత్యాహ —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**సర్వే ధర్మాః** సకల జీవులు **ప్రకృత్యా** స్వాభావికంగా **ఆకాశవత్** ఆకాశంలాగా సూక్ష్మతను, వేటితోనూ సంబంధం లేకుండుట, అంతటా సమంగా వ్యాపించి ఉండటం వంటి ధర్మాలు కలిగి **అనాదయః** శాశ్వతమైనదిగా సాధకులచే **జ్ఞేయాః** తెలియబడాలి. ప్రాణులు అని బహువచనం ఉపయోగించడం చేత వాటిలో భిన్నత్వం ఉంటుందేమో అనే అనుమానాన్ని నివృత్తి చేయడానికి ఇలా అంటున్నారు. **తేషామ్** వాటిలో అంటే ఆ ప్రాణులలో **క్వచన** ఎక్కడ కూడా **కిఞ్చన** అణుమాత్రం కూడా **నానాత్వం** భిన్నత్వం అన్నది **న విద్యతే** లేదు అని అంటున్నారు.

జీవులు తెలియబడే విషయాలుగా అజ్ఞానం చేత అనుభవానికి వస్తున్నాయే కాని, వాటి యదార్థత అది కాదు అని తర్వాత శ్లోకంలో చెప్తున్నారు.

**ఆదిబుద్ధాః ప్రకృత్యైవ సర్వే ధర్మాః సునిశ్చితాః |**
**యస్యైవం భవతి క్షాన్తిః సోఽమృతత్వాయ కల్పతే || || మాం.గౌ.కా. 4-92 ||**

సకల జీవులు స్వాభావికంగా మొదటినుండీ జ్ఞానప్రకాశమే అన్నది బాగా శోధించి నిర్ణయించబడిన విషయం. ఆ విధంగా ఎవడు విచారించి సమాధానం కలిగి ఉంటాడో అతడు అమృతత్త్వానికి అర్హుడౌతాడు.

## శంకరుల భాష్యము

యస్మాత్ ఆదౌ బుద్ధాః ఆదిబుద్ధాః ప్రకృత్యైవ స్వభావత ఏవ యథా నిత్యప్రకాశస్వరూపః సవితా, ఏవం నిత్యబోధస్వరూపా ఇత్యర్థః . సర్వే ధర్మాః సర్వ ఆత్మానః . న చ తేషాం నిశ్చయః కర్తవ్యః నిత్యనిశ్చితస్వరూపా ఇత్యర్థః . న సందిహ్యమానస్వరూపా ఏవం నైవం వేతి యస్య ముముక్షోః ఏవం యథోక్తప్రకారేణ సర్వదా బోధనిశ్చయనిరపేక్షతా ఆత్మార్థం పరార్థం వా . యథా సవితా నిత్యం ప్రకాశాంతరనిరపేక్షః స్వార్థం పరార్థం వేత్యేవం భవతి క్షాంతిః బోధకర్తవ్యతానిరపేక్షతా సర్వదా స్వాత్మని, సః అమృతత్వాయ అమృతభావాయ కల్పతే, మోక్షాయ సమర్థో భవతీత్యర్థః ..

తథా నాపి శాంతికర్తవ్యతా ఆత్మనీత్యాహ —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

ఎందువల్లనంటే, **సర్వే ధర్మాః** సమస్తమైన జీవులు **ప్రకృత్యైవ** స్వాభావికంగానే **ఆదౌ బుద్ధాః** నిత్యమూ ప్రకాశించే స్వరూపమైన సూర్యుని లాగా, మొదటినుండీ కూడా శాశ్వతమైన జ్ఞాన ప్రకాశమే అని అభిప్రాయం. **సునిశ్చితాః** వాటిని గురించి కొత్తగా నిర్ణయించవలసింది లేదు, అవి శాశ్వతమైన నిశ్చయమైన జ్ఞానస్వరూపములే అని అభిప్రాయం. 'అది ఇలాంటిది కాదు, అలాంటిది' అనే సందేహాలకు తావులేని జ్ఞానస్వరూపం. **యస్య** ఏ సాధకుడైతే **ఏవమ్** ఈ చెప్పిన ప్రకారంగా స్వయంగా తాను ఎల్లప్పుడూ నిశ్చయంగా జ్ఞాన స్వరూపమేనని, ఎలాగైతే సూర్యుడు నిత్యమూ ప్రకాశిస్తూ తన కొరకుకాని మరొకదాని కొరకు కాని వేరొకదానిని అపేక్షించడో, ఆవిధంగా **క్షాంతిః భవతి** అన్ని వేళలా తన ఆత్మయందు వేరొక జ్ఞాన స్వరూపాన్ని అపేక్షించని సర్వస్వతంత్రుడౌతాడో, **సః అమృతత్వాయ కల్పతే** అతడు అమృతానుభవాన్ని పొందేందుకు సమర్థుడు కాగలడు, అంటే మోక్షానికి అర్హుడౌతాడు అని అభిప్రాయం.

అదేవిధంగా, ఆత్మయందు శాంతిని నెలకొల్పే కర్తవ్యం కూడా సాధకునికి ఉండదని తర్వాత శ్లోకంలో చెప్తున్నారు.

**ఆదిశాంతా హ్యనుత్పన్నాః ప్రకృత్యైవ సునిర్వృతాః |**
**సర్వే ధర్మాః సమాభిన్నా అజం సామ్యం విశారదమ్ || || మాం.గౌ.కా. 4-93 ||**

పరమార్థ సత్యం అజమూ, సమానమూ, విశుద్ధమైనది. అందుచేత, దానికి సమానమూ అభిన్నమూ అయిన సకల జీవులు తొలినుండీ శాంతమైనవీ, ఉత్పన్నం కానివీ, స్వభావసిద్ధంగా ఎట్టి వ్యవహారములు లేనట్టివే.

## శంకరుల భాష్యము

యస్మాత్ ఆదిశాంతాః నిత్యమేవ శాంతాః అనుత్పన్నా అజాశ్చ ప్రకృత్యైవ సునిర్వృతాః సుష్ఠూపరతస్వభావాః నిత్యముక్తస్వభావా ఇత్యర్థః . సర్వే ధర్మాః సమాశ్చ అభిన్నాశ్చ సమాభిన్నాః అజం సామ్యం విశారదం విశుద్ధమాత్మతత్త్వం యస్మాత్ , తస్మాత్ శాంతిర్మోక్షో వా నాస్తి కర్తవ్య ఇత్యర్థః . న హి నిత్యైకస్వభావస్య కృతం కించిదర్థవత్స్యాత్ ..

యే యథోక్తం పరమార్థతత్త్వం ప్రతిపన్నాః, తే ఏవ అకృపణా లోకే ; కృపణాస్త్వన్యే ఇత్యాహ —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

ఎందువల్లనంటే, **ఆదిశాంతాః** ఎప్పుడూ శాంతమే అయినది, **అనుత్పన్నాః** దేనినుండి ఉత్పన్నత లేనట్టిది, **ప్రకృత్యైవ సునిర్వృతాః** స్వభావసిద్ధంగా సంపూర్ణంగా వ్యవహారములనేవే లేనట్టిది అంటే సర్వదా విడివడిన స్వభావము గలది అని అభిప్రాయం. **సర్వే ధర్మాః** సకల జీవులు **సమాభిన్నాః** సమానమైనవి, భిన్నత్వం లేనివి **అజమ్ సామ్యమ్ విశారదమ్** విశుద్ధమైన ఆత్మతత్త్వమే అయినందువలన ఆత్మతత్వానికి శాంతి కాని మోక్షం కాని కర్తవ్యం కాదు అని అభిప్రాయం. సదా నిత్యము ఏకము అయిన స్వభావం కలదానికి చేయవలసిన కర్తవ్యం ఏమాత్రమూ మిగిలి ఉండదు.

ఈ చెప్పబడిన పరమార్థతత్త్వాన్ని అనుభవానికి తెచ్చుకొన్న వారు మాత్రమే ఈ లోకంలో కార్పణ్య రహితులు. మిగిలినవారందరూ కార్పణ్యత కలవారేనని తర్వాత శ్లోకంలో ఇలా చెప్తున్నారు.

**వైశారద్యం తు వై నాస్తి భేదే విచరతాం సదా |**
**భేదనిమ్నాః పృథగ్వాదాస్తస్మాత్తే కృపణాః స్మృతాః || || మాం.గౌ.కా. 4-94 ||**

ఎల్లప్పుడూ సంసారంలోనే మునిపోయిన వారికైతే విశుద్ధ ఆత్మతత్త్వం అనుభవానికి రాదు. భిన్నత్వంలోనే మునిగిపోయి, విభిన్నమైన వాదనలు చేసేవారంతా జాలిగొలిపే వారేనని సాంప్రదాయం చెప్తోంది.

## శంకరుల భాష్యము

యస్మాత్ భేదనిమ్నాః భేదానుయాయినః సంసారానుగా ఇత్యర్థః . కే ? పృథగ్వాదాః పృథక్ నానా వస్తు ఇత్యేవం వదనం యేషాం తే పృథగ్వాదాః ద్వైతిన ఇత్యర్థః . తస్మాత్తే కృపణాః క్షుద్రాః స్మృతాః, యస్మాత్ వైశారద్యం విశుద్ధిః తన్నాస్తి తేషాం భేదే విచరతాం ద్వైతమార్గే అవిద్యాపరికల్పితే సర్వదా వర్తమానానామిత్యర్థః . అతో యుక్తమేవ తేషాం కార్పణ్యమిత్యభిప్రాయః ..

యదిదం పరమార్థతత్త్వం , అమహాత్మభిరపండితైర్వేదాంతబహిష్ఠైః క్షుద్రైరల్పప్రజ్ఞైరనవగాహ్యమిత్యాహ —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము

ఎందువల్లనంటే, వారు **భేదనిమ్నాః** భిన్నత్వాన్ని అనుసరించేవారు, అంటే సంసారం పట్ల ప్రీతిగలవారు అని అర్థం. ఎవరు? **పృథక్ వాదాః** వేర్వేరు వస్తువిషయాల అస్తిత్వాన్ని గురించి వాదించేవారు అంటే ద్వైతులు అని అభిప్రాయం. **తస్మాత్** అందువల్ల, **తే** వారు **కృపణాః** జాలిగొలిపేవారు అని **స్మృతాః** సాంప్రదాయులు అంటారు. ఎందుకనగా, **వైశారద్యమ్ తు** విశుద్ధి అయితే వారికి **వై** నిశ్చయంగా లేదు కాబట్టి. వారు **భేదే విచరతాం సదా** ఎల్లప్పుడూ అజ్ఞానంచేత కల్పించబడిన ద్వైతమార్గంలోనే వ్యవహరిస్తూ ఉంటారు అని అభిప్రాయం. అందుచేత, వారిపట్ల కృపణతనే అంటే జాలినే ప్రదర్శించాలి అని అభిప్రాయం.

ఈ పరమార్థతత్త్వం ఏదైతే ఉన్నదో, అది మహాత్ములు కాని పండితులచేత, వేదాంత బాహ్యులైన వారిచేత, సంకుచితమైన అల్పప్రజ్ఞ కలవారిచేత గ్రహించగలిగినది కాదని అంటూ తర్వాత శ్లోకంలో ఇలా చెప్తున్నారు.

**అజే సామ్యే తు యే కేచిద్భవిష్యన్తి సునిశ్చితాః |**
**తే హి లోకే మహాజ్ఞానాస్తచ్చ లోకో న గాహతే || || మాం.గౌ.కా. 4-95 ||**

ఎవరైనాగాని, పుట్టుకలేని సమత్వాన్ని ధృఢ నిశ్చయంతో సాధిస్తారో, వారే లోకంలో మహాజ్ఞానులు. మరి సాధారణ జనులు దానిని గ్రహించలేరు.

**శంకరుల భాష్యము**

అజే సామ్యే పరమార్థతత్త్వే ఏవమేవేతి యే కేచిత్ స్త్ర్యాదయోఽపి సునిశ్చితా భవిష్యంతి చేత్ , త ఏవ హి లోకే మహాజ్ఞానాః నిరతిశయతత్త్వవిషయజ్ఞానా ఇత్యర్థః . తచ్చ తేషాం వర్త్మ తేషాం విదితం పరమార్థతత్త్వం సామాన్యబుద్ధిరన్యో లోకో న గాహతే నావతరతి న విషయీకరోతీత్యర్థః . 'సర్వభూతాత్మభూతస్య సమైకార్థం ప్రపశ్యతః . దేవా అపి మార్గే ముహ్యంత్యపదస్య పదైషిణః . శకునీనామివాకాశే గతిర్నైవోపలభ్యతే' ఇత్యాదిస్మరణాత్ ..

కథం మహాజ్ఞానత్వమిత్యాహ —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**అజే సామ్యే** పుట్టుకలేనిది మరియు సమత్వత గలిగినదైన పరమార్థతత్త్వాన్ని **యే కేచిత్** స్త్రీలు మొదలైన వారు కూడా **సునిశ్చితాః భవిష్యంతి** 'నిశ్చయంగా ఇదియే' అనే ధృడమైన నిశ్చయాన్ని కలిగి ఉంటారో, **తే హి లోకే మహాజ్ఞానాః** వారు మాత్రమే ఈ లోకంలోని మహాజ్ఞానులు అని అభిప్రాయం. **తత్ చ** దానిని అంటే ఆ పరమార్థతత్త్వాన్ని మరియు దానిని పొందే మార్గాన్ని **లోకః** సామాన్యమైన బుద్ధిగల ఇతర జనులు **న గాహతే** అర్థము చేసుకొనలేదు అంటే ఆ తత్త్వాన్ని గ్రహించలేరు అని అభిప్రాయం. 'సకల జీవులకు ఆత్మస్వరూపమే అయి అన్నింటియందు సమత్వాన్ని దర్శిస్తాడు. అలాంటి పదచ్ఛాయలు లేని అతడి పదచ్ఛాయలను చూడాలని అభిలషించే దేవతలు కూడా మోహానికి లోనవుతున్నారు. ఆకాశంలోని పక్షుల పదచ్ఛాయలు తెలియబడనట్లుగా, జ్ఞాని యొక్క పదచ్ఛాయలు అందేవి కావు' ['సర్వభూతాత్మభూతస్య సమైకార్థం ప్రపశ్యతః. దేవా అపి మార్గే ముహ్యంత్యపదస్య పదైషిణః . శకునీనామివాకాశే గతిర్నైవోపలభ్యతే' (మహాభారతం శాంతి పర్వం 239-23,24)] అని స్మృతి కూడా ప్రకటనం చేసింది.

అట్టి మహాజ్ఞానుల జ్ఞానం ఎలాంటిదో తర్వాత శ్లోకంలో చెప్తున్నారు.

**అజేష్వజమసఙ్క్రాన్తం ధర్మేషు జ్ఞానమిష్యతే |**
**యతో న క్రమతే జ్ఞానమసఙ్గం తేన కీర్తితమ్ || || మాం.గౌ.కా. 4-96 ||**

పుట్టుకలేని జీవాత్మలయందలి జ్ఞానం పుట్టుకలేనిది ఇతరముతో సంపర్కం లేనిది అయితీరాలి. ఎందుకంటే, వేరొకదానితో సంబంధమే లేని జ్ఞానం సంగరహితమైనదని కీర్తించబడింది కనుక.

**శంకరుల భాష్యము**

అజేషు అనుత్పన్నేషు అచలేషు ధర్మేషు ఆత్మసు అజమచలం చ జ్ఞానమిష్యతే సవితరీవ ఔష్ణ్యం ప్రకాశశ్చ యతః, తస్మాత్ అసంక్రాంతం అర్థాంతరే జ్ఞానమజమిష్యతే . యస్మాన్న క్రమతే అర్థాంతరే జ్ఞానం , తేన కారణేన అసంగం తత్ కీర్తితం ఆకాశకల్పమిత్యుక్తం .

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**అజేషు** ఉత్పన్నమేకాని **అసంక్రాంతమ్** సంక్రమించుట లేదా కదలికయే లేని **ధర్మేషు** జీవాత్మలలోని **జ్ఞానమ్** జ్ఞానానికి, సూర్యునిలోని వేడిమి మరియు కాంతి వలె, పుట్టుక మరియు కదలికలు లేకుండటయే **ఇష్యతే** భావ్యమని లేదా అభిలషణీయం అని భావం. **యతః** అందువల్ల, జ్ఞానమ్ వేరొక జ్ఞానంగా సంక్రమించదు, పరిణమించదు అంటే పుట్టదు అని భావించాలి. **జ్ఞానం న క్రమతే** జ్ఞానం వేరొక జ్ఞానంగా పరిణమించని **తేన** ఆ కారణం చేత, **జ్ఞానమ్** అట్టి జ్ఞానం **అసంగమ్** సంపర్కంలేని ఆకాశంతో పోలిక కలదిగా **కీర్తితమ్** కీర్తించబడుతోంది.

**అణుమాత్రేఽపి వైధర్మ్యే జాయమానేఽవిపశ్చితః |**
**అసఙ్గతా సదా నాస్తి కిముతావరణచ్యుతిః || || మాం.గౌ.కా. 4-97 ||**

అణుమాత్రమైనా పుట్టుకకలదనే వైరుధ్యాన్ని విపరీతధోరణితో వాదించేవారికి సంగరహితత్త్వమనేది ఎప్పటికీ కలుగనే కలుగదు. మరి అట్టివానికి ఆజ్ఞానావరణం తొలగిపోతుందని ఎలా చెప్పడం?

**శంకరుల భాష్యము**

ఇతోఽన్యేషాం వాదినాం అణుమాత్రే అల్పేఽపి వైధర్మ్యే వస్తుని బహిరంతర్వా జాయమానే ఉత్పద్యమానే అవిపశ్చితః అవివేకినః అసంగతా అసంగత్వం సదా నాస్తి ; కిముత వక్తవ్యం ఆవరణచ్యుతిః బంధనాశో నాస్తీతి ..

తేషామావరణచ్యుతిర్నాస్తీతి బ్రువతాం స్వసిద్ధాంతే అభ్యుపగతం తర్హి ధర్మాణామావరణం . నేత్యుచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

దీనికి వేరుగా, **అణుమాత్రే అపి** లేశమాత్రమైనా **వైధర్మ్యే** ఆత్మవస్తువుకు లోపల లేదా బాహ్యంలో **జాయమానే** పుట్టుక కలదని వాదించే **అవిపశ్చితః** అవివేకులకు **అసంగతా** సంగరహితత్త్వం **సదా నాస్తి** ఎన్నటికీ కలుగనే కలుగదు. **కిముత ఆవరణచ్యుతిః** బంధం నశిస్తుంది అని ఎలా చెప్పగలం?

**సందేహం :** అట్టివారిలో బంధం నశించదని మీరు చెప్పినప్పుడు, మీ సిద్ధాంతంలో ఆత్మలకు ఆవరణం ఉన్నదని అంగీకరించినట్లే కదా!

**సమాధానం :** కాదు అని తర్వాత శ్లోకంలో ఇలా చెప్తున్నారు.

**అలబ్ధావరణాః సర్వే ధర్మాః ప్రకృతినిర్మలాః |**
**ఆదౌ బుద్ధాస్తథా ముక్తా బుధ్యన్త ఇతి నాయకాః || || మాం.గౌ.కా. 4-98 ||**

సకల జీవులకు ఆవరణం అన్నదే లేదు. స్వభావ సిద్ధంగా తొలినుండీ అవి నిర్మల జ్ఞానస్వరూపములే. అందువల్ల, స్వతంత్రంగా అవి తెలుకొంటాయని మహర్షులు అంటారు.

**శంకరుల భాష్యము**

అలబ్ధావరణాః అలబ్ధమప్రాప్తమావరణం అవిద్యాదిబంధనం యేషాం తే ధర్మాః అలబ్ధావరణాః బంధనరహితా ఇత్యర్థః . ప్రకృతినిర్మలాః స్వభావశుద్ధాః ఆదౌ బుద్ధాః తథా ముక్తాః, యస్మాత్ నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావాః . యద్యేవం కథం తర్హి బుధ్యంత ఇత్యుచ్యతే — నాయకాః స్వామినః సమర్థాః బోద్ధుం బోధశక్తిమత్స్వభావా ఇత్యర్థః . యథా నిత్యప్రకాశస్వరూపోఽపి సన్ సవితా ప్రకాశత ఇత్యుచ్యతే, యథా వా నిత్యనివృత్తగతయోఽపి నిత్యమేవ శైలాస్తిష్ఠంతీత్యుచ్యతే, తద్వత్ ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

అలా అయినప్పుడు మరి అవి ఎలా తెలుసుకుంటాయి అనే ప్రశ్నకు **నాయకాః** అంటే ఆచార్యులు, బోధనా సామర్థ్యం కలిగినవారు ఇలా బదులిస్తున్నారు అని అర్థం. **అలబ్ధ ఆవరణాః** అవిద్యవల్ల కలిగే బంధనమనేది ఏదీ లేకపోవడమనేది **సర్వే ధర్మాః** సమస్త జీవుల యొక్క ధర్మము. **ప్రకృతినిర్మలాః** స్వాభావికంగా శుద్ధమైనవి. **ఆదౌ బుద్ధా తథా ముక్తాః** నిత్య-శుద్ధ-బుద్ధ-ముక్త స్వభావం కలవైనందున అవి సకల బంధముల నుండి విముక్తమైనవి. ఎలాగైతే నిత్యప్రకాశ స్వరూపమైనప్పటికీ సూర్యుడు ప్రకాశిస్తున్నాడని అంటున్నామో అలాగా లేదా సదా చలన రహితమైనప్పటికీ పర్వతం నిలిచి ఉన్నదని ఎలాగైతే అంటున్నామో, (ఆవిధంగా జీవాత్మలు తెలుసుకొంటున్నాయి అని మహర్షులు అంటున్నారు).

**క్రమతే న హి బుద్ధస్య జ్ఞానం ధర్మేషు తాయినః |**
**సర్వే ధర్మాస్తథా జ్ఞానం నైతద్బుద్ధేన భాషితం || || మాం.గౌ.కా. 4-99 ||**

జ్ఞానియొక్క జ్ఞానం నిశ్చయంగా జీవ-వస్తు విషయాలయందు ప్రవర్తిల్లదు. జ్ఞానం లాగానే సకల జీవులూ (వస్తువిషయాలయందు సంచరించవు). దీనిని బుద్ధుడు ప్రకటించలేదు.

**శంకరుల భాష్యము**

యస్మాత్ న హి క్రమతే బుద్ధస్య పరమార్థదర్శినో జ్ఞానం విషయాంతరేషు ధర్మేషు ధర్మసంస్థం సవితరీవ ప్రభా . తాయినః తాయోఽస్యాస్తీతి తాయీ, సంతానవతో నిరంతరస్య ఆకాశకల్పస్యేత్యర్థః ; పూజావతో వా ప్రజ్ఞావతో వా సర్వే ధర్మా

ఆత్మానోఽపి తథా జ్ఞానవదేవ ఆకాశకల్పత్వాన్న క్రమంతే క్వచిదప్యర్థాంతర ఇత్యర్థః . యదాదావుపన్యస్తం 'జ్ఞానేనాకాశకల్పేన' (మా. కా. 4 . 1) ఇత్యాది, తదిదమాకాశకల్పస్య తాయినో బుద్ధస్య తదనన్యత్వాదాకాశకల్పం జ్ఞానం న క్రమతే క్వచిదప్యర్థాంతరే . తథా ధర్మా ఇతి ఆకాశమివ అచలమవిక్రియం నిరవయవం నిత్యమద్వితీయమసంగమదృశ్యమగ్రాహ్యమశనాయాద్యతీతం బ్రహ్మాత్మతత్త్వం , 'న హి ద్రష్టుర్దృష్టేర్విపరిలోపో విద్యతే' (బృ. ఉ. 4 . 3 . 23) ఇతి శ్రుతేః . జ్ఞానజ్ఞేయజ్ఞాతృభేదరహితం పరమార్థతత్త్వమద్వయమేతన్న బుద్ధేన భాషితం . యద్యపి బాహ్యార్థనిరాకరణం జ్ఞానమాత్రకల్పనా చ అద్వయవస్తుసామీప్యముక్తం . ఇదం తు పరమార్థతత్త్వమద్వైతం వేదాంతేష్వేవ విజ్ఞేయమిత్యర్థః ..

శాస్త్రసమాప్తౌ పరమార్థతత్త్వస్తుత్యర్థం నమస్కార ఉచ్యతే —

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

ఎందువల్లనైతే, **తాయినః** తాయము కలది తాయి, అంటే ఆకాశంతో పోలిక గల నిరంతర వ్యాపనశీలత కలది, లేదా పూజనీయము లేదా ప్రజ్ఞావంతము. అట్టి **న హి క్రమతే బుద్ధస్య** పరమసత్యాన్ని దర్శించిన వారి జ్ఞానం నిశ్చయంగా **ధర్మేషు** ఇతరవిషయాల యందు సంచరించదో, అంటే వారి జ్ఞానం సూర్యుని కాంతిలాగా ఆత్మయందే కేంద్రీకృతమై ఉంటుందో అని అర్థం. **సర్వే ధర్మాః** సకల జీవాత్మలు కూడా అదేవిధంగా జ్ఞానవంతమై ఆకాశమువంటి వ్యాపనశీలత కలిగినందున ఇతరమైన విషయాలయందు ఏమాత్రంకూడా చరించవు అని అభిప్రాయం. 'ఆకాశంతో పోలిక కలిగిన జ్ఞానం ద్వారా' ['జ్ఞానేనాకాశకల్పేన' (మా.గౌ.కా. 4-1)] అంటూ ఈ కారికలో మొదట్లో ప్రస్తావించిన, ఆకాశంతో పోల్చబడిన వ్యాపనశీలత కలిగి, ఆకాశంవలె అనన్యత్వం కలిగిన జీవాత్మల జ్ఞానం ఏమాత్రం కూడా ఇతర విషయాలలో సంచరించదు. అలాగే, 'ద్రష్టయొక్క సాక్షిత్వానికి నాశమన్నది నిజానికి లేదు' ['న హి ద్రష్టుర్దృష్టేర్విపరిలోపో విద్యతే' (బృ.ఉ. 4-3-23)] అని శ్రుతి చెప్పినట్లుగా సకల జీవులు కూడా, ఆకాశం వలె చలన-క్రియ-అవయవ రహితమూ, నిత్యం-అద్వితీయం-అసంగం-అదృశ్యం-అగ్రాహ్యం, ఆకలిదప్పులకు అతీతమైన బ్రహ్మాత్మతత్త్వమే. **ఏతత్** ఈ జ్ఞానము-జ్ఞేయము-జ్ఞాత అనే భేదం లేని అద్వయమైన పరమార్థతత్త్వం **బుద్ధేన** బుద్ధునిచే **న భాషితమ్** చెప్పబడలేదు. బాహ్యవస్తువిషయాలను నిరాకరించడం మరియు సకలమూ కేవలం జ్ఞానముచే కల్పించబడినదే అన్నంత వరకు మాత్రమే అద్వయ స్థితికి బుద్ధుడు చెప్పినది దగ్గఱగా ఉన్నది. యదార్థసత్యమైన అద్వయ స్థితిని మాత్రం కేవలం ఉపనిషత్తులనుండి మాత్రమే గ్రహించవలసియున్నది అని అభిప్రాయం.

గ్రంథాన్ని ముగించే సందర్భంలో, పరమార్థ తత్త్వాన్ని స్తుతి చేస్తూ ఇలా నమస్కరిస్తున్నారు.

**దుర్దర్శమతిగంభీరమజం సామ్యం విశారదమ్ |**

**బుద్ధ్వా పదమనానాత్వం నమస్కుర్మో యథాబలమ్ || || మాం.గౌ.కా. 4-100 ||**

కష్టసాధ్యమైనది, అతిగంభీరమైనది, పుట్టుకలేనిది, సమత్వం కలిగినది, పవిత్రమైనది, అనేకం కానిది అయిన పరమపదాన్ని తెలుసుకొన్నమీదట మా శక్తిమేరకు ప్రణమిల్లుతున్నాము.

**శంకరుల భాష్యము**

దుర్దర్శం దుఃఖేన దర్శనమస్యేతి దుర్దర్శం . అస్తి నాస్తీతి చతుష్కోటివర్జితత్వాద్దుర్విజ్ఞేయమిత్యర్థః . అత ఏవ అతిగంభీరం దుష్ప్రవేశం మహాసముద్రవదకృతప్రజ్ఞైః . అజం సామ్యం విశారదం . ఈదృక్ పదం అనానాత్వం నానాత్వవర్జితం బుద్ధ్వా అవగమ్య తద్భూతాః సంతః నమస్కుర్మః తస్మై పదాయ . అవ్యవహార్యమపి వ్యవహారగోచరతామాపాద్య యథాబలం యథాశక్తీత్యర్థః ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదము**

**దుర్దర్శమ్** దేనిని దర్శించడం కష్టసాధ్యమో అది దుర్దర్శం. అంటే అస్తి, నాస్తి, అస్తి-నాస్తి, నాస్తి-నాస్తి అనే నాలుగు ప్రధాన సిద్ధాంతాలను వదిలిపేయడమనే కష్టంతో సాధించబడేది అని అభిప్రాయం. అందుచేతనే, **అతిగంభీరమ్** మహాసముద్రంలాగా అవివేకులు ప్రవేశించేందుకు వీలుకానిది. **అజమ్-సామ్యమ్-విశారదమ్** పుట్టుక లేనిది, అంతటా సమంగా ఉన్నది, పరమ పవిత్రమైనది. ఇటువంటి **పదమ్** పరమపదము **అనానాత్వమ్** అనేకత్వము లేనట్టిది అని **బుద్ధ్వా** తెలుసుకొని అదియే తాముగా సిద్ధింపచేసుకొని ఆ పరమపదానికి, అది వ్యవహారం కాకపోయినా వ్యవహారంగా భావన చేసుకొని **యథాబలమ్** మా శక్తిమేరకు **నమస్కుర్మః** నమస్కరిస్తున్నాము.

**అజమపి జనియోగం ప్రాపదైశ్వర్యయోగా -**
**దగతి చ గతిమత్తాం ప్రాపదేకం హ్యనేకమ్ |**
**వివిధవిషయధర్మగ్రాహి ముగ్ధేక్షణానాం**
**ప్రణతభయవిహన్తృ బ్రహ్మ యత్తన్నతోఽస్మి || || 1 ||**

తన యోగశక్తితో పుట్టుకలేనిదైనా పుట్టుకతో కూడినదిగా, కదలికలు లేనిదైనా కదలికలున్నదిగా, తాను ఏకమైనా అనేకంగా మోహంతో చూచే జీవులకు వివిధ విషయాలుగా ప్రాప్తిస్తూ, తనను ఆశ్రయించినవారి సంసార భయాన్ని పారద్రోలే పరబ్రహ్మమేదియున్నదో దానికి నమస్కరిస్తున్నాను.

**ప్రజ్ఞావైశాఖవేధక్షుభితజలనిధేర్వేదనామ్నోఽన్తరస్థం**
**భూతాన్యాలోక్య మగ్నాన్యవిరతజననగ్రాహఘోరే సముద్రే |**
**కారుణ్యాదుద్దధారామృతమిదమమరైర్దుర్లభం భూతహేతో-**
**ర్యస్తం పూజ్యాభిపూజ్యం పరమగురుమముంపాదపాతైర్నతోఽస్మి || || 2 ||**

వేదములనబడే జలనిధి లోతులలో మునిగిపోయి ఎడతెరిపి లేకుండా అనేక జన్మల రూపంలోని మొసళ్లచే బాధించబడుతున్న జీవులను చూసి, ఆ భూతజాలాన్ని

ఉద్ధరించాలనే కరుణతో, దేవతలకు కూడా దుర్లభమైన ఈ జ్ఞానామృతాన్ని, సముద్రజలాలనుండి తన వివేకజ్ఞానం అనే కవ్వంతో చిలికి వెలికి తీసిన, పూజ్యులనదగిన వారికే పూజ్యుడైన, గురువులకే గురువైన, ఆ పరమగురువు పాదములపై పడి నమస్కరిస్తున్నాను.

**యత్ప్రజ్ఞాలోకభాసా ప్రతిహతిమగమత్స్వాన్తమోహాన్ధకారో**
**మజ్జోన్మజ్జచ్చ ఘోరే హ్యసకృదుపజనోదన్వతి త్రాసనే మే |**
**యత్పాదావాశ్రితానాం శ్రుతిశమవినయప్రాప్తిరగ్ర్యా హ్యమోఘా**
**తత్పాదౌ పావనీయౌ భవభయవినుదౌ సర్వభావైర్నమస్యే || || 3 ||**

ఎవ్వని జ్ఞానకాంతి ప్రభావంతో నా మనసును ఆవరించిన మోహమనబడే అంధకారం చెదిరిపోయిందో, ఎవరైతే ఈ ఘోరమైన సంసారసముద్రంలోని జనన-మరణ భయాన్నుండి పూర్తిగా నన్ను రక్షించారో, ఎవరి పాదములు ఆశ్రయించిన వారికి ఉపనిషత్తుల యందలి జ్ఞానం, ఇంద్రియ నిగ్రహం, వినయం, అమోఘమైన జ్ఞానం ప్రాప్తిస్తుందో, అట్టి సంసారభయాన్ని పారద్రోలే ఆ పరమపవిత్రమైన పాదములకు సకలభావనా సహితంగా నమస్కరిస్తున్నాను.

.. ఇతి అలాతశాంతిప్రకరణం సంపూర్ణమ్ ..

.. హరిః ఓం తత్ సత్ ..